# ఆంధ్రప్రదేశ్ ను గురించి...

| | |
|---|---|
| విస్తీర్ణం | 1.06.286 చ. మై. |
| జిల్లాలు | 20 |
| తాలూకాలు | 189 |
| గ్రామాలు | 28,997 |
| పట్టణాలు, నగరాలు | 212 |
| మొత్తం జనసంఖ్య (1961) | 359.83 లక్షలు |
| జన సాంద్రత (1961) | 339 చ. మై. కి. |
| అక్షరాస్యులు (1961) | 76 27 లక్షలు |
| షెడ్యూల్డు కులాలవారు (1961) | 49.71 లక్షలు |
| షెడ్యూల్డు తెగలవారు (1961) | 13.24 లక్షలు |
| నమోదైన కర్మాగారాలు | 3,928 |
| విశ్వవిద్యాలయాలు | 4 |
| పంచాయతీలు | 15,266 |
| పంచాయతీ సమితులు | 321 |
| ఆంధ్రప్రదేశ్ నుండి పార్లమెంటు సభ్యులు | 61 |
| విధానసభ సభ్యులు | 288 |
| శాసనమండలి సభ్యులు | 90 |

# ఆంధ్ర ప్రదేశ్

సంపుటి: 12 ]

ఆగస్టు – 1968

శ్రావణ–భాద్ర. – 1890 శా.శ.

[సంచిక: 10

ప్రధాన సంపాదకులు

బి. యస్. రామన్, ఐ. ఎ. యస్.

సంపాదకులు

ఎస్. వి. గోపాలశాస్త్రి

మా పాఠకులకు స్వాతంత్ర్యదిన శుభాకాంక్షలు

ముఖ చిత్రం : స్వాతంత్ర్య దినోత్సవ దృశ్యాలు

మూడవ అట్ట : మహంకాళి జాతర

నాలుగవ అట్ట లేపాక్షిలోని అసంపూర్తి కళ్యాణమంటపం



## ఈ సంచికలో...

పేజీ



63–1



# మన జాతీయ పతాకం

డా. ఎస్. రాధాకృష్ణన్

మన జాతీయ పతాకం ఒక్క మన భారత దేశానికే కాక సర్వమానవజాతికీ చిహ్నం.

భారతీయుల జీవన సరళిని— ఒక్క భారతీయులన్న మాటేమిటి, యావత్ ప్రపంచ ప్రజల జీవన సరళిని— ఈ జెండా వివరిస్తుంది.

ఈ జెండా మధ్యలో నీలపు రంగులో ఒక చక్రం వుంది. సృష్టివైచిత్రిలోని అంతర్భాగాలైన ఆకాశాన్నో, సముద్రాన్నో చూడండి. వాటి రంగు నీలం. ఆ నీలంరంగే యీ చక్రానికి సంకేతం. చక్రం దొర్లిపోతూ వుంటుంది. ఈ కాలచక్రమే సర్వమైతే యిది అన్నింటినీ కబళించి వేస్తుంది. దేనినీ మిగలనీయదు. అప్పుడు ప్రాణికోటి గమ్యం మరణమే అవుతుంది. ప్రళయం సంభవించి సర్వమూ నాశనమై పోతుంది.

కాబట్టి యీ ప్రపంచానికి అర్థం అంటూ లేదనీ, మన మనుగడకు ఏ పరమార్థమూ లేదని ప్రజలనుకుంటారు. నీలి ఆకాశమూ నీలి సముద్రమూ సంకేతమైన యీ సృష్టి స్వయం పోషకం కాదనీ, స్వశక్తిమీద నిలబడలేదనీ, ఏదో ఒక శాశ్వతమైన నేపథ్య శక్తిపైన ఆధారపడి వున్నదని అనిపించడం లేదా అంటూ ప్రజలు ప్రశ్నలు కురిపిస్తారు. అందుకే నీలిరంగు చక్రం వెనుక నేపథ్యంలో శ్వేతవర్ణం వుంచాం. ఈ తెలుపునే షెల్లీ శాశ్వతమైన వెలుగుగా పేర్కొన్నాడు. అనిత్యమూ, అశాశ్వతమైన యీ పరిణామక్రమం స్థిరంగా నిలిచేందుకు ఏదో ఒక ఆధారం కావాలి కదా.

కాలమే సర్వమూకాదు. మన జీవితాల మనుగడకు మరో ధ్యేయం వుంది. అది నిత్యమైనది. సృష్టి పరిణామాన్ని సూచించే చక్రానికి నీలిరంగు యిస్తే, నిత్యమైన పదార్థాన్ని సూచించే నేపథ్యానికి శ్వేత వర్ణం ఎన్నుకోవడం జరిగింది. నిత్యమైన పదార్థాన్ని పదాలతో నిర్వచింపచూసేవారు అనంతమైన ఆ వైచిత్రికి న్యాయం చేకూర్చలేరు.

శాశ్వతమైన ఆ నేపథ్యపు వెలుగు ఏమిటో స్పష్టంగా ఎవరూ చెప్పలేరు. అది మధ్యాంత సహితమైన మానవుడి ఊహకు తద్రహితమైన మహా సత్యపదార్థ సమవగాహన కష్టసాధ్యము. అందువల్లనే దానికి వివర్ణత, లేక తెలుపు రంగు సంకేతమైంది.

అందుకే కాలం సర్వ శక్తివంతం కాదు. అదే సర్వం అయితే ఆ సర్వానికి గమ్యం మృత్యువే అవుతుంది. ఈ కాల ప్రభావం నుండి మనం తప్పించుకోలేమా? మృత్యువును జయించలేమా? సంసారమని పిలవబడే యీ ఐహిక విషయాల నుండి, యీ మృత్యు గహ్వరం నుండి, యీ కాలకన్య కౌగిలి నుండి మనల్ని మనం రక్షించుకునే మార్గం ఏదో ఒకటి మనకు లేదా?

కాలం మధ్య మనం జీవిస్తున్నాం. శాశ్వతమైనదేదో వున్నదని మనకు తెలుసు. అశాశ్వతమైన కాలం మధ్య, నిరంతరం పరిభ్రమించే కాలం మధ్య జీవిస్తూ శాశ్వతమైన దానిని ఎలా అందుకోగలం? ఒక వైపు అశాశ్వతమైన దానినీ, మరో వైపు శాశ్వతమైన దానినీ— యీ రెంటినీ లక్ష్యాలుగా పెట్టుకొని ఏక కాలంలో ఎలా మనం మనుగడ సాగించగలం? అంటే యీ రెంటినీ మనలోనే యిముడ్చుకోవాలి. క్రమశిక్షణతో మెలగాలి, అరిషడ్వర్గాలని జయించాలి. ఆత్మశుద్ధిని అలవరచుకోవాలి. అప్పుడే అది సాధ్యమౌతుంది. అగ్నిదేవుడు సర్వ భక్షకమూర్తి. మానవ జీవితంలోని చెడునంతటినీ కాల్చివేసేది అగ్ని. ఆ అగ్ని వర్ణం కాషాయం. మన ఋషులు, మన సన్యాసులు ఆ రంగు వస్త్రాలనే ధరించారు. బుద్ధుడు ఆ రంగు వస్త్రాలనే ధరించాడు. ఈనాటికీ ఆయన అనుయాయులు కాషాయాంబరాలనే ధరిస్తున్నారు.

అందుకే మన జెండాలో పై భాగాన ఆ కాషాయ వర్ణాన్ని ఏర్పాటు చేసుకున్నాం. ఐహికమైన లోకంలో అశాశ్వతమైన కాలంమధ్య వుంటూ, శాశ్వతమైన సత్యాన్ని పొందాలంటే మన మనసు అగ్ని సంస్కారాన్ని చెందాలి. అగ్ని వర్ణమైన కాషాయ వర్ణం యీ సంస్కారాన్నే సూచిస్తుంది. అందుకే ఆ వర్ణం పై భాగాన వుంచాం.

ఇదంతా దేనికి?

మనం ఎన్ని బాధలనో అనుభవించి, బుద్ధిని సక్రమ మార్గంలో బంధించి, సన్యాసివలె అన్ని సుఖాలనూ పరిత్యజించి, మన దేహాన్ని శుష్కింపజేసుకుని ఎట్లాగో కష్టపడి ఆత్మశుద్ధిని పొందుతామనుకోండి. అంతటితో సరిపోతుందా? బాధలను, అరిషడ్వర్గాలను జయించడం—యివేనా జీవిత లక్ష్యాలు. కాదు. మనం యీ భూలోకంలో పచ్చని స్వర్గాన్ని ప్రతిష్ఠించగలగాలి.

పచ్చ రంగు ప్రాణానికి చిహ్నం. చెట్ల రంగు ప్రాణికోటికి ప్రాణంపోసే రంగు.

అందుకే ఆరంగు అడుగు భాగాన వుంది.

జెండాలో కాలాన్ని సూచించాం, శాశ్వతత్వాన్ని సూచించాం, అరిషడ్వర్గాలపై విజయాన్ని సూచించాం. భూమిమీద స్వర్గాన్ని సృష్టించే నిర్మాణాత్మక కృషిని సూచించాం. వీటన్నిటినీ మనం ఎందుకు నిర్వర్తించాలి? ప్రేమ, న్యాయం అంతటా వెల్లివిరిసే మానవ సమాజాన్ని యీ భూమిమీద పునర్నిర్మించేందుకు శాంతి, స్నేహ వాతావరణం అంతటా నెలకొల్పే మానవ సమాజాన్ని యీ భూమిమీద ప్రతిష్ఠించేందుకు. అదీ మన లక్ష్యం. కాల ప్రవాహంలో మనం కొట్టుకుపోతూవుంటే యీ లక్ష్యాన్ని సాధించలేం.

ఇదంతా మన జెండా సూచిస్తుంది. కాలం, శాశ్వతత్వం, అరిషడ్వర్గాలపై విజయం, సృజనాత్మక జీవితం—యివన్నీ దీనిలో వున్నాయి. అందుకే మొత్తం మానవజాతి కంతటికీ సంబంధించిన జెండా యిది. ఈ విషయాలన్నీ ఆలోచించి అవగాహన చేసుకున్న వారెవరైనా యీ జెండాను అంగీకరిస్తారు. *

# వందేమాతరం

—బంకించంద్ర చటర్జీ

వందే మాతరం
సుజలాం సుఫలాం మలయజ శీతలాం
సస్య శ్యామలాం మాతరం                    వందే మాతరం

శుభ్రజ్యోత్స్నా పులకిత యామినీం
ఫుల్లకుసుమిత ద్రుమదళశోభినీం
సుహాసినీం-సుమధుర భాషిణీం
సుఖదాం వరదాం మాతరం                    వందే మాతరం

త్రింశత్ కోటికంఠ
కలకల నినాదకరాళే
ద్వాత్రింశత్ కోటి
భుజైర్ధృత ఖరకరవాలే
కేబలే మాతుమి అబలే!
బహుబల ధారిణీం నమామి తారిణీం
రిపుదళ వారిణీం మాతరం                    వందే మాతరం

తుమివిద్యా తుమిధర్మ,
తుమిహృది తుమిమర్మ,
త్వంహి ప్రాణాః శరీరే,
బాహుతే తుమి మాశక్తి,
హృదయే తుమి మాభక్తి,
తోమారఇ ప్రతిమాగడి
మందిరే మందిరే!

త్వంహి దుర్గా దశప్రహరణ ధారిణీ
కమలా కమలదళ విహారిణీ
వాణీ విద్యాదాయినీ నమామి త్వాం
నమామి కమలాం అమలాం అతులాం
సుజలాం సుఫలాం మాతరం,                    వందే మాతరం

శ్యామలాం సరళాం సుస్మితాం భూషితాం
ధరణీం భరణీం మాతరం                    వందే మాతరం

# ముఖ్యమంత్రి జన్మదినోత్సవం



చిన్నారిపాపలు పూలమాలలు వేశారు

ముఖ్యమంత్రి శ్రీ కాసు బ్రహ్మానంద రెడ్డి జూలై 28 వ తేదీన అరవయ్యోయేట అడుగుపెట్టారు.

ముఖ్యమంత్రి పుట్టిన రోజున అనేక సంస్థలు, వ్యక్తులు, ఆయనకు తమ శుభాకాంక్షల్ని తెలియజేశారు. గవర్నరు శ్రీ ఖండూభాయ్ దేశాయ్, రాష్ట్ర మంత్రివర్గ సభ్యులు, ప్రముఖులు, అనధికారవ్యక్తులు ఆరోజున ముఖ్య మంత్రిని కలుసుకుని తమ హృదయపూర్వక శుభాకాంక్షల్ని తెలియజేశారు.

సికింద్రాబాదులోని ఠాగూర్‌హోం వారు శ్రీ బ్రహ్మానంద రెడ్డి జన్మదినోత్సవాన్ని జరుపుకున్నారు. శాసన సభ్యురాలు శ్రీమతి సరోజినీదేవి పుల్లారెడ్డి ముఖ్య మంత్రి చిత్రపటాన్ని ఆవిష్కరించారు. శ్రీ బ్రహ్మానంద రెడ్డి రోజుకు కనీసం మూడు వందలమంది వ్యక్తులనైనా కలుసుకుంటారనీ, ఎప్పుడూ ఆయన చిరాకు పడడంగానీ, ఛీదరించుకోవడంగానీ చేయరనీ, రాజకీయ



ఆంధ్రప్రదేశ్ గవర్నరు అభినందించారు

వేత్తల్లో, పరిపాలకుల్లో యీ గుణాలు బహు అరుదనీ ఆమె అన్నారు. ఆయన తన బాధ్యతను గుర్తించి ప్రవర్తించే నాయకుడనీ, ప్రజలు విశ్వసించదగ్గ పరిపాలకుడనీ ఆమె ముఖ్య మంత్రిని అభివర్ణించారు.

రాష్ట్రమంతటా అనేకచోట్ల ప్రజలు ముఖ్యమంత్రి జన్మదినోత్సవాన్ని జరుపుకున్నారు.

అంత ఉన్నతమైన పదవిలో వుండికూడా ఆయన బీదవారితోనూ సామాన్యులతోనూ స్వేచ్ఛగా కలిసిపోయి ప్రవర్తిస్తారు. వారి బాగోగులంటే ఆయనకు ఎంతో అభిమానం. వారంటే ఆయనకు సానుభూతి. యువకుల్లో యువకుడిగా, పెద్దల్లో పెద్దగా కలిసిపోయి సంచరిస్తారు ఆయన. నెహ్రూజీలాగే ఆయనకూ బాలలన్నా కళలన్నా, క్రీడలన్నా ఆసక్తి.



యువ కళాకారులు ప్రదర్శనలు ఇచ్చారు

# స్వాతంత్ర్య భారతి

....కరుణశ్రీ

'గణగణ' మ్రోగెరా విజయ ఘంటలు భారతమాత మందిరాం
గణమున; ద్వారబంధముల గట్టిరి చిత్ర విచిత్ర రత్న తో
రణ తతి; వీథివీథుల విరాజిలుచున్న వవే త్రివర్ణ కే
తనములు; మేలుకాంచె పరతంత్ర పరాఙ్ముఖ సుప్త కంఠముల్.

'పాటాగొట్టి' పరప్రభుత్వమునకున్, బ్రహ్మాండమౌ శాంతి పో
రాటంబున్ నడపించినాడు మన 'వార్ధా యోగి'; ఆంగ్లప్రభుల్
మూటల్ ముల్లెలు నెత్తి కెత్తుకొని నిర్మోహాత్ములై సంద్రముల్
దాటంజొచ్చిరి; నవ్వుకొన్నవి స్వతంత్ర స్వర్ణ సోపానముల్.

'నేతాజీ' ప్రతిభా ప్రతాపములు, 'గాంధీ తాత' సత్యాగ్రహ
జ్యోతిర్దీప్తులు; 'దేశభక్తుల' అఖండోత్సాహముల్, విశ్వ వి
ఖ్యాతంబైన 'అగస్టు విప్లవ' మహా గాథల్, సమైక్యమ్ములై
స్వాతంత్ర్య ధ్వజ మెత్తె భారత మహా సౌధాగ్ర భాగమ్ములన్.

లాఠీ పోటులు పూలచెండ్లు, చెరసాలల్ పెండ్లివారిండ్లు, ఏ
కాఠిన్యం బయినన్ సుఖానుభవమే, "గాంధీ కళాశాల"లో
పాఠంబుల్ పఠియించు శిష్యులకు; తద్ బ్రహ్మాస్త్రసంధానమే
పీఠంబుల్ కదలించి సీమలకు పంపెన్ శ్వేత సమ్రాట్టులన్.

ప్రస్థానించిరి త్యాగమూర్తులు పవిత్రంబైన "శ్రీకృష్ణ జ
న్మస్థానంబున" కెందరో; నిహతులైనా రెందరో శౌర్య ధై
ర్య స్థైర్యంబులు చూపి విప్లవ సమిద్రంగమ్ములన్; వారి సు
ప్తాస్థి శ్రేణికలే పునాదులట మా స్వారాజ్య సౌధాలకున్.

# నీటిపారుదల, విద్యుచ్ఛక్తి వసతులు.

## నల్గొండ జిల్లాలోని భూములకు నాగార్జున సాగర్ జలాలు

నల్గొండ జిల్లాలోని హుజూర్ నగర్ తాలూకాలో 40,000 ఎకరాలకు సేద్యపు నీటిని అందజేసేందుకు జూలై 27 న ముఖ్యమంత్రి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి నాగార్జునసాగర్ ఎడమ కాలువ నుండి జలాలను విడుదలచేశారు. మూసీ నదిమీద రూ. 70 లక్షల ఖర్చుతో నిర్మించిన అక్విడెక్టు వద్ద జలాలను విడుదలచేసే కార్యక్రమానికి ఆయన ప్రారంభోత్సవం చేశారు. చతుర్థ పంచవర్ష ప్రణాళికాంతం లోపునే పోచంపాడు ప్రాజెక్టునుకూడా పూర్తి చేయాలని ప్రభుత్వం నిశ్చయించినట్లు ఆయన చెప్పారు. ఈ ఏడాది అదనంగా 500 చిన్న నీటి వనరుల పనులు పూర్తిచేయబడ్డాయని, తద్వారా అదనంగా ఒకలక్ష ఎకరాల భూమిని సేద్యం క్రిందకు తీసుకురావడం జరిగిందని ముఖ్యమంత్రి పేర్కొన్నారు. నాగార్జునసాగర్ రెండు కాలువలద్వారా వచ్చే జలాలను సాధ్యమైనంత ఎక్కువగా ఉపయోగించుకుని అధికోత్పత్తికి తోడ్పడవలసినదిగా రైతులకు ఆయన విజ్ఞప్తిచేశారు.

నీటి పారుదల శాఖామంత్రి శ్రీ శీలం సిద్దారెడ్డి రూ. 31,20,000 ల ఖర్చుతో నిర్మించిన చిన్న పాలేరు అక్విడెక్టు వద్ద జలాలను విడుదల చేశారు. లాల్‌బహదూర్ కాలువ ప్రధాన రెగ్యులేటర్‌కు ముఖ్యమంత్రి ప్రారంభోత్సవం చేశారు. ఈ ఉత్సవానికి సహకార శాఖామంత్రి శ్రీ విజయ భాస్కరరెడ్డి అధ్యక్షత వహించారు. ఈ ప్రాజెక్టును పూర్తిచేసినందుకు శాసన సభ్యుడు శ్రీ వావిలాల గోపాల కృష్ణయ్య ప్రభుత్వాన్ని అభినందించారు.

ప్రజల ఆందోళనవల్ల రూపురేఖలు దిద్దుకున్నందువల్ల ఈ ప్రాజెక్టును 'ప్రజల ప్రాజెక్టుగా' పేర్కొనవచ్చునని ఆయన అన్నారు. హుజూర్‌నగర్ శాసన సభ్యుడు శ్రీ ఎ. వాసుదేవరావు, ఈ సందర్భంలో ప్రచురించిన సావనీర్‌ను ముఖ్యమంత్రికి అందజేశారు.

### లంకసాగర్ ప్రాజెక్టు

కృష్ణా బేసిన్‌లో మున్నేరు నదికి ఉపనదిగా వున్న కట్టలేరు మీద నిర్మించిన లంకసాగర్ ప్రాజెక్టుకు జూలై 27 న రాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి ప్రారంభోత్సవంచేశారు. ఆనకట్ట తలుపులను సడలించి కుడి కాలువలోకి నీటిని ఆయన విడుదల చేశారు.

రైతులు తమ భూముల సాగుకు యీ నీటిని వుపయోగించి ఆహార సమస్యను తొలగించడానికి తోడ్పడవలసిందిగా ముఖ్యమంత్రి యీ సందర్భంలో రైతులను ఉద్దేశించి పలికారు. రైతులకు సత్వరమే ప్రయోజనాన్ని కలిగించే ప్రాజెక్టులను చేపట్టడానికి కొన్నిటిని ప్రభుత్వం ఎంపిక చేసిందని ఆయన అన్నారు.



మూసీ అక్విడెక్టువద్ద నీటిని విడుదలచేసే కార్యక్రమానికి ముఖ్యమంత్రి ప్రారంభోత్సవం చేశారు

ఈ ఉత్సవానికి అధ్యక్షత వహించిన నీటి పారుదల శాఖామంత్రి శ్రీ శీలం సిద్దారెడ్డి మాట్లాడుతూ, కేంద్రంనుంచి ఉదారంగా సహాయం లభిస్తే రానున్న మూడేళ్ళల్లో నాగార్జునసాగర్ ప్రాజెక్టును అన్ని విధాలా పూర్తిచేయాలని ప్రభుత్వం భావిస్తున్నదన్నారు. రూ. 76 లక్షల వ్యయంతో నిర్మించిన లంకసాగర్ ప్రాజెక్టువల్ల తొలి దశలో 5,100 ఎకరాలకు సేద్యపు నీటి సౌకర్యం లభిస్తుంది. సంవత్సరం పొడుగునా రైతులకు నీటిసౌకర్యం వుంటుంది.

### అద్దంకి బ్రాంచి కాలువకు ప్రారంభోత్సవం

సహకార శాఖామంత్రి శ్రీ కె. విజయ భాస్కరరెడ్డి జూలై 29 న అద్దంకి బ్రాంచి కాలువకు ప్రారంభోత్సవం చేశారు. ఈ సందర్భంలో ఏర్పాటైన సభకు ఎక్సైజు శాఖామంత్రి శ్రీ వెనిగళ్ళ సత్యనారాయణ అధ్యక్షత వహించారు. ఈ కాలువ క్రింద యీ ఏడాది 1,30,000 ఎకరాలు సేద్యం క్రిందకు తీసుకురావడం జరుగుతుందని శ్రీ విజయ భాస్కరరెడ్డి తెలియజేశారు.

## విద్యుచ్ఛక్తి

### ఎగువ సీలేరు జల విద్యుత్ ప్రాజెక్టు ప్రథమదశ —ముఖ్యమంత్రిచే ప్రారంభం

ముఖ్యమంత్రి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి, ఆగస్టు 3 న, ఎగువ సీలేరు జల విద్యుత్ ప్రాజెక్టు ప్రథమ దశకు ప్రారంభోత్సవం చేయడంతో ఆర్థికాభివృద్ధి పథంలో ఆంధ్రప్రదేశ్ మరో మైలురాయి చేరుకున్నదన్నమాట. విశాఖపట్నం జిల్లాలో చింతలపల్లి ఏజెన్సీ ప్రాంతం అడవులలో నిర్మింపబడే ఈ ప్రాజెక్టు, పారిశ్రామికంగా అభివృద్ధి చెందుతున్న విశాఖపట్నానికి అవసరమయ్యే విద్యుచ్ఛక్తి నందిస్తుంది. గ్రామీణ విద్యుదీకరణకు, వ్యవసాయకంగా పంపుసెట్లు పనిచేసేందుకు కావలసిన విద్యుచ్ఛక్తి సరఫరా చేసేందుకు ఈ ప్రాజెక్టు ఉపకరిస్తుంది.



## హరిజన దినోత్సవాలు

రాష్ట్రంలో ప్రతి బ్లాకులోనూ, ఒక నిర్ణీత గ్రామంలో ప్రతి నెలా 30వ తారీఖున పంచాయితీసమితులచే హరిజనదినోత్సవం జరుపబడుతుంది. జూలై 20న రాష్ట్ర మంత్రివర్గం ఈ విధంగా నిర్ణయాన్ని తీసుకొంది. [హరిజన దినోత్సవాలు జరుపవలసినదిగా యిదివరకే ఉత్తరువులున్నాయి. అవి ఇప్పుడు మరింత కట్టుదిట్టంగా అమలుపరచబడుతాయి]

## అదనపు పోలీస్ యిన్‌స్పెక్టర్ జనరల్

అదనపు పోలీస్ ఇన్‌స్పెక్టర్ జనరల్‌గా శ్రీ ఎ. జయరామ్ ఐ. పి. యస్. జూలై 16న పదవీ స్వీకారంచేశారు. 1939లో ఆయన పోలీస్ శాఖలోచేరి, యిటీవలివరకూ కేంద్రప్రభుత్వ నేరపరిశోధక శాఖలో సంయుక్త సంచాలకునిగా పనిచేశారు.

## తెలంగాణాలోని ఉద్యోగ ఖాళీలను గురించి ప్రభుత్వ ఉత్తర్వు

తెలంగాణా ప్రాంతంలోని ఉద్యోగాలలో ఏర్పడే ఖాళీలన్నింటినీ, నివాస స్థలానికి సంబంధించిన అర్హత కలిగిన యోగ్యతగల అభ్యర్థులు లభించని పక్షంలో భర్తీ చేయకుండా వుంచాలని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఉత్తర్వు చేసింది.

తెలంగాణా ప్రాంతంలోని ఉద్యోగాలలో నియమించబడిన బయటివారైన అందరు అభ్యర్థుల స్థానంలోనూ మూడు మాసాల కాలంలో నివాస స్థలానికి సంబంధించిన అర్హత కలిగిన అభ్యర్థులను నియమించాలి. ఈ విధంగా జరగని సందర్భాలలో నివాస స్థలానికి సంబంధించిన అర్హత కలిగిన అభ్యర్థులను తీసుకోవడానికై చేసిన ప్రయత్నాలను గురించీ, అద్యతన భావిలో అట్టి అభ్యర్థులను పొందడానికిగల అవకాశాలను గురించీ తెలియపరుస్తూ ఆయా శాఖలు ప్రభుత్వానికి నివేదికలు సమర్పించాలి.

1959వ సంవత్సరపు ఆంధ్రప్రదేశ్ పబ్లిక్ ఎంప్లాయ్‌మెంట్ (నివాస స్థలానికి సంబంధించిన నియమం) నిబంధనావళిలో ఇకముందు సడలింపు జరగదని కూడా ప్రభుత్వం పేర్కొన్నది. ఈ ఉత్తర్వులను ఖచ్చితంగా పాటించవలసిందిగా సచివాలయ శాఖలనూ, శాఖాధిపతులనూ కోరడం జరిగింది.

ఉద్యోగాల కొరకు నివాస స్థలం నియమానికి సంబంధించిన ఆంధ్ర నిబంధనావళి ఆచరణను సమీక్షించిన మీదట ప్రభుత్వం ఈ ఉత్తర్వు చేసింది.

## మంత్రుల శాఖల పునర్వ్యవస్థీకరణ

ఈ దిగువ విధంగా మంత్రుల శాఖలు పునర్వ్యవస్థీకరించబడినవి:-

శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి, ముఖ్యమంత్రి: సాధారణ పరిపాలన, సర్వీసెస్, ఎన్నికలు, ప్లానింగ్, అర్థగణాంకశాఖ, విద్యుచ్ఛక్తి, రవాణా, హోమ్, పోలీసు ఆయుధాల చట్టం, ప్యాస్‌పోర్టు వ్యవహారాలు, ఆర్థిక వాణిజ్య పన్నుల శాఖలు.

శ్రీ తిమ్మారెడ్డి: వ్యవసాయం, ఆహారోత్పత్తి, మార్కెటింగ్, గ్రామీణపరపతి, వడ్డీవ్యాపారం, పశుపోషణ, పాలసరఫరా పథకం, పాడిపరిశ్రమాభివృద్ధి, గిడ్డంగుల సంస్థ.

శ్రీ వి.బి.రాజు: భూమిశిస్తు, భూసంస్కరణలు, స్టాంపులు, రిజిస్ట్రేషన్, కాందిశీకుల ఆస్తులు, జాగీర్ల నిర్వహణ రుణపరిష్కార మండలి, పౌరసరఫరా, రేషనింగు

శ్రీ తోట రామస్వామి: పంచాయతీరాజ్, పంచాయతీలు, అడవులు, చిన్న మొత్తాల పొదుపు.

శ్రీ జె వి నరసింగరావు: భవనాలు, రోడ్లు, రహదార్లు, రేవులు, పబ్లిక్‌గార్డెన్స్, నగర నీటి సరఫరా, పి.డబ్ల్యు.డి. వర్క్‌షాపులు, రైల్వే టెలిగ్రాఫ్ శాఖలతో సంబంధంకల అంశాలు.

శ్రీ టి.వి. రాఘవులు: న్యాయ, న్యాయస్థాన, న్యాయాధికారులు, జైళ్ళ శాఖలు.

శ్రీ కొండా లక్ష్మణ్ బాపూజీ: జనసంబంధశాఖ, సినిమా చట్టం యాత్రా వ్యవహారాలు, పునరావాసం, రవీంద్రభారతి, స్పోర్ట్స్ కౌన్సిల్ క్రీడావ్యవహారాలు, స్టేడియమ్, సాంస్కృతిక ప్రతినిధి వర్గాలకు ఆతిధ్యమిచ్చే బాధ్యతలు.

శ్రీ పి. వి. నరసింహారావు: విద్య, పురావస్తుశాఖ, స్వాతంత్ర్యోద్యమ చరిత్ర, సాహిత్య, శాస్త్రసంఘాలు, అకాడెమీలు, మ్యూజియములు, సంగీత విద్యాలయాలు, కళాశాలలు, ప్రాచీన వ్రాతప్రతుల సంరక్షణ, తర్జుమా, సాహితీకారులకు ధన సహాయమివ్వడం, లిఖితపత్ర భాండాగారం, లలితకళలు, వాస్తు కళాశాల, వ్యాయామవిద్య, అధికారభాష, శాసనసభ వ్యవహారాలు

శ్రీ బి.వి. గురుమూర్తి: అన్ని రకాల పరిశ్రమలు, పారిశ్రామిక సహకార సంఘాలు, ముద్రణ, కంట్రోలు సరకులు.

శ్రీ ఎన్. చెంచురామానాయుడు: మ్యునిసిపల్ పరిపాలన, టవున్ ప్లానింగ్, గృహవసతి, గృహనిర్మాణ విషయాలు.

శ్రీ కె. విజయభాస్కరరెడ్డి: సహకారం, సహకార చక్కెర ఫ్యాక్టరీలు, తుంగభద్ర, నాగార్జునసాగర్ ప్రాజెక్టులు, ఆయకట్టు అభివృద్ధి.

శ్రీ రుద్రరాజు రామలింగరాజు: దేవాదాయ ధర్మాదాయ శాఖలు.

శ్రీ శీలం సిద్దారెడ్డి: ఇరిగేషన్ (నాగార్జునసాగర్, తుంగభద్రమినహా), గిరిజన సంక్షేమం.

శ్రీ కె.వి. నారాయణరెడ్డి: కార్మికశాఖ, వాణిజ్యం, ఎగుమతుల అభివృద్ధి, గనులు, గనుల కార్పొరేషన్.

శ్రీ ఇబ్రహీమ్ అలీ అన్సారీ: వైద్య, ప్రజారోగ్యశాఖలు, వక్ఫ్, వక్ఫ్‌బోర్డు, సాలార్‌జంగ్ ఎస్టేటు.

శ్రీ అరిగె రామస్వామి: సాంఘిక, మహిళా సంక్షేమం.

శ్రీ వెనిగళ్ళ సత్యనారాయణరావు: ఎక్సైజ్, మద్య నిషేధం, మత్స్యపరిశ్రమ.

శాసనపర్వం

# శాసనసభ వర్షాకాల సమావేశం

—వి. శేషాద్రి

## ఆమోదించబడిన బిల్లులు

ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర శాసనసభ, 1968 జులై 10వ తేదీన 1968వ సం॥ ఆంధ్రప్రదేశ్ (కృష్ణా, గోదావరీ డెల్టా ప్రాంతం) డ్రయినేజి సెస్సుబిల్లును ఆమోదించింది. కృష్ణా, గోదావరీ డెల్టా ప్రాంతంలోని అన్ని భూములపై 6 సంవత్సరాలపాటు డ్రయినేజు సెస్సు విధించడానికి యీబిల్లు అవకాశం కల్పిస్తుంది. గోదావరి తూర్పు, మధ్యడెల్టా డివిజనులలోని భూములకు సంబంధించి ఎకరాకు సంవత్సరానికి రూ. 10 లు చొప్పున, గోదావరి పశ్చిమ డెల్టా ప్రాంతం, కృష్ణా తూర్పుడెల్టా, డివిజనులలోని భూములకు సంబంధించి ఎకరాకు సంవత్సరానికి రూ. 25 లు; కృష్ణా పశ్చిమ డెల్టా డివిజన్‌లోని భూములపై సంవత్సరానికి ఎకరాకు రూ. 15 లు చొప్పున సెస్సు విధించ బడుతుంది.

శాసనసభ, 1968 జూన్ 27న, 1967వ సం॥ ఆంధ్రప్రదేశ్ జాయింటు పట్టాల విభజన బిల్లును ఆమోదించింది. సబ్ డివిజనులు చేయడానికి సంబంధించి ప్రభుత్వం ఖర్చుచేసే మొత్తాలను ముందుగానే పట్టాదార్ల నుండి వసూలుచేయడానికి యీ బిల్లు వీలు కల్పిస్తుంది. జాయింటు పట్టాలను విభజించే సందర్భంలో హక్కుల రికార్డు ధ్రువీకరించడమేగాక పట్టాదార్లకు ప్యాసు పుస్తకాల పద్ధతి ప్రభుత్వం తలపెట్టింది.

1968 జూన్ 27న శాసనసభ, 1968వ సం॥ ఆంధ్రప్రదేశ్ సివిల్‌సర్వీసుల (క్రమశిక్షణ విచారణ ట్రిబునల్) సవరణ బిల్లును ఆమోదించింది. విచారణ సందర్భంలో సహాయపడే నిమిత్తం యే వ్యక్తినైనా మదింపు అధికారిగా నియమించడానికి ఈ బిల్లు ద్వారా ట్రిబునలుకు అధికారం లభిస్తుంది.

1968 జూన్ 27న, 1968వ సం॥ ఆంధ్రప్రదేశ్ భూమి అతిక్రమణ చట్టాన్ని ఆమోదించింది. ప్రభుత్వ భూములను అక్రమంగా ఆక్రమించుకున్నవారిని తొలగించడానికి వీలుగా పటిష్ఠమైన చర్యలు తీసుకోవడానికి తహసీల్దార్లకు, స్పెషల్ డిప్యూటీ తహసీల్దార్లకు యీ చట్టంద్వారా అధికారం సంక్రమిస్తుంది.

ఆంధ్రప్రదేశ్ శాసనమండలి, 1968 జులై 12వ తేదీన శాసనసభ ఆమోదించిన 1968వ సం॥ ఆంధ్రప్రదేశ్ దుకాణాలు, వ్యవస్థల బిల్లుకు తన సమ్మతిని తెల్పింది. దుకాణాల వ్యవస్థలకు 'సోమవారం' సెలవుదినంగా యీబిల్లు అవకాశం కల్పిస్తుంది. ఆదివారం ప్రజలకు సెలవు కావడంవల్ల ప్రజలకు ఆరోజు తమకు అవసరమైన వస్తువులు కొనుగోలు చేయడానికి వీలుకలుగుతుంది. ఏవైనా దుకాణాలకుగానీ, కొన్ని తరగతులకు చెందిన దుకాణాలకుగానీ మరేదైనా ఒక రోజును సెలవుదినంగా ప్రకటించడానికి యీ బిల్లుద్వారా ప్రభుత్వానికి అధికారం ఉంటుంది.

ఆంధ్రప్రదేశ్ శాసనసభ, 1968 జులై 15వ తేదీన 1968వ సం॥ ఆంధ్రప్రదేశ్ ఎక్సైజ్ బిల్లును ఆమోదించింది, మత్తుపానీయాలు, పదార్థాల ఉత్పత్తి తయారీ, అధీనం, రవాణా క్రయ విక్రయాలకు సంబంధించిన నిబంధనలను సవరించి సమీకృతం చేయడానికీ, రాష్ట్రంలో మానవుల వినియోగానికి సంబంధించిన మత్తుపానీయాలపై ఎక్సైజ్ పన్ను విధించడం, నల్లమందు యితర సంబంధిత వస్తువులపై ఎక్సైజ్ పన్ను విధించడానికీ యీ బిల్లు ఉద్దేశించ బడింది. రాష్ట్రంలో ఒకే విధమైన ఎక్సైజ్ పన్నులను విధించడానికి యీ బిల్లు వీలుకల్పిస్తుంది. అయితే మొదట యిది తెలంగాణా ప్రాంతానికి వర్తిస్తుంది, ఆ తర్వాత మద్యనిషేధాన్ని తొలగించినప్పుడు ఆంధ్ర ప్రాంతంలో అమలు జరుపుతారు.

ఆంధ్రప్రదేశ్ శాసనమండలి, 1968 జులై 13వ తేదీన శాసనసభ ఆమోదించిన 1968వ సం॥ ఆంధ్రప్రదేశ్ జీతాల చెల్లింపు, అనర్హతల తొలగింపు (సవరణ) బిల్లును ఆమోదించింది. శాసనసభ్యుల జీతాలను రూ. 250 ల నుండి రూ. 350 లకు ఎక్కువ చేయడానికి ఉద్దేశించబడింది. ముఖ్యమంత్రి, యితర మంత్రులు, స్పీకర్, శాసనమండలి అధ్యక్షుల యింటి అద్దె అలవెన్సు, మోటారు శకటం అలవెన్సులను ఎక్కువ చేయడానికికూడ వీలుకలుగుతుంది.

శాసనమండలి, 1968 జులై 13న, శాసనసభ ఆమోదించిన 1968వ సం॥ ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ఆవరణల (అనధికార ఆక్రమణల తొలగింపు) బిల్లును ఆమోదించింది. ప్రభుత్వ స్థలాలను అనధికారికంగా ఆక్రమించుకున్నవారిని తొలగించడానికి యీ బిల్లు ఉద్దేశించబడింది. తొలగింపు చర్యలకు దావా ద్వారా తొలగించే మామూలు విధానం వర్తించదని యీ బిల్లు ఆదేశించింది.

శాసనసభ ఆమోదించిన 1968వ సం॥ ఆంధ్రప్రదేశ్ అభ్యంతర కార్యకలాపాల నిషేధం(సవరణ) బిల్లునుకూడ శాసనమండలి ఆమోదించింది. పోలీసు ఇన్స్పెక్టరు హోదాగలవారు, అంతకు పైహోదాగలవారు మాత్రమే ప్రవేశించి, వెతికి, జప్తు మొదలైనవి చేసే అధికారం వినియోగించగలుగుతారు. ఈ బిల్లుకు ముందు ఏ పోలీసు అధికారైన యీ అధికారాన్ని వినియోగించ

దానికి అవకాశం ఉండేది. హోదాగల బాధ్యతాయుత పోలీసు అధికారికి యీ అధికారం పరిమితం చేయడంవల్ల వాటిని దుర్వినియోగం చేసే అవకాశం ఉండదు. తత్ఫలితంగా వ్యక్తుల హక్కులకు నిర్దిష్టపరిమితులలో భద్రతఉంటుంది.

1968 జులై 16న శాసనసభ, 1968వ సం॥ ఆంధ్రప్రదేశ్ (తెలంగాణ ప్రాంతం) కౌలుదారీ, వ్యవసాయభూముల (రెండవ సవరణ బిల్లును) ఆమోదించింది. భూముల మార్పిడి జరిగిన తర్వాత సంవత్సరంలోగా సర్టిఫికెటు నిమిత్తం చట్టంలో 50 బి సెక్షన్ క్రింద తహసీల్దారుకు దరఖాస్తు చేయాలనే కాలపరిమితిని 1968 మే 22వ నుండి 2 సంవత్సరాలకు పెంచబడింది.

1968 జులై 1న, 1968వ సం॥ వేతనాల చెల్లింపు (ఆంధ్రప్రదేశ్ సవరణ) బిల్లును శాసనసభ ఆమోదించింది. ఈ చట్టంలోని 15వ సెక్షన్ క్రింద జరిగే ప్రొసీడింగ్స్‌కు సంబంధించి కోర్టు ఫీజు చెల్లింపునుండి పనివారలను మినహాయించడానికి యీ బిల్లు ఉద్దేశించబడింది. ఇది వాస్తవంగా పనివారలకు ఎంతగానో ప్రయోజనకరమైనది. దీని ఫలితంగా సాంఘిక న్యాయం చేకూరుతుంది ఈ కార్మికచట్టం రూపొందించినందువల్ల కార్మికులు ప్రభుత్వానికి ఋణపడి ఉన్నారు

1968 జులై 8న శాసనసభ, 1968వ సం॥ ఆంధ్రప్రదేశ్ లాటరీల బిల్లును ఆమోదించింది. వ్యక్తిగత ప్రయోజనాల నిమిత్తం లాటరీలు, రాఫిల్స్‌ను నిర్వహించడాన్ని నిషేధిస్తూ తద్వారా ఆంధ్రప్రదేశ్‌లో లాటరీలు, రాఫిల్స్‌ను క్రమబద్ధం చేయడానికి స్వలాభాపేక్షలేని లాటరీల రాఫిల్స్‌కు లైసెన్స్ పద్ధతితో కొన్ని నిర్బంధాలు విధించడానికి యీ బిల్లు ఉద్దేశించబడింది. రాష్ట్రంలో లాటరీలు, రాఫిల్స్ నిర్వహణను పటిష్ఠంగా కంట్రోలు చేయడానికి, భారతశిక్షాస్మృతిలోని 294 ఎ సెక్షన్ అంతగా ఉపయుక్తం కానందువల్ల రాష్ట్రంలో దాని వర్తింపును రద్దుచేయడం జరిగింది.

1968 జూన్ 25వ తేదీన శాసనసభ, 1968వ సం॥ ఆంధ్రప్రదేశ్ మెడికల్ ప్రాక్టీష్నర్ల రిజిస్ట్రేషన్ బిల్లును ఆమోదించింది. ఇది సమీకృత శాసనం. ఈ విషయంలో ఆంధ్ర, తెలంగాణా ప్రాంతాలలో వేరువేరుగా అమలులో ఉన్న చట్టాలను దీనిద్వారా రద్దుచేశారు. ఈ చట్టాన్నిగూర్చి అప్పటి రాష్ట్ర ఆరోగ్యశాఖ మంత్రి, శ్రీ పి. వి. నరసింహారావు, యిలా వివరించారు. "ఆధునిక వైద్యాన్ని ప్రాక్టీసుచేసే అర్హత గలవారిని నమోదుచేయడానికేగాక యీ పద్ధతి వైద్యానికి సంబంధించిన అన్ని విషయాలను గూర్చి వ్యవహరించడానికి యీ చర్య ఉద్దేశించబడింది."

1968 జూన్ 27న శాసనసభ, 1968వ సం॥ ఆంధ్రప్రదేశ్ (ఆంధ్రప్రాంతం) మద్యనిషేధ (సవరణ) బిల్లును ఆమోదించింది. అనేక ఇతర విషయాలతోపాటు మద్యనిషేధాన్ని ఉల్లంఘించే నేరస్థులను కఠినంగా శిక్షించడానికి యీ బిల్లు అవకాశం కల్పిస్తుంది.

## ప్రాంతీయ సంఘానికి నివేదించబడిన బిల్లులు

రాష్ట్ర శాసనసభ 1968 జులై 3వ తేదీన ఆంధ్రప్రదేశ్ (ఆంధ్ర ప్రాంతం) విద్యా సంస్థల (కోరడం, స్వాధీనపరచుకోవడం) విస్తరణ: సవరణ బిల్లునూ, 1968వ సం. పు ఆంధ్రప్రదేశ్ సహకార సంఘాల (సవరణ) బిల్లునూ ప్రాంతీయ సంఘానికి నివేదించింది. వీటిలో మొదటి బిల్లు ఆ శాసనాన్ని తెలంగాణా ప్రాంతానికి కూడా విస్తరింప జేయడాన్ని ఉద్దేశిస్తున్నది. రెండవ బిల్లు ననుసరించి, సహకార కేంద్రబ్యాంకు తదితర సంస్థలకు ఎన్నికలు నిర్వహించే నిమిత్తం ఎన్నికల అధికారిగా వ్యవహరించడానికి గాను డిప్యూటీ రిజిస్ట్రారు హోదాకు తక్కువకాని సహకార శాఖకు చెందిన ఎవరైనా అధికారిని నియోగించడానికి సహకార సంఘాల రిజిస్ట్రారుకు అధికారం వుంటుంది. 1968వ సం. పు ఆంధ్రప్రదేశ్ (తెలంగాణా ప్రాంతం) కౌలుదారు, వ్యవసాయ భూముల (సవరణ) బిల్లును కూడా శాసనసభ ప్రాంతీయ సంఘానికి నివేదించింది. దీనివల్ల రక్షిత కౌలుదార్లకు ప్రభుత్వం మంచే కాక భూమి తనఖా బ్యాంకునుంచి, సహకారసంఘం నుంచి, లేక రైతులకు ఋణాలు యిచ్చే ఏదైనా ఇతర సంస్థలనుంచి ఋణాలు పొందడానికి వీలు ఏర్పడుతుంది. 1968 జూన్ 27వ తేదీన, 1968వ సం. పు ఆంధ్రప్రదేశ్ (తెలంగాణా ప్రాంతం) భూమిశిస్తు సవరణ బిల్లు ప్రాంతీయ సంఘానికి నివేదించ బడింది.

## జాయింట్ సెలక్ట్ కమిటీకి నివేదించబడిన బిల్లు

శాసనసభ, 1968 జులై 17వ తేదీన 1968వ సంవత్సరపు ఆంధ్రప్రదేశ్ ప్రత్యేక అధికారాల (పత్రికల) బిల్లును జాయింట్ సెలక్ట్ కమిటీకి నివేదించింది. శాసనసభలో 1968 జులై 13వ తేదీన ఈ బిల్లును ప్రవేశపెట్టడానికి రాష్ట్రపతి, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వానికి అనుమతి యిచ్చారు.

## ప్రవేశపెట్టబడిన బిల్లులు

ప్రభుత్వం, 1968 జులై 9వ తేదీన 1968వ సంవత్సరపు ఆంధ్రప్రదేశ్ గేమింగ్ బిల్లును ప్రవేశపెట్టింది. వేటలను నిరోధించడానికై కఠినశిక్షలను ఈ బిల్లు నిర్దేశిస్తున్నది. రాష్ట్ర లా కమిషన్ సిఫార్సులను పురస్కరించుకొని ఈ బిల్లు రూపొందించబడింది.

## ప్రభుత్వ పరిశీలనలో వున్న బిల్లులు

ముసాయిదా విద్యా బిల్లును విద్యా సలహా సంఘమూ, న్యాయశాఖా పరిశీలిస్తాయి. దీనిని రూపొందించే విషయంలో 1964వ సంవత్సరంలో ఒక ప్రత్యేక అధికారిని నియమించడం జరిగింది,

గత 8 సంవత్సరాలనుంచి గ్రామ పంచాయతీల చట్టం అమలు జరుగుతున్న తీరుతెన్నులను జాగ్రత్తగా పరిశీలించిన మీదట ఈ చట్టంలోని కొన్ని నిబంధనలను సవరించడానికి ప్రభుత్వం నిశ్చయించింది.

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో 'భిక్షుక' వృత్తిని నిర్మూలించే నిమిత్తం సమగ్రమైన ఒకబిల్లు తేవడానికి ప్రభుత్వం శ్రద్ధగా పరిశీలిస్తున్నది. ఇది బహుశః వచ్చేసారి శాసనసభలో ప్రవేశ పెట్టవచ్చును

ఆంధ్రప్రాంతంలో అమలులో వున్న 1949వ సం పు మద్రాసుభూమి అభివృద్ధి పథకం చట్టాన్ని తెలంగాణా ప్రాంతంలో అమలులో వున్న 1963వ సం. పు హైదరాబాదు భూమి అభివృద్ధి చట్టాన్ని ఏకం చేయటాన్ని ఉద్దేశిస్తున్న ముసాయిదా శాసనం ప్రభుత్వ పరిశీలనలో వుంది. రాష్ట్ర శాసనసభ యీ యేటి వర్షకాల సమావేశం శాసన కార్యకలాపాల దృష్ట్యాచాల ప్రాధాన్యత కలిగినది.

## శాసనమండలి నూతన అధ్యక్షుడు



శ్రీ గొట్టిపాటి బ్రహ్మయ్య తరువాత, ఆయన స్థానంలో రాష్ట్ర శాసన మండలికి అధ్యక్షునిగా మాజీమంత్రి శ్రీ పిడతల రంగారెడ్డి ఏకగ్రీవంగా ఎన్నికయ్యారు.

శాసన సభ్యునిగాను, మంత్రిగాను, ప్రదేశ్‌కాంగ్రెస్ అధ్యక్షునిగాను, తదితర హోదాలలోనూ శ్రీ రంగారెడ్డి రాష్ట్రానికి చేసినసేవలను, ముఖ్యమంత్రితోసహా, శాసనమండలిలో అన్ని వర్గాలవారూ కొనియాడారు.

ఏకగ్రీవంగా శ్రీ రంగారెడ్డి ఎన్నిక, ఆయన పట్ల ప్రతి ఒక్కరికీ గల అంగీకారభావం సూచిస్తుందని ముఖ్యమంత్రి అన్నారు. విద్యార్థిగానే ఆయన జాతీయోద్యమంలో ముందుకురికారు. దక్షతగల మంత్రిగాను, సమర్థతగల ప్రదేశ్ కాంగ్రెసు అధ్యక్షుడుగాను, శ్రీ రంగారెడ్డి తన ప్రతిభాన పతిని నిరూపించుకున్నారు తనకుపూర్వం, అధ్యక్షపదవి నిర్వహించిన శ్రీ మాడపాటి హనుమంతరావు, శ్రీగొట్టిపాటి బ్రహ్మయ్యగార్లు నెలకొల్పిన ఉన్నత సంప్రదాయాలను శ్రీ రంగారెడ్డి కొనసాగించ గలరనడంలో సందేహంలేదని ముఖ్యమంత్రి వ్యక్తంచేశారు. పదవీకాలంలో, తన కందజేసిన సహకారానికి, శ్రీ గొట్టిపాటి బ్రహ్మయ్య సభ్యులందరికీ కృతజ్ఞత వెల్లడించారు.

రాజకీయ జీవితంలో వివిధరకాలైన బాధ్యతలు తాను నిర్వహించడం జరిగిందనీ – అయితే ప్రస్తుతం నిర్వహించ బోతున్న పదవి తనను ప్రతిఒక్కరికీ; ప్రతిఒక్కరినీ తనకూ చెందేటట్లు చేయడం దృష్ట్యా అన్నింటిలో దాన్ని ఉత్తమైనదిగా పరిగణిస్తున్నానని శ్రీ రంగారెడ్డి అన్నారు. పదవీనిర్వహణలో నిష్పాక్షికంగా వ్యవహరించగలననీ, శాసనమండలికి మంచిపేరు ప్రఖ్యాతులున్నాయనీ, మండలి సమాలోచనలు ఉన్నతప్రమాణానికి చెందివుంటాయని, ఆ స్థాయిని యింకనూ పెంచేందుకు అందరూ కృషి చేయాలని ఆయన అన్నారు

శాసనమండలి అధ్యక్షపదవికి, యువతరం ప్రతినిధిగా శ్రీ రంగారెడ్డికి స్వాగతం పల్కడం తమకందరికీ ఆనందదాయకమైన విషయమని శ్రీ వి. పి. రాఘవాచారి అన్నారు.

# న్యాయపాలన

## స్టాంపు పన్నులు: కోర్టు ఫీజులు

భారత స్టాంపు చట్టం క్రింద, స్టాంపు పన్ను న్యాయేతర (నాన్ జుడీషియల్) స్టాంపుల ద్వారా వసూలవుతున్నది. ఆంధ్రప్రదేశ్ కోర్టు ఫీజు, దావాల మదింపు చట్టం క్రింద నిర్దిష్ట పరచిన కోర్టు ఫీజు ను జుడీషియల్ స్టాంపుల ద్వారా కానీ లేక కోర్టు ఫీజు బిళ్లల ద్వారా కానీ పొందడం జరుగుతున్నది. కోర్టు ఫీజు నిజానికి పన్ను కాదు చేసిన సేవలకు ప్రతిఫలంగా తీసుకొనబడే మూల్యం. అయా స్థానిక సంస్థల చట్టాలచే, స్టాంపు పన్నుపై సర్‌ఛార్జిగా నిర్దిష్టపరచబడిన బదలాయింపు పన్ను [ట్రాన్స్‌ఫర్ డ్యూటీ] కూడా న్యాయస్థానేతర స్టాంపుల రూపంలోనే వసూలవుతుంది అయితే "కలక్షన్ ఛార్జీల" క్రింద 6 శాతం మొత్తాన్ని మినహాయించుకున్నమీదట ఈ ఆదాయాన్ని ఆయా స్థానిక సంస్థలకు కేటాయిస్తారు. రాష్ట్రం ఆదాయాలను పెంపొందించే నిమిత్తం ప్రభుత్వం, శాసన సభ గత బడ్జెటు సమావేశంలో స్టాంపు పన్నులను 50 శాతం హెచ్చించడానికి ఒక బిల్లును ప్రవేశ పెట్టింది. ఈ బిల్లు వల్ల కోర్టు ఫీజు కానీ, బదలాయింపు పన్ను కానీ పెరగదు. కేంద్ర ప్రభుత్వం మాత్రమే నిర్దిష్టపరచవలసిన స్టాంపు పన్ను రేట్లలో కూడా ఈ బిల్లు వల్ల మార్పు జరగదు. ఈ బిల్లుకు రాష్ట్రపతి ఆమోదం లభించిన తర్వాత 1967 అక్టోబరు 20 వ తేదీ నుంచి యిది అమల్లోనికి వచ్చింది.

## స్టాంపుల సరఫరా, పంపిణీ

నాసిక్‌లోని స్టాంపుల కంట్రోలర్ స్టాంపు కాగితాలనూ, బిళ్లలనూ ముద్రించి రాష్ట్రానికి సరఫరా చేస్తారు. జిల్లా ట్రెజరీ కార్యాలయాలన్నీ అన్ని రకాల స్టాంపులను నిలువ వుంచడంలోనూ

విక్రయించడంలోనూ స్థానిక డిపోలుగా వ్యవహరిస్తాయి. అన్ని రకాల స్టాంపులను స్టాంపు విక్రేతలకూ, ప్రజలకూ విక్రయించడంలో సబ్ ట్రెజరీలన్నీ బ్రాంచి డిపోలుగా వ్యవహరిస్తాయి.

హైదరాబాదు, సికింద్రాబాదు నగరాలలో స్టాంపు విక్రేతలకూ ప్రజలకూ స్టాంపులు విక్రయించడంలో జనరల్ స్టాంపు ఆఫీసు స్టాంపు డిపోగా వ్యవహరిస్తుంది.

లైసెన్సు పొందిన స్టాంపు విక్రేతలకు ప్రభుత్వం, వారి వారి నివాస స్థలం, వారు విక్రయించే స్టాంపుల రకాలను బట్టి నూటికి 10 పైసలు మొదలు నూటికి రూ 4-70 ల వరకు కమిషను యిస్తుంది. లైసెన్సుగల స్టాంపు విక్రేతలు ఒక వ్యక్తికి ఒకే పర్యాయం రూ. 2,000 ల విలువకు మించిన స్టాంపులు విక్రయించడానికి వీలుండదు. హుజూర్ ట్రెజరీల ట్రెజరర్లూ, సబ్ ట్రెజరీల సబ్ ట్రెజరీ ఆఫీసర్లూ ఎక్కువ విలువ కలిగిన స్టాంపులను నేరుగా ప్రజలకు విక్రయిస్తారు.

**కొరత :**

ఇటీవల రాష్ట్రంలో స్టాంపుకాగితాల కొరత తీవ్రంగా వుంటున్నది. ఈ స్టాంపును ముద్రించడానికి ఉపయోగించే విదేశీ కాగితం సరఫరా తగ్గడం దీనికి కారణం. విదేశ మారకం ఇబ్బందులవల్ల ఈ కాగితాన్ని ధారాళంగా దిగుమతి చేసుకోవడానికి సాధ్యం కావడం లేదు. కొరతపరిస్థితిని నివారించి, ప్రజలకు కలుగుతున్న అసౌకర్యాన్ని సాధ్యమైనంతవరకు తగ్గించడానికి దిగువ పేర్కొన్న చర్యలు గైకొనబడినవి—

ట్రెజరీ ఆఫీసర్లకూ, సబ్ ట్రెజరీ ఆఫీసర్లకూ అందజేయబడిన పత్రాలపై, వాటిని ఆచరణలో పెట్టడానికి పూర్వం లేబిల్సు అంటించడానికీ, లేబిల్సును కొట్టివేయడానికీ ఈ అధికార్లకు అధికారాలు వుండేవిధంగా నిబంధనలు సవరించబడినవి. ఈ లేబిల్సును తయారుచేయడం, సరఫరా చేయడం సులభం. ఖర్చు తక్కువ. స్టాంపు విక్రేతల వద్దకాని ట్రెజరీలోకాని స్టాంపు చేసిన కాగితాలు లభించని పక్షంలో ప్రజలు పత్రాలను సాదా కాగితంపై వ్రాసి వీటిని ఆచరణలో పెట్టడానికి పూర్వం లేబిల్సు అంటించి కొట్టివేసే నిమిత్తం సబ్ ట్రెజరీ కార్యాలయానికి తీసుకొనివెళ్ళవచ్చు.

అన్ని రకాల స్టాంపులను ప్రజలకు నేరుగా విక్రయించే నిమిత్తం, హైదరాబాదులోని జనరల్ స్టాంపు ఆఫీసులో ఒక కౌంటరును తెరిచారు. రాష్ట్రంలోని ముఖ్యప్రదేశాలలో కూడా ఇటువంటి కౌంటర్లను తెరవడానికి ప్రతిపాదన వుంది.

1959 ఏప్రిల్ మొదటితేదీకి పూర్వం, హైదరాబాదులోని స్టాంపు ప్రెస్‌లో ముద్రించిన స్టాంపులు తెలంగాణా ప్రాంతంలో చలామణిలో వుండేవి. ముద్రణ అండాకారంలో వుండేది. సంఖ్య మెషినుతో వేయబడి వుండేది. వాటికి పూర్వ "హైద్రాబాదు ప్రభుత్వ" పు వాటర్‌మార్కు వుండేది. తరువాత వాటిని చలామణీనుంచి ఉపసంహరించారు. ఇటువంటి స్టాంపు కాగితాలు దాదాపు ఒక లక్షవరకు విలువ వున్నాయి. స్టాంపు ప్రెస్‌ను పునరుద్ధరించే ప్రతిపాదనకూడా పరిశీలనలో వుంది.

తక్కువ విలువ కలిగిన స్టాంపులను దేశీ కాగితంపై ముద్రించవలసిందిగా స్టాంపుల కంట్రోలర్‌ను అభ్యర్థించడం జరిగింది. ఆయన వాటిని వివిధ స్టాంపు డిపోలకు సరఫరా కూడా చేశారు. ఎక్కువ విలువ కలిగిన స్టాంపులను తా.పు స్టాంపు డిపోలకు సరఫరా చేసినట్లుగా నాసిక్‌లోని స్టాంపుల కంట్రోలర్, రిజిస్ట్రేషన్ స్టాంపులశాఖ ఇనస్పెక్టర్ జనరల్‌కు తెలియ జేశారు.

స్టాంపుల విక్రేత ఒక నెలలో ఆర్జించకలిగిన కమిషను గరిష్ట పరిమితిని రూ. 150 ల నుంచి రూ. 300 లకు హెచ్చించారు. ఇందువల్ల స్టాంపు విక్రేతలు ఇతోధికంగా స్టాంపులకొరకు ఇండెంటు పెట్టి నెల అంతటా స్టాంపులను ప్రజలకు అందుబాటులో వుంచడానికి ప్రోత్సాహం ఏర్పడుతుంది.

పైన తెలిపిన చర్యల ఫలితంగా కొరత పరిస్థితి తొలిగిపోగలదనీ, ప్రజలకు కలుగుతున్న అసౌకర్యాలు చాలావరకు తగ్గగలవనీ ఆశించబడుతున్నది.



# సమాజంలో నైతిక విలువలు

—డా. జాకిర్ హుసేన్



మహాత్మాగాంధీ నాయకత్వం క్రింద స్వాతంత్ర్య పోరాటాన్ని మనం కొనసాగించిన సందర్భంలో దేశ కాల పరిస్థితులకు అనుగుణంగా మన జీవన సరళిని మార్చుకుని, మన సాంఘిక వ్యవస్థలో అతి ప్రధానమైన మార్పులను తీసుకురావలసి వచ్చింది. స్వాతంత్ర్య సముపార్జన అనంతరం భారతదేశ పునర్నిర్మాణ కృషి అతి ప్రధానమూ, అత్యంత కష్టసమన్వితమూ అయిన పని అయింది. వ్యక్తిత్వ నిర్మాణం కూడా అంతే ప్రధానమైనదీ, కష్టసాధ్యమైనదీ కూడా. సమాజంలో నెలకొనివున్న అవినీతే మన దేశ పునర్నిర్మాణ కృషిలో అడుగా నిలిచివున్న ఆటంకమని నిస్సంశయంగా చెప్పవచ్చు. మన స్వాతంత్ర్యానికి ఒక అర్థాన్ని కల్పించి, మన ప్రజాస్వామ్యాన్ని అచ్చమైన ప్రజాస్వామ్యంగా చేయాలంటే యీ లోపాన్ని మనం సమాజంనుంచి కూకటి వేళ్ళతో పెకలించివేయాలి.

క్షుద్బాధను తీర్చుకోవడం మంచిదేకాని కడుపుబ్బ తినడం మాత్రం మంచిపనికాదు. ఎన్నో త్యాగాల్నిచేసి స్వాతంత్ర్యాన్ని సంపాదించుకున్నాం మనం. అయితే స్వాతంత్ర్యం గురించి పోరాడి, దానిని సాధించిన మనలోనే ఏదో లోపం వున్నట్టుంది. మనలో చాలా మంది స్వార్థపరులూ, దురాశాపరులూ అయిపోయారు. వారేగాని నిష్కల్మషమైన జీవితాన్ని గడిపివుండివుంటే అప్పుడు వారు యితరులను పరిశుద్ధమైన, తప్పుపట్టడానికి వీలులేని స్వచ్ఛమైన జీవితాన్ని గడపమని అడగడంలో అర్థంవుంది. అలా కానప్పుడు కేవలం మాటలు మాత్రమే చెప్పడం, క్రియాశూన్యత్వం అనిపించుకుంటుంది. నిజానికి కేవలం మాటలతో మూటలు కట్టలేం వట్టి పలుకులతో పనిజరగడం కల్ల. నెల్లాళ్ళు పనిచేసి ఓగంట ప్రసంగించు—అన్నది సరైన పద్ధతి. బళ్ళకొద్దీ, టన్నులకొద్దీ మాటల్ని పోగులు పెట్టడంకన్న ఔన్సంత పనిచేసి చూపడం మంచిది. మన నోటి నుంచి వచ్చే ప్రతి మాటా మన భుజాలమీద బరువుగా తయారవుతుంది. ఆ బరువును మనం మోయడానికి సిద్ధంగా వుండాలి. దానిని సాధించి మరీ చూపించాలి లేకపోతే ఆ బరువే తలకుమోపిడై మనల్ని అణగద్రొక్కేస్తుంది. ఈ మాటలన్నీ నేను ఎందుకు చెప్తున్నానంటే నేను ఎన్నో సమావేశాలకు హాజరయ్యాను. అక్కడ వేదికమీద బల్లగుద్ది చెప్పిన మాటలన్నీ నీటిలో మూటలు అయిపోతూ వచ్చాయి. పెద్ద పెద్ద మాటలతో ప్రకటనలుచేసి, తీర్మానాలుచేసి, తీరా ఆచరణలోకి వచ్చేసరికి వాటిని చిత్తశుద్ధితో సాధించే ఓపికలేక ప్రసంగాలు ప్రసంగాలుగానే మిగిలి పోతున్నాయి. అందువల్ల యితరులను స్వచ్ఛమైన, నిజాయితీతో కూడిన జీవితాన్ని గడపమని, ఉన్నత నైతిక ప్రమాణాలను పోషించమని అడిగేవారు ముందుగా ఆత్మావలోకనం చేసుకొని తమలోని లోపాలను సరిదిద్దుకోవడం అవసరం.

## ఒక క్రొత్త సాంఘిక దృక్పథం

ప్రతిమనిషీ పరిశుద్ధమైన జీవితాన్ని గడపాలనే కోరుకుంటాడు. అది మానవ ప్రవృత్తి. అయితే ప్రజలు చూసి, అనుసరించడానికి ఎట్టఎదుట కళ్ళకు కనబడుతూ ఉదాహరణ అంటూ ఒకటి ఉన్నప్పుడే ఆ ప్రవృత్తి కార్యరూపం ధరిస్తుంది. అందుకే మాటల్ని వల్లించడంకన్న కార్యరూపంలో కళ్ళకు కనిపింపజేసే ఉదాహరణలు వుండాలి. లేకపోతే నీతులు ఎన్ని వల్లించినా వాటి వల్ల ఎక్కువ ప్రయోజనం సిద్ధించదు. తప్పుడు పనుల్ని ప్రజలు సహించలేని ఒక క్రొత్త వాతావరణాన్ని సృష్టించడానికి మనం ప్రయత్నించాలి. అవినీతిపరులు—వారు తమ జీవితంలో ఎంతటి విజయాన్ని సాధించినప్పటికీ—సమాజంలో ఏవిధమైన గౌరవాన్ని పొందలేని విధంగా ఒక క్రొత్త సాంఘిక దృక్పథాన్ని మనం అలవరచుకోవాలి. ఈ మార్గంలో మనం విజయాన్ని సాధించాలంటే అందుకు ఎన్నో సంవత్సరాలపాటు ఎంతో కృషి కొనసాగించవలసిన అవసరంవుంది.

అవినీతి అనేక విధాలు. అందులో లంచం ఒకటి. మోసం చేయడం, అసహ్యించుకోవడం, అత్యాశ, మతాన్ని స్వార్థానికి వినియోగించుకోవడం— యివన్నీ కూడా చెడ్డపనులే. ఈ చెడును సమాజం నుంచి తొలగించడానికి ప్రయత్నించాలి. ఈ కల్మషాన్నంతా నిర్మూలించి భారతీయ సమాజాన్ని పరిశుద్ధవంతం చేయాలి. అంతేకాదు యీ చెడు తిరిగి మన సాంఘిక జీవితంలోకి ముందు ముందు ఎప్పుడూ చోటు చేసుకోకుండా గట్టి చర్యలు తీసుకుని ఎప్పటికప్పుడు అప్రమత్తతతో వ్యవహరించాలి.

## గాంధీ మార్గం

గాంధీజీ మనకు మార్గాన్ని చూపించారు. ఆయన మహా మేధావి మాత్రమేకాదు ఆదర్శ క్రియాశీలి కూడా. మనం స్వాతంత్ర్యాన్ని సాధించుకోవడానికి ఆయన మనకు అహింస అనే ఆయుధాన్ని యిచ్చారు. స్వాతంత్ర్య పోరాటంలో ఒకవేళ భారతీయులు హింసాయుత విధానాన్నే అవలంబించివుంటే స్వాతంత్ర్యాన్ని సాధించిన తర్వాత మత విషయికంగానూ, భాషా విషయికంగానూ వారిమధ్యవున్న భిన్నత్వాల కారణంగా, ఒకరి గొంతు ఒకరు కోసుకుంటారని గాంధీజీ ముందుగానే ఊహించారు. ఆయన మనకు అప్పట్లో యిచ్చిన అహింసా ఆయుధం, వర్తమాన పరిస్థితుల్లో కూడా అవసరమే. అవినీతిమీద మనం చేయాల్సిన దండయాత్రలో అహింసా ఆయుధాన్ని మనం చేపట్టితే మన సుందర భవిష్యత్తుకు కొత్త మార్గాలు ఏర్పడగలవని నిస్సంశయంగా చెప్పవచ్చు. అప్పుడు మనం మన ప్రజాస్వామ్య సమతా సమాజ లక్ష్యంవైపు నిరాటంకంగా పురోగమించగలం.

ఈ లక్ష్య సాధనలో మతం కూడా ప్రముఖ పాత్ర వహిస్తుంది. నిజానికి మతాలు అన్నీ మంచివే. అయితే వాటిని అనుసరించే వారినిబట్టి వాటి మంచి చెడ్డలు నిర్ణయమౌతాయి. అన్ని మతాల ప్రాథమిక సూత్రాలూ మంచినే బోధిస్తాయి. ప్రతి మతం మూల సూత్రాలను ప్రతి భారతీయుడూ అనుసరించి ఆచరిస్తే నైతిక విలువలను ప్రతిష్ఠించి అతి తక్కువ వ్యవధిలోనే అన్ని రూపాల్లోని చెడునూ నిర్మూలించవచ్చు. దానివల్ల భవిష్యత్తులో నూతన భారత దేశం మరింత శక్తి సమన్వితం కాగలదు; మరింత సుప్రతిష్ఠితం కాగలదు. ఆనాడు సమాజం ఒక క్రొత్త రూపాన్ని సంతరించుకుంటుంది. మన హృదయాలు కల్మషానికీ, స్పర్ధలూ, కార్పణ్యాలకూ దూరంగా నిష్కల్మషంగా స్వచ్ఛంగా ప్రకాశిస్తాయి.

భారత దేశాన్ని సత్యవంతమైన దేశంగా, భారత ప్రజలను సత్యసంధులుగా కీర్తి ప్రతిష్ఠలకు ఆలవాలం చేయాలంటే మనలో చిత్తశుద్ధీ, నిజాయితీ, ఉత్సాహమూ, పరస్పర సహకారము వుండాలి. ఒక కొత్త శక్తిని, ఒక విధమైన త్యాగశీలతను, నిస్వార్థతను మనలో ప్రతిష్ఠించుకోవాలి. ఆనాడే మనం పరిస్థితులకు ఎదురొడ్డి ఠీవిగా నిలబడగలం. *

---

# దేశంలో సహకార సంఘాల అభివృద్ధి

1. మొదటి ప్రణాళిక ప్రారంభంలో గ్రామ ప్రాంతాలలో సుమారు 1 లక్ష 5 వేల ప్రాథమిక వ్యవసాయ పరపతి సంఘాలు వుండేవి. ఈ సహకార సంఘాలలో 40 లక్షల మంది సభ్యులు వుండేవారు. కాగా ఈనాడు 2 లక్షల 10 వేల ప్రాథమిక వ్యవసాయ పరపతి సంఘాలు ఏర్పాటై వున్నాయి; వీటిలో సభ్యుల సంఖ్య సుమారు 2 కోట్ల 60 లక్షలు.

2. మొదటి ప్రణాళికకుముందు రైతులకు రూ. 23 కోట్ల స్వల్పకాలిక ఋణాలు మంజూరు కాగా 1965_66 లో సుమారు రూ 400 కోట్లు స్వల్పకాలిక ఋణాలు వారికి మంజూరు చేయబడ్డాయి.

3. ఈ నాడు మొత్తం సుమారు 575 లక్షల ఎకరాల మేరలో 5,000 కు పైగా సహకార వ్యవసాయ క్షేత్రాలు ఏర్పాటై వున్నాయి. స్వాతంత్ర్యానికి ముందు దేశంలో వున్న సహకార వ్యవసాయ క్షేత్రాల సంఖ్య చాలా స్వల్పం.

4. దేశంలో ఇప్పుడు 3,00 కోట్లకు పైగా మార్కెటింగు సొసైటీలు వున్నాయి. 1964_65 లో ఈ సొసైటీలు రూ. 300 కోట్లకుపైగా విలువగల ఫలసాయాన్ని అమ్మకంచేశాయి.

5. స్వాతంత్ర్యానికి ముందు దేశంలో సహకార పద్ధతిపై ఏర్పాటైన పంచదార మిల్లులు గాని ప్రత్తి ఫ్యాక్టరీలు గాని లేనే లేవని చెప్పవచ్చును. ఇప్పుడు 57 సహకార పంచదార ఫ్యాక్టరీలు వున్నాయి. 1964_65 లో ఇవి 8 లక్షల మెట్రిక్ టన్నుల పంచదారను ఉత్పత్తి చేశాయి. దేశంలో ఆ ఏడు ఉత్పత్తి అయిన మొత్తం పంచదారలో ఇది సుమారు 25 శాతం. ప్రత్తి నుండి విత్తులు తీసే కార్ఖానాలు 162 సహకార పద్ధతిపై ఏర్పాటై వున్నాయి. దేశంలో ఉత్పత్తి అయిన పత్తిలో నూరింట సుమారు 9 వంతుల ప్రత్తి నుండి ఈ కార్ఖానాలలో విత్తులు తీయబడ్డాయి. ఉత్పత్తి అయిన మొత్తం ప్రత్తిలో సుమారు 10 శాతం ఈ కార్ఖానాలలో ప్రెస్ చేయబడింది.

6. పెరుగుతున్న ధరలను అదుపులో పెట్టడానికి కేంద్ర ప్రభుత్వం పథకం క్రింద 252 టోకు వ్యాపారపు స్టోర్సు సుమారు 8,000 ప్రాథమిక స్టోర్సు, లేదా బ్రాంచీలు ఏర్పాటు చేయబడ్డాయి. టోకు వ్యాపారపు స్టోర్సు 1964_65 లో రూ. 143.52 కోట్లు విలువ గల సరకులను అమ్మకం చేశాయి. 1964_65 లో ప్రాథమిక స్టోర్సు రూ. 40.43 కోట్ల విలువగల సరకులను అమ్మకం చేశాయి.

# జాతీయ సమైక్యత - శ్రీనగర్ మహాసభ నిర్ణయాల సమీక్ష

సి. వి. హెచ్. రావు

"భారత దేశాన్ని సర్వసత్తాక ప్రజాస్వామిక రిపబ్లిక్‌గా ఏర్పర్చుకోడానికి, దేశపౌరు లందరికీ ఆర్థిక, రాజకీయ, సాంఘిక న్యాయం చేకూర్చడానికి, భావ ప్రకటన, విశ్వాసం, ఆరాధనా విషయాలలో వారికి స్వేచ్ఛ ఇవ్వడానికి, వ్యక్తిగత గౌరవాన్నీ జాతి సమైక్యతనూ కాపాడుతూ పౌరులందరి మధ్య భ్రాతృభావాన్ని పెంపొందించడానికి త్రికరణ శుద్ధిగా తీర్మానించు కున్న భారత దేశ ప్రజలమైన మేము మా రాజ్యాంగ సభలో 1949 నవంబరు 26వ తేదీ నాడు ఈ రాజ్యాంగాన్ని ఇందుమూలంగా అవలంబిస్తున్నాము." (భారత రాజ్యాంగంలోని అవతారిక)

ఇటీవల శ్రీనగర్‌లో జరిగిన జాతీయ సమైక్యతా మహాసభ, మూడు ముఖ్య అంశాల దృష్ట్యా, 1961వ సంవత్సరంలో జరిగిన ప్రథమ మహాసభకంటే భిన్నమైనది. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలకూ దేశంలోని యితర సంస్థలకూ సమైక్యతను సాధించడంలో మార్గదర్శకంగా వుండేందుకై శ్రీనగర్ మహాసభలో లక్ష్యాలను ప్రకటించారు—ఇది మొదటిది. లక్ష్యాలను అమలుపరచడంలో సాధించిన పురోభివృద్ధిని సమీక్షించే నిమిత్తం ఒక శాశ్వత కమిటీని నెలకొల్పడం రెండవది. ఈ కమిటీ అధ్యక్షులుగా ప్రధాన మంత్రి వ్యవహరిస్తారు. దేశవ్యవహారాల మంత్రి; మత, ప్రాంతీయ, విద్యా విషయాలకు సంబంధించిన మూడు ఉప సంఘాల కన్వీనర్లూ కమిటీ సభ్యులుగా వుంటారు. తరువాత మరి కొంత మందిని కమిటీ సభ్యులుగా చేర్చుకుంటారు. ఇవే ఉద్దేశాలను సాధించే నిమిత్తం రాష్ట్ర స్థాయిలోనూ దిగువ స్థాయిలలోనూ యిటువంటి కమిటీలను ఏర్పాటు చేయదలిచారు. మహాసభ లక్ష్యాలను నెరవేర్చడానికై ప్రధాన మంత్రి, మహాసభలో పాల్గొన్న యితర ప్రముఖులూ తమ కృతనిశ్చయాన్ని స్పష్టంగా ప్రకటించడం మూడవదీ, ముఖ్యమైనదీ అయిన అంశం. ఎన్ని కమిటీలు వేసినా, ఎన్ని ప్రకటనలు చేసినా, లక్ష్యాలను గూర్చి ఎన్నిసార్లు ఘనంగా పలికినా వాటివల్ల లభించేదేమీ వుండదు వాటిని కార్యరూపంలో అనుసరించి చేసిచూపినప్పుడే వాటి ప్రయోజనం సిద్ధిస్తుంది. కులమతాభిమానం, ప్రాంతీయాభిమానం, భాషాభిమానం గత కొన్నాళ్ళుగా భారత దేశంలో స్థిరంగా పాదుకొనిపోయాయి. ఈ వ్రేళ్ళను పెకలించివేయాలంటే అటు కేంద్ర ప్రభుత్వం, యిటు రాష్ట్ర ప్రభుత్వాలేకాక, వివిధ రాజకీయ సంస్థలు, సాంస్కృతిక సంస్థలు విద్యాసంస్థలు అన్ని స్థాయిల్లోనూ పరస్పరం సహకరించు కుంటూ కృషిచేయ వలసివుంది, విదేశీ పరిపాలన సమసిపోవడంతో కులమతాల వ్యత్యాసం తొలగిపోగలదని భావించారుగాని దురదృష్టవశాత్తూ తగినంతగా ఆ జాడ్యం సమసిపోలేదు.

1961 లో సమావేశమైన జాతీయ సమైక్యతా మండలి చేసిన తీర్మానాలను ఆచరణలో పెట్టడానికి నిరంతరకృషి జరగలేదు. వేర్పాటుశక్తులు విజృంభించాయి. అయితే యీ వేర్పాటు ధోరణులు సమసిపోయి సమైక్యతాభావం నెలకొనడానికి చైనా, పాకిస్థాను దురాక్రమణలు కొంతవరకు తోడ్పడినప్పటికీ వాటి ప్రభావం తాత్కాలికంగా మాత్రమే వుంది. అది కేవలం ఆత్యయిక పరిస్థితి కాలానికి మాత్రమే పరిమితమైవుంది. జనసామాన్యంలో కులమతాలు, ప్రాంతీయ ధోరణి ప్రాతిపదికగా సమస్యలనన్నిటినీ పరిశీలించే దృక్పథం గాఢంగా నాటుకొనిపోయి వుండేది. అది కేవలం పైపైనే తొలగించి వేయబడింది గాని వ్రేళ్ళతో సహా పెకలించి వేయబడలేదు. జాతీయసమైక్యతకై జరిగిన ప్రయత్నం, ప్రస్థానం ప్రారంభించబడిందిగాని కొద్దిదూరం వెళ్ళేసరికి ఆగిపోవడం జరిగింది. ఆగిపోవడంతోనే సరిపుచ్చక అక్కడినుంచి తిరోగమించడం కూడా జరిగింది.

## ప్రజల బాధ్యత

జాతీయ సమైక్యతను నెలకొల్పేకృషి కేవలం ప్రభుత్వానిది మాత్రమే కాదనీ, సమైక్యతాసాధనకూ, సమైక్యతాశక్తులను బలపరచడానికీ, జాతీయ సమైక్యతా మండలి తీర్మానాలను కార్యరంగంలో పెట్టడానికీ ప్రభుత్వం ప్రధానంగా బాధ్యత వహించే మాట నిజమే అయినప్పటికీ ప్రజలందరూ—రాజకీయవేత్తలూ, విద్యావేత్తలూ, కళాకారులూ, రచయితలూ, ఉపాధ్యాయులూ, తల్లిదండ్రులూ, విద్యార్థులూ, విజ్ఞులూ, వ్యాపారస్తులూ, కార్మికసంఘాల నాయకులూ—అందరూకూడా సమిష్టిగా బాధ్యత వహిస్తారని శ్రీనగర్‌లో జరిగిన జాతీయ సమైక్యతా మండలి గట్టిగా అభిప్రాయపడింది. ఆ విషయాన్నే స్పష్టం చేసింది. కులమత వ్యత్యాసాల ధోరణిని, ప్రాంతీయ అభిమాన భావాన్ని ప్రోత్సహించరాదని కూడా ఆ సమావేశం వ్యక్తం చేసింది. సమాజంలో తప్పుదారి పట్టిన శక్తులను దౌర్జన్యచర్యలకు దిగకుండా తప్పించాలి. సహనము, సఖ్యతా భావాలను ప్రచారం చేయాలి. సంఘంలోని నిర్మాణాత్మక శక్తులనన్నిటినీ సమీకరించడానికి తోడ్పడాలి. సామాన్య పౌరుని హక్కులకు అనుగుణంగా సమిష్టి కార్యక్రమాలను రూపొందించి జాతీయతాభావ వీచికలను వారిలో రేకెత్తించాలి.

జాతీయ సమైక్యతకు సంబంధించిన మూడు ఉపసంఘాలు చేసిన సిఫారసులతోపాటు ప్రకటింపబడిన లక్ష్యాలను గూడా మనసులో పెట్టుకోవాలి. అప్పుడే మన రాజ్యాంగంలోని మూలసూత్రమైన జాతీయ సమైక్యతాభావాన్ని పరివ్యాప్తం చేయడానికీ, పరిపుష్టం

చేయడానికి దేశవ్యాప్తంగా ఒక సమిష్టి కృషికి ఆస్కారం వుంటుంది. మత సామరస్యానికి గాంధీజీ చెప్పినమందు ఒకటి వుంది. అదే 'హృదయ పరివర్తన'. అంటే వివిధ మతాల వారి మధ్య పరస్పర అవగాహనకు దోహదం కలిగించడం. ఒకరి అభిప్రాయాలను మరొకరు మన్నించి గౌరవించేటు చేయడం. అల్ప సంఖ్యాకుల ప్రయోజనాలను కాపాడడానికి దోహదంచేసే విధంగా అధిక సంఖ్యాకులలో మానసిక పరివర్తనను కలిగించడం. అదే విధంగా తమ అభివృద్ధికీ, ప్రయోజనాలకూ, న్యాయసమ్మతమైన హక్కుల్ని పొందడానికీ అల్ప సంఖ్యాకులు అధికసంఖ్యాకుల ఎడ నమ్మకముంచి, వారికి తోడ్పడుతూవుండే స్నేహవాతావరణానికి దోహదం కలిగించడం–యివి చేయాలి. ప్రస్తుతంవున్న మత కలోలాలను సమసిపోయేటు చేయడానికి జాతీయనాయకులు అనుసరించవలసిన మార్గం యిదే

## దివ్యౌషధం

నిజానికి యిది సులభసాధ్యమైనది కాదు. ప్రజలలో కుల, మత ధోరణి బాగా వ్రేళ్ళూని పాతుకొని పోయింది. దీనిని కూకటి వ్రేళ్ళతో పెళ్ళగించాలంటే ప్రజలలోని నిరక్షరాస్యతను నిర్మూలించి విద్యాధికులను చేయడం అవసరం. మత రహిత వ్యవస్థ ఆవిర్భావానికిగాను తమ సాంప్రదాయిక ధోరణులను పరిత్యజించి ప్రజలు ముందుకు రావడానికి విద్య తోడ్పడగలదు. ప్రజాస్వామ్య వ్యవస్థలో మత రహిత విధానమే ఆదర్శవిధానం. వివిధ కులాల వారి మధ్య, వివిధమతాల వారి మధ్య సంబంధాలకుగాని, ప్రభుత్వ కార్యకలాపాలకు గాని, పరిపాలనా యంత్రాంగం కదలికకు గాని మతంగాని, కులంగాని ఏ విధమైన ఆటంకమూ కారాదు. మత ధోరణి జాతీయ సమైక్యతకు, మత రహిత సర్వ మానవ సమానతావాదానికీ గొడ్డలి పెట్టు. మత రహిత వ్యవస్థలో మొత్తం సమాజం అంతా ఒక కూటమి 'అధిక సంఖ్యాకులు', 'అల్ప సంఖ్యాకులు' అన్నపదాలు జాతీయ సమస్యల విషయంలో రాజకీయ అభిప్రాయాలను వ్యక్తం చేయాల్సిన సందర్భంలో ప్రయోగించే మాటలుగా మాత్రమే వుండాలి. సమాజంలోని ఏ వర్గంగాని, వర్గాలుగాని ఒక ప్రత్యేక కాలానికి ప్రత్యేకమైన రక్షణ, రాయితీలు కల్పించడానికి ఆర్థికపరమైన వెనుకబడిన తనమే ప్రాతిపదికగా వుండాలి 'మతరహితవిధానం' అంటే కేవలం అదొక రాజకీయ సిద్ధాంతంకాదు. అదొక సమగ్ర సాంఘిక, సాంస్కృతిక సిద్ధాంతం భారతీయ ప్రజాస్వామ్యం ఆరోగ్యప్రదంగా ఎదగడానికి దోహదం చేసే దివ్యౌషధం.

అయితే ఒక విషయాన్ని విస్మరించడం తగదు. యీ విధమైన జాతీయ మతరహిత దృక్పథాన్ని యీ దేశంలో ప్రతిష్ఠించడం అనేది కొంత నెమ్మదిగా జరిగేపని. ఎందుకంటే దేశ విభజనకుముందు, ఆ తర్వాత మతకలహాలు దేశంలో స్వైరవిహారం చేశాయి. ప్రజల్లో అన్ని మతాలవారికి, వర్గాలవారికి విస్తృతంగా విద్యావకాశాలను కల్పించడం, వారి ఆర్థికప్రగతికి దోహదం కలిగించడం, సాంఘికన్యాయాన్ని కల్పించడం– యివన్నీ జరిగిన తర్వాతనే వాటి సత్ఫలితాల ఫలాలు పొందడానికి వీలవుతుంది.

మతవైషమ్యాలను ప్రోత్సహించే దుష్టశక్తులను అణచివేయడానికి రాజకీయ, సాంఘిక, విద్యా, పరిపాలనారంగాలలో అవసరమైన చర్యలన్నిటినీ తీసుకోవాలి. అంతేగాక రాజకీయ ప్రయోజనాల నిమిత్తం రాజకీయసంస్థలుగానీ యితరసంస్థలుగానీ ప్రాంతీయ, భాషాసమస్యలను రేకెత్తించడాన్ని, ఇతరులకు నష్టం కలిగే విధంగా యేదో ఒక ప్రత్యేకవర్గానికి ప్రత్యేకప్రయోజనం కావాలనే వాదాన్ని తగినవిధంగా అరికట్టాలి. ప్రజల మనస్సులలో మతతత్వభావం ఉన్నంత వరకు చట్టాలద్వారాగానీ, శిక్షలు విధించడంవల్లగానీ మతతత్వాన్ని నిర్మూలించలేము. అయితే మత ద్వేషాలను రెచ్చగొట్టి ప్రోత్సహించేవారినీ, వివిధ మతాలవారి మధ్య వైషమ్యాలను వ్యాపింపజేసేవారినీ కఠినంగా శిక్షించడానికి అవసరమైన చట్టాలను రూపొందించి, వాటిని సక్రమంగా

భారతదేశంలో వివిధ మతాలమధ్య సమైక్యతకు హృదయపూర్వకంగా కృషిచేసేవారికీ, ప్రాంతీయ, మత, కుల వైషమ్యాలను రేకెత్తించేవారికీ మధ్య సంవత్సరాల తరబడి ఘర్షణ కొనసాగుతున్నది. మనం వాదించినా, వద్దన్నా యిది మనజాతి జీవనంలో ఒక భాగంగా రూపొందడం విచారకరమైన విషయం. జాతి సమైక్యత అవసరమంటూ పిలుపు ఇచ్చినందువల్లగానీ ఉత్తమ లక్ష్యాలను ప్రకటించినందువల్లగానీ యీ ఘర్షణలను రూపుమాపలేము. విచ్ఛిన్న ధోరణి గతంలోనూ, యిప్పుడుకూడా గుర్తించడం జరిగింది. దాని ఫలితమే యీ కాశ్మీరు మహాసభలో ప్రాంతీయతత్వం, విద్యా విషయాల ఉపసంఘంచేసిన తీర్మానాలు. అయితే ప్రాంతీయ, కులతత్వాలు, మత తత్వం అంతగా ప్రమాదకరమైనవిగా పరిగణించాల్సిన అవసరంలేదు. పైన పేర్కొన్న రెండిటివల్ల పాలకులు సరైన దృక్పథాన్ని అలవరుచుకొని తగిన విధానాలను అనుసరించడానికి వీలుకలుగుతుంది.

## అసమానతల తొలగింపు

ఉదాహరణకు, ఆర్థిక, సాంఘిక రంగాలలోగల అసమానతలు అందరుకుతెలిసినవే. గత 16 సంవత్సరాలుగా ప్రణాళికల ద్వారా యీ అసమానతలను తొలగించాలనే ప్రయత్నం ఫలించలేదు. అయితే ఆయాప్రాంతాల పాలకులు అక్కడ లభించే వనరులను గరిష్ట పరిమితిలో వినియోగించు కోవడంద్వారా యీ అసమానతలను సాధ్యమైనంతవరకు తొలిగించడానికి అవసరమైన కృషిచేయాలి. భాషా ప్రాతిపదిక మీద రాష్ట్రాలను ఏర్పరచడం జాతీయసమైక్యతకు భంగకరంగా పరిణమించిందని అంటున్నారు. అయితే భారతదేశంవంటి సువిశాలమైన దేశంలో పరిపాలనా సౌలభ్యానికి ప్రత్యేకవిభాగాలను ఏర్పరచడం అనివార్యమనీ, అన్ని ప్రాంతాలు సమంగా అభివృద్ధిచెందినప్పుడు సమైక్యత సిద్ధిస్తుందనీ కేంద్రం అభిప్రాయపడింది. ఇప్పటి ప్రత్యేక రాష్ట్రాలను రద్దుపరచడంగానీ, యూనిటరీ స్టేట్‌గా రూపొందించడంగానీ జరిగే విషయంకాదు. అయితే నదీ జలాలపంపిణీ, సరిహద్దుల నిర్ణయం వంటి అంతర్‌రాష్ట్రీయ వివాదాలను చర్చలద్వారాగానీ, మధ్యవర్తుల

ద్వారాగానీ సామరస్యపూర్వకంగా పరిష్కరించడానికి అంగీకరించాలి. ఆచరణరీత్యా యీ విధంగా జరగడ లేదు. కొన్ని రాష్ట్ర ప్రభుత్వాలు తమంతతామే ప్రాంతీయ వివాదాలను రెకెత్తించి, అవి సహేతుకమైనవి కానప్పుడుకూడా యితర రాష్ట్ర ప్రభుత్వాల వాదనలను పెడచెవిన పెట్టి తమ ప్రయోజనాల నిమిత్తం అహరహం కృషిచేస్తున్నప్పుడు జాతీయస్థాయిని, జాతీయ దృక్పథాన్ని అలవర్చుకోవడం క్లిష్టమవుతుంది.

భాషావిషయాలకు కూడా యిదే వర్తిస్తుంది. అనేక భాషలు గల మన దేశంలో వివిధ భాషావర్గాలలో పరస్పరగౌరవం, సహనం చాలా అవసరం. జాతీయ భాషగా హిందీని ఏర్పరచాలనే విషయంతో యీ సమస్యను ముడిపెట్టరాదు. హిందీయేతర ప్రాంతాల వారి సహకారంతో యీ విషయాన్ని పరిష్కరించడానికి బదులు అనవసరంగా వివాదాన్ని రేకెత్తించడం దురదృష్టకరమైన విషయం. సుహృద్భావం ప్రాతిపదికగా యీ సమస్యను పరిష్కరించడం జరగలేదు. అదే విధంగా త్రిభాషాసూత్రం అమలుకూడ వివిధ రాష్ట్రాలలో వివాదాంశంగా పరిణమించింది.

## పత్రికలపై ఆంక్షలు

జాతీయ సమైక్యతను సాధించడంలోగానీ, విచ్ఛిన్నకర ధోరణులను సృష్టించడం లోగానీ వార్తా పత్రికలు ప్రముఖమైన పాత్ర నిర్వహిస్తాయి. కొన్ని పత్రికలు ప్రత్యేక మతానికి చెందిన వారి దృక్పథాన్ని ప్రతిఫలింపజేస్తూ తద్వారా మత విద్వేషాలను రెచ్చగొట్ట ప్రయత్నిస్తున్నాయి. ఏ దేశంలోనైనా సమాజం స్థాయికి భిన్నంగా పత్రికలు ఉండవు. మన దేశంలో కూడ అదే పరిస్థితి ఉంది. మనదేశంలో ఎక్కువభాగం పత్రికలు వేర్పాటు ధోరణులు, విచ్ఛిన్నకర ధోరణులకు వ్యతిరేకంగానే వ్యవహరిస్తున్నా, కొన్ని మాత్రం స్వప్రయోజనం నిమిత్తం యీ శక్తులకు ప్రోత్సాహం కల్పిస్తున్నవి. జాతీయ సమైక్యతా సాధనకు యిటువంటి పత్రికలపై రాజ్యాంగాన్ని అనుసరించి కొన్ని ఆంక్షలు విధించాల్సి ఉంటుంది.

ఈ విషయంలో "పత్రికా స్వాతంత్ర్యం"పై కొన్ని ఆంక్షలు విధిస్తూ శాసనం చేయడాన్ని సమర్థించవచ్చు. పత్రికా స్వాతంత్ర్యాన్ని పరిమితం చేయడాన్ని జర్నలిస్టుగా నేను వ్యతిరేకిస్తాను. అయితే పత్రికా స్వాతంత్ర్యం అనేది ఒక పవిత్రమైన అంశం. ఏ జర్నలిస్టు కూడ దానిని దుర్వినియోగం చేయరాదని కూడ నా అభిప్రాయం.

1961లో జరిగిన జాతీయ సమైక్యతా మహాసభలో రాజకీయ పార్టీలకు, పత్రికలకు ప్రవర్తనా నియమావళిని రూపొందించాలని సిఫార్సు చేశారు. అయితే గత సాధారణ ఎన్నికలకుపూర్వం రాజకీయ పార్టీలకు ప్రవర్తనా నియమావళిని రూపొందించినా మొత్తంమీద వాటిని సమర్థవంతంగా అమలుజరపలేదు. ఇటువంటి నిబంధనావళిని అమలుజరపాల్సిన అవసరం ఎంతగానో ఉంది. ఇది స్వచ్ఛందంగా అమలుజరగాలి. మత విద్వేషాలను రెచ్చగొట్టే పత్రికలపై ఆంక్షలు విధిస్తూ రాష్ట్ర ప్రభుత్వాలు శాసనాలు చేయడాన్ని వ్యతిరేకించరాదు.

శ్రీనగరులో జరిగిన జాతీయ సమైక్యతా మహాసభలో చేసిన వివిధ సిఫార్సులను ప్రభుత్వ స్థాయిలోను, వివిధ సంస్థల స్థాయిలోను వెంటనే అమలు జరపాలి. అన్నిటినీమించి కేంద్రంలోను వివిధ రాష్ట్రాలలోను అధికారంలో ఉన్న పాలక పార్టీలు ప్రతిపక్షాలు, మాటలలోగాక క్రియారూపేణా జాతీయ సమైక్యతను పెంపొందించడానికి కృషి చేయాలి. వివిధ మతాలవారిలో "హృదయ పరివర్తన" కలిగేవరకు యీకృషి కొనసాగించాలి. మంచి పదజాలంతో తీర్మానాలు రూపొందించి ఏకగ్రీవంగా ఆమోదించడంతో సరిపోదు. చరిత్ర పునరావృతం కారాదు. 1961 మహాసభ జరిగిన తర్వాత జరిగినవిధంగా యిప్పుడుకూడ జాతీయ సమైక్యతాసాధనావిషయంలో ప్రమత్తత, ఉదాసీనత వహించరాదు.

రాజ్యాంగంలోని ఉపోద్ఘాతంలో ప్రజాస్వామ్య లౌకిక రాజ్య నిర్మాణానికీ, జాతీయ సమైక్యతకూ నుడివిన ప్రధాన సూత్రాలను ప్రతి పౌరుడు ఎల్లప్పుడు మననంచేస్తూ వాటి సాధనకు నిరంతరం కృషిచేయాలి.



---

దేశం ప్రస్తుతం అల్లకల్లోలంగా వున్నప్పటికి భవిష్యత్తులో ఇది, పూర్వంవలెనే, సమానంగా గౌరవింపబడే అనేక మతాలకు నిలయమైనదై, ఒకే ఒక జాతీయ దృక్పథం కలిగి వుండగలదు. అయితే అది సంకుచిత జాతీయతత్వం కారాదనే నేను కోరేది. సహన భావంతో కూడినదై అది సృజనాత్మకమైన జాతీయతత్వమై వుండి, ప్రజల ప్రతిభా విశేషాలలో విశ్వాసం గలదై, అంతర్జాతీయంగా క్రమపద్ధతి యేర్పాటు చేయటంలో అది తన పూర్తిపాత్రను నిర్వహించాలి. వసుధైక ప్రపంచమే మన ఏకైక లక్ష్యంగా వుండాలి.

**జవాహర్‌లాల్ నెహ్రూ**

---

సీరియల్

# పహరి

పిలకా గణపతిశాస్త్రి

మొట్టమొదట అనుకొన్నట్టుకాక, పార్థసారథి అక్టోబరు 19వ తేదీ తెల్లవారుజామునే బయలుదేరి పొద్దున్న ఏడున్నర గంటలకే ఏలూరు చేరుకున్నాడు ఆ వెనకటిరోజు సాయంకాలం సరోజ ఇంటికి వెళ్ళి, మరునాడు తెల్లవారుజామునే బయలుదేరి రావలసినదని గుప్త కోరినట్టు, అతని కోరిక ప్రకారమే వెళ్ళు తున్నట్టు చెప్పాడు. ఆమె మాటలవల్ల అతని కానాడే స్టేజిమీద రిహార్సల్ జరగగలదన్న గట్టి నమ్మకం కలిగింది. తాను 19వ తేదీ ఉదయానికే బయలుదేరి వస్తున్నట్టు పార్థసారథి అంతకు మునుపే గుప్తపేర ఉత్తరం రాశాడు. కంట్రాక్టరు కొంచెం ముందుగానే స్టేషనుకి వచ్చి అతనినెంతో గౌరవించి నటీనటుల విడిదికేర్పరిచిన పెదపాటివారి పెద్ద సత్రంలో అన్ని విధాల అనువయిన బసలోకి వెంటబెట్టుకొని వెళ్ళాడు. మధ్యాహ్నం భోజనాలయిన తరవాత ఇద్దరు కలిసి సరస్వతీమహల్ హాలులోకి వెళ్ళి అక్కడ జరుగుతున్న ఏర్పాటులన్ని పరిశీలించారు. పార్థసారథి వచ్చేటప్పుడు తనతోకూడా వేర్వేరు రంగుల లైట్లు, కొన్ని ముఖ్యమయిన అలంకార వస్తువులు తీసుకువెళ్ళాడు ఇంకా గుప్త ఆ పట్టణంలో కొన్ని మంచిమంచి సీనరీల తెరలు, చక్కని సైడ్‌కర్టెన్లు సంపాదించాడు. ఇక సింహాసనాలు, కుర్చీలు మొదలయిన హంగులన్ని ఆ హాలు యజమాని సంపాదించగలనని మాట ఇచ్చాడు. గుప్త చేసిన ఏర్పాట్లలో పార్థసారథి కెక్కడ లోపం కనిపించలేదు. కొంత లాభదృష్టితోనే అతడెంతగా శ్రమ పడుతున్నా మొత్తంమీద నాటకాలంటే చెవి కోసుకుంటాడని గ్రహించుకున్నాడు. అందుచేత అతనికి గుప్తమీద ఎంతో అభిమానం కలిగింది.

కంట్రాక్టరు అంతకుమునుపే పెద్ద పెద్ద ఉద్యోగస్థులకు, లాయర్లకు, డాక్టర్లకు, ఇంకా కొందరు ప్రముఖులకు ఆహ్వానాలతోబాటు పైతరగతి టిక్కెట్లు కొన్ని పంపించాడు. కరపత్రాలలో కాంప్లిమెంటరీలు చెల్లవని ప్రకటించినా, కొందరికవి పంపించక తప్పలేదు. పార్థసారథి కొంత ముందు గావచ్చినట్టు విన్న నలుగురయిదుగురు నాటకాభిమాను లతన్ని చూడడానికి వచ్చారు. ఒకాయన విందుభోజనానికి కూడా ఆహ్వానించాడు. వారి ఆదరాభిమానాలు తలుచుకుంటూంటే అతనికొక విధమయిన నూతనశక్తి వచ్చినట్టనిపించింది. అంతేకాదు, వీధులలో ఏ గోడమీద చూసినా రాఘవ నాట్య కళామండలి కృష్ణతులాభారం ప్రకటనలే; వాటిమీద సరోజ పేరు, తనపేరు పెద్దపెద్ద సైజులో తాటికాయంతేసిచొప్పున



## జరిగిన కథ

పార్థసారథికి నాటకాలపిచ్చి. రాఘవ నాట్యకళామండలి ద్వారా నాటకాలు వేస్తూండేవాడు.

ఏలూరునుండి హీరోయిన్ సరోజతోకలసి మద్రాస్ వెళ్ళి సరదాగా కాలంగడిపి పార్థసారథి తిరిగి యిల్లుచేరుకున్నాడు. జబ్బుతోవున్న పార్థసారథి భార్య విజయలక్ష్మిని పరామర్శించడానికి వచ్చిన కృష్ణమూర్తి ఏ విధంగానైన సరోజ మోసాన్నిగూర్చి పార్థసారథికిచెప్పి విజయలక్ష్మి కాపురం నిలబెట్టాలను కున్నాడు. కృష్ణమూర్తి మాటలను పార్థసారథి లెక్కచేయలేదు. విజయలక్ష్మి అన్నీ ఆలోచించి ఎలాగో బాధ భరించి ఊరుకొనడమే మంచిదని తీర్మానించుకొంది. పార్థసారథి, తమ ఏలూరు నాటకం విషయమై సరోజ యింటికి వెళ్ళి మాట్లాడాడు.

రంగుల అక్షరాలతో ముద్రించిన తీరు అతనికెంతయిన సంతృప్తి కలిగించింది. గుప్త మరునాడు బజారులలో అంతటా కరపత్రాలు విరివిగా పంచిపెట్టించాడు. ఆ హంగామాఅంతా గమనించిన పార్థసారథికి తమ మండలి, దానికి తగినంత ఘనంగా మాట దక్కించుకోగలదా ? అన్న అనుమానంకూడా కలిగింది.

ఆవేళ మధ్యాహ్నం సుఖంగా నిద్రపోయి లేచిన తరవాత గుప్త అతని చేతికొక టెలిగ్రాం అందించాడు. అది ఏమై ఉంటుందా? అని పార్థసారథి రెండుమూడు క్షణాల వరకు ఆత్రపడ్డాడు. కాని దానిలో రాఘవ తామంతా 20వ తేదీ సాయంత్రానికే ఏలూరు వస్తున్నట్టు, మిగిలిన వ్యవహారాలన్నీ ముఖతా మాట్లాడబోతున్నట్టు తెలియజేశాడు. అందరు కలసి కొంచెంముందుగానే వస్తున్నందుకు పార్థసారథి ఎంతయినా ఆనందించాడు. గుప్త సంతోషానికిక అంతేలేదు. అయితే ముఖతా మాట్లాడవలసిన వ్యవహారాలేమయి ఉంటాయా? అని పార్థసారథి కొంత ఆలోచనలో పడ్డాడు.

వారిద్దరు కలిసి సాయంత్రం 6 గంటల బండికి టౌను స్టేషనుకి వెళ్లారు. అది సుమారొక గంట లేటని తెలిసింది. 'ఈ రైళ్లెప్పుడు ఇంతే!' అని విసుక్కున్నాడు పార్థసారథి. ఆనాటి సాయంత్రానికి ఆకాశంలో అంతటా కారుమబ్బు లలముకొన్నాయి. సన్నని తుంపర వంటి జల్లు పడడం ప్రారంభించింది. దూర దూరంగా ఉరుముల ప్రతిధ్వని వినబడింది. ఉండి ఉండి ఒక మెరుపు చీలిక తళుక్కుమని మెరిసేది. స్టేషనుచుట్టూరా ఎడతెగని కీచురాళ్ల మోత! అకస్మాత్తుగా ఒక రైలింజను పెద్దగా గొంతెత్తి అరిచినట్టు ఒక కూతకూసి నెమ్మదినెమ్మదిగా బుసకొడుతూ వెళ్లిపోయింది, అల్లంతదూరంలో వానజల్లు చీకటి ముసుగులో ఎర్రని పచ్చనిదీపాలకాంతి స్పష్టాస్పష్టంగా మెరిసింది. పార్థసారథి పక్కనే నిలబడిన ఒక మేక అరటిపండు తొక్క నోట పెట్టుకొని పోర్టరు అదిలింపుతో మే అని అరిచింది. ఆవేళ స్టేషన్‌లో జనసమ్మర్దం చాలా తక్కువ.

'బండిగాని ఇంకా లేటయిందా?' పార్థసారథి పోర్టరు దగ్గరికివెళ్లి అడిగాడు.

'లేదుబాబూ! ఇక వచ్చేస్తది'

పోర్టరు ప్లాట్‌ఫారమ్ ముందుకి వెళ్లి బాగా పరిశీలనగా చూశాడు.

'అదిగో! రెక్క వాలిందిబాబూ.'

గుప్తకూడా ఇంక బండిరావడం ఆట్టే ఆలస్యం కాదన్నాడు. మరికొంత సేపటికి గంట గణగణ మోగింది. ఉండిఉండి గాలి జోరుగా వీచింది. వాన తుంపర చిన్నచిన్న చినుకులుగా మారింది. అల్లంతదూరంలో పొగగుబురుల మధ్య ఇంజనుదీపం తళతళ మెరిసింది. మరికొన్ని క్షణాలలోనే చక్రాల కిరకిర ధ్వనులతో బండి ప్లాట్‌ఫారమ్‌ముందు నిలబడింది.

గుప్త, పార్థసారథి మండలి సభ్యులకోసం ఫస్టు, సెకండు క్లాస్ పెట్టెలన్నీ జాగ్రత్తగా పరిశీలించారు. రాఘవ, వెంకటనారాయణ, వెంకయ్య మొదటితరగతి పెట్టెలోనుంచి, జానకి, పూర్ణ మొదలయిన నటీవర్గం యింకొక మొదటితరగతి పెట్టెలోనుంచిదిగి ప్లాట్‌ఫారమ్‌మీద నిలుచున్నారు. గుప్త, పార్థసారథి వానచినుకులు పడుతున్నా లక్ష్యపెట్టక కొన్ని నాటక పరికరాలతోబాటు వారి సామానులన్నీ పోర్టరులచేత జాగ్రత్తగా కిందికి దింపించారు.

పార్థసారథికి ఆ మహిళాబృందంలో ఎక్కడా సరోజ కనబడలేదు; ఒకవేళ వేరే ఇంకొక మొదటితరగతి పెట్టెలో ఎక్కి ఉండవచ్చునని ఊహించాడు. కాని ఎంత సేపటికి ఎక్కడా ఆమె దిగిన జాడే పొడకట్టలేదు మరికొన్ని నిముషాలలోనే నటీనటులందరు వేరువేరుగా ఎక్కిన గుర్రపుబళ్లన్నీ పెద పాటివారి సత్రంవైపు సాగిపోయాయి. సరోజ రాలేదెందుచేత? ఒంటరిగా గుర్రపుబండిలో కూర్చున్న పార్థసారథి హృదయంలో మాటిమాటికి అదే ప్రశ్న ప్రతిధ్వనించింది. నటీనటులందరు సామానులతోబాటు తమకేర్పరచిన వేర్వేరు గదులలో దిగి పెట్టెలు, బేడలు సర్దుకుంటున్నారు. రాఘవ, గుప్త ఇంకొక గదిలో కూర్చుని ఏవో మాట్లాడుకుంటున్నారు. అందుచేత వారి సంభాషణకంతరాయం కలిగించడానికి యిష్టపడని పార్థసారథికి వెంటనే సరోజ సంగతి అడగడానికవకాశం చిక్కలేదు.

అంతలోనే గుప్త ఎంతో మర్యాదగా అతనిదగ్గిర, రాఘవ దగ్గిర సెలవు తీసుకొని వీధిలోకి వెళ్లిపోయాడు. పార్థసారథి వెంటనే ఆ గదిలోకి వెళ్లి ఒక పెద్ద ట్రంకుపెట్టెమీద కూర్చుని కొంచెం కంగారుగా అడిగాడు.

'ఏమయ్యా! రాఘవా! సరోజ రాలేదేం?'

'రేపు సాయంకాలం బండిలో వస్తున్నానని చెప్పమంది.'

రాఘవ యాథాలాభంగా సమాధానం చెప్పాడు.

'అయితే ఇప్పుడెందుకు రాలేదు?'

పార్థసారథి మరింత కంగారుగా అడిగాడు.

'వాళ్ళ మామయ్య వచ్చాడట! వెంటనే ఆయన్ని విడిచిపెట్టి రావడం బాగుండదని సణిగింది.'

ఆ సమాధానం విని పార్థసారథి ఎంతయినా ఆశ్చర్యపడాడు. అతగాడెందుకు వచ్చినట్టు? ఒకవేళ వస్తే మాత్రం? సరోజ ఏలూరు రావడానికి, దానికి సంబంధమేమిటి? రాఘవ ప్రత్యుత్తరాల ధోరణి అతని కేమి నచ్చలేదు. అతడేదో అంటీ అంటనట్టు మాట్లాడుతున్నాడు. తన ఆందోళన రవంతయినా గుర్తించినట్టే కనబడలేదు. రెట్టించిన ఆత్రతతో తిరిగి ప్రశ్నించాడు.

'వెంకట కృష్ణయ్య ఎప్పుడు వచ్చాడు?'

'ఏమో నాకు తిన్నగా తెలియదు. నువ్వు వెళ్లిన తరువాతే వచ్చినట్టున్నాడు.'

'ఆ వేళ స్టేజిమీద రిహార్సల్ జరిగిందా?'

'జరిగింది'.

రాఘవ ఏవంత విసుక్కున్నట్టు సమాధానం చెప్పాడు.

'దానికి సరోజ వచ్చిందా ?'

పార్థసారథి మరింత కంగారుగా అడిగాడు.

'రెండు మూడు సారులు కబురు పంపించిన తరవాత అతి కష్టం మీద కొంత ఆలస్యంగా ఊడిపడింది. ఆ పైన విప్పుల మీద నిలుచున్నట్టు ఒక గంట సేపుంది. కొంచెం పని ఉన్నదని చెప్పి రిహార్సల్ పూర్తి కాకుండానే తొందరగా తిరిగి వెళ్లిపోయింది'

'ఆ తరవాత మళ్ళీ సరోజని కలుసుకున్నావా ?'

'లేదయ్యా !'

రాఘవకి క్రమక్రమంగా చిరాకు తలకెక్కింది.

'అయితే రేపు ఆరుగంటలకి వస్తున్నట్టు నీతో ఎప్పుడు చెప్పింది?'

'రిహార్సల్ జరుగుతున్నప్పుడే !'

పార్థసారథి సందేహం ఇంకా పూర్తిగా తొలగిపోలేదు.

'తప్పకుండా వస్తానని చెప్పిందా ?'

రాఘవ మరి భరించలేక పోయాడు.

'ఎందుకు పార్థసారథీ ! అనవసరంగా నీకింత కంగారు ? నేనప్పుడు తప్పకుండా వస్తావా ? అని అంత గట్టిగా అడగలేదు సుమా ? చెప్పద్దూ ! రేపు సాయంత్రం ఆరు గంటల బండిలో బయలుదేరి వస్తానన్న తరువాత మరి నాకు అనుమానపడవలసిన అవసరమే కలగలేదు ! వస్తున్నానని చెప్పిన తరువాత మాట ఎందుకు తప్పుతుంది ? ఇంతకు మునుపు ఎప్పుడయినా నాటకం అభాసు చేసిందా ? సరోజకామాత్రం బాధ్యత తెలియదూ ? వట్టి పసిపిల్ల వాడిలాగ ఎందుకలాగ కంగారు పడిపోతావు ?'

అప్పటికి కాని పార్థసారథికి సరోజ రాక విషయంలో కలిగిన అనుమానం పూర్తిగా తొలగిపోలేదు. రాఘవ అంత గట్టిగా హెచ్చరించిన తరవాత అతనికి గుండె మీద నుంచి కొండంత బరువు దించి వేసినట్టయింది ఉసూరుమని నిట్టూర్చి చిన్న నవ్వు చిలకరించాడు

'ఇందాకటి నించి నేనెంత కంగారు పడుతున్నానో నీకేం తెలుసును రాఘవా ! నువ్వు ఇంత గట్టిగా చెప్పేదాకా నాకు నమ్మకమే కలగలేదు పాపం, గుప్త ఈ నాటకం కోసం రాత్రింబగళ్లు అదే పనిగా ఆవేదన పడుతున్నాడు ఏదో విధంగా అతనికి, మనకి మాట దక్కిపోతే నాకదే పదివేలు !'

'మాట దక్కకేం జేస్తుంది ! తప్పకుండా దక్కుతుంది ! ......మన దురదృష్టం కొద్దీ ఒకప్పుడేదయినా అవాంతరం వస్తే రానూ వస్తుంది ! దానికి మనమేం చెయ్యగలం ? అన్నీ మనం అనుకున్నట్టు తిన్నగా జరుగుతాయా ?'

రాఘవ వెనకటిలాగే కొంత నిర్లక్ష్యంతో తన సంభాషణ కొనసాగించాడు. పార్థసారథి మరి మాట్లాడలేదు. ఆ తరువాత ఇద్దరూ భోజనాలకి బయలుదేరారు

ఆ మరునాడుకూడా ఆకాశం మేఘావృతన్నగానే కనబడింది. కాని వర్షం మాత్రం పడలేదు ! అయితే ఏ క్షణంలోనయినా కుండపోతగా వాన పడవచ్చునన్న ఆందోళన కలిగింది. మరికొంత సేపటికి ఆ భయం తొలగిపోయింది. క్రమక్రమంగా మధ్యాహ్నానికి బాగా తెరిపి ఇచ్చింది. ఆనాడు యథాప్రకారంగా సాయంత్రం అయిదుగంటలకే అన్ని తరగతుల టిక్కెట్లు చెల్లిపోయాయి. సరస్వతీ మహల్ హాలుముందు చివరి తరగతుల టిక్కెట్టు దొరకక నిరుత్సాహపడిన జనం గుంపులు గుంపులుగా గుమిగూడారు. మరికొందరు హాలుకెదురుగా వేలాడగట్టిన శ్రీకృష్ణ తులాభారం ప్రకటన చిత్రంకేసి విడ్డూరంగా చూస్తూ నిలుచున్నారు. మేఘాల మాటునుండి రవంత వెలువడిన సాయంకాల సూర్యబింబం వాళ్ళందరిమీద జేగురురంగు విరజిమ్మింది. ఆ వెలుగులు పడి ఎర్రబడిన తూనీగలు రెక్కలు వచ్చిన ఆర్ద్ర పురుగులలాగ ఆకాశంలో నలువైపులా పరుగు లారంభించాయి.

కరపత్రాలలో ప్రకటించిన ప్రకారం సరిగా రాత్రి తొమ్మిదిన్నర గంటలకే నాటకం ప్రారంభించవలిసి ఉంది ఒకవేళ ఏదయినా స్వల్ప కారణంవల్ల తలవని తలంపుగా కొంత ఆలస్యం జరిగినా పది గంటలకయినా ఆట ప్రారంభించక తప్పదు, అందుచేత నటీనటులందరు అధమం ఎనిమిది గంటలకయినా సిద్ధంగా ఉండాలి. కనుక ఆరుగంటలకి స్టేషనుకి వెళ్ళి సరోజను వెంటబెట్టుకుని వచ్చిన తరువాత నాటక ప్రదర్శన సన్నాహం ప్రారంభించవచ్చునని పార్థసారథి సంకల్పించుకున్నాడు వెంటనే మిగిలిన ఏర్పాట్ల వ్యవహారం గుప్తతోబాటు రాఘవకప్పజెప్పి తానొక్కడే టౌను స్టేషనుకి బయలుదేరి వెళ్లాడు.

అదృష్టవశాత్తు ఆ వేళ బండి రావడం పావుగంటకన్న ఎక్కువ ఆలస్యం కాలేదు ఆ పైన ఆకాశం మరింతగా తెరిపి ఇచ్చింది. ఆ రెండు శుభశకునాలని పార్థసారథి సంతోషించాడు. సరోజకోసం పెద్ద తరగతిపెట్టెలన్నీ జాగ్రత్తగా పరిశీలించాడు. ఆమె ఎక్కడయినా కూర్చున్నా తనకంగారు మూలాన కనబడలేదేమో అని ఆ మూలనించి ఈ మూలదాకా ప్లాట్‌ఫారం మీద రెండు మూడుసారులు తిరిగాడు ! సరోజ ఎక్కడా కనబడలేదు ! చిట్టచివరికి ఆదరా బాదరగా ఇంకొకసారికూడా తిరిగాడు ! కాని ఎక్కడ ఆమె కనబడలేదు ! అంతలోనే బండి చెవులు గింగురుమనేటట్టు కూతవేసి నెమ్మదిగా కదిలి వెళ్ళిపోయింది.

ఆమె రాలేదని తేలిపోయిన తరువాత పార్థసారథి మరి నిలబడలేకపోయాడు. ప్లాట్‌ఫారాని కెదురుగా ఉన్న వరండాలో సిమెంటు కుర్చీమీద చదికిల బడ్డాడు. సరోజ ఎందుకు రాలేదు ? ఆమె తప్పక రాగలదని రాఘవ అన్నాడే. అకస్మాత్తుగా ఏదయినా అవాంతరం వచ్చి పడిందా ? ఏలూరువచ్చేముందు ఆమెతో మాట్లాడినప్పుడు ఎటువంటి అనుమానానికి ఎక్కడా ఆస్కారం కలగలేదే ! ఒకవేళ వెంకటకృష్ణయ్యగాని వెళ్ళవద్దని అడ్డు

కున్నాడా ? అంతమాత్రంచేత ఆమె రావడం ఎందుకు మానుకుంటుంది. అతనుమాత్రం అంత ఆకస్మాత్తుగా ఎందుకు వద్దంటాడు ? మరి యెందుకు రాలేదు ! తాను రాక పోతే నాటకం అంతా అభాసయిపోతుందని తెలియదా ? పాపం, గుప్త ప్రతి వాల్‌పోస్టర్‌మీద తమ ఇద్దరిపేర్లు రంగురంగుల పెద్ద అక్షరాలతో కొట్టవచ్చినట్టు ప్రకటించాడే. ఇప్పుడేమి చెయ్యాలి ? తగు మనిషి గుప్తకిది తెలిస్తే ఏమను కుంటాడు ! సహజంగా మంచివాడు కనక అతనొకవేళ మాట్లాడకూరుకున్నా ప్రేక్షకులూరుకుంటారా ? ఇప్పుడిక గత్యంతరమేమిటి ?

ఆ ప్రశ్నలతని మనస్సులో పెద్దపెద్ద సమ్మెట పోటుల్లా ప్రతిధ్వనించాయి. పార్థసారథికి ఒళ్ళంతా ముచ్చెమటలు పోశాయి. సరోజ చిట్టచివరి కంతపని చేసింది. కలలోకూడా ఇలాగ చేస్తుందని అనుకోలేదే ! తల చేతో పట్టుకుని ఉసూరుమని ఒక సుదీర్ఘ నిశ్వాసం విడిచిపెట్టాడు పార్థసారథి కాని అంతలోనే అసలు జరిగిన వ్యవహారమేమో తిన్నగా తెలియకుండానే ఆమెమీద నింద మోపడంన్యాయం కాదని క్షమాయించుకున్నాడు.

ఆవిధమయిన ఎడతెగని ఆలోచనలతో ఎంత సేపు గడిచిందో అతని కేమాత్రము తెలియలేదు. మరికొన్ని నిమిషాలలోనే అతని భుజంమీద ఎవరో తట్టారు. ఉలిక్కిపడి వెనక్కితిరిగి చూశాడు ! రాఘవ ! అతడు నెమ్మదిగా పార్థసారథి సరసన కూర్చుని ముఖం నిశితంగా పరిశీలించాడు.

'ఇదేమిటి ? ఇక్కడ కూర్చుండిపోయావు పార్థసారథీ ! సరోజ రాలేదా ?'

'వస్తే ఎగిరి గంతేసి నేనీపాటికి బస్‌లో ఉండనా ? ఇక ఏమిచెయ్యడానికి కాళ్ళాడక ఇక్కడే చతికిల పడి పోయాను !'

ఉసూరుమని నిశ్వసించాడు పార్థసారథి. అదేక్షణంలో రాఘవ అందుకున్నాడు.

'హారి నీ అసాధ్యంకూల ! దీనికింతటి దిగులెందుకు ? ఒకవేళ హఠాత్తుగా ఏదయినా అవాంతరంవచ్చి సరోజ ఈ బండికి రాలేకపోయిందేమో ! పోనీ పదిగంటల కోచ్‌లో వస్తుంది! దానికేం? ఈమాత్రానికే ఇంతదిగులు పడిపోవడ మెందుకు ? రా పోదాం ?' ఆ సమాధానం పార్థసారథికి మునిగిపోతున్న మనిషికొక పట్టు కొమ్మలా స్ఫురించింది. నెమ్మదిగా విట్టూర్చి అడిగాడు.

'పదిగంటలకి ఒక కోచ్ ఉందా?' నాకాసంగతి తెలియలేదే !

'ఉందయ్యా ! లేమరి ! ఆలస్యం చెయ్యకు ! అప్పుడే ఎనిమిది కావస్తూంది. అందరూ నువ్వు ఎక్కడికి వెళ్ళావని అడుగుతున్నారు! పెంద్రాళ్ళే భోజనాలుచేసి నాటకం మొదలుపెట్టాలి! రా!'

అయినా పార్థసారథికింకా పూర్తిగా నమ్మకం కలుగలేదు. కాని రాఘవ దానికి తగినట్టు గట్టిగా నచ్చజెప్పాడు. అనుకున్నట్టు తొమ్మిదిన్నరకో పదింటికో తెర ఎత్తవచ్చును ! ఆ మాత్రం ఆలస్యం అయినా ఫరవాలేదు. నాటకం మొదటి అంకంలోను, ద్వితీయాంకం మొదటిరంగములోనుకూడా సత్యభామరాదు. రెండవ రంగం ప్రారంభించేలోగనయినా సరోజ తప్పకుండా వస్తుంది. సేషనులో ఎవరినయినా అట్టేబెట్టి, వెంటనే హాలు దగ్గిరికి తీసుకువచ్చి, వెంటనేవేషం వేయించేటట్టు ఏర్పాటు చెయ్యవచ్చును! ఆ తరవాత నాటకం అంతా యథాప్రకారంగా నిమ్మకి నీరెత్తి నట్టు సాగిపోతుంది. ! అదీరాఘవ ఆలోచన, ఆ సలహా అంతా విన్న తర్వాత పార్థసారథికి కొంత ఊరట కలగకపోలేదు. నెమ్మదిగా లేచి కొంచెం తటపటాయిస్తూ నసిగాడు.

'సరోజ ఒకవేళ ఏదయినా అవాంతరంవల్ల పదిగంటల కోచ్‌లోకూడా రాకపోతే?'

భరించలేని చిరాకుతో చిరచిరలాడుతూ విసుక్కున్నాడు రాఘవ.

'ఏమిటి సారథీ ! కుభమల్లె ఱకున పక్షిలాగ అలాగ మాట్లాడతావు? నీకేమయినా మతిగాని పోతుందేమిటి ? వస్తానన్న మనిషి ఎందుకు రాకుండా మానివేస్తుంది ? ఒకవేళ నువ్వు అనుమానించినట్టు రాదే అనుకో ! అంతమాత్రానికే చేతులు ముడుచుకొని కూర్చుంటామా ? చిట్టచివరికి పూర్ణ చేతయినా సత్యభామ వేషం వేయించి కొసకు యీ కథ నడిపించివేస్తాంగాని మాట్లాడకూరుకుంటామా ? ఎవరు రాకపోయినా ఏది ఆగదు; తెలిసిందా ! రా! పోదాం''

రాఘవ అతనిచెయ్యి దొరకబుచ్చుకుని వెంటబెట్టుకుని వెళ్లాడు. అతని భరోసాతో పార్థసారథికి కొంతవరకు ధైర్యం పుంజుకుంది. అయితే మొత్తంమీద ఆవేళ నాటకానికేదో పెద్ద విఘాతం రావచ్చునని అనుమానం కలిగింది. కాని అతనికింకా సరోజ రాదని పూర్తిగా నిరాశ కలగలేదు ! అదృష్టం బాగుంటే ఆఖరి క్షణంలోనయినా రావచ్చునన్న ఆశ అంతర్యంలో మొలకెత్తింది. ఒకవేళ రాకపోయినా తానిక చెయ్యగలిగినదేది లేదని మొండిధైర్యం తెచ్చుకొన్నాడు. మరికొంత దూరం నడక సాగించి ఉసూరుమని ఒక వేడి నిట్టూర్పు విడిచిపెట్టాడు.

'అయితే రాఘవా ! ఇంతకి సరోజ ఎందుచేతరాలేదంటావు ?'

'ఏమోమరి ! దానికేమి అంత పట్టడంలేదు ! ఆరు గంటల బండికి తప్పకుండా వస్తుందనే అనుకున్నాను. ఇప్పటికీ తప్పకుండా కోచ్‌లో వస్తుందనే నా నమ్మకం ! ఒకవేళ దానిలో కూడా రాకపోతే ఆ వెంకట కృష్ణయ్యగాడు వెళ్ళవద్దని ఏదో పెద్ద పెటకం పెట్టాడన్నమాట !'

'తీరా ఇంతవరకు వచ్చిన తరువాత అతగాడు మాత్రం ఎందుకు అడ్డు చెబుతాడు ? సరోజ ఇన్నాళ్ళనుంచి నాటకాల్లో బాహాటంగా వేషాలు వేస్తూనే ఉందిగా ! ఇంతలోనే అంత పుట్టిములక ఏమి వచ్చింది ?'

'ఏమో నాకిదంతా చాలా గజిబిజిగా ఉంది ! ఇంతకి సరోజ కోచ్‌లో వస్తుందేమోలే ! అనవసరంగా పాపం అతనిమీద నింద వెయ్యడమెందుకు ? త్వరగానడు ! టయిమయిపోతూంది !'

రాఘవ మరింత తొందర పెట్టాడు. వారిద్దరు మరి మాట్లాడుకోలేదు. వాస్తవానికి సరోజ రాకపోవడానికేమి కారణమో రాఘవకు కూడా బోధపడలేదు! కాని దానిలో ఏదో పెద్ద రహస్యం ఇమిడి ఉండవచ్చునని అనుమానించాడు. పార్థసారధి మీద కలిగిన అక్కస్సు వల్ల మొట్టమొదట అతనికి ఏలూరు నాటకం వ్యవహారంలో అంతగా ఉత్సాహం కలగలేదు. కాని తీరా అక్కడికి వచ్చిన తరువాత మిగిలిన వారిందరికన్న మించిపోవాలన్న తహతహ కలిగింది. అందుచేత సరోజ రాకపోవడం మూలాన అతనికి కూడా కొంత కించ కలిగింది. కాని గుండెదిట్టవున్న మనిషి కనక కోచ్ లోనయినా తప్పక రావచ్చునని ఆశించాడు. ఒకవేళ అప్పటికి కూడా రాకపోయినా ఎలాగో అలాగ అందరికి మాటదక్కించి తాను బాగా మర్యాదగా బయటపడ వచ్చునని ఆలోచించాడు.

వారిద్దరు బసలోకి వెళ్ళేసరికి ఇంచుమించుగా ఎనిమిది గంటలయింది. మిగిలిన నటీనటులందరు అంతకు మునుపే తమ భోజనాలు ముగించుకున్నారు. రాఘవ పార్థసారథి లిద్దరు కూడా త్వరగా భోజనాలుచేసి అందరిని వెంటబెట్టుకుని సరస్వతీమహల్ లో ప్రవేశించారు. పురుషులకని ప్రత్యేకించిన గ్రీన్ రూములో వేషధారణ ఆరంభించారు.

మరి కొంత సేపటికి గుప్త బాగా కంగారుపడుతూ లోపలికి వచ్చాడు. అతని ముఖంమీద కత్తివేటుకయినా నెత్తురు చుక్క లేదు! తటపటాయిస్తూ పార్థసారథిని సమీపించాడు.

'ఏమండీ! పార్థసారథిగారూ! సరోజమ్మగారు రాలేదా?'

అతడు మరి మాట్లాడలేదు! ముఖమయినా పైకెత్తి గుప్త వైపు చూడలేదు! అదే క్షణంలో రాఘవ అందుకున్నాడు.

'ఆవిడ పదిగంటల కోచ్ లో వస్తుందండీ గుప్తగారూ! మరేం కంగారు పడకండి!'

'తప్పకుండా వస్తున్నారా! బాబూ!'

'ఆ! ముమ్మాటికి తప్పకుండా వస్తున్నారు! ఒకవేళ ఏ కారణం చేతయినా రాకపోతే ఆ వేషం మరొకరు వేసి అంతకన్న గొప్పగా రక్తికట్టిస్తారు! సరిగదా! ఆవిడగారు రాకపోయినంత మాత్రంలో ఏది ఆగిపోదు! మరి మీరు వెళ్ళి హాలులో ఏర్పాట్లన్ని తిన్నగా జరుగుతున్నాయో లేదో చూడండి!'

గుప్త ఇక మాట్లాడలేక ఏదో ఆలోచించుకుని క్షణ కాలం తటపటాయించాడు 'సరోజమ్మగారు రాలేదని తెలిస్తే హాలులో గొడవ బయలుదేరుతుందేమో! బాబూ! చాలా మంది జనం ఆమె వేషం చూడాలనే వస్తున్నారు!'

'మరేం భయంలేదు! ఎందుకండీ! మీకంత కంగారు! మేమున్నాంగా! బహుశః మూడు వంతుల తొంభై తొమ్మిదిపాళ్ళు ఆవిడ రానే వస్తుంది! స్టేషనుకి మాలో ఒకణ్ణి పంపిస్తున్నాము! ఆమె బండి దిగగానే అతను నిలుచున్నపాటుగా ఇక్కడికే తీసుకు వస్తాడు. నాటకం అంతా మొదటినుంచి చివరిదాకా హోరెత్తిపోతుంది! ఒకవేళ రాకపోయినా అంతే జరుగుతుంది! మరి మీరు వెళ్ళండి! మేము వేషాలు వేసుకోవాలి!... అనవసరంగా కంగారుపడకండి!'

'గుప్తకిక ఏమనడానికి పాలుపోలేదు! అతనికి కూడా కావలసింది నాటకం అంతా ఏ గొడవ లేకుండా బాగా రక్తికట్టడమే! రాఘవ దానికేమి ఫరవాలేదని గట్టిగా హామీ ఇస్తున్నాడు. ఒకవేళ ఏదయినా అవాంతరం వస్తే ఆ పరిస్థితులలో ఇక చెయ్యగలిగినదేది కనిపించలేదు! అలాగే మథనపడుతూ నెమ్మదిగా అడుగులు వేసుకుంటూ హాలులోకి వెళ్ళిపోయాడు.

(సశేషం)

---

సక్రమమైన మార్గాన్ని, అంటే స్నేహ మార్గాన్ని, అనుసరించటం అవసరం. స్నేహ మార్గం అనుసరించినపుడు కలిగే ఫలితాలు అందుకు అనుగుణంగానే అంటే సత్ఫలితాలుగానే వుంటాయి. అనుసరించే పంథా మంచిదైనప్పుడు ఫలితాలుకూడా మంచివే కలుగుతాయి అన్నది మానవ జీవితంలో ప్రధాన సూత్రమన్నదానిలో నాకు ఎటువంటి అనుమానములేదు. కాబట్టి, మనం మనతోటి మానవులపట్ల లేదా తోటి దేశాలపట్ల నిష్కళంక బుద్ధితో స్నేహభావంతో ప్రవర్తించి, మంచి ఏమికలిగినా స్వీకరించటానికి సంసిద్ధులమైతే — అంటే మనకు సత్యమని తోచినదానిని మనం విడనాడటం కాదు — అందువలన ఒకరినొకరు అర్థం చేసుకోటానికి వీలు కలగటమే కాకుండా, సదవగాహనకు కూడా అవకాశం యేర్పడుతుంది.

జవాహర్ లాల్ నెహ్రూ

ప్రజాస్వామ్య పద్ధతిలో మనకు గాఢ విశ్వాసముంది. ప్రజలు ఆకలిమంటలతో ఉలమటిస్తూ దారిద్ర్యంతో బాధపడుతున్నంత కాలం, ప్రజలలో అసమానతలు వున్నంతకాలం, ప్రజాస్వామ్యానికి మనుగడ వుండదు కాబట్టి రాజకీయ, ఆర్థిక రంగాలలోకూడా ప్రజాస్వామ్య సూత్రాలను అనుసరించాలని మనం కోరుతున్నాము.

జవాహర్ లాల్ నెహ్రూ

---

# ద్వారబంధాల చంద్రయ్య

("జాతీయ సభావతరణము" అను అముద్రిత కావ్యము నుండి)

*

ముదిగొండ వీరభద్రమూర్తి

ఆంగ్లపాలన మనెడు తిమింగిలమును
వ్రచ్చి తద్భుక్తదేశమహోచ్ఛ్రమౌక్తి
కము వెలువరింప గండరగండ డొకడు
మొనసినాడు ధన్యము గాగ తెనుగునాడు.

అతడే "ద్వారబంధాల"యన్వయమును
మింటి కెత్తిన చంద్రయ్య, మిడిసిపడిన
పగఱ ధైర్యగృహంబున ద్వారబంధ
మూడగొట్టు నామస్మృతి నొప్పునయ్య.

ఇరు తటమ్ముల నేచి తఱచైన తరువాటి
కురియుచున్నది సదా కుసుమవృష్టి
శిలల ముక్కలుగ గోసి తరంగముల పంక్తి
దుముకుచున్నది మహోద్ధురబలమ్ము
కలకలస్వానమ్ము నెలుగెత్తి ద్విజకోటి
పలుకుచున్నది శ్రుతి ప్రమోదభరము
పుడమికి హృదయమ్ముపై గు శాద్వలరేఖ
తొణకుచున్నది పచ్చదనపు ఫలశ్రీల

పూర్వభారత రక్త సంపూర్ణశౌర్య
కళ మహోగానవర్ధంతి గౌతమీ ప్ర
వంతి యద్దరి గలదు భవంతి యొకటి
అదియ గుహ రామచంద్ర హర్యక్షమునకు

వానిని బట్టికో ప్రతినబట్టి యటన్ జనుదెంచి యాంగ్లసే
నాని ససైన్యుఁ డద్దరి వనమ్మున బెబ్బులివేటపొంచె ను
న్నా డని పొంచిపొంచియు రణత్వరమాణ చమూసమేతుడై
యా నది దాటి కొండపయి కద్దరి ప్రాకదొడంగె వేగుతో.

వాని నెఱింగి యీ కుధరపాదవనిన్ దహియింపుడంగభా
గాన మహోపలమ్ములకు గ్రచ్ఛర మందిడి ప్రేల్చి యా శిలల్
సేనతలల్ బగుల్ప దొరలింపుడు కోయదొరల్ బిరాన నం
చానతివెట్టె చంద్రయ. ఫెళార్భటి పర్వులువెట్టె మింటిపై.

భారతమ్ము గొజ్జంగి పూదాన్పటంచు
నెంచినా మగ్నిపర్వత మంచు నెంచ
మెతిమే యనుకొనిరి హూణాగ్రసరులు
ప్రకృతికడుపున మంటలు భగ్గురనగ.

గంధకవాసనాకలుషగాఢ విసారితఘోర ధూమ భా
రాంధులు భారతాక్రమణ లంత్యము చూపున నొంచొకిళ్ళ ని
రంధముగా కనుంగొనుటకై సలిపెన్ సహకారమున్ మరు
ద్బంధువు వారి చుట్టు తరువాటము గాటముగా దహించుచున్.

ఆ వనచరాళి రామచంద్రయ్య యండ
చూచికొని ద్విగుణీకృతస్యూతశక్తి
గండపాషాణముల మార్త దండుపైని
విడిచె మెదడూడి తల పిప్పిపిప్పిగాగ.

# "క్విట్ ఇండియా" ఉద్యమంలో ఆంధ్రుల పాత్ర

1942 ఆగస్టు విప్లవంలో జరిగిన ఎన్నో ప్రముఖ సంఘటనలూ, ప్రజలకు ఆ సమయంలో జాతిపిత గాంధీజీ ప్రసాదించిన అపూర్వమైన నాయకత్వమూ చరిత్రకారులకు ఎన్నో విషయాలను వివరిస్తాయి. నాజీ జర్మనుల విజయ దుందుభి కారణంగా ప్రజల సమీకరణకు భారత దేశంలో బ్రిటిష్ పాలకులు రెండు సంవత్సరాలపాటు నిర్వహించిన దమనకాండతో ప్రజలలో భయోత్పాతం విలయతాండవం చేస్తున్న రోజులలో స్వాతంత్ర్య ఉద్యమాన్ని నిర్వహించి విప్లవనాదం యివ్వడం గగనకుసుమంగా భావించబడుతున్న తరుణమది. అయితే భారతదేశంలో 200 సంవత్సరాల బ్రిటిష్ పాలనకు ఉద్వాసన చెప్పడానికి జాతిపిత ప్రజలను చైతన్యవంతులనుచేస్తూ వారిలో క్రమంగా విప్లవ జ్వాలలను రేకెత్తించారు. ప్రతి పౌరుడు "విజయాన్నో వీరస్వర్గాన్నో ఎన్నుకోవాలని ఆయన ప్రజలకు పిలుపునిచ్చారు. 1942 ఆగస్టు 9వ తేదీన బొంబాయిలో జరిగిన చరిత్రాత్మకమైన అఖిలభారత కాంగ్రెసు సమావేశంలో పాలకులకు "అల్టిమేటం" యిచ్చారు. దానితో ఆశించిన విధంగానే కుపితులైన బ్రిటిష్ పాలకులు ప్రజానాయకులను ప్రజలనుండి వేరు చేస్తూ వారిని అరెస్టుచేసి అజ్ఞాత ప్రదేశంలో నిర్బంధించారు దేశంలోని యువతరం విప్లవకారులు యీ సవాలును స్వీకరించారు. వారితో పాటు దేశ ప్రజలు కూడ త్యాగానికీ కష్టాలు భరించడానికీ సంసిద్ధులైనారు.

## "క్విట్ ఇండియా"

జాతీయ నాయకులను నిర్బంధించిన తరుణంలోనే ఆంధ్ర నాయకులనుకూడ అరెస్టుచేసి అజ్ఞాత ప్రదేశాలలో ఉంచారు. తన అరెస్టుకు మూడు మాసాలకు ముందే మహాత్మాగాంధీ "క్విట్ ఇండియా" ఉద్యమాన్ని గూర్చి నిర్భయంగా ఉపన్యాసాలద్వారా ప్రజలందరికీ వివరిస్తూ వారిలో ఉత్సాహాన్నీ ఉద్రేకాన్నీ, విప్లవ జ్వాలలనూ రేకెత్తించారు. ప్రజలలో అవధులులేని ఉద్రేకాలు ప్రబలినాయి. బ్రిటిష్‌పాలకులకు వ్యతిరేకంగా ప్రజలు స్వాతంత్ర్య సమరంలో దుమికారు. అన్ని ప్రాంతాలలో ప్రజలు యెవరి ప్రమేయమూ లేకుండా యెవరికి వారు ఉద్యమ ప్రేరితులైనారు. నూతన చైతన్యం వెల్లివిరిసింది. త్యాగనిరతి ఉచ్చస్థాయికి చేరుకున్నది. బొంబాయి, కలకత్తా, మద్రాసువంటి మహానగరాలలోను, పట్టణాలలోను, మారుమూల గ్రామాలలోను, ఆఫీసులు, దుకాణాలు పరిశ్రమలలోను ఉద్యోగులు, కార్మికులు, పనివారలు, రైతు, కూలీలు, వ్యవసాయదారులు ఒకరేమిటి సర్వేసర్వత్రా స్త్రీలు పురుషులు, ఆబాలగోపాలమూ స్వాతంత్ర్యసమరంలో సమిధలుగా, తమను తాము సంతోషంగా సమర్పించుకున్నారు. వాస్తవంగా జాతి యావత్తూ విప్లవంతో ఉగ్రూత లూగింది.

జాతీయ నాయకులను బొంబాయి నుండి యితర అజ్ఞాత ప్రదేశాలకు తరలించారనే వార్త దేశమంతటా దావానలంలా వ్యాపించింది. దానికి తోడు బొంబాయి కాంగ్రెసు సమావేశంలో జరిగిన ఉద్వేగపూరితమైన గంభీరోపన్యాసాలు రేడియోద్వారా, పత్రికల ద్వారా ప్రజలలో వ్యాపించి, వారిలో రోషాగ్ని ప్రజ్వలింపజేశాయి. ప్రతీకార జ్వాలలురేగి దౌర్జన్యకాండకు పురికొల్పాయి.

## ఆంధ్ర దేశంలో

ప్రజలు వేల సంఖ్యలో త్రివర్ణ పతాకాలుపూని, నినాదాలు చేస్తూ ప్రభుత్వ కార్యాలయాలపైన, కమ్యూనికేషన్స్‌పైన దాడి జరపనారంభించారు. ఆఫీసులకు, రైళ్లకు నిప్పంటించారు. శ్రీకాకుళం నుండి నెల్లూరు వరకు యావదాంధ్ర దేశంలో విప్లవం వ్యాపించింది. అన్ని రైల్వే స్టేషనులను, రైళ్లను పరశురామ ప్రీతిగావించారు. ఆనాడు అంతటా అరాచకం రాజ్యం చేసింది. రైల్వే స్టేషనులు, పోస్టాఫీసులు, పోలీసు స్టేషనులు, ప్రభుత్వ కార్యాలయాలు మాత్రమేగాక కోర్టులుకూడ అగ్నిదేవునికి ఆహుతి అయినవి. దేశంలో ప్రభుత్వ యంత్రాంగమంతా స్థంభించిపోయింది.

ప్రభుత్వం ప్రజలపై లాఠీచార్జీలు, అరెస్టులు, తుపాకికాల్పులు ఒకటేమిటి అన్నివిధాలైన అణచివేత చర్యలను తీసుకున్నది. అన్నిచోట్ల నిరాయుధులైన ప్రజాసమూహాలపై దమననీతితో దౌర్జన్య చర్యలకు ప్రభుత్వం పూనుకున్నది. తెనాలి, గుంటూరులలో పోలీసు కాల్పులద్వారా డజన్‌మంది ప్రజల ప్రాణాలను ప్రభుత్వం పొట్టనపెట్టుకున్నది. లాఠీచార్జీల ఫలితంగా అన్ని పట్టణాలలో అసంఖ్యాకులు వికలాంగులైనారు, స్పృహ కోల్పోయారు.

రాత్రిళ్లు రైళ్ళు నడపడాన్ని ఆపుచేశారు. రైలుడబ్బాల లోను, రైల్వేస్టేషనులలోను, రైలుపట్టాలవెంట సైనిక కాపలా ఏర్పాటు చేశారు. అదేవిధంగా ప్రభుత్వ కార్యాలయాలవద్ద, కమ్యూనికేషన్స్‌వద్ద సైనిక సిబ్బందిని కాపలాగా ఉంచడమేగాక పట్టణాలలో శాంతిభద్రతలను కూడ వారికే అప్పగించారు.

అన్నిజిల్లాలలో వేలాదిమందిని సబ్‌జైళ్ళలో నిర్బంధించారు. జైళ్ళన్నీ జనంతో కిటకిటలాడాయి. అక్కడికక్కడ విచారణచేసి శిక్షలు విధించి జైళ్ళపరం చేశారు. డిటెన్యూల నందరినీ బళ్లారి లోని క్యాంపుకు తరలించారు.

కొన్ని రాష్ట్రాలలో విమానాల ద్వారా బాంబుల వర్షం కురిపించారు. మెషీన్‌గన్‌లతో కాల్చివేశారు పాఠశాలలోను, కళాశాలలోను విద్యార్థులు సామూహికంగా నెలలతరబడి నిరవధిక సమ్మె కొనసాగించారు. పరిశ్రమలలో కార్మికులు కూడా అదే విధంగాచేశారు. సువ్యవస్థితులైన సత్యాగ్రహ కార్యకర్తలు క్రమశిక్షణతో పోలీసు స్టేషనులు, ప్రభుత్వఆఫీసులు, కోర్టులవద్దకు వెళ్ళి స్వచ్ఛందంగా అరెస్టుఅయ్యారు. మన భరతమాత దాస్యశృంఖలాలు విచ్ఛేదనకు అన్నివర్గాల ప్రజలు నిరంతరం ఎన్నో త్యాగాలు చేశారు. అధికారులు ఉద్యోగాలకు రాజీనామాలు యిచ్చి ఉద్యమంలో పాల్గొనడం, గర్భిణీస్త్రీలు సత్యాగ్రహంలో చేరడం, ఆర్జనను త్యజించి, కుటుంబాల పోషణనుగాలికి వదలి స్వచ్ఛందంగా అరెస్టు కావడం వంటి ఉదంతా లెన్నిటినో పేర్కొనవచ్చు.

ఆ తరువాత పోరాటం మలుపు తిరిగి రెండవ ఘట్టంలో ప్రవేశించింది. ముఖ్యులైన కార్యకర్తలందరూ అజ్ఞాత వాసం లోకి వెళ్ళారు.

ప్రతి జిల్లాలోను, పట్టణంలోను స్థానిక కార్యాచరణ సంఘాలు ఏర్పడ్డాయి. అనుభవంగల గుర్తించబడిన జాతీయ కార్యకర్తలతో వాటికి సంబంధాలు ఉండేవి. బొంబాయిలో నెలకొల్పబడిన అజాద్‌హింద్ రేడియో ద్వారా యీ సంఘాలకు వార్తలు అందేవి. బొంబాయి హెడ్‌క్వార్టర్స్ నుండి తరుచుగాను, క్రమంగాను వాటికి ఆదేశాలు అందుతుండేవి.

## రణ గర్జన

ఆంధ్రదేశంలోని దేశభక్తులు రహస్యంగా "రణగర్జన" అనే తెలుగు పత్రికను ప్రారంభించారు. వారు తమ శక్తి కొలది నాటుబాంబులు, పిస్తోళ్లు స్వయంగా తయారు చేశారు. ఈ సంస్థ త్వరలోనే నలుమూలలకు ప్రాకింది. వారికి రహస్యపదాలు, సంకేతాలు ఉండేవి.

స్వతంత్ర భారత ప్రకటనకు ఆగస్టు ఉద్యమాలకు వత్తాసుగా స్వచ్ఛందంగా అరెస్టు అయ్యి, శిక్షయ అనుభవించడానికి వారు బృందాలుగా ఏర్పడి వెళ్ళేవారు. ఆంధ్రదేశంలోని దేశభక్తులు, యువకులు, విద్యార్థుల జాతీయ సంస్థలను ఏర్పాటు చేశారు. కొంత కాలం తర్వాత ప్రభుత్వం వాటిని నిషేధించింది. అప్పుడు వారు విద్యార్థుల, యువకుల కాంగ్రెసు ఉద్యమాలను తిరిగి ప్రారంభించారు. బొంబాయిలో "క్విట్ఇండియా" తీర్మానాన్ని ఆమోదించిన తర్వాత ప్రభుత్వం కాంగ్రెసును నిషేధించిన సమయంలో యీ సంస్థలే తమ మాతృసంస్థ సందేశాలను దేశంలో వ్యాపింపజేశాయి. తాడికొండలో జాతీయ యువజన మహాసభలను నిర్వహించారు. తత్ఫలితంగా యీ సంస్థలన్నిటినీ ప్రభుత్వం నిషేధించింది. ఈ మహాసభలలో పాల్గొన్న అనేక మందిని అరెస్టు చేసి శిక్షలు విధించింది.

మళ్లీ 1944 వ సంవత్సరంలో విద్యార్థి సంఘాలూ, యువజన కాంగ్రెసు సంఘాలూ జాతీయ స్వాతంత్ర్యానికై ఉద్యమం సాగించాయి. అప్పటికి యుద్ధం ముగియవచ్చింది ఈ సంఘాల పట్ల ప్రభుత్వం తన వైఖరిని మార్చుకున్నది.

గాంధీజీ "క్విట్ ఇండియా" నినాదం పూరించినప్పుడు యుద్ధం ప్రబలంగా వుంది. బ్రిటన్‌కు తీవ్ర అపాయ పరిస్థితి ఏర్పడింది. దేశంలో ఒక ప్రక్క విప్లవం, తిరుగుబాటు చెలరేగుతుండగా, నేతాజీ నాయకత్వాన అజాద్ హింద్ సైన్యం వెలుపలి నుంచి విమోచనోద్యమం సాగించింది.

తరువాత పరిస్థితి పూర్తిగా మారిపోయింది కొంత మంది జాతీయ నాయకులు పెరోల్‌పై విడుదలయ్యారు. మెల్లమెల్లగ ఉత్సాహ పరులందరూ యువజన కాంగ్రెసు, విద్యార్థి కాంగ్రెస సంఘాలలో చేరిపోయారు. ప్రముఖనాయకులు విడుదల కావడంతో యువజనులకు తమ ఉద్యమ కార్యకలాపాలలో వారి అండదండలు లభించాయి.

ఇదిజరిగిన వెంటనే అనేక మంది కాంగ్రెసు వాదులను బృందాలుగా విడుదల చేశారు. కాంగ్రెసు అసెంబ్లీలు ఏర్పడ్డాయి ఈలోగా నేతాజీ సుభాష్ చంద్రబోస్ అజాద్ హింద్ ఉద్యమం దేశప్రజల హృదయాలను అలరించింది. సంపూర్ణ స్వాతంత్ర్య సాధనకు అభినివేశం ప్రబలమైనది. భారత నౌకాదళంలో తిరుగుబాటు కూడా జరగడంతో స్వాతంత్ర్యానికి పూర్తి అవకాశాలు ఏర్పడ్డాయి.

ఈ విధంగా "క్విట్ ఇండియా" ఉద్యమపు అంతిమ పోరాటం తరువాత సంపూర్ణ స్వాతంత్ర్యం సిద్ధించింది.

—వి. యల్. యస్

# నేడే స్వాతంత్ర్య దినం

దూపాటి సంపత్కుమారాచార్య

సీ॥ తెగిపోయినవి మాతృ దేవీ పదస్థిత
  కఠినోగ్ర దాస్యశృంఖలములన్ని
తీగసాగెను భారతీయ శుభోదర్క
  సంస్కృతి గీతికా చయములన్ని
తమిఁ మ్రోగినవి శాంతి సమర జయప్రాభ
  వానందఘటిత వాద్యమ్ములన్ని!
ఛేదింపబడె విదేశీయ దుష్పాలనా
  నిష్ఠురములు దీర్ఘ నిశలవన్ని
పారతంత్ర్య జీవనశాప పటలియెల్ల
  తీరిపోయి పురోభివృద్ధి నిస్సృజింప
నవనవోన్మేష జీవనానందదాయి
  నేడె స్వాతంత్ర దినము! యీనాడె సఖుడ!

గీ॥ నేటి స్వాతంత్ర్యదినము సిన్ని జగాన
మానవునిగనిల్పినది, తన్మహితశోభ
తర తరమ్ముఁదాక సుస్థిరమొనర్ప
ప్రతినబూనుము నేడు! భారతకుమార!

సీ॥ ధనజీవనమ్ములు తృణముగా త్యజియించు
  పూజ్యనాయకుల తపోబలమ్ము!
స్వార్థజీవుల కథాసారంబు వేషముల్
  దర్శింప నిల్పిన దర్పణమ్ము!
బానిసతమమును ప్రాగ్దేశ శిఖరాల
  నుడిగింపనైన సూర్యోదయమ్ము
అభ్యుదయ పథమ్ము నందించు నిశ్రేణి
  పదమూన నిలుపు సోపానపంక్తి
దశదిశాంతాలలో ప్రతిధ్వనులుగూర్చు
శాంత్యహింసా కళాపూర్వ సరసగీతి;
యీమహాస్వతంత్ర దినమెన్నేళ్ళనాటి
భవ్యజీవనమున కనుప్రాసమొగద;

# ఆదర్శఘట్టాలు

## వితరణ శీలం

నెల్లూరులో బాలల ఆసుపత్రిని నెలకొల్పే నిమిత్తం శ్రీ రేబాల లక్ష్మీనరసారెడ్డిగారు మూడు లక్షల రూపాయల విలువగల తమ నివాసగృహాన్ని తన తల్లి శ్రీమతి సరస్వతమ్మ గారి స్మారక చిహ్నంగా దానం చెయ్యడం అత్యంత ప్రశంసనీయం

ప్రభుత్వం తరపున దానపత్రాలను స్వీకరించిన (అప్పటి) రాష్ట్ర ఆరోగ్యశాఖమంత్రి శ్రీ పి.వి. నరసింహారావుగారు శ్రీ రెడ్డిగారి వదాన్యతను కొనియాడుతూ అచిరకాలంలోనే ఈ భవనంలో అధునాతనమైన చక్కని ఆస్పత్రి ఏర్పడగలదని హామీ నిచ్చారు.

ఇంతేకాదు. బలహీనులకు, వికలాంగులకు, దీనులకు వినియోగపడేందుకై అయిదు లక్షల రూపాయలతో ప్రత్యేకమొక నిధిని ఏర్పాటు చేసినందుకు పై సభలో శ్రీ మాలకొండారెడ్డి గారు శ్రీ లక్ష్మీనరసారెడ్డి గారిని అభినందించారు.

దానశీలుడైన శ్రీ లక్ష్మీనరసారెడ్డిగారు పైరెండింటితోనే సంతృప్తి చెందలేదు. గ్రుడ్డివారి సహాయార్థంగా ప్రభుత్వమొక పథకాన్ని తయారుచేసిన పక్షంలో సముచితంగా దానికి సాయపడగలమని కూడా వాగ్దానం చేశారు.

ధనం సంపాదించిన వారెందరులేరు? ధనవంతులందరూ త్యాగమూర్తులా? 'త్యాగాయ సంభృతార్థానాం' (త్యాగం చెయ్యడానికే ధనసంపాదనం) అన్న కాళిదాసు సూక్తిని అనుసరించి శ్రీ రేబాల లక్ష్మీనరసారెడ్డిగారు ఆంధ్రదేశానికేగాక, యావద్భారతానికే చక్కని ఆదర్శం నెలకొల్పిన వారైనారు.

—ఆంధ్రప్రభ

మన పంటసీమలు

# ప్రధానిచే 'గోధుమ విప్లవం' స్టాంపు విడుదల

ప్రధానమంత్రి శ్రీమతి ఇందిరాగాంధీ జూలై 17వ తేదీన ఢిల్లీలో 'గోధుమ విప్లవం' తపాలా బిళ్ళను విడుదలచేశారు. 1967–68 వ సంవత్సరంలో గరిష్ఠస్థాయిలో సుమారు 17 మిలియన్ టన్నుల గోధుమ వుత్పత్తి జరిగిన సందర్భాన్ని పురస్కరించుకొని ఈ ప్రత్యేక స్టాంపును వెలువరించారు. గత పర్యాయం 1964–65 వ సంవత్సరంలో గోధుమ దిగుబడి బాగా వున్నప్పుడు 12 మిలియన్ టన్నుల వుత్పత్తి జరిగింది. స్వర్గీయ శ్రీ రఫీ అహమద్ కిద్వాయ్ జ్ఞాపకార్థం, భారత వ్యవసాయ పరిశోధనా సంస్థ ఏర్పాటుచేసిన బహుమతులను కూడా ఆరుగురు వ్యవసాయ శాస్త్రజ్ఞులకు ప్రధానమంత్రి అందజేశారు. ప్రస్తుత స్థాయిలోనే ఈ పురోభివృద్ధి కొనసాగినట్లయితే మూడు సంవత్సరాల కాలంలో భారతదేశం గోధుమ దిగుమతిని నిలిపివేయ గలుగుతుందని ప్రధానమంత్రి పేర్కొన్నారు.

## ఆహార రంగంలో స్వయం సమృద్ధి : ఆంధ్రప్రదేశ్ పాత్ర

భారత రిజర్వుబ్యాంకు గవర్నరు శ్రీ ఎల్. కె. ఝా, హైదరాబాదులో బ్యాంకర్స్ క్లబ్ అధ్వర్యంలో జూలై 6వ తేదీన జరిగిన సమావేశంలో ప్రసంగిస్తూ, భారతదేశ ఆర్థిక వ్యవస్థలో ఆంధ్రప్రదేశ్ కీలకపాత్ర వహిస్తుందని అన్నారు. ఆహారోత్పత్తి పెరిగినప్పటికీ, కేరళ, మద్రాసు, పశ్చిమ బెంగాలు మొదలైన బియ్యం ప్రధాన ఆహారంగాగల రాష్ట్రాలలో యిప్పటికీ బియ్యం కొరత వుందనీ, వాటిధరకూడా ఎక్కువగానే వుంటున్నదనీ ఆయన పేర్కొన్నారు. ఆహారరంగంలో స్వయం సమృద్ధిని సాధించవలసిన అవసరాన్ని గురించి నొక్కి చెబుతూ శ్రీ ఝా, ఈ లక్ష్యసాధనలో ఆంధ్రప్రదేశ్ తోడ్పడగలదని అన్నారు. నాగార్జునసాగర్ ప్రాజెక్టును జూలై 5వ తేదీన సందర్శించిన శ్రీ ఝా ఆహార విషయంలో స్వయం సమృద్ధిని సాధించడానికి రాష్ట్రంలో అవకాశాలు వున్నాయని అన్నారు.

## మెట్ట భూములలో సేద్యపు నీటి పారుదలకు ఫ్రాన్సు ప్రభుత్వ పథకం

ఆంధ్రప్రదేశ్‌లోని క్షామపీడిత ప్రాంతాలలో మెట్ట భూములకు సేద్యానికై నీటిపారుదల చేయడానికి సంబంధించిన ఒక పథకాన్ని ఫ్రాన్సు ప్రభుత్వం రూపొందించింది. ఇటీవల ఫ్రెంచి నిపుణులు ఈ ప్రదేశాలను సందర్శించారు. ప్రత్తి, వేరుశనగ మొదలైన మెట్టపైర్లకు నీటిపారుదల విషయంలో ఈ పథకంవల్ల ప్రయోజనం వుంటుంది. ఈ సమాచారాన్ని, సేద్యపు నీటిపారుదల శాఖా మంత్రి శ్రీ శీలం సిద్దారెడ్డి జూలై 17వ తేదీన రాష్ట్రశాసన సభలో తెలియజేశారు.

## వ్యవసాయ దార్లకు ఋణాలు

పశ్చిమగోదావరి జిల్లా కలెక్టరు శ్రీ కె. సుబ్రహ్మణ్యం ఏలూరులో జూలై 17వ తేదీన జరిగిన ఒక సమావేశంలో మాట్లాడుతూ, ఈజిల్లాలోని వ్యవసాయదార్లకు గత సంవత్సరంలో రూ. 2 కోట్ల మొత్తాన్ని ఋణాలుగా పంపిణీ చేయడానికి గాను పెట్టుకున్న లక్ష్యాన్ని సాధించడం జరిగిందని, తీవ్రతర జిల్లా వ్యవసాయాభివృద్ధి కార్యక్రమానికి సంబంధించిన రాష్ట్రస్థాయి సమన్వయ సంఘం సభ్యులకు తెలియజేశారు వర్తమాన సంవత్సరంలో రూ. 33 కోట్ల మొత్తాన్ని రైతులకు ఋణాలుగా పంపిణీ చేసేందుకు లక్ష్యంగా పెట్టుకున్నట్లు కూడా ఆయన వివరించారు.

---

# నాగార్జున సాగర్ ప్రాజెక్టు అభివృద్ధి

ఎల్. వెంకటరత్నం

ఆగష్టు 4, 1967 సం॥లో నాగార్జునసాగర్ నీరు, పంటల సాగుదలకై శ్రీమతి ఇందిరాగాంధి గారిచేత ప్రారంభోత్సవము జరుపబడినది. ప్రాజెక్టునుండి లభించు నీరు $6\frac{1}{2}$ లక్షల ఎకరముల పంటకు సరిపడుతుందని అంచనావేయబడినది. నల్గొండ జిల్లాలోని మిరియాలగూడ తాలూకాకు నీరు ఎడమ కాలువ ద్వారా సరఫరా అవుతున్నది. 74 గ్రామాలలోని 90 వేల ఎకరములకు కూడా నీరు పారినది.

కుడి కాలువ, నరసరావుపేట, పల్నాడు, సత్తెనపల్లి, వినుకొండ తాలూకాలోని కొద్దిభాగము అనగా 5.5 లక్షల ఎకరములకు నీరు సరఫరా చేయబడినది. గుంటూరు జిల్లాలోని 250 గ్రామములలోని పంటలకు నీరు లభించుట యిదియే మొదటిసారి.

ఏ ప్రాజెక్టులోని రైతు అయినను, పంటలు పండించుటకు నీరు వదలినప్పుడు, తన పొలములో, ఆ నీటిని పూర్తిగా ఉపయోగించుకొనలేడు. ఎందుకనగా రైతులు చాలా కాలము నుండి పండించే పంటల విధానము, అంత త్వరితముగా మార్చుకొనలేరు. వారు తమ భూమిని ముందు బాగా సమముగా చేసుకొని మరల ఆ భూమిని చిన్న చిన్న భాగములుగా–అంటే చిన్నమళ్ళుగాచేసి నీరు పెట్టవలసియున్నది. ఈ పరిస్థితి చాలా కష్టమైనది, మిక్కిలి శ్రమతో కూడుకొనిన పని.

నీరు చిన్న చిన్న బోదెల ద్వారా, భూములలోకి పంపవలె నన్న అచ్చటచ్చట గట్టులు త్రవ్వవలసియున్నది. ఎచ్చట అయితే రైతులు భూమిని దున్నించి చదును చేయలేదో, అట్టి భూములలో గూడ నీటిని పారించవలసియున్నది. కొందరు రైతులు పంట నీరు తమ పొలములలోకి పారించి చుట్టుప్రక్కల ఉన్న పొలములకు నీరుపారుటకు అంగీకరించరు. దీనికి వారికున్నటువంటి చిన్న చిన్న ద్వేషములే కారణము అని చెప్పవచ్చును. అయితే చిన్న చిన్న నీటి కాలువలకు నీరు కొద్దిమాత్రముగానే పంపుటకు అనుకూలముగా నుండును. అట్టి పంటకాలువల నీరు అధికముగా వదలినచో కట్టల గట్లు తెగి నీరు వృధా అయిపోగలదు. ఇటు వంటి పనులలో పి. డబ్ల్యు. డి. అధికారుల సహాయము ఎంతో అవసరము అయితే నీరు తగినంత మాత్రమే వదలి గట్లు తెగకుండా చూచుట, తెగిన వాటిని బాగుచేయుట, ప్రతి రైతుకు నీరు లభించేటట్లు చేయుట, అంతేగాక రైతులందరిని ఒకే ఆయకట్టు క్రింద నుండునట్లు చూచుట చాలా కష్టతరమైనది.

పైనచెప్పిన యీ సమస్యలేగాక, ప్రతి రైతుకు భూములను సాగుచేయుటకు, లేక అభివృద్ధి చేయుటకు డబ్బు అవసరము. వ్యవసాయపు పనిముట్లు, ఎరువులు, ఎద్దులు, విత్తనములు మొదలగునవి అవసరము. అంతేగాక శాస్త్రీయ పద్ధతిలో పంటలను పండించుట నేర్చుకొనవలసి యున్నది. ఇటువంటి గడ్డు సమస్యలు ఎదుర్కొనుటకు మన ప్రభుత్వమువారిచే, ప్రాజెక్టుల అభివృద్ధి సంఘము (Project Development Committee) స్థాపించబడి ప్రాజెక్టు అభివృద్ధి కమీషనరుగారి క్రింద నిర్వహించ బడుతున్నది. వీరు ఆ ప్రాజెక్టు అభివృద్ధి ప్రణాళికలను గురించి చూచుచున్నారు.

వ్యవసాయశాఖవారు మేలురకముల విత్తనములను వివిధ రకములైన ఎరువులను రైతులకు సప్లై చేస్తున్నారు. ఏయే రకపు పంటలు ఎప్పుడు ఏవిధముగా నాటవలెనో, లేక వేయవలెనో వీరు రైతులకు సలహానిచ్చుచున్నారు.

ఇప్పటి వరకును నాగార్జునసాగర్ ప్రాజెక్టు అభివృద్ధి పథకము క్రింద 100 ఎకరములకు పైగా బుల్‌డోజర్ పనిచేయుచున్నది. 30 వేల ఎకరములకు పైబడి భూములు చదును చేయబడినవి. భూములు చదునుచేయుటకై భూమి తనఖా బ్యాంకు వారు రైతులకు 600 లక్షల రూపాయలు అప్పుగాయిచ్చి యున్నారు.

పి.డబ్ల్యు.డి. వారు పంట నీరును సకాలములో అందించడం, గట్లు తెగిపోకుండా చూచుట, రైతులు నీరును సక్రమముగా ఉపయోగించు కొనులాగున చూచుట వీరిపని. రెవిన్యూ శాఖవారు రైతుల మధ్యవచ్చిన తగవులను తీర్చుట వీరిపని. ఈ విధముగా అన్ని ప్రభుత్వ శాఖలవారు ప్రాజెక్టు అభివృద్ధికై పనిచేయు చున్నారు, చేయగలరు.

## కర్నూలు జిల్లాలో కాయగూరల ఉత్పత్తి పెరుగుదల

కర్నూలు జిల్లాలో గ్రామ ప్రజలకు కాయగూరల వాడకం పూర్వంనుంచీ చాలా తక్కువ. కాని ఇప్పుడు క్రమంగా వీటి వాడకం పెరుగుతున్నది. నందికొట్కూరులో విత్తనాల పంపిణీ వ్యవహారాల జాతీయ సమాఖ్య శాఖా కార్యాలయం ఏర్పాటైన తర్వాత ప్రగతి సాధకులైన కొందరు వ్యవసాయదారుల కృషి ఫలితంగా ప్రజలకు కాయగూరలు అందుబాటులోకి వస్తున్నాయి. ఈ కార్యాలయం ప్రోత్సాహంతో పగిడాల గ్రామ సర్పంచి శ్రీ బి. సుబ్బారెడ్డి నాలుగు ఎకరాలలో బెండ వేశాడు. ఈ సంవత్సరం పంట బాగా పండింది. సుమారు రూ. 4,800.ల విలువ చేసే 16 క్వింటాళ్ళ బెండ విత్తనాల దిగుబడి లభించింది. ఈ విత్తనాలు ఏక మొత్తంగా ఈ కార్యాలయం కొనడం కూడా జరిగింది. ఇదే విధంగా శ్రీ ఇ. శేషిరెడ్డి, శ్రీ ఆర్. గోపాలరెడ్డి కూడా రామములగ కాయలు విరివిగా పండించారు.

ప్రస్తుతం గ్రామ ప్రాంతాలలో విస్తరణ శాఖ అధికారుల సహాయ సహకారాలతో వ్యవసాయ అభివృద్ధి కార్యక్రమాలు శీఘ్రంగా అమలు జరుగుతున్నాయి.

## సంకర జాతి విత్తనాల ద్వారా అధికోత్పత్తి

కర్నూలు జిల్లాలోని యెమ్మిగనూరు పట్టణం చేనేత పరిశ్రమకు పేరు పొందింది. ఈ నాడు మరో విధంగా కూడా గణన కెక్కింది. 1965 లో సంకరజాతి వరి, జొన్న, సజ్జ, మొక్కజొన్న వంగడాలను ఈ పట్టణ ప్రాంతంలో ప్రవేశ పెట్టడం జరిగింది. తుంగభద్ర ప్రాజెక్టు క్రింద సాగయ్యే ఈ పట్టణంలోనూ, పరిసర గ్రామాలలోనూ, రాష్ట్ర ప్రభుత్వానికి చెందిన వ్యవసాయ విస్తరణ శాఖోద్యోగుల తీవ్ర కృషి ఫలితంగా, వ్యవసాయోత్పత్తి గణనీయమైన అభివృద్ధి చెందింది. రైతాంగం "అదివరలో ఎన్నడూ లేనంత" హెచ్చు పంటలను పండించుకుని బాగు పడ్డారు.

1965–66 పెద్ద పంటకాలంలో మొట్టమొదటి సారిగా హెచ్చు రాలుబడి నివ్వగల వంగడాలను ప్రవేశపెట్టడంతో, ఇక్కడ వ్యవసాయ రంగంలో విప్లవాత్మకమైన మార్పుకు నాంది ప్రస్తావన జరిగింది. జొన్న విషయంలో జాతీయ స్థాయి ప్రదర్శన క్షేత్రం ఏర్పాటు చేసినప్పుడు దాదాపు $2\frac{1}{4}$ ఎకరాలలో 6,380 కిలో గ్రాముల ఫలసాయం లభించింది. ఈ ప్రయోగం, అక్కడి రైతాంగంలో ఉత్సాహ శక్తులను పురికొల్పింది. అంతకంతకు ఎక్కువ మంది ఈ విత్తనాల మడిలో పండించిన విత్తనాల కోసం ముందుకు రాసాగారు. బనవాసి అనే గ్రామంలో, బీడువేసి ఉంటూ వచ్చిన 150 యకరాల చవిటి పల్లిలో ఈ సంకర జాతి జొన్న విత్తనాలను నాటగా, ఎకరానికి 15,20 బస్తాల ఫలసాయం గిట్టుబాటవడం ప్రతివారినీ ఆశ్చర్యచకితులను చేసింది.

జొన్న విషయంలో ఈ సత్ఫలితాలను సాధించగానే, సంకర జాతి మొక్కజొన్న, సజ్జ, ఐ. ఆర్. 8 రకం వరి వంగడాలు వాడకంలోకి వచ్చాయి ఈనాడు హెచ్చు రాలుబడినివ్వగల ఈ వంగడాల పైరులలో ఏదో ఒకటి వేయని గ్రామం ఈ సబ్ తాలూకా మొత్తంలోనే లేదు.

ఈ రకాల విత్తనాలను వాడేందుకు పూనుకోవడం వల్ల యెమ్మిగనూరుకు చెందిన శ్రీ సచీ సాహెబ్ వంటి పేదరైతులు ఎందరో బాగుపడ్డారు. అఖిల భారత స్థాయి వరిపంట పోటీల్లో ఆయన మూడవ బహుమతి గెల్చుకున్నారు. జి. బి 24 రకం ధాన్యాన్ని ఎకరానికి 2,160 కిలోగ్రాములు పండించారాయన. మూడేమూడు సంవత్సరాలలో ఆయన మూడెకరాల భూమి కొనుక్కోగలిగారు ఒక ఇల్లు కట్టుకున్నారు.

ఇదే విధంగా శ్రీ గుంటప్ప అనే రైతు, పెద్దలిచ్చిన 3 ఎకరాలకు తోడు మరో 3 ఎకరాల భూమి కొనుక్కోగలిగారు. సంకరజాతి వరి, సజ్జ, మొక్కజొన్న పైరులనూ సి. ఐలెండ్ రకం ప్రత్తినీ పండించటం ద్వారా ఆయన, తన ఆరెకరాల కమతం లోనూ సాలీనా 8,000 రూపాయల నికరాదాయాన్ని పొందగలుగుతున్నారు.

శ్రీ రజాక్ అనే మధ్య తరగతి రైతు 3 ఎకరాల 10 సెంట్ల భూమిలో సి. ఐలెండ్ రకం ప్రత్తి పండించి 12,000 రూపాయలు గడించగలిగారు. గత మూడేళ్ళలోనూ ఆయన యెమ్మిగనూరు పట్టణంలో మూడు ఇళ్లు కొనగలిగారు.

యెమ్మిగనూరులోనూ పరిసర గ్రామాలలోనూ ఇలాటివారే ఇంకా ఎందరో ఉన్నారు. మూడు సంవత్సరాల క్రితం వరకు ఆశ అనేది కనబడని పరిస్థితుల్లో సంప్రదాయానుగుణమైన పద్ధతులను నమ్ముకొని అవస్థలు పడుతూండిన రైతాంగం, హెచ్చు రాలుబడినిచ్చే ఈ సంకరజాతి విత్తనాల పుణ్యమా అని తమ స్థితిగతులను ఆనాటి కానాడు మెరుగు పరుచుకుంటున్నారు.

## చెఱకును నాటడానికి ఒక క్రొత్త సాధనం

నాలుగు హెక్టేర్ల విస్తీర్ణంలో ఒకేరోజున చెఱకును నాటగల ఒక క్రొత్తసాధనాన్ని లక్నోలోని భారతీయ చెఱకు పరిశోధనా కేంద్రంవారు తయారు చేశారు. ట్రాక్టరుతో లాగబడే ఈ సాధనము తనంతట తానే చెఱకును నాటుతుంది. ఈ సాధనాన్ని ట్రాక్టర్ యొక్క 'అడ్డర్ బాడీ' కి తగిలించాలి. చెఱకు ముక్కలను నాటి, రసాయనిక ఎరువు వేసి, మట్టితో కప్పి, చుట్టూ మట్టిని పోగు చేస్తుంది ఈ సాధనం. ఇటువంటి సాధనాలు ఒకటి లేదా అంతకన్న ఎక్కువ సంఖ్యలో కాని ట్రాక్టరుకు తగిలించి పని చేయించవచ్చును. ఒక్కొక్క సాధనం ఒకసారికి ఒక చెఱకు ముక్కను నాటుతుంది.

ఈ సాధనంలోని పాత్రలో చెఱకు ముక్కలుంటాయి. ఇవి ఒక్కొక్కటిగా నాటబడుతాయి. మరొకభాగం రసాయనిక ఎరువును చెఱకు ముక్కకు రెండువైపులా వేస్తుంది. మూడవ భాగం చెఱకు ముక్కను మట్టితో కప్పి, పోగుచేస్తుంది

## ప్రత్తిని విత్తడానికొక క్రొత్త సాధనం

పూనాలోని వ్యవసాయ కళాశాలవారు ప్రత్తిని నాటడానికి ఒక కొత్త సాధనాన్ని రూపొందించారు. ఈ క్రొత్త సాధనంతో గనుక ప్రత్తిని విత్తితే, విత్తడానికి కూలీలకయ్యే ఖర్చులో అయిదవవంతు మాత్రమే ఖర్చవుతుంది నీరు పెట్టి పండించే ప్రత్తిని విత్తడానికి ఈ సాధనం పనికివస్తుంది.

గట్లవెంబడి చేతితో విత్తడానికి మామూలుగా హెక్టేరుకు రు 18.75లు ఖర్చు అవుతుంది. ఈ పనిముట్టుతో రు 3.75 మాత్రమే అయింది. ఇది చాళ్ళను ఏర్పరచి, గట్లవెంబడి విత్తనాలను నాటుతుంది

దీని ధర రు. 75/– దీనిని ఒక మనిషి పనిచేయించవచ్చును. దీనితో 8 గంటల సేపులో 0.65 హెక్టేరు మేర విత్తవచ్చును.

## ప్రత్తి పైరుకు యూరియా ఎరువు

అమ్మోనియం సల్ఫేటుకు బదులు యూరియా ఎరువును వేస్తే ప్రత్తి పైరు మంచి లాభాన్నిస్తుంది; యూరియాను గనుక ప్రత్తిని విత్తేటప్పుడే వేస్తే ఇతోధికమైన లాభాలు వస్తాయి. ఈ విషయాలు భవానీసాగర్ (మద్రాసు)లోని ప్రత్తి పరిశోధనా కేంద్రం వారు కనుగొన్నారు.

యూరియాను ఆకులమీద చల్లవచ్చునని కూడా పై కేంద్రం వారు కనుగొన్నారు. ఇట్లా యూరియాను నీటితో కలిపి చల్లితే ఆకులు మాడిపోవు. యూరియాతో బాటు మందులనూ కలిపి చల్లవచ్చును ఇట్లా చేస్తే పిచికారీకయ్యే ఖర్చులు తగ్గుతాయి.

ప్రత్తిని పండించే రైతులందరూ అమ్మోనియం సల్ఫేటు బదులు యూరియాను వాడితే ఎరువులమీద ఖర్చు తగ్గుతుంది. ఒక్క మద్రాసు రాష్ట్రంలోనే రైతులీవిధంగా కోటీ ముప్పై లక్షల రూపాయలను ఆదా చేయవచ్చును.

## నెమటోడ్ పురుగుల నుండి మిరపపైరుకు రక్షణ

మిరపపైరు మీద దాడిచేసి నష్టం కలిగించే నెమటోడ్ పురుగులనుండి మిరపపైరును రక్షించడానికి "నెమగోన్" అన్న మందును వాడాలి అని మద్రాసు రాష్ట్రంలో జరిగిన పరిశోధనలు తెలుపుతున్నాయి.

మిరపను విత్తడానికి 10–15 రోజుల ముందూ, విత్తిన తర్వాత కోసేదాక ప్రతి రెండు నెలలకూ– ఈ మందును వాడాలి.

'నెమగోన్' మందు నీటిలో కలిపి, మిరప మడిలోకి వెళ్ళే నీటిలోకి కలపాలి. ఈ మందు నీరు కలిపిన తర్వాత–మడిలో 10–15 సెం. మీ లోతున నీరు నిల్వవుంచాలి.

ఎన్నో సంవత్సరాల పరిశోధన ఫలితంగా తేలిన ఈ విధానాన్ని అనుసరించి మన రైతులందరూ తమ తమ మిర్చి పైరులను కాపాడుకొనవచ్చును.

## గినీగడ్డితో బాటు లూసర్న్ పెంపకం

ఆనంద్ (గుజరాత్)లో వ్యవసాయ సంస్థ వారు చేసిన ప్రయోగాల వలన–లూసర్న్‌తో కలిపి పెంచితే గినీగడ్డి అధికమైన పుష్టిగల గ్రాసాన్ని ఎక్కువ ఇస్తుంది–అని తేలింది.

వర్షఋతువులోనూ, వేసవిలోనూ గినీ గడ్డి బాగా పెరుగుతుంది; కాని చలికాలంలో అంతగా పెరగదు. కనుక చలికాలంలో గినీగడ్డి వరుసల మధ్య లూసర్న్‌ను పెంచవచ్చును.

గినీగడ్డిని మాత్రమే పెంచగా ఒక హెక్టేరునుండి 4082 కిలోల పశుగ్రాసం లభించింది; లూసర్న్‌తో కలిపి పెంచగా మొదటి సంవత్సరం 7464 కిలోల గ్రాసం లభించింది. రెండవ సంవత్సరము గినీగడ్డి మాత్రం 8448 కిలోల గ్రాసాన్నివ్వగా, లూసర్న్‌తో బాటు కలిపి పెంచిన గినీగడ్డి నుండి 12,137 కిలోల గ్రాసం లభించింది.

ఇంతే కాదు. లూసర్న్‌తో కలిపి పెంచిన గినీ గడ్డిలో మాంసకృత్తులు, క్రొవ్వు, కేల్షియం ఎక్కువయ్యాయి.

# స్వాతంత్ర్యానంతర ప్రగతి

## మంచినీటి సరఫరా

ఇండియా స్వతంత్రమైనప్పుడు మొత్తం పట్టణాల సంఖ్యలో 6 వ వంతుకు కూడా సరియైన మంచినీటి వసతి లేదు. ఇప్పుడు ఇంచుమించు ప్రతి పట్టణంలో కొళాయి సౌకర్యం ఉన్నది

గ్రామాలకు మంచినీటి సరఫరా చేసే నిమిత్తం గడచిన 15 ఏళ్లలో 7 లక్షల పైగా బావులు త్రవ్వడం జరిగింది. మన గ్రామాలలో నివసిస్తున్న జనాభాలో మొత్తం మూడింట సుమారు రెండు వంతుల మందికి ఈ విధంగా మంచినీటి వసతి లభించింది.

పట్టణాలకు కొళాయి సౌకర్యాలూ, గ్రామ ప్రాంతాలకు బావులూ చేతిపంపులూ అమర్చే నిమిత్తం మొదటి రెండు ప్రణాళికల క్రింద సుమారు రూ 70 కోట్లు వెచ్చించడం జరిగింది. మూడవ ప్రణాళికలో ఇందు నిమిత్తం రూ. 67 కోట్లు కేటాయించడం జరిగింది.

వచ్చే 5 ఏళ్లలోగా అనగా నాల్గవ ప్రణాళిక అంతంనాటికి మన జనాభాలో సుమారు 30 శాతం మందికి మంచినీటి సరఫరా ఏర్పాటు కాగలదు.

# దేశంలో ఇరిగేషన్, విద్యుత్తు

| ఇరిగేషన్ | 1951 | 1966 |
|---|---|---|
| ఇంతవరకు నిర్మించబడిన భారీ, మధ్యతరహా ప్రాజెక్టుల ద్వారా ఇరిగేషన్ సదుపాయం ఏర్పాటు చేయడానికి వీలైన భూమి విస్తీర్ణం (లక్షల ఎకరాలలో) | 240 | 420 |
| భారీ, మధ్యతరహా ప్రాజెక్టులక్రింద సాగునీటి సదుపాయం ఏర్పాటైవున్న భూమి విస్తీర్ణం (లక్షల ఎకరాలలో) | 240 | 380 |
| అన్నిరకాల నీటి వనరుల ద్వారా సాగుఅవుతున్న మొత్తం భూమి విస్తీర్ణం (లక్షల ఎకరాలలో) ... | 560 | 880 |
| **విద్యుత్తు** | | |
| దేశంలో నెలకొల్పిన విద్యుత్తు ఉత్పత్తి సామర్థ్యం (లక్షల కిలోవాట్లలో) | 28 | 102 |
| ఉత్పత్తి అవుతున్న మొత్తం విద్యుత్తు (లక్షల కిలోవాట్ గంటలలో) ... | 65,730 | 3,64,000 |
| విద్యుత్తు సరఫరా చేయబడుతున్న గ్రామాలు, పట్టణాల సంఖ్య ... | 3,687 | 54,780 |
| తలసరివిద్యుత్తు ఉత్పత్తి (కిలోవాట్ గంటలలో) ... ... | 18 | 82 |
| **వరదల నివారణ** | | |
| కరకట్టల నిడివి (మైళ్ళలో) | 3,000 | 7,500 |

# సూపర్ బజారును గురించి....

వి. నాగరత్నం

చైనా దురాక్రమణ, రూపాయి విలువ తగ్గింపు కారణాల వల్ల ఆకాశాన్ని అంటిన ముఖ్యావసర వస్తువుల ధరలను తగ్గించ వలసిన అవసరం యేర్పడి, భారత దేశంలోని వివిధ నగరాలలో సూపర్ బజార్లు తలెత్తాయి.

వాటిలో హైదరాబాదులోని 'కల్పలత' ఒకటి. ఇది 1966 డిశంబరు 14వ తేదీ నుంచి హైదరాబాదు నగరంలో పని చేయడం ప్రారంభించింది. ఆంధ్రప్రదేశ్‌లోని యీ మాదిరి డిపార్ట్‌మెంటల్ స్టోర్సులలో యిదే మొట్టమొదటిది. రెండంతస్తుల భవనంలో యిదివుంది. ఆధునిక పద్ధతుల్లో డిపార్ట్‌మెంటల్ స్టోరును ఏర్పాటు చేయడానికి వీలుగా పాతభవనాన్ని మార్పులు చేర్పులు చేసి నిర్మించిన భవనంలో యీసూపర్ బజారు 'కల్పలత' ఏర్పాటైంది. ఒకటిన్నర ఎకరాల ఖాళీ ప్రదేశం గల యీ 'కల్పలత'లో 17,545 చ. అ. విస్తీర్ణంగల అమ్మకపు విభాగం వుంది. ఆంధ్రప్రదేశ్ రాష్ట్రరాజధాని నగరంలో జనసమ్మర్దం ఎక్కువగా గల ప్రాంతంలో యీ సూపర్ బజార్ పనిచేస్తోంది.

## ప్రజల సంస్థ

"ప్రజలు యీ సూపర్ బజారును ప్రభుత్వ సంస్థగా గాక వ్యాపారసంస్థగా గుర్తించేట్టు చేయాలి. అది తమ స్వంత సంస్థగా ప్రజలు భావించాలి" అన్నారు ముఖ్యమంత్రి ప్రారంభోత్సవ సమయంలో. బయట అక్కడక్కడ 'యిది ఎన్నో నెలలు నిలవదులే' అన్న పలుకులు వినిపించేవి గాని యీనాడు యిది ఆ సందేహాలన్నిటినీ పటాపంచలుచేస్తూ సగర్వంగా ఒక పరిపూర్ణ వ్యాపార సంస్థగా వినియోగదారులకు అధిక ప్రయోజనాలను చేకూరుస్తూ రెండో సంవత్సరంలోకి అడుగు పెట్టింది.

ప్రభుత్వ సీనియర్ అధికార్లను (ఐ. ఎ. ఎస్.) అనుభవం గల శాసన సభ్యులను, సాంఘిక కార్యకర్తలను బోర్డు ఆఫ్ డైరెక్టర్లుగా ప్రభుత్వం నియమించింది. మేనేజింగ్ డైరెక్టరుగా ఒక సీనియర్ అధికారిని (ఐ.ఎ.ఎస్. హోదా) కూడా ఏర్పాటు చేసింది.

భారతప్రభుత్వం వాటా ధనం రూపేణా, గిడ్డంగి నిర్మాణానికి ఋణం రూపేణా, ట్రక్కులు మొదలైన వాటి కొనుగోలుకు, ఫర్నిచరు మొదలైనవాటి కొనుగోలుకు సబ్సిడీరూపేణా మొత్తం రూ. 19.19 లక్షల ఆర్థిక సహాయాన్ని అందజేసింది. హైదరాబాదులోని ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర సహకార బ్యాంకు రూ 14 లక్షల నగదు ఋణాన్ని, భారత ప్రభుత్వం రూ 14 లక్షల మేరకు హామీనీ యిచ్చింది.

హైదరాబాదులోని సూపర్‌బజారు మాదిరిగానే సికింద్రాబాదులోకూడా ఒక సూపర్ బజారును నడిపేందుకు రూ 7.15 లక్షలను మంజూరు చేయడంకూడా జరిగింది. 'కల్పలత' సభ్యత్వ రుసుమును రూ 50 నుంచి రూ 20 కు తగ్గించారు. ఇంతవరకు 755 మంది సభ్యులుగా చేరారు. ఒక సభ్యుడు తీసుకునే షేర్ల కనిష్టసంఖ్యను యిటీవల ప్రకటించారు. ఈ బజారును సామాన్యునికి కూడా అందుబాటులో వుంచాలనే ఉద్దేశంతోనే ఈ షేర్ల కొనుగోలు కనిష్టసంఖ్యను ప్రకటించారు. సూపర్ బజార్ సభ్యులకు అనేక విధాలైన ప్రయోజనాలు కల్పించబడుతున్నాయి. ఫోనులో తమకు కావలసిన వస్తువులను కోరిన వెంటనే అడ్వాన్సు చెల్లించకుండానే వారికి నేరుగా అందజేయడం జరుగుతున్నది వారు కొనే వస్త్రాలు, సాధారణ వాణిజ్య వస్తువులమీద డివిడెండుతోపాటు 2 శాతం రిబేటుకూడా అందజేయబడుతున్నది.

ప్రస్తుతం సూపర్ బజారులో 70 కౌంటర్లతో 14 విభాగాలు వున్నాయి. ఇందులో 300 మంది సిబ్బంది పని చేస్తున్నారు మెయిన్ స్టోర్సుల నిర్వహణ వ్యయాన్ని తగ్గించే ఉద్దేశంతో కొత్త నియామకాలను జరుపకుండా కొందరిని సికింద్రాబాదులో నెలకొల్పనున్న విభాగానికి తరలించాలని ఉద్దేశించారు.

## "సెల్ఫ్ సర్వీస్"

అత్యవసర వస్తువులను సరఫరాచేయడమే సూపర్ బజారు ప్రధానంగా పూనుకుంటున్నది. అపరాల విభాగం క్రమక్రమంగా నాలుగు భాగాలుగా విస్తరించింది. ఇవికాక వస్త్రాలు, కాయగూరలు, మందులు అమ్మే విభాగాలు కూడా వున్నాయి. ఈ 'కల్పలత' యింతకన్నా ఎక్కువ శక్తివంతంగానూ, ప్రయోజనాయుతంగానూ పని చేయడానికి, వినియోగదార్లకు అధిక ప్రయోజనకరంగా రూపొందడానికి ఎప్పటికప్పుడు కొత్తకొత్త మార్గాలను అన్వేషిస్తూనేవున్నది. తత్ఫలితంగానే ఖాదీ, డ్రైక్లీనింగ్, టెయిలరింగ్ విభాగాలు ఏర్పాటు చేయబడ్డాయి. ఈ బజారుకు ఎప్పటికప్పుడు కొత్త ఆకారాన్ని, కొత్త అందాలను కల్పించేందుకు, ఇంకా ఆకర్షణీయంగా, ప్రయోజనకరంగా రూపొందింపజేసేందుకు అనవరతమూ కృషి జరుగుతున్నది. ఇందులో మరో విశేషమేమంటే —ఇక్కడ 'సెల్ఫ్ సర్వీసింగ్ విభాగం' ఒకటి వుంది. అంటే మన వస్తువుల్ని మనమే కొనుక్కొని డబ్బు చెల్లించే విభాగం అన్నమాట. భారతదేశంలో యీ మాదిరి అమ్మకపు విభాగాల్లో ఇది రెండవది. ఈ విభాగం ఈ ఏడాది ప్రారంభంనుంచి పనిచేయడం ఆరంభించింది. దీనివల్ల అమ్మకపు సిబ్బందిమీద ఖర్చుపెట్టే వ్యయం తగ్గించే వీలు ఏర్పడింది.

సూపర్ బజారు సాధించిన అనేక విజయాలలో వినియోగదార్లకు ధరలను గురించిన చైతన్యం కలిగించడం ఒకటి. సాధారణంగా సూపర్ బజారులో విక్రయించే అనేక వస్తువుల ధరలు మార్కెటులో అమ్మే ఆ వస్తువుల ధరలకంటే తక్కువగా వుంటాయి. వుత్పత్తిదారు తమ వస్తువులను తాము నిర్ణయించిన చిల్లర ధరలకు మాత్రమే విక్రయించాలని నిర్బంధపరచిన కొన్ని సందర్భాలలో మాత్రమే వస్తువులను మార్కెటు కంటే తక్కువ ధరకు అమ్మడం సాధ్యం కాదు. అయితే ఇటువంటి వస్తువుల అమ్మకాల మీదకూడా సభ్యులకు రెండు శాతం చొప్పున రాయితీ ఇవ్వడం జరుగుతున్నది. అప్పుడప్పుడు అనేక కారణాల వల్ల అనివార్య పరిస్థితులలో ఇక్కడి ధరలు బజారు ధరలకు సమానంగా వుండడం లేక వాటికంటే కొద్దిగా ఎక్కువగా వుండడం తటస్థించినప్పుడు ఏర్పడిన పరిస్థితిని తొలగించి వినియోగదార్లలో విశ్వాసం, సంతృప్తి కలిగించడానికి ఈ రాయితీ అనుకూల వాతావరణం కలిగించింది.

సూపర్ బజారు గత ఒక సంవత్సరంగా నిర్వహించబడడం వల్ల కలిగిన ఫలితాలను పరిశీలించి నట్లయితే, సరిఅయిన డిపార్ట్‌మెంటల్ స్టోరు నిర్వహణకుగాను నిర్దుష్ట పరిచిన ప్రమాణాలనూ సూత్రాలనూ యిది ఖచ్చితంగా పాటిస్తున్నదనీ, ఖర్చు. అమ్మకాలలో గరిష్ట శాతం 8. 37 కాగా 8. 20 శాతం వుందనీ, నిర్వహణ ధనం మార్పిడి తగినంతగా వుందనీ, చదరపుటడుగు లెక్కన అమ్మకాల పరిస్థితి చాలా సంతృప్తికరంగా వుందనీ పెట్టుబడులన్నీ ప్రతిఫలం ఆర్జించేవేననీ, అత్యవసరమైన వినియోగవస్తువులు, త్వరితంగా ప్రతిఫలం ఆర్జించిపెట్టే వస్తువుల అమ్మకాలకు హెచ్చు ప్రాధాన్యం యివ్వబడుతున్నదనీ స్పష్టమవుతుంది.

ప్రజల సౌకర్యార్థమూ సూపర్ బజారు నిర్వాహకుల సౌకర్యార్థమూ సూపర్ బజారు ఆవరణలో ప్రసిద్ధ బ్యాంకుశాఖ నొకదానిని ప్రారంభించడానికి సంప్రదింపులు జరుగుతున్నాయి.

## సర్వేజనా స్సుఖినోభవంతు

వినియోగాన్ని గురించిన సిద్ధాంతంలో "వినియోగదారు ప్రభువు" అనే విషయాన్ని చదివాము. మన దేశంలో సూపర్ బజార్లు ఆవిర్భవించిన తరువాత వినియోగదార్ల ఈ కలలు ఫలించడం చూస్తున్నాము. సూపర్ బజారు తనవినియోగదార్లలో ప్రతి ఒక్కరినీ "ప్రభువు"గా స్వీకరిస్తుంది. వినియోగదార్ల సహకారం లేనిదే సూపర్ బజారుకు అనతికాలంలో నే ఈవిధంగా అద్భుత విజయాలు సాధించడం సాధ్యమయ్యేదికాదు.

సహకారోద్యమం విజయం చాలా వరకు సమైక్యత, సేవా భావం, త్యాగశీలంపై ఆధారపడి వుంటుంది. ప్రైవేటు వర్తకంలోని అవాంఛనీయమైన ధోరణులను అరికట్టడానికి దీనివిజయం తోడ్పడుతుంది.

"సర్వేజనా స్సుఖినోభవంతు" అన్నది సూపర్ బజారు ఆదర్శం. ఈ సంస్థ ఉద్భవించినప్పటినుంచీ ఈ లక్ష్యంతోనే, ఈ ఆదర్శంతోనే కృషిచేస్తున్నది, వినియోగదారు శ్రేయస్సు, సూపర్ బజారు విజయవంతం కావడం పైననే ఆధారపడివున్నదనే విషయం సుస్పష్టమైనది. కాబట్టి దాని సఫలతకు దోహదం చేసి తద్వారా మేలు పొందడం మనందరి కర్తవ్యం.

## కొరత వస్తువుల సరఫరా

రెగ్యులర్ డిపార్టుమెంటలను ప్రారంభించడంతోపాటు కాలానుగుణమైన వస్తువులను విక్రయించడానికి కూడ గతంలో చర్యలు తీసుకున్నారు. ఈవిధంగా కల్పలత(సూపర్ బజారు)లో బాణసంచా, స్కూల్‌పుస్తకాలు, ఉన్ని వస్తువులు, వివాహానికి సంబంధించిన చీరెలు, దాశపల్లి మొదలైనవి విక్రయించడం జరిగింది. ఇటీవల కొత్త రెస్టారెంటులో 20 పైసలు, 30 పైసలకు సాంబారు అన్నం, పెరుగన్నం ప్యాకెట్లను చౌకగా విక్రయించడం ప్రారంభించారు బియ్యం విక్రయాన్ని కూడ చేపట్టారు కిరసనాయిల్ కొఱత ఏర్పడిన సందర్భంలో సభ్యులకు కిరసనాయిల్‌ను సరఫరా చేయడానికి వెంటనే ఏర్పాట్లు చేశారు. పండుగలు, పర్వదినాలలో ప్రజలకు రవ్వ, మైదా, నగపప్పువంటి కొఱతవస్తువులను సరఫరా చేయడానికి ప్రత్యేకమైన కౌంటర్లను ఏర్పాట్లు చేశారు. మత్స్యమాంసాదుల విక్రయానికి ఏర్పాట్లు చేయడానికి కృషిజరుగుతున్నది. సచివాలయంలోని ప్రభుత్వసిబ్బంది సౌకర్యార్థం అక్కడ బ్రాంచిని ఏర్పాటు చేశారు.

ప్రతిరోజూ సగటున రు 40,000/- ల విక్రయం జరుగుతున్నది. ఒకరోజు గరిష్ట విక్రయం రు 1. 02 లక్షలు, భారత దేశంలోని మరే సూపర్ బజారులోను లేనివిధంగా వినియోగదారులకు ఎక్కువరకాలవస్తువులను అందించి అనేక విధాలైన సౌకర్యాలను కల్పించడం జరుగుతున్నది.

ఏదైనా ఒక పద్ధతిని గానీ, కొత్త ఆదేశాలనుగానీ సత్ఫలితాల నిచ్చే విధంగా అమలు జరిపే సమయంలో సంబంధిత సిబ్బందిని మాత్రమేగాక సమాజంలోని ప్రజా ప్రతినిధులను, పత్రికా ప్రతినిధులను కూడ సంప్రదించి కూలంకషంగా చర్చించడం జరుగుతున్నది.

వినియోగదారుల సంక్షేమమే ప్రధానలక్ష్యంగా, సూపర్ బజార్ విధానాలను కార్యక్రమాలను రూపొందించడం జరుగుతున్నది. ఈ విధానాల ఫలితంగానే ప్రజల సహాయసహకారాలు అమోఘంగాలభించాయి ఏదోఒక నిశ్చితమైన ధోరణిలో సూపర్ బజారును నిర్వహించడమే విధానంకాదు. ప్రజాభిప్రాయానికి అనుగుణంగా ప్రజల అవసరాలను దృష్టిలో ఉంచుకొని సూపర్ బజారు విధానాలను రూపొందించడంజరుగుతున్నది. ఈ విధంగా సూపర్ బజారు నిర్వహణ అందరి మన్ననలను అందుకున్నది. పత్రికలవారు ఎల్లప్పుడు తమ సహాయసహకారాలు అందజేస్తూ యీకొత్తరంగంలోని అంశాలకు అత్యధిక ప్రచారం యిస్తున్నారు. సూపర్ బజారు కొంగ్రొత్త శక్తితో దినదినాభివృద్ధి చెందుతున్నది.



భారతదేశంలో స్వీడిష్ రాయబారి శ్రీ గున్నర్ హాక్ ఫేహార్ సతీసమేతంగా హైదరాబాదు మహిళల చేతి పరిశ్రమల సంస్థను సందర్శించారు



చేతిపరిశ్రమల సంస్థలో మహిళలు రకరకాల ఆటవస్తువులను, బొమ్మలను తయారు చేస్తున్న దృశ్యం

# హైదరాబాదులో మహిళల చేతిపరిశ్రమల సంస్థ

టి. రాజగోపాలన్

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలోని హైదరాబాదు రాజధాని నగరంలో 18_30 సంవత్సరాలమధ్య వయసుగల మహిళలకు వృత్తి కల్పించి, ఆర్థిక ప్రయోజనం చేకూర్చే నిమిత్తం ఏర్పరచబడిన ప్రాంతీయ చేతిపనుల శిక్షణ సంస్థ అపూర్వమైనది. అఖిల భారత చేతిపరిశ్రమల బోర్డుసహాయ సహకారాలతో ఆంధ్ర మహిళా సభ యీ సంస్థను నిర్వహిస్తున్నది. ఈ సంస్థలో ప్రవేశానికి మెట్రిక్యులేషన్, దానికి సమానమైన విద్యను కనీస విద్యార్హతగా నిర్ణయించారు. ఈ సంస్థ ఉ॥ 11.00 గంటల నుండి సా॥ 4.00 గంటల వరకు పనిచేస్తుంది.

దక్షిణాదిలోని నాలుగు రాష్ట్రాలనుండి (ఆంధ్రప్రదేశ్, తమిళనాడ్, మైసూరు, కేరళ) వచ్చిన 66 మంది విద్యార్థినులు బొమ్మల తయారీ, బెత్తపుపని, చర్మంతోచేసే విలాస వస్తువులు, పుస్తకాల బైండింగు, వస్త్రాల అద్దకంవంటి విషయాలను నేర్చుకుంటున్నారు. ఆంధ్రప్రదేశ్‌లోని కృష్ణాజిల్లా హెడ్ క్వార్టర్స్ అయిన మచిలీపట్టణం నుండి కలంకారీ అద్దకాల నిపుణుడు, బెంగుళూరులోని చెక్కబొమ్మల తయారీ నిపుణుడు, బొంబాయికి చెందిన ఫ్రేము పనులు, చర్మపు పర్సుల తయారీ నిపుణుడు యిక్కడ శిక్షణ యిస్తున్నారు.

చెక్కబొమ్మల తయారీ విభాగంలో 14 మంది విద్యార్థినులు శిక్షణ పొందుతున్నారు. వారు మృదువైనచెక్కతో శ్రీ బి.వి. వర్మ నేతృత్వంలో రంగురంగుల బొమ్మలుతయారు చేస్తున్నారు. చెక్కతో ఏనుగులు, ఒంటెలు, వివిధరకాల పక్షులు, కూరగాయలు, ఫలాలు తదితరవస్తువుల బొమ్మలు యిక్కడ తయారవుతాయి. ఈ శిక్షణ కోర్సు ఒకటిన్నర సంవత్సరం ఉంటుంది. ప్రతి విద్యార్థినికి రు. 80/_ల స్టయిఫండు యిస్తారు.

వెదురు బెత్తం వస్తువుల తయారీ విభాగంలో 25 మంది విద్యార్థినులు శిక్షణ పొందుతున్నారు. శ్రీమతి షరుపున్నీసా బేగం నేతృత్వంలో వారు వెదురు బెత్తంతో నేత్రపర్వమైన పూల కుండీలు, దినవెచ్చాల సంచులు, చేతిసంచులు, గోడకు అమర్చే పూలకుండీలు, గోడ క్యాలండర్లు మొదలైన వినియోగ వస్తువులను తయారు చేస్తున్నారు. బెత్తపు ఫర్నీచరువంటి వాటి రిపేరు పనులు కూడచేస్తారు

చర్మకారీ వస్తువుల తయారీ విభాగంలో ఐదుగురు విద్యార్థినులు శిక్షణ పొందుతున్నారు శ్రీమతి ఇ. సుందరమ్మ పర్యవేక్షణలో వారు మంచిమంచి చర్మకారీ వస్తువులను తయారు చేస్తున్నారు. సీతాకోక చిలుకల ఆకారంలో ఫోటో ఆల్బములు, మార్కెటు సంచులు, మనీ పర్సులు, గడియారాలు కీలాలు, కత్తెరల కేసులు, బెల్టులు మొదలైనవి తయారు చేస్తారు

పుస్తకాల బైండింగు తయారీ విభాగంకూడ సందర్శకులను ఎంతగానో ఆకర్షిస్తుంది అందులో శ్రీ ఎస్. పి. విఠల్ పర్యవేక్ష

ణంలో 9 మంది విద్యార్థినులు శిక్షణ పొందుతున్నారు. లెదర్ పుస్తకాల లెదర్ బైండింగ్, ఆటోగ్రాఫ్ పుస్తకాలు, ఆల్బములు, ఎక్సర్‌సైజ్ పుస్తకాలు, బైండింగ్, కార్డ్‌బోర్డుతో చేసేవస్తువులు, ఫైళ్లు, లెటర్ ర్యాకులు, లెటరు ప్యాడులు, చిత్తు కాగితాలు వేసే బుట్టలు, చేతిసంచులు, ఆభరణాల పెట్టెలు, గడియారాలు, పెన్నుల కేసులు, చదరంగం బోర్డులు మొదలైనవి తయారు చేస్తారు.

వస్త్రాల అద్దకంవిభాగంలో 12 మంది విద్యార్థినులు శిక్షణ పొందుతున్నారు. ఈ విభాగం శిక్షకులు శ్రీ బి. మైత్రం అద్దకం విభాగంలో బెడ్‌షీట్లు, టేబిల్ కవర్లు, ట్రేకవర్లు, కర్టెనులు మొదలైన వాటిపై అద్దకం పని నిర్వహిస్తున్నారు. అద్దకంతోపాటు కలంకారీ పనికూడ చేస్తుంటారు. వస్త్రాలపై చేతితో వివిధరీతులలో అనేక భంగిమలలో పెయింటింగులు వేయడం ముగ్ధులను చేస్తుంది. ఈ సంస్థ తయారుచేసిన ప్రత్యేకమైన పెన్నులతో చీరలు, కర్టెనులపై వివిధ డిజైనులలో పెయింటింగులు వేస్తుంటారు

ఈ సంస్థలో టైలరింగ్ విభాగంకూడ ఉంది. ప్రతిరోజు మూడు గంటలు యీ విభాగం పనిచేస్తుంది. సంస్థకుచెందని స్త్రీలు, నెలకు రు. 5/- ల మామూలు ఫీజు చెల్లించి యిక్కడ కుట్టుపని నేర్చుకుంటారు.

శిక్షణ పూర్తి అయిన తర్వాత అఖిల భారత చేతి పరిశ్రమల బోర్డు ఛీఫ్ ఎగ్జిక్యూటివ్ అధికారి ఆదేశాలమేరకు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ లఘు పరిశ్రమల శాఖ అధనపు డైరెక్టరు పరీక్షలు నిర్వహిస్తారు ఉత్తీర్ణులైన విద్యార్థినులకు క్రాఫ్ట్స్‌మెన్ షిప్ సర్టిఫికెట్లు యిస్తారు.

ఈ సంస్థ సూపరింటెండెంటు గౌ॥ డైరెక్టరు (చేతిపరిశ్రమల కార్యక్రమాలు) శ్రీ జి. జి అయిరే తీవ్రకృషి ఫలితంగా యీసంస్థ దినదినాభివృద్ధిచెందుతున్నది.

జంటనగరాలను దర్శించే దేశీయులు, విదేశీయులను యీ సంస్థ ఎంతగానో ఆకర్షిస్తున్నది •

---

**యువత-నవత**

## గ్రామ ప్రాంతాలలో యువజనోద్యమం

ప్రస్తుతం తీవ్రతర వ్యవసాయాభివృద్ధి కార్యక్రమాలకు హెచ్చు ప్రాధాన్యం లభిస్తున్న దృష్ట్యానూ, సమాజాభివృద్ధి కార్యక్రమాలను వినూత్న విధానంలో అమలు జరుపుతున్న దృష్ట్యానూ గ్రామాలలో యువకులు గురుతరమైనపాత్ర నిర్వహించవలసి వుందని గ్రామ ప్రాంతాలలోని యువజన క్లబ్బులకు సంబంధించిన ఫలిత పరిశీలన నివేదికలో పేర్కొనబడింది. బ్లాకు అధికార్లూ, పంచాయతీరాజ్ సంస్థల అధికార్లూ యువకుల శక్తి సామర్థ్యాలు నిర్మాణాత్మకమైన అభివృద్ధి కార్యకలాపాలకు వినియోగమయ్యేటట్లుగా చర్యలు తీసుకోవాలని కూడా ఈ నివేదికలో సూచించారు.

ఈ నివేదికను ప్రణాళికా సంఘానికి సంబంధించిన కార్యక్రమాల మదింపు సంఘం 1966వ సంవత్సరంలో జరిపిన పరిశీలనల ఆధారంగా రూపొందించింది. రాష్ట్ర ప్రభుత్వాలతో సంప్రదించి రాష్ట్రానికి ఒకటి చొప్పున మొత్తం 11 యువజన క్లబ్బులను ఎన్నికచేసి వాటి కార్యకలాపాలను పరిశీలించి ఈ సంఘం వారు 200 పుటల నివేదిక సమర్పించారు

గ్రామ ప్రాంతాలలో యువజన క్లబ్బుల ఉద్యమాన్ని శక్తివంతం చేసేనిమిత్తం రాష్ట్రస్థాయిలో ఖచ్చితమైన ఒక విధానాన్ని రూపొందించాలని కూడా ఈ నివేదికలో సూచింపబడింది. గ్రామ ప్రాంతాలలోని యువజనులు సుసంఘటితమైన విధానంలో కృషి చేయడానికి వీలుగా వారికి తగువిధంగా తోడ్పడడమే యువజన క్లబ్బు కార్యక్రమం లక్ష్యం.

### సమాన అభివృద్ధి

మైసూరు, ఒరిస్సా రాష్ట్రాల నుంచి ఎన్నికచేసిన క్లబ్బులు తమ కృషిలో అమోఘమైన విజయం సాధించినట్లు కూడా ఈ నివేదికలో వెల్లడించబడింది.

ఇవి ఆర్థిక కార్యకలాపాలు, సాంఘిక కార్యకలాపాలు రెండింటికీ సమాన ప్రాధాన్యం యిచ్చాయి. వీటికి సమర్థవంతమైన నాయకత్వం లభించడంతో పాటుగా బ్లాకు, పంచాయతీ సంస్థల నుండికూడా సహాయ సహకారాలు బాగా లభించాయి.

కోళ్ళపెంపకం, ఉమ్మడి వ్యవసాయం, పెరటితోటల అభివృద్ధి మొదలైన ఆర్థికాభివృద్ధి కార్యక్రమాలూ, సాహిత్య కేంద్రాలు, క్రీడలు, ఆటల పోటీలు, భజనలు, కీర్తనలు మొదలైన విద్యా సాంస్కృతిక కార్యక్రమాలు; పాఠశాలలు, కాలువలు, రోడ్ల నిర్మాణం మొదలైన సామాజిక కార్యక్రమాలు—ఇవి తాము ఎన్నుకున్న పదకొండు యువజన క్లబ్బుల కార్యకలాపాలలో చేరివున్నట్లు కూడా నివేదికలో పేర్కొన్నారు. ప్రయోజనాత్మకమైన భారీ కార్యక్రమాల పట్ల క్లబ్ సభ్యులు ఎక్కువ ఆసక్తి ప్రదర్శించినట్లు నివేదికలో వెల్లడించబడింది ప్రాజెక్టుల ఎన్నిక సక్రమంగా జరగని కొన్ని సందర్భాలలో క్లబ్బువారు ఉత్సాహం ప్రదర్శించినప్పటికీ అవి విజయవంతం కానట్లు నివేదికలోపేర్కొనబడింది. స్పష్టమైన కార్యక్రమం లేకపోవడం యువజన క్లబ్బులు పనిచేయడంలో ప్రధాన అవరోధంగా వుంటున్నదని కూడా నివేదిక తెలుపుతున్నది. బ్లాకు, పంచాయతీ, యితర సంస్థల సహాయ సహకారాలు లభించినప్పుడు యువజన క్లబ్బులు విజయవంతంగా నిర్వహించబడ్డాయని నివేదికలో చెప్పారు. యువజన క్లబ్బులు విజయవంతం కావడానికి పైన తెల్పిన సంస్థల సహాయమే ప్రధాన కారణంగా భావించడుతున్నది. కొన్ని సందర్భాలలో సంపూర్ణ బాధ్యతలు లేకుండా పాల్గొనే వివిధ సంస్థల కారణంగా క్లబ్ కార్యక్రమాలలో అంతరాయం ఏర్పడుతున్నదని నివేదికలో పేర్కొన్నారు. యువజన కార్యక్రమాలను సమీకృతపరచి అమలు జరిపే పూర్తి బాధ్యతను రాష్ట్ర స్థాయిలో ఒకే ఒక సంస్థకు అప్పగించడం భావ్యమవుతుంది.

## సభ్యత్వం

1965_66లో క్లబ్బులలో సగటున 38 మంది సభ్యులు ఉన్నారు. 4 క్లబ్బులలో 50 మందికిపైగా సభ్యులు ఉన్నారు. గ్రామాలలోని అన్ని కులాలు, అన్ని వృత్తులవారి నుండి సమాన నిష్పత్తిలో సభ్యులను చేర్చుకోవడం జరగలేదు. వ్యవసాయ వృత్తి గల ధనిక కుటుంబాలవారు వాటిపై ఆధిపత్యం వహిస్తున్నారు.

విస్తృత ప్రాతిపదికపై ఉదారంగా విద్యా వ్యాప్తి జరిగినప్పుడు మాత్రమే క్లబ్బులలో అన్ని వర్గాలు, అన్ని కులాలకు చెందినవారిని సభ్యులుగా చేర్చి సభ్యుల సంఖ్యను ఎక్కువచేసే సమస్యను పరిష్కరించడానికి అవకాశం వుంటుందని నివేదికలో పేర్కొన్నారు.

కొన్ని రాష్ట్రాలలో సాంఘిక విద్యా కార్యకర్తల ఉద్యోగాలను తీసివేయాలనిగానీ, వాటిని పంచాయతీ అధికారులుగా మార్చాలనిగానీ నిర్ణయించడం యువజన, మహిళా కార్యక్రమాలలో అశ్రద్ధ వహించడంగా భావించబడుతున్నదని నివేదిక పేర్కొన్నది. ఉన్నత కులాలవారినీ, బడుగు కులాలవారినీ, ధనిక, పేద వర్గాలవారినీ సమీకరించి వారిలో నూతన భావాలను అంకురింపజేసి వారి ఆర్థిక, సాంఘిక సంక్షేమానికి కలసికట్టుగా కృషిచేసే విధంగా ఆయత్తపరచడంలో సాంఘిక విద్యా కార్యకర్త తోడ్పడ్తాడు.

## నాయకత్వంలో శిక్షణ

యువజనక్లబ్ కార్యక్రమాలను తరచుగా సమీక్షించి వారికి తోడ్పడడానికి వీలుగా యువజన క్లబ్బులు తమ కార్యక్రమాల రికార్డులను నిర్వహించాల్సిన అవసరాన్ని గూర్చి నివేదికలో నొక్కిచెప్పారు. రాష్ట్రస్థాయిలో యువజనక్లబ్ సభ్యులకు నాయకత్వంలోను, వ్యవస్థాగత విషయాలలోను క్లబ్బు కార్యక్రమాల విషయాలలోను శిక్షణ యివ్వాలి

యువజనులకు శిక్షణ, ప్రోత్సాహం యివ్వడంపై గ్రామీణ ఆర్థిక సాంఘిక అభివృద్ధి ఆధారపడి ఉందని నివేదికలో స్పష్టం చేశారు ఈ కృషిలో సాధారణ విద్య, వ్యవసాయిక విద్య వ్యాప్తి ప్రారంభదశ అయినప్పటికీ స్థానిక ప్రజాస్వామిక సంస్థలను ఏర్పాటుచేసి నిర్వహించడంలోను, వైయక్తిక, లేక సమిష్టి ప్రాతిపదికపై ఆర్థికంగా లాభించే పనులు చేపట్టటంలోను యువజనులు ఎక్కువగా పాల్గొనే విధంగా చేయడం చాలా అవసరం

అనేక రాష్ట్రాలలో పౌష్టికాహార కార్యక్రమాలను విజయవంతంగా నిర్వహించ బడడానికి కారణం యువతీ యువకులు ఉత్సాహంతో యీ కార్యక్రమాలలో పాల్గొనడం వల్లనేనని నివేదికలో వివరించారు

విజయవంతంగా నిర్వహించబడిన క్లబ్బులకు అవార్డులు, ప్రోత్సాహక బహుమతులు యివ్వాలనీ, దానివల్ల వివిధ ప్రాంతాలలోని క్లబ్బులమధ్య ఆరోగ్యకరమైన పోటీ ఏర్పడుతుందనీ నివేదికలో సిఫార్సు చేశారు.



# సాంఘిక సంక్షేమం

## అస్పృశ్యత నివారణ విషయాల పరిశీలనా సంఘ కార్యనిర్వాహక కాలం పొడిగింపు

అస్పృశ్యత నివారణ, షెడ్యూల్డ్ కులాల ఆర్థిక, విద్యాభివృద్ధి విషయాల పరిశీలన సంఘ కార్యనిర్వాహక కాలం జూలై 15వ తేదీతో పూర్తవుతుండగా భారత ప్రభుత్వం ఆ కాలాన్ని అక్టోబరు 31వ తేదీ వరకు పొడిగించింది

ఈ సంఘాన్ని 1965 ఏప్రిల్ నెలలో యేర్పాటు చేశారు. ఈ సంఘం తన నివేదికను ఆరు నెలలలో సమర్పించవలసి వున్నది. 1965 డిశంబరు నెలలో తాత్కాలిక నివేదిక సమర్పింపబడింది.

శ్రీ ఎల్. ఎలయపెరుమాళ్ ఈ సంఘానికి అధ్యక్షుడుగా నియమింపబడినారు పార్లమెంటు సభ్యులు శ్రీ బి. కె. గైక్వాడ్, శ్రీ ఎస్. ఎం. సిద్దియా, శ్రీ సి. దాస్, న్యాయశాఖకు చెందిన శ్రీ ఆర్. అచ్యుతన్, శ్రీ వి. వి. వజె, సంఘ సేవకుడు శ్రీ నారాయణ్ దిన్ ప్రభృతులు దీనిలో సభ్యులు.

## ప్రభుత్వోద్యోగాలకు షెడ్యూలు కులాల, తెగల అభ్యర్థుల నియామకం

భారత ప్రభుత్వ కార్యాలయాలూ, శాఖలూ వేటిలోనైనా గాని, ప్రభుత్వ యాజమాన్యం క్రిందగల, లేదా అధీనంలోగల సంస్థల్లోగానీ, ఉద్యోగాలకు షెడ్యూల్డు కులాలు, తెగల వారిని నియమించే విషయంలో పని యేవిధంగా జరుగు తున్నదో సమీక్షిస్తూ ఉండటానికై ఒక ఉన్నతాధికార సంఘాన్ని భారత ప్రభుత్వం నియమించింది. దేశ వ్యవహారాల మంత్రి ఈ సంఘానికి అధ్యక్షుడు. కేంద్ర పాలిత ప్రాంతాలలో ఉద్యోగాలకు సంబంధించిన వ్యవహారం కూడా ఈ సంఘం చూస్తుంది.

వేర్వేరు సర్వీసులలోకి షెడ్యూల్డు కులాలు, తెగల అభ్యర్థులను తీసుకునే విషయంలో పని ఏవిధంగా జరుగుతూ ఉన్నదో సమీక్షిస్తూ ఉండేందుకు కేంద్రంలోనూ, రాష్ట్రాలలోనూ ఒక ప్రత్యేక సంఘంఅంటూ ఏర్పడాలి. ఈ నియామకాల సంగతి గమనిస్తూఉండి ఆ సంఘానికి సంగతి సందర్భాలను ఎరుకపరుస్తూ ఉండేందుకై ప్రతి రాష్ట్రంలోనూ స్పెషల్ ఆఫీసర్లు ఉండాలి అంటూ లోగడ జరిగిన నిర్ణయాన్ని పురస్కరించుకుని ఇప్పుడీ ఉన్నతాధికార సంఘం ఏర్పాటయింది. ఈ సంఘం జరిపే సమావేశాలన్నిటికి షెడ్యూల్డు కులాల, తెగల వ్యవహారాల కమీషనర్‌ను ఆహ్వానిస్తూ ఉంటారు

# ఆర్థికాభివృద్ధికి దోహదకారి కుటుంబ నియంత్రణ

ఎస్. ఎస్. రావు



ఆంధ్రప్రదేశ్ గవర్నరు శ్రీ ఖండూభాయ్ దేశాయ్ జూలై 11న షాద్‌నగర్‌లోని కుటుంబ నియంత్రణ శిబిరాన్ని సందర్శించారు

మనదేశంలో అతివేగంగా పెరిగిపోతున్న జనసంఖ్యను తగ్గించటమన్నది మనలను ఎదుర్కొంటున్న బృహత్తర సమస్యలలో ఒకటని అందరికి తెలిసినవిషయమే: ఆదాయం, వినియోగం తక్కువస్థాయిల్లో వున్నప్పుడు హెచ్చు జనాభావృద్ధి కారణంగా ఆర్థికాభివృద్ధియొక్క గమనం చాలవరకు మందగిస్తుంది. జనాభా హెచ్చటంతో వినియోగపు అవసరాలు అధికం అవుతాయి తలసరి ఆదాయానికి, సంబంధించిన దీర్ఘకాల లక్ష్యాలను సాధించాలంటే, పెట్టుబడి సమీకరణ కృషి అధికం కావాలి. సేవలు ఎక్కువ ఉండాలి. జనాభా పెరుగుదల విషయాలు, కుటుంబ నియంత్రణ విధానాలపట్ల దృక్పథం బాగామారి సత్ఫలితాలు విస్తారంగా లభించే వాతావరణం ఏర్పడాలి జనాభావృద్ధి వేగాన్ని అదుపులో పెట్టే కృషి ఆర్థిక అభివృద్ధి వ్యూహంలో ఒకముఖ్య అంశంగా పరిగణించి తీరాలి.

కుటుంబ నియంత్రణ కార్యక్రమం చిక్కులతో కూడి వున్నది. సత్ఫలితాలకు కొంతకాలం పట్టక తప్పదు మొదటి ప్రణాళికలో స్వల్పస్థాయిలో ఆరంభమై ఇప్పుడది విస్తరించింది. ఈ కార్యక్రమాన్ని విజయవంతం చేయటానికి మన ప్రభుత్వం సకల చర్యలు తీసుకొంటున్నది. ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలకు అనుబంధంగా అనేక గ్రామీణ కుటుంబ నియంత్రణ క్లినిక్కులు ప్రారంభించడానికితోడు రాష్ట్రంలో జిల్లాకొకటిచొప్పున సంచార శస్త్ర చికిత్స యూనిట్లుకూడా మంజూరు చేయబడినాయి. గర్భనిరోధక లూపులను అమర్చే కార్యక్రమాన్ని అమలుజరపటంకోసం ఆస్పత్రులద్వారా తగు సౌకర్యాలుకూడా కలుగచేయబడ్డాయి. ఈ క్రింది విషయాలకు ప్రాముఖ్యం చూపబడుతుంది—

విస్తారమైన కుటుంబ నియంత్రణ కార్యక్రమానికి తగిన సాంఘిక వాతావరణాన్ని చేకూర్చటానికి విద్యావ్యాప్తి కార్యక్రమాన్ని తీవ్రతరం చేయటం.

కుటుంబనియంత్రణ కార్యక్రమాలను మామూలుగా ఆరోగ్యవంతులతో జోడించటం.

వైద్య ఆరోగ్య కేంద్రాల ద్వారా స్టెరిలైజేషన్ వసతులు కాంట్రసెప్టివ్‌ల సప్లయి వసతులు వగైరా.

వైద్య కళాశాలలో, ఇతర బోధనా సంస్థలలో శిక్షణ కార్యక్రమాల అభివృద్ధి.

సాధ్యమైనంత విస్తారంగా స్థానిక స్వచ్ఛంద నాయకత్వాన్ని కుటుంబ నియంత్రణ ఉద్యమానికి వినియోగించటం.

ఈ కార్యక్రమాలను బాగా ప్రోత్సహించి అభివృద్ధి పరచుటకు ప్రభుత్వం ఎంతగానో కృషి చేస్తున్నది. మన రాజధానిలో 24 శాఖలు నిరంతరం ఈ కార్యక్రమాన్ని నడిపిస్తున్నాయని, ఆకాశవాణిలో కుటుంబ నియంత్రణ కొరకు ఒక ప్రత్యేక విభాగం ఏర్పాటు చేయాలని కోరుతూ శ్రీ త్యాగి వెల్లడించారు అయితే దీని మీద కొన్ని పత్రికలు, కొంత మంది వ్యక్తులు విమర్శలు చేస్తున్నారు. ఈ పద్ధతి కొన్ని మతాలకు విరుద్ధమని, అపవిత్రమని, హిందూ జాతి నశించి పోతుందని అంటున్నారు. ఈ పద్ధతి ఏ మతానికి సంబంధించినది కాదు. అందరికీ సంబంధించిన విషయం. నేడు మన దేశంలో దినదినాభివృద్ధి చెందుతున్న జనాభాకు ఆహార వసతి సదుపాయాలు కల్పించటం చాలా పెద్ద సమస్య. అసలే తిండి గింజల కటకటతో, అధిక ధరలతో పీడించబడే మధ్య తరగతి కుటుంబీకులు, కుటుంబ నియంత్రణ పద్ధతి అవలంభించకపోతే, ముందు ముందు ఎన్ని అవస్థలు పడాలో ఆలోచించాలి కుటుంబం పరిమితంగా వుంటే, ఆరోగ్య, వైద్య సదుపాయాలే, విద్యా సౌకర్యాలు పిల్లలకు కలిగించటం సులభంగా వుంటుంది. ఆర్థిక ఇబ్బందులు తొలగిపోతవి. ఆరోగ్యవంతంగా సుఖంగావుంటే దేశం సుఖశాంతులతో తులతూగుతుంది నేటి జనాభా పెరుగుదల రేటును తగ్గించడానికి అఖిల భారత స్థాయిలో నియంత్రణ ప్రణాళికను ప్రభుత్వం రూపొందిస్తున్నది ఇందుకై 17 వేల కేంద్రాలు పని చేస్తున్నవి. దేశం మొత్తం మీద ఆరు లక్షల మంది స్త్రీలు లూపులు వాడుతున్నట్లు తెలుస్తున్నది గ్రామాలలో నూటికి 25 మంది, నగరాలలో నూటికి 50 మంది లూపులు ధరించే కార్యక్రమం విజయవంతంగా కొనసాగితే ఈనాడు జటిలంగా మారిన ఆహార సమస్యను తేలిగ్గా పరిష్కరించుకొనుటేగాక, ఆహార ధాన్యాల నిమిత్తం ఇతర దేశాల మీద ఆధారపడే అగత్యం వుండదు. హిందువులు, క్రైస్తవులు, మహమ్మదీయులు పరస్పర

సహకారంతో ప్రభుత్వం తలపెట్టిన ఈ విప్లవ కార్యక్రమానికి ఇతోధికంగా తోడ్పడి జయప్రదం చేయవలసిన బాధ్యతవున్నది. ఈ కుటుంబ నియంత్రణ పద్ధతి ఒక్క మన దేశంలోనేకాదు, ఇతర దేశాలలో కూడా వున్నది. ఈ సమస్యను మతానికి, సాంప్రదాయానికి ముడిపెట్టరాదు. నవభారత నిర్మాణానికి అందరు కృషి సాగించాలి.

రెండో ప్రపంచ సంగ్రామం తరువాత జపాన్ దేశంలో జనాభా విపరీతంగా పెరిగింది. ఈ అధిక జనాభాను అరికట్టుటకు కుటుంబ నియంత్రణను ఒక ఉద్యమంగా సాగించారు. 1947 సం॥ తదుపరి ఒక దశాబ్దంలో జనాభాను సగానికి తగ్గించగలిగారు. 1948 సం॥లో ఆ దేశంలో జనసంఖ్య 38.7 శాతం వుంటే, 1958 సం॥ నాటికల్లా 18 1 శాతంకు, 1963 సం॥నకు 17 5 శాతంకు తగ్గించ గల్గారు. జపాన్ దేశంవలె మనం కూడా అభివృద్ధిని సాధించాలంటే ఎక్కువగా కృషి చేయవలసిన అగత్యం ఉన్నదని వేరే చెప్పనవసరంలేదు.

లూపులు కనిపెట్టిన అమెరికన్ డాక్టర్ జాన్ లిప్స్ అంతర్జాతీయ నిపుణులు. మన దేశంలో పెరుగుతున్న జనాభాను పరిశీలించి ఒక నివేదికను సమర్పించారు. అందులో డాక్టర్ జాన్ ఈ క్రింది విధంగా తెల్పారు.

“నవభారత దేశంలో ఎక్కువ కొరతగానున్నవి రవాణా, వైద్య, విదేశీ మారక ద్రవ్యం కాదు. ఒక 10 సం॥లలో భారత దేశం 5,200 మిలియన్ల జనాభాను పెంచినట్లయితే, భారత దేశం గానీ, దాని మిత్రదేశాలు గానీ వారిని పోషించటం సాధ్యం కాదు.” దీనినిబట్టి మన దేశంలో కుటుంబ నియంత్రణ ఆవశ్యకత ఎంతగా వున్నదో విశదంగా తెలియుచున్నది.

జీవన ప్రమాణం శక్తివంతంగా వుండాలన్నా, ఆహారపు కొరత తొలగించాలన్నా, నిరుద్యోగం నిర్మూలించాలన్నా, అవిద్య, అజ్ఞానం, దారిద్ర్యం రూపుమాపాలన్నా, ఆర్థికాభివృద్ధి ఆర్థిక ప్రణాళికమీద, కుటుంబ నియంత్రణమీద ఆధారపడి వుంటుంది. ఎంత త్వరలో వేగంగా పెరుగుతున్న జనాభాను అరికట్ట గలిగితే అంత త్వరలో ఆర్థిక స్వాతంత్ర్యాన్ని సాధించగలుగుతాం. కుటుంబ నియంత్రణ కార్యక్రమాన్ని విజయవంతంగా కొనసాగించకపోతే మనం సంక్షేమ రాజ్యాన్ని సాధించలేము

ప్రజల జీవన స్థాయిని మెరుగు పరచుటకు, దారిద్ర్యం, నిరుద్యోగం తొలగించి ప్రజల జీవితాన్ని సుఖమయం చేయుటకు, ఆర్థిక ప్రగతిని సాధించుటకు, ప్రభుత్వం అనేక అభివృద్ధి పథకాలను ప్రవేశపెట్టి కృషి సాగిస్తున్నది. ఇట్టి తరుణంలో మనమంతా గతంలో స్వాతంత్ర్య పోరాటంలో ఏకత్రాటిమీద నడిచిన విధంగా, సమైక్యతతో కృషి చేసి దేశాన్ని ప్రగతి పథంలో నిలిపి ఐశ్వర్య విలసితం చేద్దాం. ×

# స్వాతంత్ర్యానంతర ప్రగతి

| | 1951 | 1965 |
|---|---|---|
| **ఇంజనీరింగు** | | |
| డిప్లొమా సంస్థలు | 86 | 300 |
| డిగ్రీ సంస్థలు | 49 | 135 |
| డిప్లొమా తరగతులలో విద్యార్థులు | 5,903 | 44,000 |
| డిగ్రీ తరగతులలో విద్యార్థులు | 4 119 | 24,000 |
| **వైద్యం** | | |
| కళాశాలలు | 30 | 87 |
| విద్యార్థులు | 2,500 | 10,625 |

| | | |
|---|---|---|
| **విద్య** | | |
| ఉపాధ్యాయులు | 7½ లక్షలు | 20 లక్షలు |
| ట్రెయినింగు పొందిన ఉపాధ్యాయులు | 4½ లక్షలు | 14 లక్షలు |
| **వ్యవసాయం** | | |
| కళాశాలలు | 19 | 66 |
| విద్యార్థులు | 1,060 | 8,935 |
| **పశువైద్యం** | | |
| కళాశాలలు | 9 | 19 |
| విద్యార్థులు | 434 | 1,319 |

# బుట్టాయగూడెం గిరిజనబ్లాకు ప్రగతి

పి. రామకృష్ణారావు

ప్రదేశ్యక్రితం అన్నివిధాల వెనుకబడిన ప్రాంతంగానూ, అనారోగ్యకరమైన ప్రదేశంగానూ పరిగణించబడిన పశ్చిమగోదావరి జిల్లా, పోలవరం తాలూకాలోని బుట్టాయగూడెం ఏజన్సీ ప్రాంతం యీనాడు వివిధ రంగాలలో ఎంతగానో అభివృద్ధి చెందింది. పంచాయత్ రాజ్ వ్యవస్థ ఏర్పడి ప్రణాళికలను అమలు జరుపుతున్న ఫలితంగా యీ ప్రాంతం క్రమక్రమంగా ప్రగతిని సాధిస్తున్నది.

1959 ఏప్రిల్ 1వ తేదీన రెండవదశ బ్లాకుగా ఏర్పడిన బుట్టాయగూడెం బ్లాకు 1964 ఏప్రిల్ 1 వ తేదీనుండి గిరిజన అభివృద్ధి బ్లాకుగా మార్చబడింది.

ఈ బ్లాకు విస్తీర్ణం 102.5 చ. మైళ్ళు. జనాభా 25999 మంది ఈ బ్లాకులో 13482 మంది గిరిజనులు (కోయలు, కొండరెడ్లు, సుగాలీలు) 2832 మంది షెడ్యూలు కులాలవారు ఉన్నారు. జనాభాలో 52 శాతం గిరిజనులు. కోయజాతికి చెందిన వ్యక్తే బ్లాకు ప్రెసిడెంటుగా పనిచేస్తున్నాడు. ఈబ్లాకులో 41 రెవిన్యూ గ్రామాలు, 22 సరిహద్దు గ్రామాలతో కూడిన 22 పంచాయతులు ఉన్నాయి.

ఇక్కడి గిరిజనులు, గిరిజనేతరులకు వ్యవసాయం ప్రధాన వృత్తి. కొండ చరియలనుండి 22 చిన్నవాగుల ద్వారా నీటిపారుదల సౌకర్యం, మంచినీటి సంఫరా జరుగుతున్నది. భూగర్భ జలాధారాలను కూడా వినియోగించుకునే ప్రయత్నం జరుగుతున్నది. దాదాపు 26,759 ఎకరాలలో సేద్యం జరుగుతున్నది. 6450 ఎకరాల విస్తీర్ణం అటవీ ప్రాంతం వ్యవసాయం. వర్షాలపై ఆధారపడి ఉంది. వరి, జొన్న, రాగులు, మిర్చి, పొగాకు, కాయ ధాన్యాలు ముఖ్యమైన పంటలు.

గిరిజనులు ఆధునిక సేద్యపు విధానాలను అనుసరించడానికి బ్లాకు వ్యవసాయ విస్తరణ సిబ్బంది శిక్షణ యిస్తున్నారు. 500 సంచుల మేలిరకం విత్తనాలను పంపిణీ చేశారు. గ్రామాలన్నిటికీ సహకార సంస్థల ద్వారా రసాయన ఎరువులు, ఆధునిక వ్యవసాయ పరికరాలు అందజేశారు, సస్యరక్షణ చర్యలు తీసుకున్నారు. 1000 కమతాలలో ఆధునిక పద్ధతుల క్షేత్ర ప్రదర్శనలను నిర్వహించారు. 30,000 పండ్ల మొక్కలను పంపిణీ చేశారు. 81 సబ్సిడీ బావులు, 17 ఆయిల్ ఇంజనులు మంజూరు చేశారు, 48 మంచినీటిబావులను త్రవ్వారు. పెక్కు గ్రామాలకు రక్షిత మంచినీటి సౌకర్యం కల్పించబడింది.

బ్లాకు అధీనంలో 27 చెరువులు ఉన్నాయి. వాటిమరమ్మతు, ర్వహణలకు రు. 65000/- లు ఖర్చుచేశారు. 5 శాతంసబ్సిడీపై ఆబోతులు, గొఱ్ఱెపొట్టేళ్ళు వంటి పశుసంతతిని సరఫరాచేశారు. ప్ర

బ్లాకులోని అన్ని గ్రామాల అవసరాలను తీర్చడానికి 10 సహకార సంఘాలు పనిచేస్తున్నాయి. గిరిజనుల అభివృద్ధికి జీలుగు మిల్లిలో వ్యవసాయభూమి కాలనైజేషన్ సంఘం నిర్వహించబడుతున్నది.

ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలద్వారా బుట్టాయగూడెం బ్లాకులో వైద్య సౌకర్యాలు యితోధికంగా కల్పించ బడుతున్నాయి జీలుగుమిల్లిలో ప్రభుత్వ ఆసుపత్రి ఉంది. , ప్రసూతి కేంద్రాలు ఉన్నాయి. కుటుంబనియంత్రణ శస్త్రచికిత్సల నిమిత్తం గ జనులు ముందుకు వస్తున్నారు. జిల్లా స క్షేమ సంఘం నిర్ణయించిన వెసక్టమీ లక్ష్యాలను మించి ఫలితాలను సాధించడం జరిగింది.

ఈ గిరిజన బ్లాకులో విద్యారంగంలో కూడ తగినంత అభివృద్ధిని సాధించారు. ఇక్కడ 2 ఉన్నత పాఠశాలలు, 65 ఎలిమెంటరీ పాఠశాలలు ఉన్నాయి



బుట్టాయ గూడెంలోని కోయలు

పంచాయతీరాజ్ వ్యవస్థ పటిష్టవంతంగా నిర్వహించ బడుతున్నది. గత నాలుగు సంవత్సరాలనుండి నూటికి నూరు శాతం పన్నులు వసూలు చేయబడుతున్నాయి. 22 పంచాయతీలలో 15 పంచాయతీ అధ్యక్షులు ఏకగ్రీవంగా ఎన్నికైనారు.

బ్లాకు హెడ్క్వార్టర్‌లో ఒక వెదురు అల్లికం శిక్షణ కేంద్రం, ములగాలం పల్లిలో వ్యవసాయ పరికరాల వర్కుషాపు, గణపవరంలో దుస్తుల తయారీకేంద్రం నిర్వహించ బడుతున్నాయి. బుట్టాయగూడెంలో డిపార్టుమెంటల్ వడ్రంగం వర్కుషాపు నెలకొల్పారు.

ఈ ప్రాంతంలో మహిళా మండలులు స్థాపించి సంక్షేమ కార్యక్రమాలలో పాల్గొనడానికి మహిళలు ఉత్సాహంగా ముందుకు వస్తున్నారు. బుట్టాయగూడెంలోని మహిళామండలి జాతీయ రక్షణ నిధికి ఎక్కువ మొత్తంలో విరాళం అందజేసింది. ప్రజలలో ఉత్సాహం, సేవాతత్పరత ఉరకలు వేస్తూంది. కరాటం కృష్ణమూర్తి, సమితి కార్యాలయం భవనానికి స్థలం విరాళంగా యిచ్చారు. కరాటం చంద్రయ్య ప్రాథమిక ఆరోగ్య కేంద్రం భవనానికి భూమిని యిచ్చారు. ఈ విధంగా గిరిజనులు యితరప్రాంతాల జలతో సమంగా అభివృద్ధిపథంలో ముందడుగు వేస్తున్నారు.



# పిచ్చాలు

గుంటూరు శేషేంద్రశర్మ

చిన్న పిల్లల మనస్సుకన్న కోమలమైనది లేదు. కపటం ఎరగనివారికి అంతా నిజమే. 'పాపాయ్, ఈ వేళ సర్కసు కెళ్ళుదాం వస్తావా.' అని అడిగింది సాధ్య-సాధ్యాలతో నిమిత్తంలేని రేవి. ఆ మాటల్లో కపటం లేదు. నిజమనుకుంటె నిజమౌతుందా మరి?

సూర్యుడప్పుడే కొండవెనక్కి వెళ్లిపోయాడు. ప్రపంచ జీవుల శోకతిమిరంలాగా చీకటి భూమ్యాకాశాలు ఆవరిస్తూ ఉంది. తాళ్ళవలసలో అందరికీ— తాళ్ళ వలసేమిటి ఆ చుట్టుపట్ల ఊళ్ళలో వుండే ఏమీ లేని ప్రజలందరికీ—ఆకొండే సర్వస్వము. ఆ కొండ మీద కర్రలు కొట్టుకొనిపోయి పట్టణంలో అమ్ముకుంటారు. అక్కడే పెద్దచెట్లమీద పెట్టిన తేనెపట్లు కూడా (పట్లు చెదరకుండా కొమ్మతోసహా) తెస్తారు అనేక విధాలుగా ఆకొండ పేద ప్రజలందరికీ

ఆశ్రయమిచ్చి పోషిస్తూ ఉంటుంది. ఎన్ని సంవత్సరాలనుంచో చెప్పలేము—బహుశా ఆకొండా ఆ మనుషులు పుట్టినప్పటినుంచీ ఏమో ఎవరెప్పుడు పుట్టారో...ఆకొండకు రెండుమైళ్ల దూరాన ఉన్న పట్టణంలో ఒక పెద్ద జమీందారు ఉన్నాడు. కానీ ఆయన కంటే ఆ కొండే నయం. అసలా కొండను అతనితో పోల్చడం మహా పాపం. ఆ కొండ బంగారు కొండ. ఆ కొండంటే నా కెంతో ప్రేమ, భక్తి, గౌరవము—అన్నీ. నా రెండు చేతులూ జోడిస్తాను ఆ కొండకు.

చీకట్లు జోరుగా వ్యాపిస్తున్నాయి. పట్నంలో సర్కసు వాళ్ళ బ్యాండు సంగీతం తాళ్ళవలసలోకి వినిపిస్తూ ఉంది. వాళ్ళమ్మ మూటలోంచి తీసి మంచి పరికిణీ కట్టుకుంది నీలి. కానీ, పరికిణీ మోకాళ్ళ క్రింద, ప్రక్కల చిరిగి పోయింది. అంతకంటే మంచిది లేదు. మంచి జాకెట్టునుకొని మరొక చిరిగిపోయిన దాన్ని వేసుకుంది. జారిపోయిన జుట్టును సవరించుకుంది. కానీ, ఆ జుట్టు తన చిట్టి జడలో కలిసిపోక చెవుల వెనుక వ్రేలాడుతూ ఉంది. ఎట్లాగో ముస్తాబయింది. చీకటి పడేకొలదీ నీలి ఆతురత హెచ్చుతూ ఉంది. కాని ఇంకా అమ్మ రాలేదు.

నీలికి నాన్న లేడు. చిన్నప్పుడే పోయాడు. ప్రొద్దుట అమ్మతో కలిసి కర్రల మోపులు పట్నంలోకి తీసుకెళ్ళింది—ఆరేళ్ళ పసిపిల్ల. కాని వాళ్ళ ఊళ్ళో తన ఈడు పిల్లలంతా కర్రలు మోస్తారు, నూతిలోంచి నీళ్ళు తోడుతారు, అమ్మ నాన్నలకు తోడుగా చాలా పనులు చేస్తూ ఉంటారు. తెల్లవారుజామున వాళ్ళ తోటే లేస్తారు. సాయంకాలం తిండి తినకుండానే పడి నిద్ర పోతారు—కర్రలు మోసుకొని వచ్చేటప్పుడు పట్నం పొలిమేరలో ఒక ఆఫీసరుగారి బంగళా ఉంది. ఆ బంగళాగేటు దగ్గర ఒక పెద్ద మర్రిచెట్టు, పెద్ద మామిడిచెట్టు ఉన్నాయి. కర్రలు తెచ్చే వాళ్ళంతా ఎండలో అలిసిపోయి ఆగేటు దగ్గర చెట్ల క్రింద మోపులు దించుకుంటారు. కాస్సేపు అలసట తీరేవరకూ వాళ్ళూ పిల్లలూ నీడలో కూర్చొని కబుర్లు చెప్పుకుంటారు. తర్వాత ఊళ్లోకి వెడతారు. అప్పుడప్పుడూ వాళ్ళని ఆఫీసరుగారి బంట్రోతులు అల్లరిచేస్తున్నారని తరిమి వేస్తూంటారు.

ఆ దినం మధ్యాహ్నం చెట్లక్రింద కూర్చొని ఉండగా ఆఫీసరుగారి పిల్లలు అక్కడ ఆడుకుంటున్నారు. అందులోఒక అమ్మాయి అచ్చంగా తనలాగేఉంది. "ఏయ్, పాపా! మా ఊళ్లో సర్కసొచ్చింది తెలుసా" అన్నది. "సర్కసంటే"—అని అడిగింది నీలి.

"హి హి హి, సర్కసంటే తెలీదట చూడక్కయ్యా" అని చప్పట్లు కొడుతూ గంతులు వేసింది రేవి. అక్కయ్యా కూడ నవ్వింది. నీలి మొహం చిన్నబోయింది. "అదేమిటో చెప్పరాదు పాపా"—అంది నీలి, మొహం కోలగాపెట్టి. ఇక రేవి కొండంత పెద్దదయిపోయింది చేతు లిట్లా జాపి, వేళ్ళువిప్పి, కళ్ళుపెద్దవి చేసి, "సర్కసంటే—ఆః సర్కసంటే" అంటూ చేతులూపుతూ గంతులువేస్తూ, ఆర్భాటంచేస్తూ ఉందేకానీ, ఇంతకూ అదేమిటో చెప్పలేక, "సర్కసంటే ఆః—ఆ—సర్కసు" అని మొహం చిన్న పుచ్చుకుని, "అంతే గదక్కయ్యా" అని వాళ్లక్కయ్య మీద చేతు లేసి వ్రేలబడింది. వాళ్లక్కయ్య' అదిగాదే సర్కసంటే. పులులూ' అనేసరికి రేవి అందుకుని "సింహాలు గాండ్రు గాండ్రు మంటూ ఎగురుతాయి. పెద్ద ఏనుగు లొస్తాయి" అని చెప్పేవన్నీ తానయి నట్లుగా నటిస్తూ ఉంటే, నీ౧ సర్కసు చూసినట్లే తన్మయ మయిపోయింది.

ఇంతలో వాళ్ళమ్మ కేక వినిపించింది. కర్రల వాళ్ళంతా ఊళ్ళోకి వెళ్ళటానికి లేచారు. పరధ్యానంగా నీలి తలవంచుకుని వెళ్ళిపోతుంటే, పాపాయ్, ఇవాళ సర్కసు కెళ్ళుదాం వస్తావా" అని అడిగింది రేవి. "వస్తాను" అంటూ నీలి వెళ్లింది. కర్రల మోపు ఎత్తుకున్న తర్వాత మళ్ళి వెనక్కు తిరిగి, "తప్పకుండా వస్తాను. ముందుగా వెళ్ళిపోకేం" అంటూ నడిచిపోయింది.

ఇక పల్లెకు వెళ్ళేటప్పుడు దారిపొడుగునా ఇదే గోల. వాళ్ళమ్మకు అసలే విసుగ్గా ఉంది. ఆ రోజు అమ్మిన డబ్బంతా చిల్లర దుకాణం షావుకారు పాత బకాయి క్రింద పూర్తిగా జమ కట్టుకున్నాడు. రాత్రికి తిండి గింజ లెట్లాగా అని ఆలోచిస్తూ ఉంది. "అమ్మా, సర్కసుకే" అని నీలి అడిగినప్పుడల్లా వాళ్ళమ్మకు ఏడుపు, కోపం, దుఃఖం, విసుగు అన్నీ ఉబికి పోతున్నాయి. దారిలో కోపంతో ఒకసారి తన్నింది కూడాను. ఏడుస్తూ నీలి వాళ్ళమ్మ వెనకాల నడిచింది. మళ్ళీ బంగాళా దగ్గరకు వచ్చేసరికి, నీలి, గేటు దగ్గర ఆగింది. ఎవ్వరూ లేరు. రెండు నిముషాలు నిలిచింది. శోకం ఒక పెద్ద కెరటంలాగున ఉప్పొంగింది. రావే, అని అమ్మ కేక వినిపించేసరికి పరికిణీతో కళ్ళు తుడుచుకుంటూ వెళ్ళిపోయింది. ఇంటికి వెళ్ళిన తర్వాత, ప్రాణం విసిగి వాళ్ళమ్మ తెగకొట్టింది. తిండిగింజలకోసం అమ్మ పొరుగింటికి వెళ్ళి గంట సేపయింది. వస్తే మాత్రం లాభమేమిటి? 'తెలియకుండా వెళ్ళి పోతాను. ఆ పాపాయి రమ్మని పిలిచిందిగా? నా కోసం చూస్తూ ఉంటుంది.'

ఎట్లాగో నీలి గుడిసెలో నుంచి బయటకువచ్చి చూసింది. వీధిలో వాళ్ళమ్మ కనుపించలేదు. ప్రక్కింటివాళ్ళ కోళ్ళు, కోడి పిల్లలూ ఇంట్లోకి వెళ్ళి పోతున్నాయి. నాలుగు బారల దూరాన ఎవరో రోట్లో ఏదో దంచుతున్నారు. నీలి వీధిలోకి వచ్చింది. చీకట్లు వ్యాపిస్తున్నాయి. గుడిసెలో దీపాలు పెట్టుకుంటున్నారు. ఆకాశంకేసి చూసింది. అక్కడక్కడా చుక్కలు వెక్కిరిస్తున్నట్లుగా కనుపించాయి. ఇంతలో పైన ఒక పిట్టలగుంపు రివ్వున ఎగిరిపోయింది. నీలి మెల్లగా బయలుదేరింది. నాలుగు బారలు నడిచింది. ఎక్కడో కుక్క మొరిగింది. నీలి గుండె జల్లుమంది. మళ్ళీ నడకసాగించింది. కొంచెం దూరం పోయాక రావిచెట్టు క్రింద కూర్చుని కొందరు చుట్టలు కాలుస్తూ మాట్లాడుకుంటున్నారు. ఒకడు నీలిని చూచి, "ఏమే, ఎక్కడకే వెడుతున్నావు" అన్నాడు.

"అమ్మకోసం" అంటూ వెళ్ళిపోయింది నీలి. పుంతలో నడుస్తూ ఉంది. తంగేడు పొదలు దట్టంగా పూచాయి. మాసిపోయే వెలుతుర్లో పువ్వులు స్వచ్ఛగా కనిపిస్తున్నాయి. మొల్లలుకూడ విరిశాయి. నీలి కళ్ళల్లో ఆనందం తళతళా మెరిసింది. అన్ని రకాల పువ్వులు కలిసి నీలిని గిలిగింతలు పెట్టాయి. దారినిండా పువ్వులు గాలికెరటాలతో కలిసి చిందులాడుతున్నాయి. నీలికి పువ్వులు కోసుకుందామనిపించింది. కాని ఎందుచేతనో కోయకుండా పువ్వుల దగ్గరకెళ్ళి కొమ్మలు గుప్పిట్లోకి తీసుకొని వాసన చూచి లేత బుగ్గలతో మెల్లగా స్పృశించి, వదిలేసింది. నీలి ఉత్సాహంతో పువ్వులు చూస్తూ గంతులేస్తూ వెళ్ళింది.

కొంతదూరం వెళ్ళేసరికి పువ్వుల పొదలు సన్నగిల్లాయి. అక్కడినుంచి వట్టి బీడు. ఎక్కడా ఒక్క మొక్క కూడా లేదు. అక్కడక్కడ చిన్న చిన్న రాళ్ళు కనిపిస్తున్నాయి. అంతా నిరామయంగా ఉన్నది. వెనక్కు తిరిగి చూసింది. ఊరు వదలి పెట్టి చాల దూరం వచ్చేసింది. చెట్ల గుబురు మాటున ఊరు కనుపించటము లేదు కూడాను. దూరాన నల్లటి కొండ వెనక తదియ చంద్రుడు కడుపు నొప్పితో కృశించిన చంటిపిల్లవాడిలాగా కనుపిస్తున్నాడు. పట్నంలోనుంచి వచ్చే గాలి ఒక్కసారిగా సర్కస్ సంగీతాన్ని వినిపించింది. వెంటనే మళ్ళీ నీలి ముందుకు నడవసాగింది. పాపాయి తనకోసం చూచి చూచి వెళ్ళిపోతుందేమో అనే ఆతురతతో కొంతదూరం పరుగెత్తింది. కాని చీకట్లో ఏదో రాయి తగిలి గబుక్కున పడిపోయింది. మోకాలిమీద మంటగా ఉంది. నేలమీద నుంచి లేవలేక కూర్చునే నాలుగు వైపులా చూసింది. పట్నం ఇంకా దూరంగానే ఉంది. ఆకాశంలో మేఘాలు కనుపిసున్నాయి. ఎందుచేతనో నీలికి ఒక్కసారిగా భయం వేసిం మెల్లిగా లేచి కుంటుతూ నడక సాగించింది. గ్రుడ్డి వెన్నెల్లో దారి సరిగా కనుపించడం లేదు. ఏవేవో వెర్రి ఊహలు దెయ్యాల్లాగా మనస్సులో అల్లరి చేయ సాగాయి. క్రమంగా ఆకాశమంతా మేఘాలు చుట్టుకున్నాయి. చినుకులు కూడా రాలుతున్నాయి. తలెత్తి చూసేసరికి పెద్ద చెట్టు జుట్టు విరబోసుకుని కూర్చున్నట్లుగా కనిపించింది. నీలికి ఎందుచేతనో తనకు తెలీకుండానే ఒక్కసారిగా ఏడుపొచ్చింది. ఇంతలో పెద్ద పెద్ద చినుకులు రాలడం మొదలు పెట్టాయి. నీలి చెట్టుక్రిందకు పరుగెత్తుకుని వెళ్ళింది. పైకి చూస్తే చెట్టంతా చీకటి గుబురులాగుంది. ఎప్పుడో వాళ్ళ తాతయ్య చచ్చిపోతే ఆ శవాన్ని తీసుకెళ్ళుతుంటే నీలి చూచింది. తర్వాత ఒకనాడు పట్నానికి వెళ్ళుతూ ఈ చెట్టు దగ్గర, "తాతయ్య ఎప్పుడొస్తాడే," అని అమ్మనడిగితే, "ఇదుగో, ఈ చెట్టు దగ్గరే ఉంటాడమ్మా. ఇక ఇంటికి రాడు" అని అమ్మ చెప్పింది. అంతా గాఢాంధకారంగా ఉంది. వర్షం పడుతూఉంది. "ఈ పాటికి పాపాయి సర్కసుకు వెళ్ళి ఉంటుంది. అమ్మ నాకోసం వెతుకుతూ ఉంటుంది. వెతికి వెతికి నేను కనుపించకపోతే అమ్మ ఏడుస్తుందేమో? పాపం అమ్మనెందుకు విడిచిపెట్టొచ్చాను" చెట్టుకొమ్మల్లో ఏదో పక్షి తన పిల్లల మీద కప్పిన రెక్కల్ని సవరించుకుంటున్న చప్పుడు వినిపించింది. నీలి బెదరి చూసింది. ఇక ఆగలేకపోయింది. "తాతయ్యా" అని గట్టిగా కేకవేసింది. కాని ఆ కేక వర్షపు హోరులో లీనమయిపోయింది. ఇక్కడ తాతయ్య లేడు. ఆ కొమ్మల్లోనుంచి తన మీదికేవైనా దూకుతాయేమోనని అక్కడనుంచి వెనక్కి తిరిగి చూడకుండా పరుగెత్తసాగింది. కొంతసేపటికి వర్షం జోరు తగ్గినా చినుకులు మాత్రం రాలుతూనే ఉన్నాయి. నీలి బాగా అలసిపోయింది. మెల్లిగా కాళ్ళీడుస్తూ నడక సాగించింది. బట్టలంతా బురదమయం అయిపోయాయి. జుట్టంతా తడిసిపోయి ముఖంమీద వ్రేలాడుతూంది. దూరాన గబుక్కున వీధిలైట్లు కనుపించేసరికల్లా ఎక్కడాలేని సంతోషం పెల్లుబికింది. రివ్వున బంగళావైపు పరుగెట్టింది. దారిలో పెట్రోలుబంకు దగ్గర ఎవళ్ళో లారీ టైర్లువిప్పేసి రిపేరు చేసుకుంటున్నారు. ఠక్కుఠక్కున వాళ్ళు కొడుతుంటే నీలి ఆ శబ్దంతో కలిసి అడుగులేస్తూ పరుగెట్టింది. ఇంతలో ఆ శబ్దం ఆగిపోయింది. బంగళా కనుపించింది. సంతోషం పట్టలేక గేటు దగ్గరకు వెళ్ళింది. కానీ గేట్లు మూసి ఉన్నాయి. చుట్టుపట్ల ఎక్కడా వెలుతురులేదు. అంతా చీకటిమయం. చినుకులు చిటపట రాలుతున్నాయి. గేటుదగ్గర ముసలి మామిడిచెట్టూ, చింతచెట్టూ పెద్ద బ్రహ్మరాక్షసుల్లా నిల్చుని ఉన్నాయి.

నీలికి ఏంచెయ్యాలో తోచిందికాదు. ఆ పాపాయి గేటుదగ్గర తన కోసం చూస్తూ ఉంటుందని అనుకుంటూ వచ్చింది, పాపం, దారి పొడుగునా తనకు తెలీకుండానే పిచ్చిపిల్ల! ఇప్పుడెట్లాగా – "పాపాయ్" అని గట్టిగా కేకవేసింది నీలి, గేటు దగ్గర నిల్చుని– ఊరంతా గాఢాంధకారంలో నిశ్శబ్దంగా నిద్రపోతూంది. కాని నీలి మనస్సులో ఎంత శబ్దం ఉందో ఎవ్వరికీ తెలీదు. పాపాయి తన కోసం చూచి చూచి నిద్రపోయిందేమో అనుకుని గేటుముందున్న పిట్టగోడ ఎక్కింది. లోపలకు చూద్దామని. కాని అసలు గోడ ఇంకా జానెడెత్తు ఉండడంచేత కనుపించలేదు. ఏమీ చేయలేక మోకాళ్ళమీద మోచేతులుపెట్టుకొని చెక్కిలి చేతుల్లోచేర్చి క్రింద ప్రవహించే వర్షపు నీటిని చూస్తూ పిట్టగోడమీద కూర్చుంది నీలి. పాపం! నీలికి తెలియదు – అప్పుడు రాత్రి సుమారు రెండు గంటలయింది. లోకమంతా నిశ్శబ్దంగా ఉంది. నీలి ఆ నిశ్శబ్దాన్ని భరించలేకపోయింది. వెంటనే "పాపాయ్" అని కేకవేసింది. కెవ్వున నవ్వినట్లుగా ఒక్క మెరుపు మెరిసి ఉరుము ఉరిమింది ఆకాశం. నీలి గబుక్కున చేతులతో మొహం కప్పుకుని 'అమ్మా' అని ఏడ్చింది – ఏమిటి చెయ్యాలి? ఇంటికి వెళ్ళిపోదామా? ఎట్లా? దారిలో తాతయ్య చింతచెట్టు ఉంది – నేను వెళ్ళలేను. ఈ పాపాయి ఇంటి దగ్గరే ఉండిపోతాను. గట్టిగాఏడిస్తే ఎవరైనా వచ్చినన్ను తీసుకువెళ్ళుతారేమో? గట్టిగా ఏడుస్తా, అనుకుందేగాని ఆ భయంకర నిశీధ నిశ్శబ్దాన్ని చూస్తే నీలికి నోరు విప్పేధైర్యం కూడ లేక పోయింది ఎందుచేతనో.

మళ్ళీ వర్షం పడసాగింది. ఈ సారి అంతకంతకూ పెద్దదయిపోయింది. ఆ వర్షంలో నీలి ఏమీచేయ్యలేక కూర్చుంది. కాని కొంతసేపటికి–వర్షం ధారాపాతంగా కురవడం మొదలు పెట్టింది. తర్వాత ఇక అక్కడ ఉండలేకపోయింది. మరొక చోటికి వెళ్ళడానికి మనస్కరించలేదు. మళ్ళీ పిట్ట గోడమీద నిల్చుంది. పెద్ద గోడ ఎక్కి కాంపౌండులోకి దూకేద్దామని. కానీ చేతకాలేదు. ఇంతలో మరొక ఉపాయం తోచింది. కాంపౌండులో మంచి సీతాఫలపు చెట్టు కొమ్మలు గోడమీదకు వ్రేలబడి ఉన్నాయి. అవి మెల్లగా అందుకుని అతి కష్టంమీద గోడ ఎక్కింది. కాంపౌండులోకి దూకింది. వర్షపు జోరుకు ఆగలేకపోయింది పాపం. లోలోపల ఏడుస్తూ పది నిమిషాలకు మెల్లిగాలేచి నిల్చుంది. తలుపులన్నీ వేసి ఉన్నాయి. మెల్లిగా తలుపు దగ్గరకు వెళ్ళి కన్నాల్లోనుంచి చూద్దామని ప్రయత్నం చేసింది. ఏమీ కనిపించలేదు. అతి మెల్లగా సన్న గొంతుకతో తలుపుసందుల్లోనుంచి 'పాపాయ్'అని పిలిచింది. కానీ ఏమీ అవలేదు. అంతా మామూలుగానే ఉంది. విసుగేసి నీలి గోడకు చేరబడి కూర్చుంది. ఎక్కణ్ణుంచో వణికిపోతూ ఒక ముసలికుక్క తోక వెనకకాళ్ళలోకి వంచుకుని మెల్లగా మెట్లెక్కి వచ్చి నీలిముందే కూర్చుంది. నీలిని ఎవరనుకుందో, అది చాల చనువుగా వచ్చి కూర్చుంది. ఎడంచేతి వైపు చూస్తే చాల చీకటిగా ఉంది. ఒక నల్లటి ఎలిమెంటరీ స్కూల్ బిల్డింగూ. వంద సంవత్సరాలనాటి మామిడిచెట్లు, చింతచెట్లూ గుబురుగా బ్రహ్మాండమయిన కొమ్మలతో చేతులు జాపినట్లు నిల్చొనిఉన్నాయి. కొమ్మల్లో గుడ్లగూబ కూసింది. ఆ అమాయక హృదయం కృంగిపోయింది. ఆ భయంతో ఏడవటం కూడా మరచిపోయింది. వర్షం మట్టుకు వదల్లేదు. జోరున కురుస్తూనే ఉంది.

ఆ సాయంకాలం ఆఫీసరుగారి భార్య ఎవరో స్నేహితురాలు భోజనానికి పిలిస్తే పిల్లల్ని తీసుకుని వెళ్ళిపోయింది. రాత్రి వాళ్ళింట్లోనే ఉండిపోతానని చెప్పింది. రేవి సర్కసుకు వెళ్ళాలని ఏడ్చింది. కానీ చివరకు వాళ్ళమ్మతోనే వెళ్ళిపోయింది. భార్య వండిపెట్టింది ఇంత తిని కాస్సేపు రేడియో త్రిప్పుకుంటూ కూర్చున్నాడు ఆయన. ఏమీ తోచలేదు. రేడియో ఆపేసి హెచ్.జి.వెల్స్ ప్రపంచ చరిత్రతీసుకున్నాడు. సృష్టిలో మానవుల అవతరణ 50,000 సంవత్సరాలనాటి ప్రపంచం, భూగోళం మీద మానవ సమూహాల సంచారమూ, సమాజంలో వ్యవసాయం ప్రారంభం అవడం, స్థిర మానవుల నాగరికత, వర్గాల హెచ్చుతక్కువలు సమాజంలో అంకురించడం — ఇదంతా చదువుతూ వెళ్ళాడు. చరిత్ర బాటలవెంబడి ఎక్కడికో మానవుల పురాతన గాఢాకుహరంలోకి. తన్ను తానే మరచిపోయాడు. కళ్ళు నొప్పి పుట్టసాగాయి. పుస్తకం ప్రక్కమీద పెట్టి కళ్ళు నలుపుకుంటూ లేచాడు. హోరుమని వర్షం వినిపిస్తే బయట వర్షం పడుతూఉందని అర్థం చేసుకున్నాడు. కిటికీ దగ్గరకు వెళ్ళి తలుపు తీశాడు. ఒక్కసారిగా రివ్వున గాలికెరటం వర్షపు జల్లుతో కలిసి లోపలికి వచ్చింది. పుస్తకంపేజీలు గిలగిల కొట్టుకున్నాయి. వెంటనే కిటికీ మూసి గుమ్మం తలుపు తీసుకుని వరండాలోకి వచ్చాడు.

సిగరెట్టు కాల్చుకుంటూ జోరున వర్షం కురుస్తూఉంటే ఆయన ఆలోచిస్తూ నిల్చున్నాడు. వరండాలో వర్షపు తుంపర్లు మొహానపడి చలివేస్తే వెళ్ళి పడుకుందామని వెనక్కి తిరిగాడు. ఇంతలో చీకటిని చీల్చుకుంటూ ఒక్కమెరుపు మెరిసింది. వరండాలో ఎవరోఉన్నట్లు కనుపించింది. చేతిలో ఉన్న సిగరెట్టు పారేసి అగ్గిపుల్ల గీచాడు. పాపం ఈ పిల్ల కూర్చొనిఉంది. కునుకుతూ ఉందేమో, ఆయన దగ్గరకు వెళ్ళేసరికి అగ్గిపుల్లకాంతిలో

బరువుగా రెప్పలెత్తి చూచింది. దగ్గరే కుక్క చుట్టచుట్టుకొని పడుకొనిఉంది. అది ఏమాత్రం చలించలేదు. 'ఎవరు?' అన్నాడు ఆయన. నీలికి ఒక్కసారిగా మత్తు వదలిపోయింది. గబుక్కున లేచి నిల్చుని భయపడి వెర్రిచూపులు చూస్తూ 'పాపాయి ఏది' అని అడిగింది నీలి. సమాధానం చెప్పకుండా మోకాళ్ళమీద నిల్చుని నీలి చేతులు పట్టుకొని. 'పాపాయ్ ఎవరు, వర్షంలో ఇక్కడెందు కున్నావ్', అని అడిగాడు. ఆయన చేతులు పట్టుకునేసరికల్లా విద్యుత్తు సోకినట్లుగా నీలి హృదయంలో ఇంత సేపూ ఏ దారిలేక అణగిఉన్న శోకమంతా ఒక్కసారి పొంగి పొర్లింది. ఆయన మెడ కౌగిలించుకొని గట్టిగా ఏడ్చేసింది నీలి. ఆయనకూ శోకం ఆగింది కాదు. నీలినిఎత్తుకుని హృదయానికి హత్తుకున్నాడు. లేత హృదయం అతివేగంగా కొట్టుకుంటూంటే ఆయన కళ్ళలో నీళ్ళు గిర్రున తిరిగాయి. ఇంట్లోకి ఎత్తుకెళ్ళి తువాలుతో తడిసిన జుట్టుతుడిచి వాళ్ళ పాపాయి వేసుకునే జాకెట్టు పరికిణీవేసి తనప్రక్కమీద పడుకోబెట్టాడు. కాని నీలి పడుకోకుండా ఆయన్ను కౌగిలించుకొని ఏడ్చి ఏడ్చి ఆయనభుజం మీదే నిద్రపోయింది. మెల్లిగా భుజం మీదనుంచి తీసి పడుకోబెట్టి దుప్పటి కప్పి ఆ అమాయక ముఖం చూస్తూకూర్చున్నాడు. కనురెప్పలు, కనుబొమ్మలు కుంచితమై ఎక్కడో ఆలేత హృదయపు అగాధంలో అవ్యక్తబాధ స్రవంతి హోరుమంటూ ఉందని సూచిస్తున్నాయి. చిన్నగులాబి మొగ్గల్లాంటి ఆ పెదవుల మీద పవిత్ర మానవత్వం తొణికిసలాడుతూఉంది. ఆహా! ఏమి లోకం! అనుకుంటూ నుదురు మీద మృదువుగా చెయ్యివేశాడు. కాలిపోతూ ఉంది. ఏమవుతుందో అని భయం వేసింది. ఏ తల్లికన్న దోగదా పాపం ఎంతగా తపించిపోతూఉంటుందో!

ఆ రాత్రి అనుభవాలు కలిగించిన క్షోభను నీలి హృదయం భరించ లేక పోయింది. నిద్రలో పాపాయ్ అని ఒకసారి, పులులూ సింహాలు అని ఒకసారి ఏవేవో రెండు మూడుసార్లు పలవరించింది. మరుసటిరోజు తెల్లవారినట్లే లేదు. మేఘాలు మరింతా దట్టంగా వ్యాపించి అంతానిబిడాంధకారంగాఉంది. పాపాయ్, పాపాయ్, అంటు మాటిమాటికీ పలవరించసాగింది నిశ్చేతన స్థితిలోఉన్న నీలి. ఇంతలో వర్షపు జల్లులో తడిసిందేమో పరికిణీ అంచులు పిండుకుంటూ, "నాన్నా" అని రేవి తలుపుతోసుకుని వచ్చింది వెంటనే ఆయన గుండెల మీదినుంచి ఏదో బరువు తీసివేసినట్లయింది. నీలి దగ్గరకువెళ్ళి "నీ పాపాయి వచ్చిందమ్మా" అని కాలిపోతున్న లేత బుగ్గలు పట్టుకుని మెల్లిగా కదిలించాడు. ఏ సంచలనమూలేదు. రేవి తండ్రి ప్రక్కన నిల్చుని, "ఎవరునాన్నా" అని అడిగింది. "ఎవరో దగ్గరకెళ్ళిచూడమ్మా" అన్నాడు. రేవి పరిశీలించిచూసింది. "అల్లా పాపాయి నాన్నా. నన్నుసర్కసుకు వెళ్ళనిచ్చారుగాదు. చూచారా, పాపం" అంటూ రేవి మంచం ఎక్కికూర్చుని నీలి చెవిదగ్గర ముఖం పెట్టి పాపా అని పిలిచింది. ఆ పిలుపులో ఏముందో, అది ఏనాటి పిలుపో, ఎక్కడిదో ఏమో ఉదయకిరణ స్పర్శతో తామరపువ్వురేకులు విప్పినట్లు నీలి కొద్దిగా కన్నుతెరచి చూసింది. వెంటనే నీలి 'పాపాయ్, అంటూ గట్లు తెగిన ప్రవాహంలాగా లేచి రేవిని కౌగిలించుకుంది. ఈ వ్యావహారిక జగత్తులో పంకిలంగాని ఆ రెండు సనాతన జీవాత్మలు అన్యోన్య సమన్వయంపొందాయి ఆ కౌగిట్లో. రేవి మల్లె మొగ్గలాంటిది. రేవి కండ్లలో నీరు నిండింది. పెద్ద పెద్ద బిందువులు బుగ్గల మీదకు జారాయి. రేవి నీలి కళ్ళమీద పడిన ముంగురులు ప్రక్కకు తీస్తూ 'పాపా' ఇవాళ సాయంకాలం వెడదామా సర్కసుకు? అని అడిగింది. కానీ సమాధానం రాలేదు. మరొకసారి అడిగింది. రేవి చేతుల్లోనుంచి నీలి చిట్టితలజారిపోయింది. ఎందుచేతనో రేవికి భయంవేసి "నాన్నా" అని కెవ్వునకేకవేసింది. వర్షంలో తడిసిన రెక్కలు దులుపుకుంటూ కిటికీలోకూర్చొని ఉన్న పిచ్చుక అనంతంలోకి రివ్వున ఎగిరిపోయింది. ఆకాశం అంతా ద్రవించి స్రవించిపోతుందా అన్నట్లు వర్షం ప్రారంభమయింది. క్షణక్షణానికి ఉరుములు మెరుపులు ఫెళ ఫెళ ధ్వనులతో భూనభోంతరాళం నిండిపోయింది. ఆ ప్రళయ ప్రభంజనంలో మహావృక్షాలు నాలుగు దిక్కులా కొమ్మలూపుతూ ప్రచండ తాండవంచేశాయి. ఏళ్ళూ వాగులూ కొండలమీద నుంచి పరవళ్ళుతొక్కుతూ సముద్రం వైపు పరుగెత్తాయి. ఆకాశంవైపు తన సహస్రబాహులుజాపి సముద్రుడు ఘోషించాడు. ఏడు రోజులు ఏక ధారగా వర్షంకురిసింది.

---



*

# ఆంధ్ర ప్రదేశ్‌లో గ్రంథాలయ వికాసం

వెలగా వెంకటప్పయ్య

దేశంలోని వ్యవసాయ విశ్వ విద్యాలయాల గ్రంథాలయాలను పరిశీలించే నిమిత్తం భారత ప్రభుత్వం నియమించిన ఇండో అమెరికన్ నిపుణుల బృందం యిటీవల హైదరాబాదు సందర్శించి నపుడు, యిచట పౌర గ్రంథాలయాల శాఖ వారి ఆధ్వర్యంలో పనిచేస్తున్న కొన్ని గ్రంథాలయాలను చూచిన మీదట, గ్రంథ పాలకులతో చర్చించి యిచట గ్రంథాలయ విధానాన్ని తెలుసుకొన్న పిదప ఎంతో ఆశ్చర్యపడి యిలా చెప్పారు "ఆంధ్ర ప్రదేశ్, గ్రంథాలయ క్షేత్రంలో నేడు ఏమి చేసిందో, రేపు భారత దేశం అదే చేయబోతూంది." ఈ మాటలను బట్టి మన రాష్ట్రంలో గ్రంథాలయ వికాసం ఎంతటి ప్రగతి పథంలో పయనిస్తోందో గమనింప వచ్చును. ఈ బృందమే గాదు, దేశవిదేశాల నుండి వచ్చిన పలువురు ఆంధ్రావనిలోని గ్రంథాలయోద్యమాన్ని గురించి ఎంతో సదభిప్రాయాన్ని వెల్లడించారు. విద్య, పరిశ్రమలు, వాణిజ్యము మొదలయిన రంగాలలో కొన్ని రాష్ట్రాలతో పోల్చి చూచుకొన్నపుడు హెచ్చు తగ్గులు కనిపించినా యీ ఉద్యమంలో మాత్రం ఆంధ్ర ప్రదేశ్ అగ్రస్థానాన్ని అందుకొన్నది. ఇది అందరూ గుర్తించిన సత్యం.

చరిత్ర పుటలను తిరగవేసి ఐదారు దశాబ్దాల తెలుగునాటి చరిత్రను పరిశీలించేట్లయితే ఆంధ్రుల ఔన్నత్యం కోసం పాటు పడిన పలు ఉద్యమాలతో గ్రంథాలయోద్యమానికి ఎంతటి సన్నిహిత సంబంధంకలదో స్పష్టమౌతుంది. ఇంత కాలంగా దేశంలో వెలసిన అనేక ఉద్యమాలకు గ్రంథాలయోద్యమం బాసటగా నిలిచింది. ఆ మాటకు వస్తే ఆంధ్ర దేశంలో ప్రభవించిన ఉద్యమాలన్నీ గ్రంథాలయోద్యమం నుంచే వచ్చాయని కొందరు చెప్పే మాటలలో సత్యం కొంతవరకు లేక పోలేదు.

ఈ శతాబ్దం మొదటి భాగంలో బరోడాలో గ్రంథాలయోద్యమం ప్రభుత్వ పరంగా బయలుదేరితే, మన రాష్ట్రంలో ప్రజల పరంగా బయలుదేరింది రాజకీయ చైతన్యం వలన మొలకలెత్తిన ఉత్సాహంతో ముఖ్యంగా గ్రామీణ ప్రాంతాలలోని యువకులు గ్రంథాలయాలను స్థాపించారు. ప్రజల సహకారంతోనే వాటిని నిర్వహించారు. ఇదే సమయంలో ఏర్పడిన ఆంధ్రప్రదేశ గ్రంథాలయ సంఘం రాష్ట్రంలోని వివిధ గ్రంథాలయాల కార్యక్రమాలను సమన్వయపరచి, కార్యకర్తలను ఉత్తేజపరచి ఉద్యమం మరింత ముందుకు పోయేట్లు చేసింది. ప్రజలు తమను గురించి, తమ దేశాన్ని గురించి తెలుసుకోడానికి ముఖ్యంగా గ్రంథాలయాలు ఎంతో ఉపయోగించాయి. ఆ తర్వాత ప్రభుత్వమే గ్రంథాలయాల అవసరాన్ని గమనించింది. పంచాయితీలు, పురపాలక సంఘాలను గ్రంథాలయాలను స్థాపించడానికి ఉత్సాహ పరచింది. ఆర్థికంగా చేయూత నిచ్చింది. ఈవిధంగా స్వాతంత్ర్యానికి పూర్వం ప్రభుత్వం పరోక్షంగా గ్రంథాలయ వికాసానికి తోడ్పడింది.

## గ్రంథాలయ శాసనం

గ్రంథాలయాలు మరింత కట్టుదిట్టంగా పనిచేయవలెనంటే శాసనబద్ధమైన తోడ్పాటు అవసరమని అనేకమంది గుర్తించారు. తత్ఫలితంగా అవిభక్త మద్రాసు రాష్ట్రానికి 1948 సం॥లో గ్రంథాలయ శాసనం వచ్చింది. ఆంధ్ర జిల్లాలన్నిటిలో యీ శాసనం అమలులోకి వచ్చి కొంత కృషి జరిగినది. ఆంధ్రుల చిరకాలపు కోరిక ఆంధ్రప్రదేశ్ అవతరించాక 1960 లో ఒక సమగ్రమయిన గ్రంథాలయశాసనం మనకు లభించింది. ఈ శాసనం వలన యిరవై జిల్లాలలో కేంద్ర గ్రంథాలయాలు, వాటి కనుబంధంగా శాఖాగ్రంథాలయాలు, యితర గ్రంథాలయాలు నిధులున్నంతవరకు స్థాపించబడినాయి. ఇంతకుముందు ప్రజలచే స్థాపించబడిన గ్రంథాలయాలకు తోడుగా నవీనపద్ధతిలో విశాలాంధ్రావనిలో గ్రంథాలయాలు ఏర్పడ్డాయి. నేడు (1968 మార్చి అంతానికి) రాష్ట్రంలో గ్రంథాలయాల సంఖ్య :

| | | |
|---|---|---|
| (1) | ప్రభుత్వ గ్రంథాలయాలు | 7 |
| | గ్రంథాలయ శాసనపరంగా వచ్చిన— | |
| (2) | జిల్లా కేంద్ర గ్రంథాలయాలు | 20 |
| (3) | నగర కేంద్ర గ్రంథాలయం | 1 |
| (4) | శాఖా గ్రంథాలయాలు | 506 |
| (5) | పుస్తకపంపిణీ కేంద్రాలు | 550 |
| | ప్రయివేటు గ్రంథాలయాలు— | |
| (6) | ప్రభుత్వ సహాయం పొందుతున్న ప్రయివేటు గ్రంథాలయాలు | 2722 |
| (7) | ప్రభుత్వసహాయం పొందని ప్రయివేటు గ్రంథాలయాలు | 3000 |
| | మొత్తం | 6806 |

## గ్రంథాలయ సేవ

మన రాష్ట్రంలో గ్రంథాలయ విధానం రాష్ట్ర కేంద్ర గ్రంథాలయంనుండి గ్రామీణ ప్రాంతంలోని చిన్న గ్రంథాలయం వరకు శాసనం వలన ఒక పిరమిడ్‌వలె ఉంది. అందుచేత సాధ్యమయినంత వరకు ప్రజానీకానికి యితోధికంగా తోడ్పడటానికి అవకాశం కలుగుతూంది. దాదాపు ప్రతి గ్రంథాలయంలోనూ పత్రికల విభాగంతోబాటు, పుస్తకాలు అరువిచ్చు విభాగము, సమాచార విభాగము, బాలల విభాగము మొదలైనవన్నీ వీలున్నంత వరకు నిర్వహించబడుతున్నాయి. ఇచట ముఖ్యంగా "పౌరగ్రంథాలయం" అనే పదాలకు సిద్ధాంతరీత్యా గల అర్థాన్ని తూ. చ. తప్పకుండా పాటించబడుతున్నది. అనగా యిచటి గ్రంథాలయాలలో:—

1. జాతి, మత, కుల, వర్ణ విచక్షణ లేక ఎల్లరకు ప్రవేశ అవకాశమున్నది.
2. చదువరులనుండి ఎట్టి రుసుము వసూలు చేయబడుట లేదు.
3. పరోక్షంగా వసూలు చేయబడిన గ్రంథాలయ సెస్సు. ప్రభుత్వ నిధులనుండి గ్రంథాలయాలు నిర్వహింపబడుతున్నవి
4. స్వయం విద్యకు అవకాశాలు కల్పించబడుతున్నవి.
5. సమాజంలోని అన్ని తరగతులకు, తెగలకు సంబంధించిన సమాచారం, పుస్తకాలు అందజేయబడుతున్నవి. ఇటువంటి అవకాశం గల మన గ్రంథాలయ విధానంలో చదువరులు ఎంతగా గ్రంథాలయ సేవను ఉపయోగించుకుంటున్నది యీ దిగువ సమాచారం వలన తెలియగలదు.

| సంఖ్య | వివరము | 1964_65 | 1965_66 | 1966_67 |
|---|---|---|---|---|
| 1. | సభ్యులు | 56,441 | 57,596 | 68,893 |
| 2. | పుస్తకాల సంఖ్య | 19,29,000 | 21,96,000 | 22,32,000 |
| 3. | చదువరులు (రోజుకు) | 1,05,750 | 1,08,050 | 1,19,210 |
| 4. | గ్రంథాలయంలో చదువుకొన్న పుస్తకాలు రోజుకు | 1,25,100 | 1,27,005 | 1,49,961 |
| 5. | అరువుగా తీసుకువెళ్ళిన పుస్తకాలు (రోజుకు) | 1,04,300 | 1,05,100 | 1,17,840 |

పైన వివరించబడిన సమాచారం ప్రభుత్వము, శాసనపరంగావచ్చిన స్థానిక గ్రంథాలయ సంస్థలు నిర్వహించు గ్రంథాలయాలకు సంబంధించినది మాత్రమే. ప్రయివేటు గ్రంథాలయాల సమాచారం యిందుచేరలేదు.

## గ్రంథాలయ సహకారము

ఈ నాడు సామాజిక జీవనం సఫలవంతం కావడానికి సహకార విధానం ఎంతో అవసరమని అందరూ గుర్తించారు. ఇది గ్రంథాలయ శాఖలోగూడ తప్పలేదు. వాస్తవానికి ఏ గ్రంథాలయమూ చదువరి కోరిన ప్రతి పుస్తకాన్ని అందించలేదు. కనుక చదువరికి అవసరమైన పుస్తకాలు తమవద్ద లేనపుడు యితర గ్రంథాలయాలనుండి తెప్పించి యివ్వడానికి, అలాగే యితర గ్రంథాలయాలకు యివ్వడానికి అనుసరించే విధానాన్ని గ్రంథాలయ సహకారం అంటారు. ఈ విధంగా రాష్ట్రంలోని ఏ పౌర గ్రంథాలయమైన మరొక పౌర గ్రంథాలయంనుంచి గాని,ఉన్నత పాఠశాల గ్రంథాలయం నుంచి గాని పుస్తకాలను యిచ్చి పుచ్చుకోడానికి శాసనబద్ధంగా అవకాశం కల్పించబడింది. ఈ సహకార విధానం ఉపయోగం యినుమడించడానికి వీలుగా గుంటూరులోని ప్రభుత్వ ప్రాంతీయ గ్రంథాలయం వారు సమీకృతసూచి (యూనియన్ కేటలాగ్) తయారు చేస్తున్నారు. ఈ సూచీలో రాష్ట్రంలోని ప్రసిద్ధ గ్రంథాలయాలలోని గ్రంథాల తాలూకు వివరాలుంటాయి. ఈ పని దాదాపు పూర్తయి, ముద్రణకు ఏర్పాట్లు జరుగుతున్నాయి.

## గ్రంథాలయ శిక్షణ

ఏ ఉద్యమమయినా సఫలవంతం కావడానికి దానికి తగినంత మంది సిబ్బంది ఉండాలి. ముఖ్యంగా వీరిలో కార్యదీక్ష, పట్టుదల, సహనశక్తి ముప్పిరిగొని వున్నపుడే ఉద్యమం ముందుకు పోవడానికి వీలుంది. వీటితోబాటు గ్రంథాలయాలను ఆధునిక పద్ధతులపై నిర్వహించడానికి క్రమబద్ధమైన శిక్షణ, కార్యకర్తలకు ఎంతో అవసరం. రాష్ట్ర ప్రభుత్వంచే గుర్తించబడిన శిక్షణాలయాలు :

| | | | |
|---|---|---|---|
| 1. | ఆంధ్రవిశ్వవిద్యాలయం, వాల్తేరు. | గ్రంథాలయశాస్త్రంలో పట్టభద్రత. | 1 సం. శిక్షణ |
| 2. | ఉస్మానియా విశ్వ విద్యాలయం, హైదరాబాదు. | డిటో | 1 సం. ,, |
| 3. | ఇనిస్టిట్యూట్ అఫ్ లైబ్రరి సైన్సు, హైదరాబాదు. | గ్రంథాలయశాస్త్రంలో సర్టిఫికెట్ | 3 మా॥ ,, |
| 4. | గ్రంథాలయ శిక్షణాలయం, విజయవాడ. | డిటో | 3 మా॥ ,, |

పైవిగాక ప్రభుత్వంచే గుర్తించబడని మరొక శిక్షణాలయంగూడ హైదరాబాదులో యిటీవల ప్రారంభించబడింది. పైన వివరించిన మొదటి మూడు విద్యాలయాలలో ఆంగ్లము బోధనా భాష కాగా, విజయవాడలోని గ్రంథాలయ శిక్షణాలయంలో తొలి

సారిగా తెలుగు బోధనా భాషగా ప్రవేశపెట్టబడింది. పైగా ఆంధ్ర దేశంలో తొలి సారిగా వ్యవహారిక భాషను బోధనకు ఉపయోగించి సత్ఫలితాలను సాధించింది. ఈ విధంగా పై శిక్షణాలయాలలో గాక యితర రాష్ట్రాలలో చదువుకొని వచ్చిన వారు గూడ మన గ్రంథాలయాలలో పని చేస్తున్నారు. ఇచట గమనించవలసిన మరొక విశేష మేమంటే గ్రంథ పాలకులుగా శిక్షణ పొందిన పలువురకు గ్రంథాలయశాఖ ఆర్థిక సహాయం చేసింది. ఇదే విధంగా శిక్షణాలయాలకు చేయూతనిచ్చింది. అందుచేత మరే రాష్ట్రంలోనూ ఇంత హెచ్చుగా శిక్షణపొందిన కార్యకర్తలు పౌర గ్రంథాలయాల్లో పనిచేయడంలేదు.

## సాంకేతిక కృషి

మన రాష్ట్రం సాంకేతికంగా చెప్పుకోదగిన ఫలితాన్ని సాధించింది. ప్రపంచ ప్రఖ్యాతమైన దశాంశ వర్గీకరణ విధానాన్ని కొన్ని అవసరమైన చేర్పులు మార్పులు స్వయంగా చేసుకొనబడి అనుసరించబడింది. అలాగే నిఘంటు సూచీకరణ విధానం వాడుక చేయబడుతుంది. పుస్తకాలు అరువివ్వడంలో బ్రౌనీ పద్ధతి అమెరికాలో స్వేచ్ఛోపలబ్ధి మొదలైన అత్యంతాధునిక విధానాలిందుప్రవేశ పెట్టబడినవి. ఈ విధానాల సక్రమనిర్వహణకు పౌరగ్రంథాలయ శాఖ ఎంతో ప్రోత్సాహం యిస్తున్నది. వీటితోబాటు గ్రంథాలయాలలో సభలు సమావేశాలు ఏర్పాటు చేయడానికి, చలనచిత్ర ప్రదర్శనలు నిర్వహించడానికి, అనేక విషయాలపై ప్రజాభిప్రాయాలను తెలుసుకోవడానికి చర్చావేదికలు నిర్వహించడానికి గ్రంథాలయాలు యీనాడు ఎంతగానో సహకరిస్తున్నవి.

## ఊరూర గ్రంథాలయం

ప్రతి గ్రామానికి ఒక గ్రంథాలయం ఉండాలని నెహ్రూ పండితులు కలలు కన్నారు. ఆ మహిమాన్వితుని కమనీయమైన ఆలోచనలు కార్యరూపం ధరించే అదృష్టం ఆంధ్రప్రదేశ్‌కు భారత దేశంలో తొలిసారిగా పట్టబోతుంది. దీనికి ప్రాతిపదికగా హైదరాబాదు, కడప జిల్లాలలో "ఊరూర గ్రంథాలయ" పథకాలను ప్రవేశ పెడుతున్నారు. వనరులున్నంతకాలం ప్రతి గ్రామంలో గ్రంథాలయం ప్రారంభించడానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి. ఇదిగాక మరొక రూపంలో కొన్ని జిల్లాలో కొన్ని సమితులలో ప్రతి గ్రామానికి గ్రంథాలయ సేవను అందజేయడంలో స్థానిక గ్రంథాలయ సంస్థ ఆదర్శవంతమైనకృషి చేసింది.

ఈతీరుగా అనేకవిధాలుగా ఆంధ్రావనిలో గ్రంథాలయ సేవ చేయడంలో దేశంలో అందరిమెప్పు పొందడానికి అవకాశం కల్గింది. ఆంధ్రులలో విజ్ఞాన వికాసాలు పెంపొందింపజేయడానికి వీలుకలిగింది. ఇదే గ్రంథాలయోద్యమంయొక్క పరమార్థం. ★

---

# పాఠకుల లేఖలు

ఆర్యా!

"ఆంధ్రప్రదేశ్" పత్రిక దినదిన ప్రవర్ధమానమగుచున్న దనుటలో సందేహం లేదు. మన రాష్ట్రం ప్రగతి పథంలో పయని స్తున్నది. అందుకు సంబంధించిన సమాచారాన్ని మీరు మీ (మా) పత్రికా ముఖంగా ప్రజలకు చక్కగా విశదీకరిస్తున్నారు.

నాజరుపేట, తెనాలి. *తురగా బుచ్చిరామారావు.*

సంపాదకులకు,

"ఆంధ్రప్రదేశ్" ఉగాది ప్రత్యేక సంచిక నన్నుబాగా ఆకర్షించింది. ఉగాది సంచిక ఆశించిన దానికంటె ఆకర్షణీయంగా చాల ముఖ్య విషయాలను సమీకరించి పాఠకులకు అందించినందుకు కృతజ్ఞతలు. ఈ సంచికలో అన్ని శీర్షికలూ అందరూ తెలుసుకునే విషయాలుగా ఉన్నవి. "రాష్ట్ర బడ్జెటు" లో కొన్ని విషయాలు సర్వులూ తెలుసుకోవలసిన అవసరం ఉండటంచేత పూర్తిగా ప్రచురించడం ఉపయోగకరం. అడవి బాపిరాజుగారి జీవిత చరిత్ర బాగున్నది. "స్నేహమతం" వ్యాసం నేను పదేపదే చదివాను. ముఖపత్ర పరిచయం నాకు నచ్చింది. డాక్టర్ రాజబహదూర్ గౌడ్ గారి "వికలాంగులకు మంచి రోజులు" చక్కగావుంది. "స్నేహగీతి" "స్వేచ్ఛాగీతి" "ముక్తకాలు" మొదలైన గేయాలు, పద్యాలు చదువుటకు ఇంపుగా యున్నవి. "ఆంధ్రప్రదేశ్" ఒక విలువైన పత్రిక.

విజయనగరం. జె. వి. మూర్తి.

తెలుగు చదువను, వ్రాయను కొద్దిగా తెలిసినవారుకూడ ఇండ్లలో చదువుకొనుటకు మీ పత్రిక ఎక్కువగా ఉపయోగపడు చున్నది.

శ్రీమతి చెల్లాయమ్మ,
నాగార్జునసాగర్.

ఆర్యా!

ఆంధ్రప్రదేశ్ మాసపత్రికలు మొదటినుండి కొనే వారిలో నేను ఒకడిని. "అడవిమల్లె," "బ్రతికిన కాలేజీ," 'ఐశ్వర్యం' సీరియల్స్ చింపి బైండింగ్ చేయించుకొంటిని. మళ్ళీ ఇప్పుడు "భాగ్యచక్రం" నవల సీరియల్ పూర్తి అయినది. దానిని పుస్తకము రాగానే కొని చింపి సీరియల్ బైండింగ్ చేయించుకొంటిని. ఆంధ్రప్రదేశ్‌లో ప్రచురించిన చిత్రములు "అల్బమ్"గా తయారు చేసికొంటిని. ముఖ్య వార్తలు అన్నియు ప్రత్యేకముగా ఒక పుస్తకముగా బైండింగ్ చేసికొంటిని, సీరియల్స్, చిత్రములు, ముఖ్యవార్తలు చాలా బాగున్నవి. ఆంధ్రప్రదేశ్ వల్ల మాకందరకు విజ్ఞానము చాలా అభివృద్ధి అయినది. మాకు ఆంధ్రప్రదేశ్ చాలా ఉపయోగ కరముగా యున్నది. టోక్యో లేఖలు గూడా చదివి జపాను దేశపు స్థితిగతులు తెలిసికొనుచున్నాము.

*దేవరబొట్ల సత్యనారాయణ శర్మ,*
కలవల పల్లి,
పశ్చిమగోదావరి జిల్లా.

# దూరప్రాచ్యదేశ పర్యటనానుభవాలు

వి. యల్. సుందరరావు

విదేశ పర్యటన జీవిత[illegible]తన అనుభవం. కొత్త అనుభవాలు, కొత్తఆలోచనలను ప్రసాదిస్తుంది. ఇటీవలి నా దూరప్రాచ్య దేశాల పర్యటన యీ అదృష్టాన్ని ప్రసాదించింది.

విదేశపర్యటనల వల్ల ఆయాదేశాలను గురించిన అంచనాలలో కలిగే మార్పులకంటే మన ఆంతరంగిక ఆలోచనలలో కలిగే మార్పు పెద్దది. ప్రతిసమస్యను గురించి మన దృష్టిలో మార్పు కలుగుతుంది.

భారత దేశాన్ని గురించి తెలుసుకోవాలంటే, దేశం బయటకు వెళ్ళిరావాలి! నా అనుభవాన్ని గురించి చెప్పమంటే కొందరి పెద్దల సమక్షంలో అన్నాను యీ మాట.

స్వరాజ్యం సిద్ధించాక పదిపదిహేను సంవత్సరాలలోనే మొదట్లో వేసుకున్న అంచనాలు తారుమారైనాయ్. మన ఆలోచనలు హిమాలయ శిఖరాలను అధిరోహించుతుంటే మనచేతలు పెరటి గుమ్మం దాటటంలేదని తేలిపోయింది. విద్యార్థిగా స్వరాజ్య పోరాటంలో చేరిన నాటినుండి గాంచిన కలలకు యథార్థ పరిస్థితికి మధ్యగల అగాధం స్పష్టమైంది. కనీసం అర్ధశతాబ్దమో, శతాబ్దమో కృషిచేయనిదే మనదేశం కల్పతరువు కాలేదని తేలిపోయింది. ఇది మన జీవిత కాలంలో జరిగేపనిగాదు.

నూతన పరిశోధనలు, ఆధునిక శాస్త్రఫలితాలను కైవసం చేసుకొని సుభిక్షంగా ఉన్నదేశం, సంఘం ఒకటి పర్యటించి రావాలి. అధునాతన పరికరాలను సంపాదించి సోదర మానవుడు ఎంతసుఖంగా జీవిస్తున్నాడో ఒక్కసారి చూడాలి. ఆనందించాలి —అనే సంకల్పం జీవిత ధ్యేయంగా ఏర్పడింది.

నా యీ దూరప్రాచ్య దేశాల పర్యటనద్వారా జీవిత ధ్యేయంలో కొంత భాగం సాధించిన తృప్తి కలిగింది.

## అందమైనప్రాంతం హాంకాంగు

కలకత్తాలో ఉదయం 11 గంటలకు బయలుదేరి హాంకాంగు సా॥ 5 గంటలకు చేరాం.

హోటలు చేరాక ఫోంచేసి హాంకాంగులో రాత్రి 10 గంటలకు నేనూ నావెంట వచ్చిన మిత్రుడు అమర్‌నాథ్‌ము ఖర్జీ షికారు బయలుదేరాం. ఆ వీధులలో గుంపులు గుంపులుగా పరుగులిడుతున్న జనసమూహాన్ని చూస్తే ఎంతో ఆశ్చర్యంకలిగింది. పురుషులకంటె స్త్రీలే హెచ్చుమంది కనిపించారు. తీరిక లేకుండా పరుగులిడుతున్నారు. ప్రతివ్యక్తి స్వేచ్ఛ, సమానత్వంతో ఆడ మొగ భేదంలేకుండా వారి వారి పనులు చేసుకొంటున్నారు. సంఘంమొత్తం చైతన్యంతో సాగిపోతున్నది. ప్రప్రథమంగా గలిగిన యీ అనుభూతి, ఆనందం, మేరలేని సంతృప్తిని కలిగించింది.

జనసంఖ్యలో సగంమంది స్త్రీలు. స్త్రీలు బానిసలుగా ఉన్నంతకాలం ఏదేశమైనా అభివృద్ధిని సాధించలేదని ఒకప్పుడు లెనిన్ మహాశయుడు చెప్పాడు. మన దేశంలోని 40 కోట్లజనాభాలో అందరూ పనిచేస్తే మనకు ముక్తి వెంటనే కలుగుతుందని నెహ్రూజీ పండితుడు అనేకసార్లు హెచ్చరిక చేశాడు. యిటువంటి హితోపదేశాలన్ని యీనాడు జ్ఞప్తికివచ్చాయి. వానిలోని సత్యం కంటికి కట్టినట్టు కనిపించింది.

హాంకాంగు టెరిటరి అంటే 235 ద్వీపాల సమూహం. హాంకాంగు నగరం జనాభా 40 లక్షలు. మిగిలిన దీవులన్నిటిలో మరొక 10 లక్షలజనం ఉన్నారు. నూటికి 98 మంది చైనీయులు. భారత దేశంలో గోవా ఎట్లాఉన్నదో ఎర్రచైనాకు హాంకాంగు అట్లాఉంది. హాంకాంగు బ్రిటీషు కమీషనరు పాలనక్రింద ఉంది ప్రపంచంలో స్వేచ్ఛా వ్యాపార కేంద్రం. దిగుమతి ఎగుమతి సుంకాలు ఉండవు. తనసరుకులు యితరదేశాలకు పంపుటకు గాని యితర దేశాల సరకులు కొనుక్కొంటానికి గాని ఎర్రచైనాకు మంచి సౌకర్యంగా ఉంది. ఈ సావకాశం ద్వారా వారానికి 400 కోట్ల డాలర్లు ఎర్రచైనా సంపాదిస్తుంది. ఈ కారణంగా చైనాకు హాంకాంగును ఆక్రమించాలనే కాంక్షలేదు.

హాంకాంగులో అధునాతన పరిశ్రమలు ఎన్నో వెలిశాయి. యిచటి జనానికి సంపాదన హెచ్చు. ఎర్రచైనాలోకంటె 7, 8రెట్లు సగటు జీవనప్రమాణం ఉంటుంది. ఒంటినిండా దుస్తులు, మంచి భోజనం, సుఖమైన నివాసం, కులాసా క్లబ్బులు, విలాసాలు, వైద్య విద్యా సౌకర్యాలతో సంతోషమైన జీవనం గడపుతున్నారు. పగలు కష్టించి పనిచేస్తారు. రాత్రి ఏడు గంటలకు భోజనం పూర్తి అవుతుంది. అక్కడ నుండి నైటుక్లబ్బులకు వెళ్ళుతారు. అక్కడ పానీయాలు, సప్పరు, డ్యాన్సులు చేసుకొని రాత్రి 12 గంటలకు తిరిగి యిల్లు చేరుతారు. మధ్యతరగతి ప్రజలకు గూడా యిచటి కార్యక్రమం యిది. హాంకాంగులో కొన్ని వందల నైట్‌క్లబ్బులు ఉన్నాయ్.

చైనావారి ఆహారం ప్రపంచంలో పేరు గాంచినది. వారు తినని మాంసంలేదు; కప్పలు, పాములుగూడా వారి ఆహారమే,

అనేకమైన రుచులు, రకరకాల వంటకాలు తయారుచేస్తారు. కాయగూరలు ఆకుకూరలు అన్నం వారి ఆహారంలోని భాగమే. అన్నం రెండు పుల్లలతో అతినేర్పుగా తింటారు. వీధులలో మన పళ్ళ అంగళ్ళమాదిరి మాంసంఅంగళ్ళు షాపులమధ్యలో ఉంటాయి. బాతులు, పందులు, కోళ్ళు, పాముల కళేబరాలు యీ అంగళ్ళలో వ్రేలాడుతూ ఉంటాయి. మనకు వింతగొల్పు తుంటాయి. మామూలు మార్కెట్టు వేరే ఉంటుంది. కాని అతి పరిశుభ్రంగా ఉంచుతారు.

రెండో ప్రపంచయుద్ధానంతరం యీ నగరానికి యీ వైభవం చేకూరింది. పూర్వం 4, 5 అంతస్థుల భవనాలు మించి లేవట. యిప్పుడు పది నుండి ముప్ఫైఐదు అంతస్తుల ఎత్తైన భవనాలతో శోభాయమానంగా విరాజిల్లుతున్నది దీ మహానగరం. హాంకాంగుద్వీపం, కౌలూాలు ద్వీపకల్పం కొండల ఉపరిభాగం వరకు యీ ఎత్తైన భవనాలు నయనానందంగా ఉంటాయి రాత్రి సమయంలో కొండపైకి వెళ్ళి లైటుకాంతులు విరజిమ్మే యీ భవన దృశ్యాలు తిలకించవచ్చు. కొండపైకి ట్రాంబండి వెళ్ళుతుంది

హాంకాంగులో అన్నిదేశాల ప్రభుత్వ విక్రియశాలలు ఉన్నాయి. చౌకగా పాత కొత్త సరకులుఅమ్మే కలగూర గంపగా ఉండే షాపులూ ఉన్నాయి. ఏ వస్తువు కావాలన్నా కుప్పలు తిప్పలుగా ఉంటాయి ఈ అంగళ్ళలో వస్తువుల నాణెం తెలుసుకొని కొనుక్కోవాలి. మన దేశంలో బ్లాకుమార్కెట్లలో మోజుగా కొనుక్కొనే ట్రాన్సిస్టర్లు, కెమేరాలు, లైటర్లు, గడియారాలు, పెన్నులు మొదలైన వస్తువులు కుప్పతిప్పలుగా ఉంటాయి. ఈ టెరిటరీలోని పల్లెకారులు దొంగవ్యాపారులు ఎర్ర చైనాతో రాకపోకలు సర్వసాధారణంగా జరుపుకొంటుంటారు.

కౌలూను నుండి ఎర్రచైనా సరిహద్దు 26 మైళ్ళు. సరిహద్దుకు వెళ్ళి అచటి పల్లెప్రజలు, పంటపొలాలు చూసివచ్చాం.




యూరపులో కార్మిక సంఘ ఉద్యమహితామహుడు వనిస్టండేల్‌తో వ్యాస రచయిత, మధ్యనున్నవారు జర్మన్ ప్రతినిధి.

దారిలో సముద్రతీరానఉన్న క్లబ్బులు, పరిశ్రమలు, అనేక యాత్రా స్థలాలు కనుల పండువుగా ఉంటాయి.

ఆసియాలోని కార్మికోద్యమం — దాని భవిష్యత్తు, అనే సదస్సు హాంకాంగులో పదిహేను రోజులు జరిగింది. యీ సదస్సుకు మనదేశం నుండి హాజరైన ముగ్గురు ప్రతినిధులలో నేనొకణ్ణి అందులో పాల్గొనిన ప్రతినిధుల నుండి, ఆయా దేశాల పరిస్థితులు సాకల్యంగా అవగాహన చేసుకొన్నాం. యిచ్చట నుండి జపాను దేశపు అమోనియం క్లోరైడు సంస్థ అధ్యక్షులు శ్రీ కజిస్కా నన్ను వారి దేశం ఆహ్వానించారు. జపానులో 12 రోజులు పర్యటించాను.

## పారిశ్రామిక ప్రగతి సాధించిన జపాను

జపాను దేశపు జనసంఖ్య 10 కోట్లు. అందులో ఒక కోటి ముప్ఫైలక్షలమంది టోకియోనగరంలో ఉంటారు. యిది ప్రపంచంలోకల్లా పెద్దనగరం. పారిశ్రామికంగా మూడవ దేశం. నౌకా నిర్మాణంలో వ్యవసాయరంగంలో ప్రపంచంలో అగ్రతాంబూలం వీరిదే. ఎలక్ట్రానిక్సులో వీరితో పోటీపడే దేశమేలేదు. ఏ యంత్రమైనా ఉత్తమోత్తంగా తయారుచేయటం వీరి ప్రత్యేకత. గంటకు 130 మైళ్ళ వేగంగాపొయ్యే రైళ్ళునడుపుతున్నారు. ప్రపంచంలో మరెచ్చటా యింత వేగంగాపొయ్యే రైళ్ళులేవు. వీరు సుంచూకి (కొత్త) రైలుస్టేషను నిర్మించారు. యింత అధునాతనమైంది ప్రపంచంలో లేదు. టోకియో సెంట్రలుస్టేషను నుండి రోజుకు 10 లక్షలమంది ప్రయాణం చేస్తుంటే సుంచూకిస్టేషను నుండి రోజుకు 8 లక్షల మంది ప్రయాణంచేస్తారు. వీరు ప్రపంచంలోకల్లా ఎత్తైన టవరు ఒకటి నిర్మించారు. చాపల్ టవరు 327 మీటర్ల ఎత్తుంది. టోకియోటవరు 333 మీటర్లు.

టోకియో నగరంలో నూటికి 80 మంది సబ్‌వే మార్గాన ప్రయాణంచేస్తారు. భూభాగంలో సొరంగాలలో కరంటుతో నడిచే రైళ్ళు యివి. భూమి పైభాగంలో ఎన్ని రహదార్లు ఉన్నయో క్రింద సబ్‌వేలు అంతకుమించి ఉన్నాయి. ఒకొక్కచోట రెండు మూడు రైళ్ళు ఒకదాని క్రింద మరొకటి క్రాస్ అవుతుంటాయి. ప్లాట్‌ఫారాలు అంతే. దిగువనున్న యీ సబ్‌వే రైలుస్టేషన్ల దగ్గర అనేకమైన అంగళ్ళు హోటళ్ళు మిరుమిట్లుగొల్పుతూ ఉంటాయి. టోకియోనగరంలో కింజా అనేది ప్రధానమైన ప్రదేశం. యిచట 30 లేక 40 యీ సబ్‌వే మార్గాలుంటాయి. యిచట ఉన్న ఆ ప్లాటుఫారాలు, హోటళ్ళు ఒక ఊరు మాదిరి ఉంటుంది. మనం వెళ్ళవలసిన స్థలంకోసం మన ప్లాటుఫారం వెతుక్కోవటం చాలా కష్టం. జపాను నిపుణులకు యీ సొరంగాలలో రైళ్ళు నడపడంలో ఏదో ప్రత్యేకత వుందనే చెప్పాలి.

పైన రోడ్లమీది కార్లరద్దీ చెప్పనలవిగాదు. ప్రతి క్రాసింగు వద్ద బ్రిడ్జిపైన బ్రిడ్జీలు మూడంతస్థులు నిర్మాణం చేశారు. కుడి ఎడమ ప్రక్కలకు బ్రిడ్జీలు ఎక్కి మలుపు తిరుగుతుంటారు వీటిని హైవేస్ అంటారు. యీ హైవేస్‌లో గూడా ప్రపంచంలో ప్రత్యేకత వీరిది.

నేను చిబా వ్యవసాయ కేంద్రానికి వెళ్ళి వచ్చాను. అచటి భూములలోని పంటలు, రైతులు వ్యవసాయం చేసే పద్ధతులు

చూశాను. పొలాల్లో సాగు అంతా యంత్రసహాయంతోనే చేస్తారు. పశువుల్ని ఉపయోగించరు. పొలాల్లో వెతికినా కనిపించవు. పది సంవత్సరాలనాడు యీ దేశంలో వ్యవసాయ సంస్కరణలు అమలు జరిపారు. భూస్వాముల దగ్గరున్న భూములన్నీ ప్రభుత్వం కొని బీద రైతులకు పంపిణీ చేసింది. రెండునుండి మూడున్నర ఎకరం చొప్పున రైతుల కుటుంబ సభ్యుల ననుసరించి భూములు పంచియిచ్చారు. గ్రామంలోని ప్రజలందరు కష్టించి పనిచేసి, భుక్తి సంపాదించుకుంటారు. నిరుద్యోగం లేకుండా పోయింది. ప్రతి గ్రామానికి కరెంటు సప్లై ఉంది. మనకంటే సగటున ఐదురెట్లు పంట పండించుతారు. వ్యవసాయ పరికరాలు, యంత్రాలు ఉపయోగించటం రైతులకు చక్కగా తెలుసు. పంటలు కోయటం కలుపు తీయడం, నూరిపిడిచేయటం, దున్నడం అన్నీ యంత్రాలతో చేస్తారు. యివన్నీ స్వయంగా చూసే అదృష్టంగలిగింది.

ప్రతి గ్రామానికి అందుబాటులో స్కూలు ఉంటుంది. ప్రతిది కాన్వెంటు మాదిరి మంచి కట్టుదిట్టాలతో ఉంటుంది. చక్కని విద్యాభ్యాసం, నడవడి అలవరుస్తారు. జపాను కుటుంబంలోని ఆప్యాయత, మర్యాద, అతిథిసత్కారం ఎంతో శ్లాఘనీయమైనవి.

జపాను దేశంలో పెద్దనదులులేవు. ఖనిజాలులేవు. పత్తి, యినుములేవు. కొబ్బరికాయ, నిమ్మకాయ, అరటిపండ్లు, పంచదార, జీడిపప్పు దిగుమతి చేసుకుంటారు. వర్షకాలంలోని నీరు నిల్వ చేసుకొంటానికి పెద్దచెరువులు, సరస్సులుగూడాలేవు. కాని, యీ ప్రజలశక్తి, కార్యదీక్ష, సమిష్టి ప్రవర్తన కారణంగా ప్రపంచంలో అగ్ర స్థానం సంపాదించారు.

ఈ దేశాలు చూసినప్పుడు మనదేశంలోని సహజ సంపదలు_నదులు, పంటభూములు, ఖనిజాలు, కీకారణ్యాలు, పర్వతాలు సరస్సులు, సమశీతోష్ణ వాతావరణం_వీనికంటే ఎన్నో వందలరెట్లు భరతభూమి సారవంతమైనదని అవగాహన అవుతుంది. తగినకృషి, ప్రయత్నం, పట్టుదల లోపించిన కారణంగా మనం ముందుకు సాగిపోలేకున్నామనిపిస్తుంది.

భారత, జపాను సౌహార్ద్రసంఘం డైరెక్టరు శ్రీమిసిమి అనే వారిని కలిశాను. ఆయనతో మనదేశానికి, జపానుకు మిత్రత్వం



హాంకాంగు సదస్సు దృశ్యం

పెంపుజేయడం అవసరమని ముచ్చటించుకొన్నాం. ఆయనద్వారా పార్లమెంటు సభ్యులు శ్రీ యిచిమండా అనేవారి పరిచయం కలిగింది. ఈయన ఐదు సంవత్సరాలు జపాను రిజర్వుబ్యాంకు గవర్నరుగా పనిచేశారు. జాతీయ నాయకుడు. డిసెంబరు 7వ తేదీన జరిగిన అత్యవసర పార్లమెంటు (డయిట్) సమావేశానికి తీసుక వెళ్ళారు. సమావేశం ఎంతో ప్రశాంతంగా, హుందాగా జరిగింది.

ఒకరోజు సూపరు ఎక్సుప్రెస్సులో హటామివెళ్ళి అచటి ప్రదేశాలన్ని చూసివచ్చాం. యిడాకొని గార్డెన్సు_అషినినొకు సరస్సు_హకొని పర్వతం_ఫిజూమంచు పర్వతం_అంతర్జాతీయ గ్రామం (యునెస్కో వారిది)_జిక్కొకులోయ_కొమగటకే పర్వతం, మంచులో ఆడుకొనే క్లబ్బులు_హాట్ స్ప్రింగ్సు (అగ్ని పర్వతాలు) చూసివచ్చాం. 130 మైళ్ళ వేగంగా వెళ్ళే రైలులో ప్రయాణం చేశాం.

అమోనియంక్లోరైడు సంఘంవారు మీటింగు ఒకటి ఏర్పాటు చేశారు. శ్రీ వొకయామా తొలిపలుకులు చెప్పాడు. మనదేశంలో అభివృద్ధి జెందుతున్న వ్యవసాయ ప్రాజెక్టులు, వ్యవసాయ భూవిస్తరణ పథకాలు_మనదేశంలో ఉత్పత్తి అవుతున్న ఎరువుల లెఖ్కలు_మనం దిగుమతి చేసుకుంటున్న లెఖ్కలు గురించి మాట్లాడాను. గతంలో సాలీనా జపానునుండి 10వేల టన్నులు అమోనియం క్లోరైడ్ దిగుమతి చేసుకొంటున్నాం. 1967లో 50వేల టన్నులు దిగుమతి చేసుకొన్నాం. యింకా అధికం చేయవలసిన అవసరం గలదనిచెప్పి వారు యింత స్నేహపూర్వకంగా వారి దేశానికి ఆహ్వానించి ఆతిథ్యమిచ్చినందుకు కృతజ్ఞతలు చెప్పుకొన్నాను.

## దూరప్రాచ్యదేశాల వినోద కేంద్రం: తాయివాన్

జపాను నుండి తాయివాన్ వచ్చాను. దీనికే పాశ్చాత్య దేశస్తులు ఫార్మోజా అనే నామకరణం చేశారు. పోర్చుగీసు భాషలో ఫార్మోజా అంటే అందమైన వస్తువు. ఇది ఏబది సంవత్సరాలు జపాను ఆక్రమణలో ఉంది. రెండవ ప్రపంచ యుద్ధంలో జపాను వోడిపోయినప్పుడు స్వాతంత్ర్యం సిద్ధించింది. అట్లాగే అనేక సామ్రాజ్యాల చదరంగంలో నలిగిపోయిన చైనా దేశం సోవియట్ రష్యా సైనికసహాయంతో కమ్యూనిష్టు రాజ్యాన్ని స్థాపించుకొంది. కమ్యూనిష్టులచే బయటకు గెంటబడి, తాయివానులో రిపబ్లిక్ ప్రభుత్వానికి అధిపతిగా చాం కై షేక్ ఉన్నాడు.

తాయివాన్ జనసంఖ్య టోకియో జనసంఖ్యకు సమానం. 250 మైళ్ళ పొడవు. 85 మైళ్ళ వెడల్పు 14 వేల చదరపు మైళ్ళ విస్తీర్ణంగల సహజ సుందరమైన ద్వీపం. మంచి సరస్సులు, సముద్ర తీరాలు, సహజమైన పార్కులు, పురాతన భవనాలు, పర్వతాలు, అరణ్యాలు, పండ్లతోటలు, పంట భూములతో నిండి దూర ప్రాశ్చ్యదేశాలకు వినోదకేంద్రంగా అలరారుతున్నది. ఐదారు వేల సంవత్సరాల పురాతన సంస్కృతి, చరిత్ర, నాగరికతతో

వైభవోపేతమైన చైనా జాతి వ్యక్తిగత స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను అనుభవించుతూ వికసిత మందహాసాలను విరజిమ్ముతూన్న సంఘాన్ని యిచటనే తిలకించవచ్చు.

వ్యవసాయ రంగంలో తాయివాన్ ప్రజలు ఎంతో అభివృద్ధిని సాధించారు. వరి పంట ఉత్పత్తిలో ప్రపంచంలో వీరిది ప్రథమ స్థానం. 1951 సంవత్సరంలో నాలుగు అంచల భూసంస్కర్ణ విధానాన్ని అమలు జరిపారు 1953కు పూర్తి చేశారు. వీటివలన భూస్వామ్యపద్ధతిని రద్దుచేశారు. దున్నే వారిదే భూమి, అనే సిద్ధాంతం ప్రవేశపెట్టారు. ప్రభుత్వ భూములపైన, భూస్వామ్యభూములపైన దున్నేవానికి హక్కు యిచ్చారు రెండున్నర సంవత్సరాల పంట విలువ భూమి ఖరీదు అని నిర్ణయించారు. పది సంవత్సరాలలో 20 వాయిదాలలో చెల్లించవచ్చన్నారు. అందులో నూటికి 70 వంతులు ధాన్య రూపంలో చెల్లించవచ్చని శాసనం చేశారు.

ఈ భూసంస్కరణల ఫలితం అంతకు ముందు కౌలుదారులుగా ఉన్నవారిలో నూటికి 71 మంది భూకామందులయ్యారు· భూస్వామ్యం 5 నుండి 15 వేలకు పెరిగింది. కౌలుదారుల సంఖ్య 91 వందలనుండి 22 వందలకు తగ్గింది. పదిహేను సంవత్సరాలలో రైతుల పరిస్థితి ఎంతో మెరుగైంది. 1963 నాటికి తాయివాన్ జన సంఖ్య 118 లక్షలైతే 56 లక్షల మంది భూమి మీద ఆధారపడి జీవించుతున్నారు.

దేశంలో సాలీనా 88 లక్షల మెట్రిక్ టన్నుల చెరుకు, 34 లక్షల టన్నుల గణిసిగడ, 23 లక్షల టన్నుల బియ్యం, లక్షపాతిక టన్నుల వేరుశనగ, 28 వేల టన్నుల గోధుమలు, 63 వేల టన్నుల సోయాబీన్సు, 51 వేల టన్నుల అపరాలు—టీ, కాఫీ, పొగాకు, పత్తి మొదలుకొని అన్ని రకాల పంటలు పండుతవి.

సాలీనా ఐదున్నర లక్షల మెట్రిక్ టన్నుల అరటి పండ్లు, మూడు లక్షల టన్నుల పైనాపిలు, పది లక్షల టన్నుల కూరగాయలు, అనేక రకాలపళ్ళు పండించుతారు. విస్తారంగా యివన్నీ ఎగుమతి చేస్తారు. ఈ ఉదహరించిన వ్యవసాయ ధాన్యాలు, పండ్లు, కూరాగాయల ఎగుమతులద్వారా సాలీనా 60 కోట్ల అమెరికను డాలర్లు సంపాదిస్తారు. ఈ దేశంలో అతినాణెమైన హార్డుఉడ్, కోనిఫరస్ కలప విదేశాలకు ఎగుమతిచేసి విస్తారంగా డబ్బు సంపాదిస్తారు. సాలీనా నాలుగున్నరలక్షలటన్నుల చేపలు పట్టుతారు.యింకా ఎన్నో గృహ పరిశ్రమలు చేతివృత్తులద్వారా పైకంఆర్జించుతారు.

ముఖ్య పట్టణమైన తాయిపై దగ్గర అనేకమైన విశేషాలు ఉన్నాయి. నేషనల్ ప్యాలెస్ మ్యూజియం అనే పురాతన వస్తు ప్రదర్శనశాలఉంది. మూడు నాలుగు వేల సంవత్సరాల నాటి వస్తువులు సేకరించారు. వ్యవసాయ పరిశోధన శాల, గృహ పరిశ్రమల వస్తుప్రదర్శనశాల, మనోహరమైన తోటలు, పార్కులు వున్నాయి.

యిచటి తాయిపై అంతర్జాతీయ విమానాశ్రయంవద్దనే నేతాజీ సుభాస్ చంద్రబోసు విమాన ప్రమాదం జరిగిందని ప్రకటించారు. యిచట కొన్ని గంటలు, యీ విషయం తెలిసినవారు ఉన్నారేమో ముచ్చటిద్దామని గడిపాను. సమాచారం చెప్పేవారు ఎవరూ లేరు. యిది ఒక కట్టు కథ అని వారి అభిప్రాయం. యిటువంటి ఉదంతాలు కల్పించటంలో జపానువారు అతి నేర్పరితనంగా చేస్తారని చెప్పారు. అప్పుడు ఫార్మోజా జపాను వారి స్వాధీనంలో ఉన్నది. 1941లో మన భారతీయ నాయకులు స్వామి సత్యానందపూరి జ్ఞాని ప్రీతమసింగు, నీలకంఠ అయ్యరు, కైసు అగ్గరు ఖానులు సింగపూరు నుండి జపాను ప్రభుత్వంతో జాతిస్వాతంత్ర్య పోరాట ఉద్యమాన్ని గురించిన నిర్ణయాలు చేసుకొంటానికి టోకియో వెళ్ళుతున్నారు. యిచట విమాన ప్రమాదంలో యీ నలుగురు భారతీయులు చనిపోయారని చెప్పారు. కనుక నేతాజీ ఐదవవారు. నా ప్రయత్నాలన్నీ వృథా అయ్యాయి.

తాయిపై నుండి తిరిగి హాంకాంగు చేరాను. మరొక వారం రోజులు గడిపాను. యిండియన్ హైకమిషనులోని మిత్రులు గణపతిగారు విందు చేశారు. జ్యోతిష్కులుగా, ప్రాణాయామ అధ్యాపకులుగా అచట ఉన్న శ్రీ యర్రమిల్లి వెంకటశాస్త్రి(తణుకు)గారి అతిథిగా ఉన్నాను. హాంకాంగు కొట్టినపిండైంది.

## భారతీయత మూర్తీభవించే తాయిలాండ్

హాంకాంగు నుండి తాయిలాండు ముఖ్యపట్టణం బ్యాంకాక్ వచ్చాను. తాయిలాండు భారతదేశానికి అతిసన్నిహితమైంది. బర్మా సరిహద్దున ఉంది. తాయిభాషకు సంస్కృత భాష మూలం. అనేక మాటలు మనకు అర్థమౌతాయి. యిదిగూడా బౌద్ధ దేశం. అనేక బౌద్ధ విహారాలు, బంగారు బౌద్ధ విగ్రహాలు ఉన్నాయి. నూతనంగా నిర్మించిన పెద్ద హోటలు రామాహోటలని నామకరణంచేశారు. హాంకాంగ్, తాయివాన్, జపాను దేశాలు నవంబరు డిసెంబరు మాసాలలో చలిబాధ అంతగా లేక పోయినా మన కంటే శీతల ప్రదేశాలు. ఎంత పనిచేసినా, ఎంత భోంచేసినా వంటి నిండా దుసులుతొడిగినా, రాత్రంతా నిద్రమేల్కొనినా అలసట ఉండేదిగాదు. బ్యాంకాక్‌లో దిగిన వెంటనే వాతావరణంలో మార్పువచ్చింది. కోటు వగయిరాలు తీసివేయాల్సివచ్చింది. యిచటి ప్రజలదుస్తులలో గూడా అంతమార్పుగోచరమైంది. తాయి స్త్రీలు మళయాళ స్త్రీల మాదిరి రవిక, అద్దకపు లుంగీలు ధరిస్తారు. యిచట భారతీయులు గూడా అధిక సంఖ్యలో ఉన్నారు. సర్వ సాధారణంగా కనిపించుతారు.

బ్యాంకాక్ నగరం నేతాజీ సుభాస్‌చంద్రబోసుకు మన అజాద్ హింద్ ఫౌజుసైన్యాలకు కేంద్రం. మన జాతీయసైన్యాలు యీ నగర వీధులవెంట మన జాతీయగీతాలు ఆలపించుతూ, విన్యాసాలు, కవాతులు చేసేటప్పుడు చూసిన మిత్రులు వర్ణించుతుంటే ప్రతి భారతీయుని వళ్లు గగుర్పాటు చెందుతుంది. మన ఆసియా ఖండంలో భారతీయులంతటి అంగసౌష్ఠంగల జాతి, అందమైన జాతి లేదు. యింతటి పరాక్రమవంతులు, యుద్ధనిపుణులుగూడా లేరు. యీ విషయం నేతాజీ నాయకత్వాన అజాద్ హింద్ సైన్యాలు

సాధించి రుజువుచేసినై. మొదటి, రెండవ ప్రపంచ యుద్ధాలుగూడా బ్రిటీష్‌పెత్తందారులు, భారతీయ సైన్యాలద్వారానే విజయం సాధించ గలిగారు.

దూరప్రాచ్యంలో 'భారతీయ సంఘటన' తయారుచేసిన వారిలో స్వామి సత్యనారాయపూరి ప్రథముడు. నేతాజీని దూర ప్రాచ్యానికి తీసుకొచ్చిన వారిలో యీయన ప్రథముడు. కాని నేతాజీ వచ్చేలోపు స్వామిజీ విమానప్రమాదంలో చనిపోయాడు. నేతాజీ 1943 అక్టోబరు 21వ తేది బ్యాంకాగులో తాత్కాలిక భారత ప్రభుత్వాన్ని స్థాపించి, 23వ తేదీ బ్రిటీష్ సామ్రాజ్యంపై యుద్ధాన్ని ప్రకటించారు.

మూడు లక్షల భారతీయుల్ని సమీకరించారు. 135 లక్షల రూపాయలు సేకరించారు. బ్రిటీష్ ఆక్రమణలో వందలాది సంవత్సరాలు బానిసత్వంలో ఉన్న దిమపూరు, కొహిమా, టిడ్డం భూభాగలను విముక్తిచేసి, స్వేచ్ఛా పతాకాన్ని, త్రివర్ణ పతాకాన్ని ప్రప్రథమంగా నేతాజీ ఎగురవేశారు. ఈ స్వాతంత్ర్య విప్లవ సాయుధపోరాటంలో 36 వేల మంది భారతీయులు నేలకొరిగారు. అస్సాంలోని, మణిపూరు ప్రాంతాలలో అచటి పర్వతలోయల్లో కీకారణ్యాలలో యీ జాతీయసైనికుల స్వాతంత్ర్య నినాదాలు యిప్పటికీ ప్రతిధ్వనిస్తున్నాయి.

ఇచటి యీ అమరవీరులస్మృతి చిహ్నంగా ఒక పెద్దహాలు, లైబ్రరీ, నేతాజీ శిలాశాసనం తయారుచేయడానికి పదిలక్షల రూపాయలు అంచనావేయబడింది. మొన్ననే మన ముఖ్యమంత్రి శ్రీ బ్రహ్మానంద రెడ్డిగారు 25 వేల రూపాయలు యిస్తామని చెప్పారు. యిది ఆంధ్రులకే గర్వకారణమైన చర్య.

నేతాజీనిగురించిన చరిత్ర, పోరాట వివరాలు, నేతాజీకి సన్నిహితులైన పండిత్ రఘునాథ్ శర్మగారి నుండి స్వయంగా తెలుసు కొనే భాగ్యం గలిగింది. ఈయన అజాద్ హింద్ బ్యాంకి కోశాధి కారిగా పనిచేశారు.

నా పర్యటనలో జపాను, ఫార్మోజా, తాయిలాండులలో నేతాజీని గురించి విచారిస్తూనే వచ్చాను. విమానప్రమాదం అంతా కల్పిత మని స్పష్టమైంది. అయితే నేతాజీని యుద్ధానంతరం కలుసు కొన్నవారుగాని, నేతాజీనుండి లేఖలు అందినవారు గాని కనిపించ లేదు. టోకియోలో శ్రీ ఎ. యమ్. నాయరు నేతాజీ సజీవుడని గట్టిగా విశ్వసిస్తున్నారు. శ్రీ శర్మగారికి ఏమీ సమాచారంలేదు. యిటువంటి ప్రధాన విషయాలు ఎన్నో అచటి భారతీయులతో ముచ్చటించి, విషయసేకరణ చేసుకొనే అదృష్టంకలిగింది.



# గోబర్ గేస్ ప్లాంటులు

ఆంధ్రప్రదేశ్ ఖాదీ, గ్రామోద్యోగమండలి చిత్తూరుజిల్లాలోని పులిచెర్ల పంచాయతిసమితిలో యాభైముగ్గురు పారిశ్రామిక వేత్తలకు గోబర్‌గేస్ ప్లాంటులను (అంటే గోమయంతో గేస్‌ను తయారుచేసే నిమిత్తం రూ 45,825ల ఋణాన్నీ రూ 15,900 (ఒక్కొక్కరికీ రూ 300)ల గ్రాంటును మంజూరు చేసింది.

రూ 450 ల ఖర్చుతో 100 ఘ. అ. శక్తిగల టేంకులు (ఏడింటిని), రూ 825 ఖర్చుతో 150 ఘ. అ. శక్తిగల టేంకులు (ముప్పయ్ ఎనిమిదింటిని) రూ 1,200 ల ఖర్చుతో 200ఘ. అ. శక్తిగల టేంకులు (అయిదింటిని), రూ 1,575ల ఖర్చుతో 250 ఘ. అ. టేంకు(ఒకదానిని), రూ 1,875ల ఖర్చుతో 300ఘ.అ టేంకును(ఒకదానిని) నిర్మించడానికి యీ ఋణం ఉద్దేశించ బడింది.

ఒకొక్కటి 150 ఘ. అ. శక్తిగల గేస్ ప్లాంటులు రెండింటిని ఏర్పాటుచేసే నిమిత్తం పుంగనూరు పంచాయతీ సమితిలో యిద్దరు పారిశ్రామిక వేత్తలకు రూ 1,650 ల ఋణాన్ని, రూ 600ల గ్రాంటును మంజూరు చేశారు.

ఈ ఋణంపై వడ్డీ లేదు. దీనిని తొమ్మిది తేలిక వార్షిక వాయిదాల పద్ధతిని తిరిగి చెల్లించవలసివుంది.

ఈ గేస్‌ప్లాంటులవల్ల (1) వంటచెరకు అవసరం లేకుండానే, పొగ లేకుండానే వంట చేసుకోవచ్చు. (2) కిరసనాయిల ప్రమేయం లేకుండానే పెట్రొమాక్స్ దీపాలను వెలిగించవచ్చు. పొలాలో మనం వాడుతుండే అవుపేడ చాలా చక్కటి ఎరువు.

అందువల్ల యితర పంచాయతీ సమితులుకూడా యీ గేస్ ప్లాంటులను ఏర్పాటు చేసుకుని వంటచెరకును నాశనం కానీయకుండా చూడడం అవసరం. అందువల్ల అడవులను విచక్షణారహితంగా నిర్మూలించకుండా వుండేందుకు వీలవుతుంది. ఈ ప్లాంటుకు సంబంధించిన సమాచారమంతా ముఖ్య సేవికలవద్ద, విస్తరణాధి కారులు (పారిశ్రామిక)వద్ద, బ్లాకు అభివృద్ధి అధికార్లవద్ద లభించ గలదు.

సీరియల్



# తిరస్కృతి

—వాసిరెడ్డి సీతాదేవి

జరిగిన కథ

తెల్లవారితే సూర్యం పట్నం వెళ్ళిపోతాడు. సత్యం షికారు కెళ్ళాడు. సూర్యం, సరళ ఏకాంతంగా కలుసుకొని ఒకరికొకరు మనసులు విప్పుకొని మాట్లాడుకొనేందుకు అవకాశం కలిగింది, సరళ తన్నే ప్రేమిస్తున్నదని గ్రహించిన సూర్యం ఈ విషయాన్ని తాను పట్నం వెళ్ళిన తర్వాత అన్న సత్యంతో సరళనే చెప్ప మంటాడు. ఇంత దారుణంగా ప్రవర్తించడానికి సరళకు మనస్కరించలేదు. తెల్లవారి సూర్యం వెళ్ళిపోయాడు. నాలుగేళ్ళపాటు స్వగ్రామంవైపు ఎప్పుడూ అతను వెళ్లలేదు. సరళకు, అన్నయ్యకు పెళ్ళని శుభలేఖ వస్తే అప్పుడు వస్తాడు. సరళ, అత్తయ్యతో తను పెద్ద బావను పెళ్ళిచేసుకోనని నిక్కచ్చిగా చెప్పేస్తుంది. కాని అంతలోకే చిన్నప్పటి సంఘటన గుర్తుకొస్తుంది.

## 8

ఊ వతల నల్ల చెరువుగట్టు, గట్టుమీద ఇద్దరు బాలురు బొమ్మరిళ్ళు కడుతున్నారు. ఐదేళ్ళు దాటిన బాలిక కూర్చొని మార్చి మార్చి ఇద్దరూ కడుతున్న బొమ్మరిళ్ళను చూస్తూకూర్చుంది. ఇద్దరు బాలురూ పోటీపడి బొమ్మరిళ్ళు కడుతున్నారు. చిన్నవాడు కాలు లాగాడు. బొమ్మరిల్లు పడిపోయింది. మళ్ళీ కట్టటానికి సతమత మవుతున్నాడు. పెద్దవాడు కాలులాగాడు, బొమ్మరిల్లు చక్కగా నిల్చింది చిన్నవాడుకూడా ఎలాగో కట్టాడు. కాని అంతబాగా కుదరలేదు. ముందు కూలిపోయింది. కొంచెంగా బొమ్మరింటి ఆకారంమాత్రం నిల్చింది.

"ఎవరి ఇల్లు బాగుంది," చిన్నవాడు ప్రశ్నించాడు బాలికను. ఆబాలిక పెద్దవాడు కట్టిన బొమ్మరిల్లును చూపించింది,

"నువ్వు ఏ ఇంట్లో కూర్చుంటావు?" చిన్నవాడే మళ్ళి రెట్టించాడు పెద్దవాడు మౌనంగా బాలిక దెసచూశాడు.

"పెద్ద బావ ఇల్లేబాగుంది నేను అందులోనే ఉంటాను" అంటూ వెళ్ళి పెద్దబావ కట్టిన ఇంటిముందు కూర్చుంది.

పెద్దవాడు బొద్దుగా చామనచాయకంటే ఒకఛాయ ఎక్కువగా, ఆకర్షణీయంగా వున్నాడు, చిన్నవాడు పీలగా సన్నంగా, చామనచాయగా వున్నాడు, వాళ్ళిద్దరు రూపంలో గుణంలో కూడ అన్నదమ్ములలా అనిపించరు.

బాలిక మాటలకు కోపగించుకొని చిన్నవాడు తను కట్టిన ఇంటిని కసిగా కాళ్ళతో తొక్కసాగాడు.

"అలాకాదు. ఇలా కూర్చో!" అం పెద్దవాడు ఆ బాలికను బాసింపట్లు వేయించి కూర్చోపెట్టాడు

చిన్నవాడు దగరలో వున్న ఒక రాతి మీద కూర్చొని గడ్డి పరకను కసిగా కొరుకుతున్నాడు. బాలిక ఆ బాలుణ్ణి చూసి తొర్రి పళ్ళు చూపిస్తూ నవ్వింది.

"తొర్రిపళ్ళలో తొండ చిక్కిందీ." అంటూ ఏదో పాట పాడుతూ బాలికను ఉడికించటానికి ప్రయత్నిస్తున్నాడు చిన్నవాడు.

"చూడు పెద్దబావా ! చిన్నబావ ఏమంటున్నాడో! అంది.

కాని పెద్దబావ చెరువులో కలువపువ్వులు కోస్తున్నాడు. బాలిక కళ్ళు ఆనందంతో వెలిగిపోతున్నాయి.

గుప్పెడు నిండుగా కలువపువ్వులను కోసుకొని బాలిక దగ్గరకు వచ్చాడు పెద్దబావ. అన్నీ పక్కన పెట్టి బాలిక పక్కగా కూర్చున్నాడు. ఒక్కొక్క పువ్వే తీసుకొని, దాని కాడను విరుద్ధముఖాలుగా చిన్న ముక్కలుగా విరుస్తూ దండలా చేశాడు. పువ్వులు మాలకు లాకెట్ లా వేలాడుతున్నాయి. ఒక్కొక్కటే బాలిక మెడలో వేశాడు. బాలిక ఆనందంతో పరవశత్వం పొందింది.

"ఉండు. ఇంకా రెండు తెచ్చి నీ చేతులకు గాజులా కడతాను." అం మళ్ళీ చెరువు కేసి నడిచాడు పెద్దవాడు.

అంతవరకూ కన్నార్పకుండ చూస్తూకూర్చున్న చిన్నవాడు గబగబా లేచి విసురుగా వచ్చాడు. రోషంగా బొమ్మరింటిని తొక్కేశాడు. వెనక్కు తిరిగి చూసిన బాలిక మెడలోని మాలల్ని బలంగా గుంజాడు. అవి తెగాయి. కాని బాలిక మెడ ఒరిపిడికి మంటపుట్టి పెద్దగా ఏడవసాగింది. పెద్దవాడు గబగబా రావటంచూసి చిన్నబావ బాలిక వీపుమీద దబదబా నాలుగు బాది పరుగు లంకించుకున్నాడు. బాలిక తారస్థాయిలో ఏడవసాగింది. ఏడుస్తున్న బాలికను ఓదార్చి, చెయ్యిపట్టుకొని ఇంటివైపుకు నడిపించాడు పెద్దవాడు.

తల్లిచేత దెబ్బలు తిన్న సూర్యం ఆ రోజు అన్నం తినకుండానే ఏడ్చిఏడ్చి నిద్రపోయాడు.

# 9

భద్రయ్య కొత్తగా కడుతున్న డాబాముందు పిల్లలు ఆడుకుంటున్నారు. ఇసుక రాసులుపోసి ఉన్నాయి. మరోపక్కన ఇటుకలు కుప్పలుగా పోసివున్నాయి. కమలా సరళా బొమ్మరిల్లు కడుతున్నారు. ఇద్దరికీ సరిగా కుదరటంలేదు. కాలు వున్నంతవరకూ కుదిరినట్టే అనిపించి కాలుతియ్యగానే పడిపోతున్నాయి. సరళకు రోషంతో ఏడుపు వస్తూవుంది. అదిచూసి సూర్యం ఇంకా ఉడికిస్తున్నాడు.

"పెద్దబావా నాకు బొమ్మరిల్లు కట్టిపెట్టవూ ?" అడిగింది. సరళ అప్పుడే అక్కడకు వచ్చిన సత్యంతో.

అడిగిందే తడవుగా సత్యం కాలు ఇసుకలోకి దూర్చి కూర్చుని బొమ్మరిల్లు కట్టసాగాడు. అది చూసిన సూర్యానికి ఉలుకుబోతుతనం వచ్చింది.

"కమలా నీకు నేను కట్టిపెట్టనా ?" అంటూ కమల జవాబు కోసం ఎదురుచూడకుండానే బొమ్మరిల్లు కట్టటానికి ఉపక్రమించాడు. కమల సూర్యం పక్కనే కూర్చుని కుతూహలంగా, ఉత్సాహంగా చూడసాగింది. సూర్యం కళ్ళు సరళ మీదనే ఉన్నాయి. సత్యం బొమ్మరిల్లు కట్టటం పూర్తయింది. సరళ సంతోషంతో కళ్ళు టపటపలాడిస్తూ సూర్యం వైపు చూసింది. సూర్యం సరళనే చూస్తూ విరక్త్యంగా కాలులాగాడు. బొమ్మరిల్లు పడిపోయింది. అదిచూసి సరళ చప్పట్లు కొట్టి నవ్వింది.

"సత్యం నాకూ కట్టిపెట్టవూ" అంటూ కమల సత్యం దగ్గరకు వెళ్ళింది. సూర్యం కోపంతో ఊగిపోయాడు.

"ఏం బావా ! నీకు చాతకాలేదా ?" నవ్వుతూ ప్రశ్నించింది సరళ. సూర్యానికి అరికాలి మంట నెత్తికెక్కింది. విసురుగా వచ్చి సరళను బలంగా తోశాడు. సరళ వెళ్ళి నడిరోడ్డుమీద బోర్లా పడది. కెవ్వున కేకవేసింది. ఒకవైపునుంచి ఇటుకల లారీ రయ్యిన వస్తూంది. సత్యం క్షణంలో పరిస్థితిని గ్రహించాడు మెరపులా వెళ్ళి సరళను లేవదీసి పక్కకు నెట్టడం, లారీ భయంకరంగా 'కీచ్' మంటూ అరచి ఆగిపోవటం రెప్పపాటులో జరిగింది.

క్షణంలో లారీచుట్టూ జనం చేరారు.

"పాపం పిల్లవాడు పడిపోయాడు."

"ఎవరి కుర్రవాడు ?"

"చంద్రయ్యగారి పెద్దవాడు."

జనంలోంచి రకరకాల మాటలు వినిపిస్తున్నాయి. నెత్తురు మడుగులో ఉన్న సత్యాన్నిచూసి సరళకు కళ్ళు తిరిగాయి.



"అన్నయ్య లారీ కింద పడిపోయాడు" అంటూ ఏడుస్తూ సూర్యం ఇంటివైపుకు పరుగు తీశాడు.

సరళ కళ్ళు తెరిచింది. నాలుగువైపులా పరికించింది. అది తమ ఇల్లుఅనీ, తను మంచంమీద పడుకొని వున్నాననీ తెలుసుకుంది. మంచం పక్కనే కూర్చొని ఆదురాగా సరళ ముఖంలోకి చూస్తూంది పార్వతమ్మ. సరళ కళ్ళు తెరవగానే ఆమె కలవరం కొంతవరకు తగ్గింది.

"ఏం తల్లీ ! ఎలావుంది ? మంచినీళ్ళు తాగుతావా ?"

సరళ దిగ్గున లేచి కూర్చుంది మంచంమీద. తల్లి లేవవద్దని వారిస్తున్నా వినిపించుకొనే స్థితిలో లేదు. "అమ్మా ! పెద్దబావ !" అంటూనే ఆమె వణికిపోయింది. అంతక్రితం ఆమె చూసిన దృశ్యం కళ్ళముందు కదిలింది, నిలువునా కంపించిపోతున్న పసిదాన్ని తల్లి రెండుచేతుల్లో పొదివి పట్టుకొని గుండెలకు హత్తుకుంది. సరళ ఉన్నట్టుండి బావురుమంది.

"ఊరుకో తల్లీ ! బావ బాగానే వున్నాడు." అందితల్లి. పార్వతమ్మ ఆ మాటలు పిల్లను ఓదార్చటానికి అన్నవేనని ఆమె కంఠంలోని కలవరపాటే చెబుతుంది. పార్వతమ్మ కంఠంలో ఆ పసిదానికి లీలగా అపశృతి వినిపించింది.

"బావను చూపించు. బావ ఎక్కడ ?" అడిగింది వెక్కి వెక్కి ఏడుస్తూ.

"బావ ఇక్కడ లేదమ్మా! గుంటూరు తీసుకెళ్ళారు." అంది పార్వతమ్మ కళ్ల ఒత్తుకుంటూ.

"ఎందుకూ "చటుక్కున తల్లి గుండెల్లో వున్న తలను పైకెత్తింది.

"బావకు కొద్దిగా దెబ్బ తగిలిందిగా! ఆసుపత్రికి తీసుకెళ్ళారు." అంది పార్వతమ్మ కూతురు తలను గోముగానిమురుతూ.

"చిన్నబావ ?"

"ఇక్కడే వున్నాడు. పిలవమంటావా ?"

"వద్దు. నేను చిన్నబావతో మాట్లాడను. చిన్నబావ జట్టు వుండనే వుండను." అంది సరళ కోపంగా.

"చిన్నబావ ఏం చేశాడమ్మా ?"

"చిన్నబావ నన్ను రోడ్డుమీదకు నెట్టాడుగా. నన్నులాగుతూ పెద్దబావ లారీకింద పడ్డాడు."

"పెద్దబావ గుణం బంగారం. పువ్వు పుట్టగానే పరిమళిస్తుందట. గొప్ప బుద్ధులవాళ్ల చిన్నప్పుడు కూడా గొప్ప పనులే చేస్తారు." ఆలోచనగా అంది పార్వతమ్మ దూరంగా దేన్నో చూస్తూ.

సరళ తల్లి ఒళ్ళోనుంచి జారి మంచంమీద పడుకుంది.

"అత్తయ్యను పిలువమ్మా!" అంది నీరసంగా.

"అత్తయ్య, లేదు తల్లీ. అత్తయ్య, మామయ్య ఇద్దరూ బావను తీసుకొని గుంటూరు వెళ్ళారు."

"అమ్మా!" ఆలోచిస్తూ అంది సరళ.

"ఏం సరళా ?"

"పెద్దబావ చచ్చిపోతాడా ?" సాలోచనగా అంది.

పార్వతమ్మ త్రుళ్లిపడింది. సరళ నోరు మూసింది అప్రియత్నంగానే. ఆమె కళ్ళలో గిర్రున నీరు తిరిగింది. వెంటనే ఏమనాలో తోచలేదు. సరళ రెప్పవేయకుండా తల్లి ముఖంలోకి చూస్తూ పడుకుంది.

"తప్పమ్మా అలా అనకూడదు. పెద్దబావకు నయం అవుతుంది కులాసాగా తిరిగి వస్తాడు."

సరళ ఓక్షణం తల్లి ముఖంలోకి సందేహంగా చూసింది.

ఆ పసిమనస్సును ఏదో అనుమానం పీడిస్తుందని పార్వతమ్మ గ్రహించింది.

"మరేమో! అప్పుడు కమలా వాళ్ళ అన్నయ్యను ఆసుపత్రికి తీసుకెళ్ళితే మళ్ళీ రాలేదుగా. రామం వాళ్ళ అమ్మకూడా ఆసుపత్రిలో చచ్చిపోయిందిగా ?"

చచ్చిపోయే వాళ్ళంతా ముందు ఆసుపత్రికి వెళతారు అనే నమ్మకం ఒకటి ఏర్పడింది ఆ చిన్న తలకాయలో.

"ఆసుపత్రికి వెళ్ళిన వాళ్ళంతా చచ్చిపోరమ్మా!" అంది పార్వతి అంతకంటే ఏం జవాబివ్వాలో తోచక.

"అమ్మా చచ్చిపోయిన వాళ్ళు ఎక్కడకు వెళతారు ?"

"దేముడి దగ్గరకెళతారమ్మా!" ఆ సంభాషణను పెంచటం ఇష్టంలేదు పార్వతికి.

"కాదు నక్షత్రాలు అవుతారు." అంది. తల్లికంటే తనకే ఎక్కువ తెలుసు అన్నట్లుంది ఆమె ధోరణి.

"ఎవరు చెప్పారు ?"

"అత్తయ్య చెప్పింది ?"

"ఎప్పుడు ? "

"అప్పుడు! నాన్న చచ్చిపోయినప్పుడు. అప్పుడు అత్తయ్యను నాన్న ఎక్కడకు వెళ్ళాడని అడిగితే చెప్పింది. నేను రోజూ నాన్న చుక్కను చూస్తూనే వున్నాగా ? అప్పుడప్పుడు నాన్నచుక్కతో మాట్లాడతానుకూడ." ఆ మాటలంటున్నప్పుడు సరళ కళ్ళు మిలమిలలాడాయి నాన్న ఎలావుంటాడో కూడా సరిగ్గా గుర్తులేని సరళ నాన్నపేరు చెబుతూ తన్మయత్వం పొందుతుంది. పార్వతమ్మ భర్తను తలచుకుంటూ గాఢంగా నిట్టూర్చింది.

"పెద్దబావకూడా చచ్చిపోతే ఆకాశంలో నక్షత్రం అయిపోతాడు. అప్పుడు నేనుకూడా చచ్చిపోయి బావపక్కనే బుల్లినక్షత్రాన్ని అవుతాను. అప్పుడు పైనవుండి మిమ్మల్నందర్నీ చూస్తూ వుంటాను." కల్పనా ప్రపంచంలో మునిగిపోయి దాన్నే వాస్తవంగా అనుకుంటూ మాట్లాడుతూ పోతుంది.

"సరళా! ఏమిటమ్మా ఆ మాటలు ?" కలవరంగా కేకవేసింది పార్వతమ్మ.

"అప్పుడు చిన్నబావను అసలు మా పక్కకే రానివ్వం. తను వంటరిగా దూరంగా నక్షత్రం అయిపోతాడు." సూర్యాన్ని తమ దగ్గరనుంచి నెట్టేసి కక్ష తీర్చుకుంటున్నట్లు ఆనందిస్తూ అంది సరళ. పార్వతమ్మ బెంబేలు పడిపోయింది. పిల్లకు మతిగాని పోలేదుగదా ?

"అమ్మా! సరళా! ఏమిటమ్మా అలా మాట్లాడుతున్నావు ? ఇటుచూడు. నాకు భయంగా వుందే తల్లీ!" పార్వతమ్మ పిల్లను గట్టిగా కుదుపుతూ అంది.

సరళ ఈ లోకంలోకి వచ్చింది. "అమ్మా నాకు ఆకలేస్తుందే" అంది.

పార్వతమ్మకు పోతున్న ప్రాణాలు కుదటపడ్డట్టు అయింది.

"ఇప్పుడే పాలు తెస్తానమ్మా!" అంటూ లోపలకు వెళ్ళిపోయింది పార్వతమ్మ.

పార్వతమ్మ పాలుకాస్తూ పొయ్యికి ఎదురుగా కూర్చుంది. ఆమె బుర్ర ఆలోచనలతో ఈగలు ముసిరిన బెల్లపుగడ్డలా అయింది.

పార్వతమ్మ మాధవయ్య చెల్లెలు. మాధవయ్య కంటే చాలా చిన్నది. మాధవయ్యకు వేరే అక్కచెల్లెళ్లుగానీ, అన్నదమ్ములుగానీ లేరు. సరళకు మూడేళ్లు నిండాయి. ఒకనాటి రాత్రి పొలంనుంచి తిరిగి వస్తుండగా గట్టుమీద ఏదో చురుక్కున కుట్టిందనీ పార్వతమ్మతో ఇంటికి వస్తూనే అన్నాడు భర్త సాంబయ్య. వెంటనే బిగుసుకొని నురగలుకక్కి కన్నుమూశాడు. పార్వతమ్మ బ్రతుకులో చీకట్లు కమ్ముకున్నాయి మాధవయ్య, శాంతమ్మ పార్వతిని తీసుకొని వచ్చారు. అప్పటి నుంచి పార్వతమ్మ బిడ్డను పెట్టుకొని మాధవయ్య ఇంట్లోనే వుంది. మాధవయ్య ఇంటి కొచ్చి నాలుగేళ్ళయింది. అన్నా, వదినా చాల ఆదరణ చూపించారు. మాధవయ్య పార్వతమ్మ పొలం నాలుగెకరాల మాగాణీ మీదవచ్చే ఆదాయాన్నీ. దమ్మిడీ కదల్చకుండా సరళ పేరుమీద బ్యాంక్‌లో వేస్తూవుండేవాడు.పార్వతి ఆ విషయంలో ఒకటి రెండు సార్లు అన్నతో ఘర్షణపడింది.

"నన్ను నువ్వు పరాయిదాన్నిగానే చూస్తున్నావు అన్నయ్యా!" అంది ఒకనాడు.

"ఏమిటమ్మా!" అన్నాడు తెల్లబోయి మాధవయ్య.

"లేకపోతే నాడబ్బు ఒకటీ నీడబ్బు ఒకటీనా? అంతా తీసుకెళ్ళి బ్యాంకులో వెయ్యకపోతే నువ్వు వాడుకోకూడదాయేం?" అంది పార్వతమ్మ.

మాధవయ్య నవ్వి ఊరుకున్నాడు.

"మాట్లాడవేం అన్నయ్యా!"

"ఇప్పుడు అంత అవసరం ఏంవచ్చిందమ్మా! ఆడపిల్ల సొమ్ము వాడుకోకూడదు."

"మేము ఇద్దరం పడితినడంలేదు? ఎంతకాలమని ఊరికే తినమంటావు!" అంది పార్వతి.

"ఎంతమాట అన్నావమ్మా! నాతోడబుట్టినదానికి అన్నంపెట్టి డబ్బు తీసుకోమంటావా?" బాధగా అన్నాడు మాధవయ్య

"అదికాదన్నయ్యా! నువ్వంత బాధ పడతావనుకుంటే అనే దాన్నికాదు. అలాగన్నా ఆ డబ్బువాడుకుంటావని అన్నాను. అంతే!" అంది పార్వతమ్మ.

పాలుపొంగి పొయ్యిలో పడ్డాయి. వాసన వచ్చి పార్వతి ఆలోచనా ప్రపంచంనుంచి బయట పడింది. పాలుదించి ఆరబోస్తూ మళ్లీ ఆలోచనల్లోకి జారిపోయింది.

సరళ పుట్టినప్పటినుంచి సత్యం భార్యగానే అందరూ ఊహించుకుంటున్నారు. సరళకు సత్యం మీదవున్న అభిమానం చూసి పార్వతమ్మ పరవశించి పోయేది. ఇప్పుడు ఈ అనుకోని అవాంతరం వచ్చిపడింది.

"భగవాన్! ఎంత పని చేశావు? పసివాళ్లంటేనూ ఎందుకయ్యా నీకంత కసి?" పార్వతమ్మ మనసులో అనుకోబోయి పైకే అనేసింది.

సత్యానికి ఎలావుందో! చెయ్యి పూర్తిగా నలిగిపోయింది! పాలగ్లాసు తీసుకొని ఆలోచిస్తూనే పార్వతమ్మ సరళ దగ్గరకు వచ్చింది. సరళ దుప్పటేసి ముసుగు పడుకొనివుంది; సరళ మౌనంగా పాలు తాగేసింది. మళ్లీ ప్రశ్నలు వేస్తుందేమోనని భయపడిన పార్వతమ్మ మనస్సు కొంచెం తేలికపడింది.

"ఇక కళ్లు మూసుకొని పడుకో! నిద్రపో!" అంటూ ఖాళీగ్లాసు తీసుకొని లోపలకు వెళ్ళింది పార్వతమ్మ. సరళకు కళ్లుమూసుకోవాలంటే భయంగా వుంది. కళ్లు మూసుకుంటే చాలు.........అంతా ఎరుపు........రక్తమయం....... అందులో చైతన్యరహితంగా పడివున్న సత్యం...... కనిపిస్తున్నాడు. కళ్లు తెరుచుకొనేపడుకుంది. గడపల్లో ఏదో అలికిడయింది. తల తిప్పి చూసింది. గడపలో సూర్యం అపరాధిలా నిల్చొని వున్నాడు. కళ్లు ఏడ్చినందువల్ల ఉబ్బుగా వున్నాయి. చెక్కిళ్ళూ, ముక్కు ఎర్రగా వున్నాయి. మేఘావృతమైన ఆకాశంలా వుంది సూర్యం ముఖం. అతను కనిపించగానే సరళ తల తిప్పేసుకుంది.

సూర్యం చిన్నగా పిల్లిలా వచ్చి సరళ మంచం పక్కనే నిల్చున్నాడు. అయినా సరళ అది గమనించనట్లే ఉండిపోయింది.

"సరళా!" రుద్రకంఠంతో పిల్చాడు సూర్యం.

సరళ ఉలకలేదు పలకలేదు. తిరిగి కూడా చూడలేదు.

"నామీద కోపం వచ్చిందా? నాతో మాట్లాడవూ?" దుఃఖం కంఠందాకా వచ్చి ఆగిపోయింది.

"అవును! నీతో మాట్లాడను. నన్ను పలకరించకు!" అంది సరళ సూర్యం వైపు చూడకుండానే. సూర్యంలో దుఃఖం కట్టలు తెంచుకుంది. బావురుమన్నాడు. సరళ గబుక్కున లేచి కూర్చుంది. పార్వతమ్మ ఏడుపువిని పరుగెత్తుకొచ్చింది గదిలోకి. సూర్యం ఏడవటంచూసి ఆంత్రగా "ఏంబాబూ ఏది జరిగింది" అంది ఆప్యాయంగా దగ్గరకు తీసుకుంటూ.

"అత్తయ్యా!" అంటూ పార్వతిని చుట్టుకొని వెక్కివెక్కి ఏడవసాగాడు.

"అత్తయ్యా; నేను అన్నయ్యను లారీకింద నెట్టలేదు సరళన్నుకూడా ఉత్తినే ఆటల్లో నెట్టాను." అన్నాడు వెక్కుతూ

"ఊరుకోబాబూ! నువ్వెందుకు అన్నయ్యను లారీకిందకు నెడతావు?" అంది సూర్యం పడుతున్న ఆవేదనను అర్థంచేసుకొని

"నీవల్లే బావ లారీ కిందపడ్డాడు." సరళ కోపంగాఅరిచింది.

"అబద్దం. నేను అన్నయ్యను లారీకింద పడెయ్యలేదు." ఏడుపులోనే గట్టిగా అరిచాడు సూర్యం.

"సరళా నువ్వూరుకో!" పార్వతమ్మ కూతుర్ని మృదువుగా మందలించింది.

"ఊరుకోబాబూ! ఏడవకు. ఆటల్లో కోపంవచ్చి సరళను నెట్టావు. అన్నయ్యను నువ్వేమీచేయలేదు. ఊరుకో!" అంటూ ఊరడించింది సూర్యాన్ని పార్వతమ్మ.

" సరళ నాతో మాట్లాడదంట! " అన్నాడు సూర్యం కన్నీళ్ళ చొక్కాతో తుడుచుకుంటూ.

" ఎందుకు మాట్లాడదూ? ఉట్టుటినే అలా అంటుంది. రేపటి నుంచి అదే మాట్లాడుతుంది." అంది పార్వతమ్మ

"అత్తయ్యా! మరేమో సరళ ఎప్పుడూ అన్నయ్యతోనే ఆడుతూ వుంటుంది నన్ను వాళ్ళిద్దరూ ఆటల్లో చేర్చనివ్వరు అందుకే అన్నయ్య అంటే నా కోపం!" కపటం తెలియని పసివాడు తన బాధను నిష్కపటంగా చెప్పుకున్నాడు.

పార్వతికి సూర్యం బాధ అర్థం అయింది. జాలివేసింది. చిన్నపిల్లల మనస్సులు మెత్తటి మట్టిముద్దలాంటివి. వాటికి ఏమాత్రం ఒత్తిడి తగిలినా రూపంలో వికృతి ఏర్పడుతుంది.

" చెప్పుకో మీఅత్తయ్యతో నాకేంభయమా? నేనుసీతో అసలు మాట్లాడనే మాట్లాడను. " అంటూ అటుతిరిగి పడుకుందిసరళ.

"చూడత్తయ్యా "

"దానిమాటలకేంలే. నేను మాట్లాడేలా చేస్తానుగా?" అంటూ సూర్యాన్ని వంటింట్లోకి తీసుకెళ్ళింది. బుజ్జగిస్తూ అన్నం తినిపించింది.

(సశేషం)

---

# ఆరోగ్యరంగంలో గత రెండు దశాబ్దాలలో సాధించిన అభివృద్ధి

సుమారు పదిహేను సంవత్సరాల క్రితం మనదేశంలో సగటు ఆయుః ప్రమాణం 32 సంవత్సరాలు మాత్రమే కాని యిప్పుడిది 50 సంవత్సరాలకు పెరిగింది. మరణాలస్థాయి వెయ్యికి 27 నుంచి 17కు తగ్గింది ఇదేవిధంగా శిశు మరణాలస్థాయికూడా 183 నుంచి 109కు తగ్గింది.

వ్యాధులను అరికట్టడానికిఉద్యమాలు సాగించిన ఫలితంగా ప్లేగువ్యాధి దాదాపు పూర్తిగా తుడిచిపెట్టుకొని పోయింది. కలరావల్ల మరణించేవారి సంఖ్య సంవత్సరానికి 87,000 నుంచి 8,300కు తగ్గింది. ఇదేప్రకారం మశూచికం వల్ల చనిపోయేవారి సంఖ్య సంవత్సరానికి 40,000 నుంచి 9,000 కి తగ్గింది. ఇప్పటివరకు 7.3 కోట్ల మందికి ప్రాథమిక టీకాలు, 41.4 కోట్ల మందికి తిరిగి టీకాలు వేయడం జరిగింది. మలేరియా వ్యాధి పీడితులసంఖ్య సంవత్సరానికి 7.5 కోట్ల నుంచి 1.1 లక్షలకు తగ్గింది.

దాదాపు సగం జనాభాను, క్షయవ్యాధిని గురించి తెలుసుకోవడానికి పరీక్ష చేయడం జరిగింది. అయిదుగురిలో ఒకరికి చొప్పున బి.సి.జి టీకాలు వేయబడినవి.

దేశ విభజనకు పూర్వం భారతదేశం మొత్తం మీద ఎన్ని ఆసుపత్రులు చికిత్సాలయాలు వుండేవో వాటికి రెట్టింపు సంఖ్యలో యిప్పుడు మనదేశంలో ఆసుపత్రులు, చికిత్సాలయాలు వున్నాయి.

పడకలసంఖ్య మూడు రెట్లకంటే ఎక్కువగా వుండగా డాక్టర్లసంఖ్య దాదాపు రెట్టింపువుండి, నర్సులసంఖ్య ఆరింతలు పెరిగింది.

| | దేశవిభజన జరుగకముందు | ఇప్పుడు |
|---|---|---|
| ఆసుపత్రులు, చికిత్సాలయాలు | 7,400 | 14,600 |
| పడకలు ... | 73,000 | 2,40,100 |
| డాక్టర్లు ... | 47,500 | 86,000 |
| నర్సులు ... | 7,000 | 45,000 |
| మంత్రసానులు ... | 5,000 | 35,000 |

పారిశుధ్యం, మంచినీటిసరఫరా ఇవి ప్రజారోగ్య కార్యక్రమంలోభాగం. మొదటి మూడు ప్రణాళికా కాలాలలో 1030 పట్టణ, 2113 గ్రామీణ నీటి సరఫరా పారిశుధ్య పథకాలు మంజూరు చేయబడినవి.

బాలలకూ, బాలింతలకూ వీరసంఘాలు అంతర్జాతీయ సంస్థల సహాయంతో ఉచితంగా పాలుసరఫరా చేస్తున్నారు. కొన్ని రాష్ట్రాలలో పాఠశాల సమయంలో పిల్లలకు ఉచితంగా భోజనంకూడా పెడుతున్నారు.



# గాంధీ మహాత్ముడు

## మన గ్రామములు

మల్లాది సుబ్బారావు

మన భారత దేశ ఆర్థిక విధానములో మహాత్ముని ఆర్థిక సిద్ధాంతములు చాలా విలువైనవి.

సత్యము, అహింసల శక్తి అమోఘమైనదని నిరూపించిన ద్రష్ట మహాత్మాగాంధీ. జాతి, మత, కుల, వర్ణ భేదములు లేకుండా సమాజంలోని జనులందరు కలసి మెలసి నడవవలెనని నుడివిరి. రాట్నమునుండి నూలు తీయుటకు ఎక్కువ ప్రాధాన్యత యిచ్చిరి. కుటీర పరిశ్రమలు ఎక్కువగా స్థాపించవలెననీ మన జాతీయ జీవనంలో యీ పరిశ్రమల పాత్ర చాలా విలువైనదనీ మన ప్రజల బీదరికాన్ని పోగొట్టడానికి యివి ఎంతో సహకరించగలవని తెలిపారు. గాంధీజీ మన భారత జాతిని ఆర్థికంగా అత్యున్నత స్థాయికి చేర్చవలెనని ఆకాంక్షించిరి. వారి ఆర్థిక విషయ పరిశీలనలు నేటికీ సత్యమనీ, మన దేశమునకు పట్టిన యీ ఆర్థిక కుంటుతనం వారు నుడివిన ఆర్థిక సూత్రములతో, తిరిగి అత్యంత వైభవముగా రూపొందింకోవచ్చనీ తేలినది మన దేశమునందు ప్రస్తుతం సమస్తమైన సంపద కలదు. అయిననూ బీదరికాన్నే ఎక్కువగా చూచు చున్నాము.

ఈ రోజున మొత్తంమీద ధనికులు, బీదలు యీ రెండు తెగలవారును ఎంతగనో బాధపడుచున్నారు. ధనికులు విపరీతముగా చెడ్డ గుణములను అలవాటు చేసుకొనటవల్ల, విశ్రాంతి తీసుకొనుటకు కూడ వీలులేక కాలాన్ని సంపాదనలకు వినియోగించుటవల్ల ఏమాత్రము సంతోషము లేక వున్నారు. బీదలు నిత్యము అనుభవించెడి బీదరికమువలన అశాంతితో దుఃఖించుచున్నారు. రోజురోజుకు మనలోని కోరికలు విజృంభించుచున్నవి. గాంధీజీ మూడవ తరగతి రైలుపెట్టెలో ప్రయాణముచేసి, సామాన్య ధర్మమును బోధించెను. నేటి మన దేశ ఆర్థిక పరిస్థితిని కూలంకషంగా గుర్తించి వారి సిద్ధాంతములను విశదీకరించిరి. మన దేశంలో వున్న ఆర్థిక చెడుగులు బ్రిటను మున్నగు దేశాలలో కూడా కన్పడినవి. మన ప్రజలు మన ఆర్థిక కార్యక్రమములను, మన దైవిక కార్యక్రమములను రెండుగా జూచుచున్నారు. ఈ రెంటిని సమన్వయించిన మన జీవితంలో ఎక్కువ లాభములను పొందవచ్చని మహాత్ముడు తెలియజేసెను. దైవ కార్యములందు మనస్సును మళ్ళించకుండా వున్నందున ఎక్కువ మానసికపు అలసట, న్యూనత కల్గుతున్నవని గాంధీజీ అన్నారు.

సాంఘిక, నైతిక విలువల దృష్ట్యా మన ఆర్థిక విధానాన్ని మలుచుకొన వలెను అని గాంధీజీ బోధించిరి. మంచి కార్యక్రమాలు తలపెట్టిన, తప్పక మంచికి విజయము కల్గును. గాంధీజీ నుడివిన విలువలను యిచ్చట పొందుపరచుచున్నాను.

1. నిష్కపటంగా జీవితాన్ని గడపవలెను. కోర్కెలను స్వతహాగా అదుపులో పెట్టుకొనవలెను పొదుపు అలవాటు చేసుకొనవలెను. దీనివలన ఎక్కువ మనశ్శాంతి కలుగును.

2. మన జాతీయ విధానంలో స్వదేశ ధర్మము పాత్ర గొప్పది. స్వదేశాభిమానమువలన యిచ్చట తయారగు ప్రతి వస్తువును మనమే కొనుగోలు చేసిన, మన దేశప్రజలకు సహాయం చేసినట్లగును. అహింసా విధానము వలన, స్వదేశాభిమానము వలన మన జాతీయ ఆర్థిక రంగంలో ప్రస్తుతం సమాధాన పడని

(తరువాయి 62 వ పుటలో)

## పండుగలూ పర్వదినాలూ

# శ్రీ కృష్ణ జన్మాష్టమి

### ఇవటూరి కామేశ్వరరావు

అష్టమి రోహిణి ప్రొద్దున
నష్టమ గర్భమున బుట్టి యా దేవకికిన్
దుష్టుని కంసు వధింపవె
సృష్టి ప్రతి పాలనంబు సేయగ కృష్ణా.

అని చిట్టి తమ్ముళ్ళు, చిన్నారి చెల్లాయిలూ వల్లెవేసే కృష్ణ శతక పద్యం మనందరికీ తెలిసిందే. శ్రీ కృష్ణుని పేరు చెప్పే సరికి ఎందరెందరో మహాభక్తులు తన్మయత్వంలో మునిగిన సన్ని వేశాలు కనిపిస్తాయి. జన్మాష్టమి అనేసరికి మనకు ఆ దివ్య మంగళ విగ్రహుడు, సకల కల్యాణ గుణాలకు ఆశ్రయుడు, వేద వేదాంతవేద్యుడు అయిన శ్రీకృష్ణపరమాత్మ మన కన్నులముందు సాక్షాత్కరిస్తాడు.

శ్రీకృష్ణుడు జన్మించినప్పటి పరిస్థితులు చాలా క్లిష్టంగా ఉన్నాయి. భూ భారంతో బాటు అధర్మం పెరిగిపోసాగింది. దానవులు పెట్టే ఘోరహింసలు భరించలేక భూదేవి, ఇంద్రాది దేవతలు శ్రీమహావిష్ణువును ప్రార్థిస్తారు. వారి ప్రార్థనలు ఆల కించి తాను భూలోకంలో అవతరించి దుష్టులను సంహరిస్తానని ఆయన అభయమిస్తాడు.

శ్రీకృష్ణుడి మేనమామ కంసుడు దుర్మార్గుడు. తన చెల్లెలైన దేవకీదేవికి పుట్టిన ఎనిమిదో సంతానంద్వారా తనకు ప్రాణాపాయం ఉందని తెలుసుకొని దేవకీ వసుదేవుల్ని చెరసాలలో బంధిస్తాడు. ఒకరొకరినే పుట్టిన బిడ్డను పుట్టినట్లు తీసుకపోయి కంసుడు నిర్దాక్షిణ్యంగా చంపేస్తాడు. తరువాత అష్టమ గర్భాన శ్రావణమాసంలో కృష్ణ పక్షపు అష్టమినాటిరాత్రి భగవంతుడు శ్రీకృష్ణుడుగా చెరసాలలో జన్మిస్తాడు. ఆనాడు అర్ధరాత్రివేళ, వసుదేవుడు భగవదాజ్ఞానుసారం యమునానదిని దాటి అక్కడ నందునింటికి చేరి తన బిడ్డను యశోద ప్రక్కలో పరుండబెట్టి, ఆమెకు పుట్టిన ఆడశిశువును తీసుకువచ్చి దేవకి కిస్తాడు. ఈలోగా దేవకీదేవి ప్రసవించినదన్న వార్త కంసుడు తెలుసుకొని, పుట్టినది ఆడపిల్ల అని దేవకీవసుదేవులు చంపవద్దని ఎంత బ్రతిమాలుకున్నప్పటికీ వినకుండా కంసుడు ఆపసికందును సంహరింపబోతాడు, కాని ఆ పసిబిడ్డ వెంటనే మాయాశక్తి రూపం ధరించి కంసుని చంపేవాడు ఇదివరకే జన్మించాడనీ, అతనికిక మృత్యువు తప్పదనీ చెప్పి అంతర్ధానమవుతుంది.

బాలకృష్ణుడు రేపల్లెలో పెరిగి విద్యాబుద్ధులు నేరుస్తూనే తన దివ్యలీలల ద్వారా అందరికీ విస్మయాశ్చర్యాలు కలిగిస్తూ ఎన్నెన్నో మహత్కార్యాలు సాధిస్తాడు. పూతన సంహారం, నలకూబరుల శాపవిముక్తి, యశోదకు సకల చరాచరమయమయిన విశ్వరూపాన్ని చూపడం, గోవర్ధనోద్ధరణం, కాళీయ మర్దనం, కంస సంహారం మొదలైన గోపాలకృష్ణునిలీలలు మన అందరికీ వీనుల విందుగొలుపుతూనే ఉంటాయి. ఈ మహానీయుని ఉపా సించిన భక్తులకు ఏ యిక్కట్టులూ దరికి రాకుండా కాపాడే పరమ కరుణామయ మూర్తిగా ఆయన గోచరిస్తుంటాడు. శైశవావస్థ మొదలు, సర్వకాల సర్వావస్థల్లోనూ బహువిధ సంక్లిష్ట సమస్యలను లోకకల్యాణ సంధాయకంగా పరిష్కరించిన మహానుభావుడు. ఆయనకు అందరూ యిష్టులే, చివరకు తన శత్రువులకు కూడా యిష్టుడుగానే భాసించిన పూర్ణపురుషుడు. యుద్ధారంభ దశలో, లోకోద్ధరణం కోసం అర్జునునికి భగవద్గీతా రహస్యాన్ని బోధించిన మహర్షిగా భాసిస్తాడు యుద్ధంలో భీష్ముని ప్రచండ ధాటికి అర్జునుడు అటమటిస్తున్నప్పుడు శ్రీకృష్ణుడు రౌద్రావతారం దాల్చి చక్రం చేబట్టుతాడు. శ్రీకృష్ణుడు ధర్మసంస్థాపన కోసం అవతరించిన అవతార పురుషుడుగా ప్రసిద్ధి కెక్కాడు సక్కుబాయి, మీరాబాయి మొదలైన పరమ సాధ్వీమణు లెందరెందరో ఆయనను కొలిచి ధన్యులయారు. పాలు, పెరుగు, వెన్న దొంగిలించిన బాలకృష్ణుని చిన్నారి దుడుకు పనుల నిదర్శనంగా కొన్ని ప్రాంతాల్లో జన్మాష్టమినాడు ఉట్ల పండుగలు చేస్తారు. ఉత్తర భారతంలో, అందులోనూ ఆయన లీలలకు ఆలవాలమైన యమునా తీరానగల మధుర బృందావనం ఆదిగాగల ప్రదేశాల్లో ఈ లీలా మానుష విగ్రహుని ఆరాధనలు, భక్తి గీతాలు, భజనలతో చూడ ముచ్చటగా నిర్వహిస్తారు.

# వినాయక చవితి

### నండూరి నారాయణరావు

వినాయక చవితి రైతుల పండుగ. హైందవులు ఏడాది కొకతూరి భాద్రపద శుద్ధ చవితినాడు దేశమంతటా వినాయకుని పూజిస్తారు. ఇది ఒక జాతీయ పండుగ. విఘ్నేశ్వరుడు సర్వాభీష్టముల నొసంగే వాడని నమ్మకం. యుధిష్ఠిరుడు గణపతి దేవుని పూజించి కోల్పోయిన రాజ్యాన్ని తిరిగి లభింప జేసు కొన్నాడు. గుప్త పండితుడు వినాయకుని పంటల దేవుడని పేర్కొన్నాడు. పంటలను నాశనంచేసేవి ఎలుకలు. గణేశుని వాహనం ఎలుక. వీరులు ఏ వస్తువును నిర్జిస్తారో దాన్ని వాహనంగా చేసుకుంటారు. శ్రీ కృష్ణుడు కాళీయ సర్పాన్ని

ఓడించి దానిపై నాట్యం చేశాడు. ఈశ్వరుడు నందిని ఓడించి దానిపై స్వారీచేశాడు. వినాయకుడు ఎలుకలను నాశనంచేసి దాన్ని వాహనంగా స్వీకరించాడు. అందువలన ఆయన్ని "మూషికవాహన" అని పిలుస్తారు. ఆయన చెవులు చేటల వంటివి. ఆయన్ని "శూర్పకర్ణ" అని అంటారు. తూర్పార పట్టుట మున్నగు కార్యాల్లో చేటలను వాడుతూవుంటాం. అందుచేత ఆ ఉపమానము కూడా పంటలకు సంబంధించి ఉన్నది. విఘ్నేశ్వరునికి ఒకే దంతము. కావున ఆయన్ని "ఏకదంతా" అని కూడ సంబోధిస్తాం. ఏకదంతంయొక్క అర్థం నాగలిగా భావించవచ్చునని గుప్త పండితుని అభిప్రాయము. గణేశుని పూజా విధానంలో సమర్పించే పత్రి, పుష్పం, ఫలంకూడా పంటలకు సంబంధించినవే. అంతేకాదు ప్రకృతియంతా పంటల మయం అయిఉన్నప్పుడే మనం ఈ వ్రతాన్ని చేస్తుకుంటాం. అందువల్ల వినాయకచవితి ప్రధానంగా పంటల పండుగని కాక, రైతుల పండుగని చెప్పవచ్చు. ఏ విధమైన నష్టము వాటిల్లకుండా మూడు పువ్వులు ఆరుకాయలుగా పంటలు పండాలంటే ప్రతి రైతు వినాయక చవితి పండుగను విధిగా చేసుకోవాలి.

# శ్రావణ పౌర్ణమి

**కమలా త్రివేణి**

వేసవి తాపం చల్లారడంతో హాయిని గొలిపే శ్రావణమాసపు జల్లులు పడతాయి. ఈ ఋతువులో వర్షాలుకురిసి యాత్రలకు, ప్రయాణాలకు ఆటంకం కలిగిస్తాయి. బయటకు వెళ్ళి పనిపాటలు చేసుకునేందుకు తగిన సమయం కాదు. కదలకుండా యింట్లో కూర్చొని కాలం గడిపేందుకు బాగుంటుంది. ధ్యానంలో మునిగి పోయేందుకు, చక్కగా చదువుకునేందుకు అనువైన కాలం.

పూర్వం వేదాభ్యాసం చేసే రోజులలో, శ్రావణ పున్నమిని ఉపాకర్మ దినంగా పాటిస్తూ ఉండేవారు. ఈ శ్రావణ పున్నమి దినాన్నే 'శ్రావణి' అని అంటాము. ప్రకృత సందర్భంలో శ్రావణ పున్నమి రోజున వేదాభ్యాసం ప్రారంభించేవారు. వేదాభ్యాసానికి పూనుకునేముందు ఈ పున్నమి రోజున శుభకార్యం ఒకటి చేస్తూండేవారు.

ఈ రోజుల్లో క్రతువులన్నా, కర్మకాండలన్నా, పవిత్రత, ప్రాధాన్యత రెండూ తగ్గిపోయాయి. కాకపోతే శ్రావణ పున్నమి నాడు నూతన యజ్ఞోపవీత ధారణ మాత్రం ఆచారయుక్తంగా జరగడం కొనసాగుతున్నది. పురాణ కాలంలో గాయత్ర్యుపాసన చేసుకునేందుకు, వేదాలు వల్లించేందుకు అర్హత కలిగించే నిమిత్తం బాల్యంలోనే పిల్లలకు యజ్ఞోపవీత ధారణ జరిగేది. దీన్నే ఉపనయనం అనేవారు. యథా తథంగా ఈ పదానికి అర్థం చెప్పాల్సి వస్తే, అదనపు కన్ను అని అనవలసి వస్తుంది. ఈ కార్యాన్ని యజ్ఞోపవీత ప్రదానోత్సవం అంటుండేవారు

శ్రావణ పౌర్ణిమను 'రక్షా పౌర్ణమి', 'రక్షా బంధన పౌర్ణమి' అని కూడా వ్యవహరిస్తారు. 'రక్ష' అంటే రక్షణ, భద్రపరచడం అని అర్థం. దీనికి 'తాపీజా' అనే అర్థం కూడా వుంది. బంధన అంటే బంధించడం, చుట్టడం–మణిబంధం చుట్టూ కట్టబడే 'దారము' పట్టుదారము, లేక మెరిసే సన్నని రేకు –వీటిని రక్ష అంటాము.

ఈ రక్ష అనేది ఎలా ఉత్పన్నమైంది అనే విషయంపై పురాణాల్లో ఒక కథ వుంది. పన్నెండు సంవత్సరాల పాటు, దేవతలకూ దానవులకూ యుద్ధం జరిగింది. ఆ యుద్ధంలో, దేవతలు రాజ్యాన్ని పోగొట్టుకున్నారు. రాక్షసులు జయించారు. ఇంద్రునికి "ముందుపోతే నుయ్యి వెనుకకు పోతే గొయ్యి" అనే పరిస్థితి ఏర్పడింది. తన రాజధానీనగరమైన అమరావతిని విడచి వెళ్ళనూ లేక పోయాడు, లేదా అక్కడే వుండనూలేక పోయాడు. జరిగేదేదో జరుగనిమ్మని పరిస్థితుల నెదుర్కొనేందుకే నిశ్చయించుకున్నాడు. దేవతల గురువు బృహస్పతి వివేకంతో ప్రవర్తించమని ఇంద్రునికు సలహా చెప్పాడు. ఇంద్రునికి క్షోభం కలిగింది. బృహస్పతి రక్షణకు తగిన మార్గం ఆలోచించాడు.

మరుసటి దినం శ్రావణ పౌర్ణమి. ఉదయాన్నే మంత్ర పఠనం చేస్తూ దేవ గురువు ఇంద్రుని మణిబంధానికి రక్ష కట్టాడు. ఇంద్రాణి కూడా రక్షా ధారణ చేసింది. ఇంద్రుడు పరాక్రమించాడు. రాక్షసులు కాలికి బుద్ధిచెప్పారు.

రాజసాన్ చరిత్రలో ఒకకథ వర్ణించబడింది. చిత్తూరును పాలించే సంగరాణా మరణించినపుడు ఆయన భార్య కర్ణావతి మహారాజు హుమయూన్‌కు ఒక రక్ష పంపించింది. హుమయూన్ ఆ రక్షను స్వీకరించాడు. కర్ణావతికి సహోదరునిగా పూర్తి రక్షణను కల్పించేందుకు అధికారం ఈ రక్ష హుమయూనునకు కలిగించింది. గుజరాత్ పాలకుడు బహదూర్‌షా చిత్తూరును ముట్టడించినప్పుడు కలుగ జేసుకొని పరాక్రమాన్ని ప్రదర్శించి నిజమైన వీర యోధుడుగా తన్ను నిరూపించుకొన్నాడు. బెంగాల్ సమరంలో లభించే విజయాన్ని కూడా లెక్క చేయకుండా, ఆ సమయంలో హుమయూన్, సోదరి సమానురాలైన కర్ణావతిని రక్షించేందుకు పరుగెత్తుకొని వెళ్ళాడు. మహోన్నతమైన ఈ సంప్రదాయాలను హృదయ పూర్వకంగా అనుసరించినట్లయితే స్వచ్ఛమైన భ్రాతృ వాత్సల్యం, అకలంకమైన భక్తి విశ్వాసాలతో ఉద్భూతమయ్యే ఉదాత్తమైన కార్యాలను నెరవేర్చవచ్చు.

రాఖీ సోదరి ప్రేమకు చిహ్నం. సుహృద్భావానికీ, స్నేహభావానికీ బంధనంగా యిది తోడ్పడాలి.



## లాల్ దర్వాజాలో

# మహాంకాళి మాతేశ్వరీ జాతర

— కోగిరి రామారావు

హైద్రాబాద్ సికింద్రాబాదు జంట నగరాలలో వివిధ సందర్భాలలో అనేక ఉత్సవాలు జరుగుతాయి. వీటిలో ప్రజలు అధిక సంఖ్యలో పాల్గొంటారు. ఆయాప్రదేశాలలో ప్రజలు ఉత్సాహంతో జరుపుకునే ఉత్సవాలు, మన సంస్కృతినీ, సంప్రదాయాలనూ, చరిత్రనూ ప్రతిఫలింపజేస్తాయి.

నిజానికి ఉత్సవాలు సాంఘిక జీవితాన్ని ఉద్దీపింపచేసి కళాత్మకమైన వ్యక్తీకరణకు అవకాశం కలుగజేస్తాయి.

హైద్రాబాద్ సికింద్రాబాదు జంటనగరాలలో శ్రీ మహాకాళి జాతర ఆయేటి కాయేడు ద్విగుణీకృతోత్సాహంతో జరుగుతున్నది.

హైద్రాబాద్ పాతనగరంలో లాల్‌దర్వాజా ప్రాంతంలో శ్రీ మహాకాళిమాతేశ్వరీ జాతర కడు వైభవంగా జరుగుతుంది. ఇచ్చటి శ్రీ మహాకాళిమాతేశ్వరీ ఆలయం అతి పురాతనమైనది. ఈ సంవత్సరం ఇచ్చట జాతర జూలై 12వ తేదీ నుంచి జూలై 22వ తేదీ వరకు జరుగుతుంది. దేవికి బోనాలు సమర్పించడానికి నగరంలోని నలుమూలలనుండి భక్తులు ఈ సందర్భంలో యిచ్చటికి అధికసంఖ్యలో వస్తారు. దేవి దర్శనార్థం, సుదీర్ఘమైన "క్యూ"లలో భక్తులు వేచివున్న దృశ్యాలు ఇచ్చట జాతర సమయంలో సర్వసాధారణంగా కనిపిస్తాయి.

గత మే 28వ తేదీ మంగళవారం సాయంత్రము 8-30 గంటలకు శ్రీ కంచికామకోటి పీఠాధిపతులు శ్రీ జగద్గురు శంకరాచార్యులవారు అశేష జనసమూహంలో ఆగమ శాస్త్రజ్ఞుల దేవతవాహన మంత్రపఠనం, నాదస్వర విద్వాంసుల శాస్త్రీయ సంగీతం, రామనామ సంకీర్తనల మధ్య శ్రీ మహాకాళి మాతేశ్వరీ (విష్ణుదుర్గ) విగ్రహం ప్రతిష్ఠ కుంభాభిషేకం జరిపారు.

ఆలయ గర్భగుడికి గొప్ప చరిత్ర ఉంది. ఆలయం నిర్వహణ విషయాలలో స్వర్గీయ మహరాజా దివాన్ కిషన్ ప్రసాద్ ఎంతో శ్రద్ధ తీసుకున్నారు. దేవునికి పూజ యేటేటా జరిగే ఉత్సవానికయ్యే ఖర్చు స్వయంగా భరించారు. రాజా కిషన్ ప్రసాద్ సౌధం నుంచి "బోనాల" ఊరేగింపు ప్రారంభమవుతుంది. జానపద నృత్య బృందాలుకూడ ఈ ఊరేగింపులో పాల్గొంటాయి.

ప్రజాభీష్టాన్ని మన్నించి మహారాజా కిషన్ ప్రసాద్ ఆలయం నిర్వహణ బాధ్యతలను పంచ్‌కమిటీకి అప్పగించారు.

1929లో ప్రజల విరాళాలతో దేవాలయాన్ని పునరుద్ధరించారు. మద్రాసుకుచెందిన సుప్రసిద్ధ శిల్పిని రప్పించి ఈ దేవాలయంలోని కాళీ, లక్ష్మి, సరస్వతి, పార్వతి ఆదిగాగల దేవతా మూర్తులనూ పూజావిగ్రహాన్నీ చేయించి ప్రతిష్ఠించారు. శిల్పకళ, రీత్యా చాలా సుందర విగ్రహాలివి.

దైవభక్తి పరాయణులైన సాంఘిక కార్యకర్తలు కొందరు ఈ ఆలయానికి సంబంధించిన విషయాలలో ఆసక్తి కనబరుస్తూ పని చేస్తున్నారు.

ఈ ప్రాంతం ప్రజలలో ఆధ్యాత్మిక భావాలను రేకెత్తించి ఈదేవి ఆరాధనకు తోడ్పడిన వారిలో స్వర్గీయ రాజ్‌పాల్‌గారిని చెప్పక తప్పదు.

ఇంతకు పూర్వం ఈ దేవాలయంలో జాతరప్పుడు జంతుబలి జరుగుతుండేది. కాని స్వర్గీయ రాజపాల్ సర్వశ్రీ బి. వెంకటస్వామి, వెంకట్రావు హల్వాల్‌కర్, లక్ష్మరాజ్‌గారల కృషివలన యీ జంతుబలి ఆచారం క్రమక్రమముగా అదృశ్యమైపోయింది.

జాతర కాలంలో ప్రతి దినం అభిషేకము, కుంకుమార్చనలు, లలిత సహస్రనామార్చనలు, హారతి, మంత్ర పుష్పముల పూజ, సప్తశతి పారాయణ, భజనలు హరికథలు, బుర్రకథలే కాక కవి సమ్మేళనములు, మహిళా సమ్మేళనములు శిశు ప్రదర్శన పోటీలు విచిత్ర వేషధారణ, ఆటపాటల పోటీలుకూడ జరుపబడుతున్నాయి.

196`లో ఆలయకమిటీ పునర్వ్యవస్థీకరింపబడి శ్రీ వై. లింగారెడ్డిగారి అధ్యక్షతన శ్రీయుతులు సిద్ధంస్వామి, పాతెల్లి నారాయణ కన్వీనర్లుగా మరో 21 కార్యవర్గ సభ్యులను ఏర్పాటు చేయడమైనది.

ఆలయ గోపురాన్ని శ్రీ గణపతి పాగర్‌గారి సలహాలతో 15,000 రూపాయాల ఖర్చుతో పునర్నిర్మించారు. ఆలయంలో అతి ఆకర్షణీయమైన వాటిలో ఇదొకటి. 7000 రూపాయల ఖర్చుతో మూల దేవతా విగ్రహాన్ని తయారుచేయించారు. ఈ విగ్రహాన్ని శిల్పి సార్వభౌమ బిరుదాంకితులు భద్రాద్రి రామాలయంలో "కళ్యాణ మండపం" నిర్మించి అఖండ కీర్తి ప్రతిష్ఠలు ఆర్జించిన

శ్రీ గణపతి స్థపతిగారి సలహాలతో అత్యంత మనోహరంగా తయారు చేయించారు.

1960లో మొట్టమొదటిసారిగా దేవి ఊరేగింపును శ్రీ బి. వెంకటస్వామి మరి కొందరు యువకుల కృషి ప్రోద్బలముతో చార్ మినార్, పథర్ గట్టి మీదుగా మూసీనదికి మళ్ళించడమైనది. తదనంతరము ఉత్సవ ఊరేగింపు క్రమేపీ చాలా అభివృద్ధిలోకి వచ్చినది. చరిత్రాత్మకమైన చార్ మినార్ వద్ద లక్షలాది ప్రజలు ఊరేగింపునకు అఖండ స్వాగతం ఇస్తారు. గతంలో జాతరలు జరిగేసమయంలో రాష్ట్ర గవర్నర్ మంత్రులు, ఇంకా అనేక ప్రముఖులు ఆలయాన్ని దర్శించి జాతర ఉత్సవాన్ని తిలకించడమేకాక వేలాది ప్రజల ముందు వివిధ ఉపన్యాస కార్యక్రమాలుకూడా జరిపించారు. ఈ ఏడాది మహాకాళి మాతేశ్వరీ బోనాలు జూలై 21న, ఉత్సవం ఊరేగింపు జూలై 22న ఘనంగా జరిగాయి. ఊరేగింపును మరింత ఆకర్షణీయంగా కొనసాగించారు.

ఉత్సవాన్ని జయప్రదంగా నిర్వహించడానికి ఉత్సవకమిటీ ప్రధాన కార్యదర్శి శ్రీ ఆర్. ధనంజయ్య విశేషంగా కృషి చేశారు.

---

(58 వ పుట తరువాయి)

నిరుద్యోగ సమస్య, యింకా, అన్ని రంగాలలో జరుగుతున్న నష్టాలను పూర్తిగా తొలగించుకొనవచ్చును. జాతీయ ఆర్థిక రంగంలో ఎక్కడ పొరపాటు జరిగినది గుర్తించి, ప్రజలు ముందంజ వేయవలెను.

3. సంపదలను ఎక్కువ చేసుకొనుట ప్రాధాన్యత కాదనియూ, మనం చేస్తున్న పనియందు గౌరవం పెంపొందించుకొనవలయుననియూ గాంధీ సిద్ధాంతం. మానవునిలోని అహంకారమును, చెడ్డతనమును పోగొట్టి, మనిషిని మరింత ఎక్కువ ఆరోగ్యవంతునిగా, ఆనంద జీవిగా, దయా స్వభావుడుగా, తాము చేయు పనులకు తగిన వారిగా రూపొందించవలెను. ధర్మ కర్తవలె మనం, మన సంపదలను కాపాడ వలెను. ధనవంతుడు తన యీ సర్వస్వము ప్రజలందరి సొత్తు అని భావించి, ధర్మ కర్తగా మెలగవలెను. శాస్త్రీయంగా, మానసికంగా, బీదవాళ్లను పైకి తీసుకొని వచ్చుట, అదే సమయమున ధనవంతులుచే వారి దయాగుణములను ప్రకటించి సహాయపడునట్లు చూచుట గొప్ప విషయములు. అందరికి తినుటకుతిండి, కట్టుటకు బట్ట వుండవలెను. తిండి లేక ఎవ్వరునూ పస్తు పడుకొన కూడదు అన్నపూర్ణ దేవి యింట్లో బిడ్డలు అన్నము లేక వుండుట జరగ కూడదు– అని గాంధీజీ అన్నారు.

గాంధీ మహాత్ముడు పరిశ్రమలు ఎక్కువగా గ్రామాలలో స్థాపించ వలెననియూ, ఆయా పరిశ్రమల ద్వారా వచ్చే వస్తువులు ఆ యా గ్రామ ప్రజల అవసరాలకు సరిపోవలెననియూ చెప్పిరి ప్రతి గ్రామమునందు కుటీర పరిశ్రమలు నెలకొల్ప వలెనని వారి ఆశయము. గ్రామాలలో వున్న నిరుద్యోగ జీవనం చేయు ప్రజలను గ్రామాలలో పెట్టే గ్రామీణ కుటీర పరిశ్రమలు మాత్రమే చక్కదిద్దగలవు. అలా చేయుట వలన మన గ్రామములు మరింత బలమైన గ్రామములుగా తయారగును. అప్పుడు గ్రామ స్థాయిలో వున్న ప్రజకు మరింత విద్య, విజ్ఞానములు కల్గును. మహాత్ముడు పెద్ద యంత్రములకు వ్యతిరేకి ఒక కారణమున మాత్రమే. ఆ పరిశ్రమల నుండి వచ్చే లాభములు కొంత మంది ధనికుల జేబులలోకి పోవునని, అందుచేతనే వ్యతిరేకినని మహాత్మాగాంధీ చెప్పెను.

మహాత్ముడు మనదేశీయులు పాశ్చాత్య దేశములలోని ప్రజల మాదిరి, మానసికపు విశ్రాంతి లేక నూటికి 50 మంది పిచ్చివాళ్లు గాకూడదని చెప్పిరి. అందుచేత అహింసా వ్రతమును చేబట్టి, ప్రతి భారతీయుని దృష్టిలో పెట్టుకొని, మహాత్ముడు పై అర్థికాభిప్రాయములను యిచ్చిరి. ఈ పై సలహాల మేరకు పాటించిన ప్రతి గ్రామము సంపూర్ణంగా వుండి ఎక్కడను బీద శబ్దం లేక వుండును. అలా భారతదేశములోని గ్రామములన్నియు సంపూర్ణ సంతోషముతో వెల్లివిరిసిన మన భారతావని గొప్పగా ప్రకాశించును.

ప్రపంచ శాంతికి గాంధీ మహాత్ముడు చూపిన బాట చాలా చక్కనిది, సులువైనది, ఆచరణ యోగ్యమైనది అని మన భారతావని నిరూపించగలగు.



# నల్గొండలోని లతీఫ్ సాహేబు గుట్ట

ఎస్. ఆర్. కోటేశ్వర శర్మ



నల్గొండ హైదరాబాదుకు 104 కిలోమీటర్ల దూరంలో వుంది. ఇది ముసల్మానులకు పవిత్రమైన వూరు. కాపరాలగుట్ట, లతీఫ్ సాహేబుగుట్ట అని రెండు కొండలమధ్య యీవూరువుంది. లతీఫ్ సాహేబు గుట్టమీద చక్కటి మసీదు ఒకటివుంది. లతీఫ్ అన బడే ముసల్మాను సాధువుకు సంబంధించిన మసీదు యిది.

కొండమీది యీ మసీదు, నల్గొండఊరుకు సరిగ్గా 400 మీటర్ల ఎత్తునవుంది. పైకి వెళ్ళడానికి విశాలమైన మెట్లు వున్నాయి. ఊరిలోంచి చూస్తే అతి మనోహరంగా, గంభీరంగా, ఠీవితో నిలచి వున్నట్టు హుందాగా కనిపిస్తుంది. ఏడాది పొడుగునా యిటు తెలంగాణానుంచీ, అటు రాయలసీమనుంచీ అన్ని మతాలవారూ యీ ప్రాంతాన్ని సందర్శించడానికి వస్తూవుంటారు. ఇక్కడ ప్రతి యేటా జమాతుల్ అవ్వల్ అరబ్బీ మాసంలో (అంటే జూలై_ఆగస్టులో) పెద్ద ఎత్తున ఉత్సవం జరుగుతుంది. ఆ సమయంలో అసంఖ్యాకంగా యాత్రికులు వందలాదిమైళ్ళ దూరంనుంచికూడా యిక్కడకు వస్తూ వుంటారు. యీ మసీదులోని లతీఫ్ సమాధిని సందర్శిస్తే దారిద్ర్యం తొలగుతుందనీ, కష్టాలు గట్టెక్కుతాయనీ, రోగాలు దరికి రావనీ, కోరికలు యీడేరగలవనీ ఒక నమ్మకం వుంది.

తెలుగు ప్రజలతో లతీఫ్ సాహేబుకు గల సన్నిహిత పరిచయాన్నిగూర్చి చారిత్రకమైన గాథ ఒకటివుంది. ఢిల్లీని పరిపాలించిన (క్రీ. శ. 1324_1325) గైసుద్దీన్ తుగ్లక్‌వద్ద ప్రధాన మతాధికారి అయిన షేక్‌నిజాముద్దీన్ ఉలియ శిష్యులు 700 మందిలో లతీఫ్ ఒకరని చెప్తారు. ఢిల్లీసుల్తానుకు,నిజాముద్దీన్‌కు ఒక చిన్న మతవిషయంమీద అభిప్రాయ భేదాలువచ్చి నిజాముద్దీన్‌ను, అతని శిష్యులనూ వారంరోజులలోగా ఢిల్లీవిడిచి వెళ్ళవలసిందిగా సుల్తాను ఆజ్ఞాపించాడనీ, ఆ సందర్భంలో లతీఫ్ దక్షిణ హిందూదేశానికివచ్చి దేవరకొండ పాలిస్తున్న రాచెర్ల ప్రభువు రాజాస్థానంలో ఆశ్రయం పొందాడని చెప్తారు. ఈ దేవరకొండ నల్గొండకు 37 కిలోమీటర్ల దూరంలో వుంది.

లతీఫ్, అనేక అద్భుతాలను చేస్తుండేవాడు. కుష్టువ్యాధి, రాచకురుపు వ్యాధివంటి వాటిని ఆయన బాగుచేస్తుండేవాడు. అనేక వేలమంది ప్రజల మానసిక, శారీరక రుగ్మతలను పోగొట్టేవాడు. మతబోధకుడుగా వివిధమతాలవారి హృదయాలను దోచుకోగలిగాడు. దేవుడు ఒక్కడే అని లతీఫ్ నమ్మేవాడు మానవులంతా సమానులని బోధించాడు. హిందూ ముసల్మానులమధ్య ఎట్టివ్యత్యాసమూ లేదని వారిరువురు సోదర తుల్యులని బోధించాడు.

రాచెర్ల రాజకుటుంబం, ప్రజలు ఆయనను ఒక గొప్ప గురువుగా, శ్రేయోభిలాషిగా గౌరవించారు. ఆయన తన అవసాన కాలాన్ని నల్గొండలో గడిపాడు. ఆయనకు అక్కడ బసవయ్య అనే శిష్యుడు లభించాడు. బసవయ్య అక్కడికి మూడు కిలో మీటర్ల దూరంలో వున్న పానగల్ గ్రామనివాసి. కొండ మీద లతీఫ్ శరీరం ఖననంచేయబడిన చోటనే యిప్పుడు యీ మసీదు వున్నది. ఆయనమీదగల గౌరవంకొద్దీ దేవరకొండ ప్రభువులే ఈ మసీదును కట్టించారట.

లతీఫ్ మరణంతోనే ఆయన మహత్తు మాయమవలేదు. ఈ నాటికీ అది కనిపిస్తూనేవున్నది. ఇప్పటికీకూడా తన భక్తులకు కలల్లో గుర్రం మీదగాని పెద్దపులిమీదగాని సవారీచేస్తున్నట్లుగా కనిపిస్తుంటాడనీ, వారి కోరికలు తీర్చుతూ, వారిని చల్లగా చూస్తుంటాడనీ చెప్తుంటారు.

## సంస్కృతి

# చిత్ర, శిల్పకళలకు సంగమ స్థానం

# లేపాక్షి



లేపాక్షి చిత్రం—కిరాతార్జునీయగాథనుండి

ప్రాణంలేని జడమయమైన రాళ్ళకు అపురూపలావణ్యాన్నీ, ప్రాణ సదృశమైన జీవభ్రాంతినీ కల్పించిన ఆంధ్ర శిల్పుల పనితనానికి లేపాక్షి మచ్చుతునక. అచ్చమైన ఆంధ్రుల గ్రామీణ జీవితాన్నీ, విలక్షణమైన ఒక ప్రత్యేక శైలినీ ప్రకటించే అద్భుతమైన చిత్రకళకు లేపాక్షి కాణాచి. తెలుగుతనం ఉట్టిపడే చిత్రాలూ, పనితనం ఉట్టిపడే శిల్పాలూ ఆంధ్రుల గతకాలపు కళా వైభవాన్ని అద్దంపట్టి చూపుతాయి. భారత దేశంలో ఏ అత్యుత్తమ శిల్పకళకూ తీసిపోని అద్భుత శిల్పాలూ, ఏ విశిష్ట కుడ్య చిత్రాలకూ తీసిపోని కళాత్మక చిత్రాలూ యిక్కడ వున్నాయి. ఎల్లోరా రాళ్ళకు ప్రాణంపోసిన ఆంధ్రశిల్పులు, అజంతా కుడ్యాల మీద కుంచెల్ని నాట్యంచేయించిన ఆంధ్ర చిత్రకారులు సుమారు వెయ్యి సంవత్సరాల తర్వాత మళ్ళీ లేపాక్షిలో కలుసుకున్నారు. ఒకేచోట అద్భుతమైన శిల్పాలూ, అపూర్వమైన చిత్రాలూ వున్న ప్రాంతాలు మన దేశంలోనే అరుదు. లేపాక్షి వాటిలో ఒకటి.

అజంతా ఎల్లోరాలు చిత్ర, శిల్ప కళలకు పెట్టింది పేరు. ఆ తర్వాత యింత కాలానికి మళ్లీ లేపాక్షిలో యీ రెండు కళా స్రవంతులూ సంగమించి ఆంధ్రుల పరంపరాగతమైన చిత్ర, శిల్ప కళా ప్రతిభలకు వారసులుగా నిలిచాయి. మధ్యలో నాగార్జున కొండలో రాళ్ళను తొలిచినా, అమరావతి, భట్టిప్రోలు ఘంటసాలల్లో స్థూపాల్ని కట్టినా, అలంపురంలో శిల్పాలూ చెక్కినా, రామప్పలో నిద్రపోతున్న రాళ్ళను తట్టి లేపినా ఒక్క శిల్పులే కనిపిస్తారు గాని చిత్రకారులూ, శిల్పులూ కలిసి ఒకేచోట కనిపించరు. లేపాక్షి యీ యిద్దరికీ కళా ప్రాంగణమైంది. అందుకే ఆంధ్రుల కళా మటపం లేపాక్షి. ఇక్కడ శిల్పమూ వుంది, చిత్రలేఖనమూ వుంది. అంతేకాదు వాస్తు శాస్త్ర వైభవం ప్రతికోణంలోంచి తొంగి చూసే చక్కటి నిర్మాణమూ వుంది.

లేపాక్షి విజయనగర రాజుల కాలంనాటిది. ఈ శిల్పానికి బహుశ కాకతీయ శిల్పం మాతృకగా వుండివుండవచ్చు. కాకతీయ శిల్పం నిరాడంబరతకు పెట్టిందిపేరు. ఆభరణాలు అతిగా వుండవు. సహజ సౌందర్యమే అన్నిటికన్న గొప్ప సౌందర్యమని చాటి చెప్పుతుంది. ఆ తర్వాత సుమారు మూడువందల ఏళ్ళకు వెలువడ్డ లేపాక్షి శిల్పం, అలంకారాలు తగిలించుకుని వన్నెలు చిన్నెలు కూర్చుకుని అందాన్ని పెంచుకుని ఆకర్షణీయంగా తయారైంది.

లేపాక్షి శిల్పానికీ, చిత్రానికీ చాలా వ్యత్యాసంవుంది. రెండూ ఏకకాలానివే అయినా భిన్నభిన్న శైలుల్లో వున్నాయి. శిల్పాలలోని ఆకారాలకూ, చిత్రాలలోని ఆకారాలకూ ఏ మాత్రం సామ్యంలేదు. శిల్పాల్లో వాడిన శైలి సామాన్యమైనది. ఇతర భారతీయ శిల్పాలలోని ధోరణే యిందులోనూ కనిపిస్తుంది. అంటే శిల్పంలోని ఆకారాల్లో మౌలికమైన మార్పేమీలేదు. అలంకారాలు ఆభరణాలు మొదలైన వాటిలో కొద్దిపాటి మార్పేతప్ప పూర్తిగా యితర భారతీయ శిల్పాలకు భిన్నంగా ఏమీలేదు. కాని లేపాక్షి చిత్రాలు అలాలేవు. అదొక ప్రత్యేకమైన శైలి. తెలుగుతనం ముమ్మూర్తులా మూర్తీభవించే శైలి. గ్రామీణ జీవితాన్ని ప్రతిబింబింపజేసే శైలి.

శిల్పంలో ఆకారాలు నగ్నమూర్తులు. కాని చిత్రలేఖనంలో సవస్త్రలు. అజంతా కాలంనాడు యీ భేదంలేదు. శిల్పాలలోని ఆకారాలకూ, చిత్రాలలోని ఆకారాలకూ తేడా వుండేదికాదు. రాతి మీద శిల్పిచెక్కిన స్వరూపాన్నే చిత్రకారుడు గోడమీద చిత్రిం



నాట్యమంటపం సీలింగుమీద చిత్రించిన ఒక చిత్రం

చాడు. ఒకే ఆకారం రెండింటిలోనూ కనిపిస్తుంది. కాని లేపాక్షి శిల్పంలోని ఆకారానికీ, చిత్రాల్లోని ఆకారానికీ పోలికల్లేనంత తేడావుంది. కిరాతార్జునీయం కథను శిల్పులు రాతిమీదా చెక్కారు. చిత్రకారులు సీలింగుమీదా చిత్రించారు. రెండూ రెండు భిన్న భిన్నమైన శైలులు.

దీనినిబట్టి ఆరోజుల్లో శిల్పం, చిత్రలేఖనం ఒకేస్థాయిలో లేవని, ఒకదానికొకటి ఎదురెదురుగా నడవడం లేదని తెలుస్తోంది. శిల్పంకన్న చిత్రలేఖనం సామాన్య మానవుడికి సన్నిహితంగా వెళ్ళినదని అర్థమౌతోంది

లేపాక్షి చిత్రాలు జానపదచిత్రాలుగా ప్రాచుర్యం పొందాయి. కాని లేపాక్షి శిల్పాలు జానపద శిల్పాలుగా పేర్కొనబడలేదు.

ఆ రోజుల్లో శిల్పంకన్న చిత్రలేఖనమే బాగా ప్రాచుర్యం పొందినదనీ, వాతావరణ పరిస్థితులకు చిత్రలేఖనం తట్టుకొని నిలవలేదు గనక ఆ విషయాన్ని మనం తెలుసుకొనే ఆధారాలు మృగ్యమైపోయాయనీ అర్థమౌతోంది.

పదిహేనవ శతాబ్ది నాటికే మన చిత్రకళ దేశీయమైంది. సరిగ్గా యిదే కాలంలో యూరపులో చిత్రకళలో 'రినైజాన్స్' ప్రారంభం కావడం గుర్తింపదగ్గది అక్కడ యీ కాలంలో కళ కాల్పనిక జగత్తునుండి వాస్తవిక జగత్తులోకి ప్రవేశించి సామాన్యుని జీవితాన్ని స్పృశించింది. మనదేశంలోకూడా చిత్రకళ సామాన్యునికి సన్నిహితంగా వచ్చినా యూరపులోవలె రియలిస్టిక్ రూపంలోకాక స్వచ్ఛమైన, మౌలికమైన దేశీయ రూపంలో ప్రవేశించింది.

విజయనగర ప్రభువులు సాహిత్య చిత్రకళా వికాసాలకు యితోధికమైన సేవచేశారు. ఈ కాలం ఆంధ్రులకు స్వర్ణయుగం. విజయనగర ప్రభువువద్ద కోశాధికారిగా వుంటున్న విరూపన్న లేపాక్షిలో వీరభద్రేశ్వరస్వామి ఆలయనిర్మాణానికి పూనుకున్నాడు పెద్ద ఎత్తున నిర్మాణ సన్నాహాలు చేశాడు. అంతకు పూర్వమే యిక్కడ ఒక చిన్న ఆలయంవుంది. నూటఎనిమిది ముఖ్య వ క్షేత్రాలలోనూ లేపాక్షి ఒకటని స్కాంద పురాణంలో చెప్పబడి వుంది. వీరభద్ర ఆలయాన్ని అగస్త్యముని కట్టించినట్టు పేర్కొనబడినప్పటికీ ప్రస్తుత ఆలయాన్ని మాత్రం విరూపన్న నిర్మించాడు.

కూర్మశైలం అనబడే రాతిగుట్టమీద విశాలమైన ప్రాకారం మధ్య పాపనాథేశ్వర ఆలయం, రంగనాథస్వామి ఆలయం, శ్రీరామ ఆలయం, వీరభద్రుని ఆలయం, దుర్గఆలయం వున్నాయి. వీటిలో ప్రధానంగా చెప్పుకోదగ్గది వీరభద్ర ఆలయం. వాస్తుశాస్త్రరీత్యా గాని, శిల్పకళరీత్యాగాని, చిత్రకళరీత్యాగాని యీ ఆలయం ఒక విశిష్టతని, ఒక ప్రత్యేక పరిగణనని కలిగివుంది.

వీరభద్ర ఆలయం మూడు ప్రాకారాలతో కూడి వుంది. మొదటి ప్రాకారంలోపల ఒకే మంటపంతో మూడు గర్భాలయాలు వుండి శివుడు, వీరభద్రుడు, విష్ణువు వీటిలో వెలిసి వున్నారు. మంటపం సీలింగుమీద లైఫ్ సైజుకన్న పెద్ద పరిమాణంలో చిత్రాలు వున్నాయి. ఒకమూల స్తంభంమీద వాస్తుపురుషుడు ఒక వైపు, పద్మినీ జాతిస్త్రీ మరోవైపు నిలువెత్తు రూపాల్లో చెక్కబడి వున్నారు. ఈ ఆలయంలోని శిల్పాలన్నిటిలోకీ అద్భుతమైన పనితనంతో చెక్కిన అపురూప శిల్పాలు యీ రెండూ. ఇంత అద్భుతమైన శిల్పం ఆంధ్రదేశంలో మరెక్కడా కనిపించదు. ఒంటినిండా ఆభరణాలు ధరించి నాట్యభంగిమలో నిలిచిన యీ రెండు విగ్ర



పద్మినీజాతి స్త్రీ



వాస్తుపురుషుడు

హాలూ అపురూప లావణ్యానికీ, అద్భుత శిల్పకళకూ మచ్చు తునకలు.

కి మొదటి ప్రాకారం వెలుపలిభాగంలో సిరియాల చరిత్రను, రాతార్జునీయం కథను శిలాఫలకలమీద చెక్కారు. ద్వార బంధానికి ఒకవైపు సిరియాల చరిత్ర. మరోవైపు కిరాతార్జునీయగాథ వున్నాయి. మొదటి ప్రాకారానికీ, రెండవ ప్రాకారానికీ మధ్యగల మంటపమే నాట్యమంటపం. ఈ మంటపంలోని స్తంభాలమీద నిలువెత్తు విగ్రహాలు యీ ఆలయానికి ప్రధాన ఆకర్షణ. భృంగి ఆదేశాలు యిస్తుండగా దేవనర్తకి రంభ తదనుగుణంగా నాట్యం చేయగా; చంద్రుడు, ఇంద్రుడు, సూర్యుడు, విష్ణువు ఆదిగాగల దెవతలూ; తుంబురుడూ, రిషేశ్వరుడు, నందీశ్వరుడు, నారదుడ మొదలైన మునులూ వాయిద్యాలు వాయిస్తూవుంటారు. స్తంభాల మీద నిండుగా, జీవకళ ఉట్టిపడుతూ కనిపించే యీ విగ్రహాల శిల్ప కళాప్రియులకూ, నర్తకులకూ చక్కటి విందు చేకూరుస్తుంటాయి. ఈ మంటపం మధ్యలో నిలుచుంటే; చుట్టూ యీ వాయిద్య విశేషాలతోకూడిన యీ మూర్తులను చూసినప్పుడు, మసక మసక చీకటి పడుతున్నవేళ ఒక్కసారి మనం ఏ దేవలోకంలోనో ఇంద్రసభలోనో అడుగుపెట్టినట్టు క్షణకాలం భ్రమ కలగకపోదు

నాట్యమంటపంలోనే మరోచోట భిక్షాటన మూర్తి విగ్రహం ఆయనకు భిక్షయిస్తున్న పార్వతీదేవి విగ్రహం అతి మనోహరంగా చెక్కబడ్డాయి. వ్రేలాడే స్తంభంకూడా యీ మంటపంలోనే వుంది

ఈ రీత్యానేగాక మరొక విధంగా కూడా నాట్యమంటపం ప్రత్యేకతను కలిగివుంది. చిత్రలేఖనం వున్నది కూడా యిక్కడే. నాట్యమంటపం సీలింగుమీద చుట్టూరా జానపద శైలిలో వివిధ పురాణగాథలు చిత్రించబడ్డాయి. కిరాతార్జునీయం కథను, ధర్మపాలుని కథను, వటపత్రశాయి సుందరమూర్తిని చిత్రకారులు చిత్రించారు.

లేపాక్షి చిత్రకళలో ప్రధానంగా చెప్పుకోదగ్గవి కన్నులు, సిగకొప్పులు. రూపం ప్రక్కకి తిరిగివున్నప్పటికీ, రెండో వైపున గల కంటిని కూడా ఈ చిత్రకారులు చూపిస్తారు. స్త్రీమూర్తిలన్నిటికీ పెద్ద పెద్ద సిగకొప్పులు వుంటాయి. బట్టకట్టే తీరులో కూడా ఒక విలక్షణమైన పద్ధతి కనిపిస్తుంది. చూడగానే గ్రామీణస్త్రీ కళ్ళకు కట్టుతుంది. వస్త్రాలనిండా రకరకాల డిజైనులు కనిపిస్తాయి. కలంకారీ అద్దకంపని చప్పున మనకుస్ఫురిస్తుంది.

ప్రధాన గోపురానికి దక్షిణదిశలో నాగలింగం వుంది. మొత్తం యిది మూడు నిలువుల ఎత్తువుండి అతి గంభీరంగా కనిపిస్తుంది.

వీరభద్ర ఆలయంలో ప్రత్యేకించి పేర్కొదగ్గది అసంపూర్తి కల్యాణ మంటపం. ఈ మంటప నిర్మాణం పూర్తి కాకుండా మధ్యలోనే నిలిచి పోయిందని పేరును బట్టే తెలుస్తున్నది. శివపార్వతులను కల్యాణానికి సిద్ధం చేస్తూ అష్టదిక్పాలకులూ, దేవగణం, మునులు యిక్కడి స్తంభాలమీద దర్శన మిస్తారు. స్తంభాలనైతే నిలబెట్టారుగాని పైకప్పును, క్రింది అరుగును నిర్మించ లేదు. ఇక్కడి వినాయకుడి తొండం సాధారణంగా దక్షిణాదిశిల్పాలలో



దత్తాత్రేయుడు



తాండవశివుడు

లాగ ఎడమవైపు తిరిగి వుండకుండా కుడివైపు తిరిగి వుంది. ఈ మంటపం నిర్మాణమైవుంటే నాట్యమంటపమంత మనోహరంగానూ, శోభాయమానంగానూ వుండి వుండేది. అయితే రాజకీయ కారణాలు కారణంగా ఈ మంటప నిర్మాణం నిలిచిపోయింది. కోశాధిపతి విరూపన్న యీ మంటపాన్ని నిర్మిస్తున్నప్పుడే ప్రభుత్వంలో మార్పులు వచ్చాయి. విరూపన్న ప్రభుత్వ ధనాన్ని దుర్వ్యయం చేస్తున్నాడని అభియోగంమోపి అందుకు శిక్షగా అతని రెండు కళ్ళను పెరికివేయాలని తీర్మానించారు. ఈ విషయం తెలిసి విరూపన్న తనే స్వయంగా రెండు కంటిగుడ్లనూ పెరికివేసుకున్నాడు. దానితో అలయ నిర్మాణం అగిపోయింది.

వీరభద్ర ఆలయానికి సుమారు వందగజాల దూరంలో తూర్పు దిశన ఏకశిలా నిర్మితమైన పెద్ద నంది ఒకటి వుంది. యీ నంది భారత దేశంలోని నందివిగ్రహాలన్నిటిలోకీ పెద్దది. సుప్రసిద్ధ చిత్రకారుడు. కవి. బహుముఖ ప్రజ్ఞశాలి అయిన అడవిబాపిరాజు యీనందిని చూసి ఆశువుగా 'లేపాక్షి బసవయ్య లేచి రావయ్యా'' అని పాడుకున్నాడు. ఆ పాట విన్న తర్వాతనే మనలో చాలా మందికి, ఆంధ్రుల అపూర్వ శిల్పచిత్రకళా వైభవాన్ని చాటి చెప్పే కాణాచి లేపాక్షి అంటూ ఒకటి వున్నదని తెలిసింది.



లేపాక్షి బసవయ్య

లేపాక్షి శిల్పరీత్య గొప్పదే అయినా చిత్రకళ రీత్యా మరింత గొప్పది. భారతదేశంలో యీనాటికీ మిగిలి వున్న పురాతన కుడ్య చిత్రాలు గల ప్రాంతాలు బహు తక్కువ. అదృష్టవశాత్తూ అలా మిగిలివున్న సంపదకు మనం వారసులమయాం. అయితే యీ అపూర్వ సంపద క్రమక్రమంగా నాశనమైపోతోంది. ముందుగానే మనం మేల్కొని దీనిని భద్రపరచుకోకపోతే కొంత కాలానికి వాతావరణ పరిస్థితులకు పూర్తిగా ఏమీ మిగలకుండా పోవచ్చు. మన చిత్రకారులు, ప్రభుత్వమూ యీ చిత్రాలను కాపీచేసి భద్రపరచడం అవసరం మొట్టమొదట హెచ్.వి. రాంగోపాల్‌గారు, బాపిరాజుగారు వీటిని కాపీ చేశారుగాని వాటిని అంతగా వుపయోగించుకోలేదు. అంట్యాకుల పైడిరాజుగారు ఈ చిత్రాలను అనుసరించి ఒక స్వంతశైలిని ఏర్పరచుకుని బహుళ ప్రచారం పొందారు. మహారాష్ట్ర ప్రభుత్వం, వెనకటి హైదరాబాదు ప్రభుత్వం అజంతా కుడ్యచిత్రాలను కాపీ చేయించి భద్రపరచినట్టుగా మన ప్రభుత్వం కూడా కాపీ చేయించడం ఎంతయినా అవసరం. లేకపోతే యీ అపూర్వకళకు మనం వారసులమని గర్వంగా చెప్పుకునే రోజు మనకు లేకుండా పోతుంది.

×

—చిత్రమూర్తి—

# సాలార్జంగ్ మ్యూజియం నూతన భవనానికి రాష్ట్రపతి ప్రారంభోత్సవం

1968 జూలై 24 వ తేదీ సాయంకాలం హైదరాబాద్‌లో సాలార్జంగ్ మ్యూజియం నూతన భవన ప్రారంభోత్సవంలో రాష్ట్రపతి డాక్టర్ జాకిర్ హుసేన్ ప్రసంగపాఠం–

"హైదరాబాద్ వచ్చి గడపడం నాకు సర్వదా సంతోషకరమైన విషయం. ఈ వేళ మీ అందరి మధ్య ఇక్కడ ఉండే అవకాశం కల్పించిన ముఖ్యమంత్రికి ప్రత్యేకంగా నేను ధన్యవాదాలు తెలుపుకోవలసిఉంది. సుందరమైన ఈ మహానగరంలో కొన్ని వారాలు గడిపేందుకు లోగడనేను వచ్చి ఉండవలసింది. కాని ఇతరత్రా కొన్ని కార్యక్రమాలు ఉండటంచేత నాకా అవకాశం దక్కకుండాపోయింది. అయితే అలాంటి పరిస్థితిలో నా మనోభావాలు ఎలాఉంటవో, సహజమైన తమ సూక్ష్మ దృష్టిచేత లెస్సగా గ్రహించిన శ్రీ బ్రహ్మానందరెడ్డి సమయం కనిపెట్టి నన్నిక్కడికి ఆహ్వానించారు. నేను కాదనలేకపోయాను. ఈనాడు నేనిక్కడ ఉండటానికి అదీకారణం.



రాష్ట్రపతి జూలై 24 న సాలార్జంగ్ మ్యూజియమ్ నూతన భవనానికి ప్రారంభోత్సవం చేశారు

స్వంత భవనాలలో సాలార్జంగ్ మ్యూజియంకు ప్రారంభోత్సవం జరుగుతున్న సందర్భాన్ని పురస్కరించుకుని ఈనాడు మనమందరం ఇక్కడ సమావేశమైనాము. నవాబ్ సాలార్‌జంగ్ బహదూర్ అనే పేరుతో అందరికి తెలిసిన స్వర్గీయ మీర్ యూసఫ్ అలీఖాన్, తాను సేకరించిన అమూల్యకళాఖండాలు చాలావాటిని, ప్రజలు యావన్మంది వచ్చి తిలకించడానికి వీలుగా నిర్మించదలిచిన వస్తు ప్రదర్శన శాలకోసమై విడిగా భద్రపరిచారు. ఈ అసంఖ్యాకములైన వస్తుసంపదతో మ్యూజియం నొకదానిని ఏర్పాటుచేయాలనే తమ వాంఛ ఈడేరకుండానే 1949 లో ఆయన అకాల మరణం పాలైనారు. ప్రఖ్యాతి చెందిన సాలార్‌జంగ్ వంశంలో కడపటివాడైన నవాబ్ సాలార్‌జంగ్ కళాప్రియులు, కళాభిమాని. వెనకటి హైదరాబాద్ ప్రభుత్వం, ఆయన సేకరించిన కళాఖండాల విలువను, ప్రాముఖ్యతను గుర్తించి, వాటిని నగరంలోని ఆయన నివాసంలో ప్రదర్శనకనువుగా అమర్చింది. ఆ వస్తు ప్రదర్శన శాలను స్వర్గీయ ప్రధానమంత్రి పండిత జవాహర్‌లాల్ నెహ్రూ 1951 డిసెంబర్ 16 వ తేదీన ప్రారంభోత్సవం జరిపారు.

ఇక్కడ పదిలపరిచిన వస్తు సంపదకు గల అపారమైన విలువను గ్రహించి భారత ప్రభుత్వం 1968 డిసెంబర్ 2 వ తేదీన ఆ కళాఖండాలనూ, అమూల్య వస్తు విశేషాలనూ జాతీయం చేసింది. సాలార్‌జంగ్ మ్యూజియంను యావత్తూ జాతీయ ప్రాధాన్యం గల సంస్థగా గుర్తిస్తూ 1961 లో పార్లమెంటు ఒక శాసనం చేసింది. మ్యూజియం నిర్వహణ వ్యవహారాలు చూడడానికి ధర్మకర్తల మండలి ఒకటి ఏర్పాటయింది. ఆంధ్రప్రదేశ్ గవర్నరు దీనికి అధ్యక్షులు.

ఇలాంటి వస్తు ప్రదర్శనశాలల వెనుక ఆసక్తిదాయకమైన గాథలు ఎన్నో ఉంటాయి. ప్రపంచ ఖ్యాతినందిన బ్రిటిష్ మ్యూజియం, పేరుపొందిన ఒకానొక వైద్యుడు సర్‌హాన్స్ స్లోవన్ సేకరించిన వస్తు సముదాయంలో నుంచి, ప్రజలందరి ప్రయోజనార్థం విడిచివెళ్ళిన వాటితో మొదట ఏర్పాటయింది. తాను సేకరించిన అపూర్వమైన వస్తు సంపదను లండన్‌లోను పరిసర ప్రాంతాలలోనూ గల అశేష ప్రజానీకం చూసి ఆనందించే అవకాశం కల్పించాలనీ, అక్కడ కొన్ని అక్కడ కొన్ని చెదురుమదురుగా కాకుండా అన్నిటినీ ఒకేచోట అమర్చాలనీ ఆయన అభిలషించారు.

ప్యారిస్ నగరంలోని లౌవ్రీ, రష్యాలోని హెర్మిటేజ్‌వంటి పెద్దపెద్ద పురావస్తు ప్రదర్శనశాలలు విదేశీ దౌత్య ప్రతినిధులను, స్నేహితులను ఆనందపరచటానికే ఆరంభంలో ఉద్దేశింపబడి వుండటంతో, ప్రజలకు వాటిని గురించి ఎవరైనా చెప్పినది విన్నది తప్ప మరేమీ తెలియదు. అలాకాకుండా పోప్ 10 వ లియో, పురావస్తు సముదాయాన్ని–ప్రఖ్యాతి వహించిన లావోకూన్ కూడా వీటిలో వుంది–ప్రజలు దర్శించటానికి వీలుకలిగించ

టంలో, కళాఖండాలను చూచి ఆనందంతో పరవశులవటంలో ప్రజలుకూడా భాగస్వాములయ్యేట్టు చేయటంలో అడుగు ముందుకు వేసినట్టయింది.

మహా పండితుడు సర్ విలియమ్ జోన్స్ 1784 లో ఏషియాటిక్ సంఘా న్నొకదాన్ని స్థాపించి, ఆ సంఘ సభ్యులు అధికోత్సాహంతో ఉదారంగా ఇచ్చిన విరాళాల సహాయంతో, ఈ దేశంలో పురావస్తు ప్రదర్శనశాలకు పునాది వేశారు. బరోడా పురావస్తు ప్రదర్శనశాల 1887 లో ప్రారంభమైంది. మహారాజు 3 వ సాయాజీరావ్ గైక్వాడ్ తన జీవిత కాలంలో అపూర్వమైన కళాఖండాలను సేకరించి, దానికి బహూకరించారు.

సాలార్ జంగ్ పురావస్తు ప్రదర్శనశాలలో ముఖ్యంగా రెండు విభాగాలున్నాయి. అవి ప్రాచ్య విభాగం, పశ్చిమ విభాగం. ప్రాచ్య విభాగంలో చైనా, జపాన్, బర్మా, ఇరాన్, భారత దేశానికి చెందిన కళాఖండాలున్నాయి. చైనాలో సంగ్, మింగ్ కాలాలకు చెందిన రకరకాలైన పింగాణీ సామాన్లు దీనిలో ప్రదర్శించ బడినాయి. ఇవి వివిధ రంగులలో చూడ సొంపుగా వుంటాయి.

ఈ ప్రదర్శనశాలలో ప్రదర్శించబడిన వ్రాత ప్రతులలో ఖురాన్ ప్రతులు, ప్రఖ్యాత కవుల కావ్యాలు మొదలైనవి వున్నాయి. వీటిలో దస్తూరి ఎంతో సొంపుగా వుంటుంది. ప్రఖ్యాతి వహించిన చిత్రకారులు వీటికి చిత్రాలు వేశారు. వీటిలో 16 వ శతాబ్దానికి చెందిన పర్షియన్ గ్రంథం రౌజత్-ఉర్-ముహిబ్బీన్ ఒకటి. బిజాపూర్ కళా సాంప్రదాయానికి చెందిన కళాకారుడు వీటికి చిత్రాలు వేశాడు. 13 వ శతాబ్దంలో అబ్బసిద్ ఖలిఫ్ ఆస్థానంలోని యాకుత్ అల్-ముస్టసిమి కాపీచేసిన ఖురాన్ కూడా దీనిలో వుంది. ఇది నస్క్ సాంప్రదాయానికి చెందినది.

ఆయుధాల విభాగంలో నూర్జహాన్ కత్తి, జహంగీర్ బాకు, షాజహాన్ కటారు మొదలైనవి ప్రదర్శించబడినాయి. నూర్జహాన్ కత్తి, పచ్చలు కెంపులతో చెక్కబడి వుంటుంది. జహంగీర్ బాకుపైన వజ్రాలు, కెంపులు, వైఢూర్యాలు కూర్చబడి వుంటాయి.

సాలార్ జంగ్ పురావస్తు ప్రదర్శనశాలలో ప్రదర్శించబడిన వాటిలో పచ్చ రాళ్లతో తయారైన వస్తువులు చాలా అద్భుతంగా వుంటాయి.

ఈ పురావస్తు ప్రదర్శనశాలలో ప్రదర్శించబడిన తివాచీలలో రకరకాలైన అల్లికలు, గొప్ప పనితనం కనిపిస్తుంది. టాబ్రిజ్, షిరాజ్, ఇస్ఫహన్, హిరాట్ సాంప్రదాయాలకు చెందిన అల్లికలు వీటిలో చూడగలుగుతాము. వర్ణ చిత్రాలలో దక్కను సాంప్రదాయానికి చెందిన చిత్రాలు, అధునాతన చిత్రకారుల చిత్రాలు కూడా వున్నాయి. లోహంతో తయారైన పాత్రలు, శిల్పాలు మొదలైన వాటిని ఇంకా ఎక్కువగా సేకరించవలసి వుంది.

ఈ వస్తు ప్రదర్శనశాలలు పశ్చిమ విభాగంలో ముద్దులు మూటలు గట్టే పలు రకాల పింగాణీ బొమ్మలు, పింగాణీ సామగ్రిలు, ఐరోపా ఖండంలో వివిధ దేశాలలో వాడే కుర్చీలు, నగిషీ పనిచేసిన బల్లలు 11 వ లూయీ, 16 వ లూయీ చక్రవర్తుల కాలంలో రాజ ప్రాసాదాలలో వాడిన రకరకాల సామగ్రులు, కళాభిమానులను మురిపించే వస్తువులు అనేకంగా ఉన్నాయి. ఇక్కడ ఉన్న 'మార్గరెట్టా' తాలూకు దారుశిల్పం అత్యంత ప్రశంసనీయమైనది. ఇటలీ దేశానికి చెందిన శిల్పి చెక్కిన అపురూప శిల్పం ఇది. మేలి ముసుగు ధరించిన ముద్దరాలు. "రాఖెలు' తాలూకు అందాల పాలరాతి బొమ్మ జగత్ప్రసిద్ధి పొందింది. బెన్ జోనీ మహాశిల్పి కళా తపఃఫలితం ఈ శిల్పం. పాశ్చాత్య చిత్రకారులు రచించిన చిత్రాలు ఉన్న మందిరం సర్వజనాకర్షకమైనది. ఇందులో హాలెండు, బ్రిటన్, ఫ్రాన్సు, ఇటలీ దేశాలకు చెందిన లాండ్ సీర్; వాట్స్, లైటన్, కూపర్ వంటి సుప్రసిద్ధులైన చిత్రకారుల మౌలిక చిత్రాలు కూడా ఉన్నాయి. వీటిలో పలువురు కళాభిమానుల మన్ననలను అందుకొన్న చిత్రాలు ఎన్నో ఉన్నాయి.



ప్రారంభోత్సవానంతరం రాష్ట్రపతి సాలార్ జంగ్ మ్యూజియంను సందర్శిస్తున్న దృశ్యం

ఈ ప్రదర్శనశాలను అతి శీఘ్రంగా అభివృద్ధి చేస్తున్నారు. ఈ ప్రదర్శనశాల పట్ల ప్రజల ఆదరాభిమానాలు అపారం. దేశంలో ఇంతటి ఆదరాభిమానాలు, ప్రచారం మరే ప్రదర్శనశాలకూ లభించలేదనే చెప్పాలి. ప్రవేశ రుసుము కొంచెం ఎక్కువగానే ఉన్నా ప్రేక్షకుల రద్దీ ఎప్పుడూ ఎక్కువగానే ఉంటున్నది. అధిక సంఖ్యలో దేశ దేశాలనుంచి సేకరించిన ఈ



సాలార్జంగ్ మ్యూజియం నూతన భవనం

కళా ఖండాలను భద్రపరచాలన్నా, వీటినన్నింటినీ అందంగా, చక్కగా కళాత్మకంగా ప్రదర్శించాలన్నా అన్ని వసతులైన హంగులు సమకూర్చిన భవనం కావాలి. ఈ ప్రదర్శనశాల నిర్వహణాధికారులు ఈ విషయమై గత పది సంవత్సరాలుగా శ్రద్ధ వహించడం, నిరంతరంగా కృషిచేయడం జరిగింది. ఈ రంగంలో జరిగిన కృషి ఫలించి ఈ భవన నిర్మాణం పూర్తిఅయింది. పాత భవనాలలోనుంచి ఈ కళా సంపదను భద్రంగా ఇక్కడకు చేరవేయడం జరిగింది. ఎక్కడ చూచినా, ప్రాచీన, అర్వాచీన అపూర్వ శిల్ప కళా సౌందర్యం రాసులు పోసినట్లున్న ఈ కళా మందిరాంతర్భాగాలలో రస పారవశ్యంలో మునిగిపోతూ, ఒక చోటనుంచి మరొకచోటుకు కదలి వెళుతున్నప్పుడు ఒకే ఒక వ్యక్తి–కళాభిమాని ఒక్కడే–ఇన్ని కళా ఖండాలను, ఇన్ని శిల్పాలను, ఇన్ని చిత్రాలను, ఇన్ని అపూర్వ వస్తువులను ఎలా సేకరించకలిగాడా అని ఆశ్చర్యం కలుగుతుంది. అపారమైన దేశాభిమానం కల ఈ కళా ప్రియుడు సాలార్‌జంగ్ తను కన్న కలలు నిజం అయేదాకా జీవించి ఉండలేదే అన్న విచారం కలుగుతుంది. మానవ సేవా తత్పరుడైన ఈ కళాభిమాని ఆశీస్సులు మనకెప్పుడూ లభిస్తూనే ఉంటాయి. దేశంలో ఉన్న పెద్ద వస్తు ప్రదర్శనశాలలో సాలార్‌జంగ్ వస్తు ప్రదర్శనశాల ఎన్నదగినది. దీని అభివృద్ధికై ఎంతైనా కృషిచేయవచ్చును.

సాలార్‌జంగ్ వస్తు ప్రదర్శనశాలకు ప్రారంభోత్సవం జరపడం నాకు అత్యంత సంతోషదాయకం. ఇది నా మహాద్భాగ్యం."

---

# నాల్గవ ప్రణాళికా కాలంలో లఘుపరిశ్రమల అభివృద్ధి

నాల్గవ ప్రణాళికా కాలంలో (1969_74) లఘు పరిశ్రమల అభివృద్ధికి పథకాలను రూపొందించే సందర్భంలో వివిధాంశాలనుగురించి కేంద్ర ప్రణాళికా సంఘానికి తగు సలహాలివ్వడానికై 19 గురు సభ్యులతో ఒక ప్రత్యేక బృందం ఏర్పాటయింది. ప్రణాళికా సంఘంలో పరిశ్రమల వ్యవహారం చూసే సభ్యుడు శ్రీ ఆర్. వెంకటారామన్ ఈ బృందానికి అధ్యక్షుడు. 19 9_79 సంవత్సరముల మధ్య పదేళ కాలంలో లఘు పరిశ్రమల అభివృద్ధికి గల అవకాశాలనూ, అవసరాలనూ, అందుకు తీసుకోదగ్గ చర్యలనూ ఈ బృందం తమ దృష్టిలో ఉంచుకోవలసి వస్తుంది.

మూడవ ప్రణాళికా కాలంలోనూ, ఆ దరిమిలా, 1966_67, 1967_68 సంవత్సరములలోనూ, దేశంలో లఘు పరిశ్రమలు ఏవేవి ఎంత వరకు అభివృద్ధి చెందినది వీరు అంచనా తేల్చుకుంటారు. తమ విధి నిర్వహణ సందర్భంగా, అవసరమని తోచిన సంఘాలను నియమించడానికి, ఎవరైనా వ్యక్తులను సభ్యులుగా కలుపుకోడానికితగు అధికారాలను ఈ బృందానికి దఖలు పరచడమయింది.

# చైతన్యమూర్తులు

## డా. ప్రఫుల్లచంద్ర రాయ్

(జననం: 2 ఆగస్టు 1861)

**1861** వ సంవత్సరంలో ఆంగ్లేయ రసాయన శాస్త్రవేత్త, సర్ విలియం క్రూక్స్, బెల్జియం రసాయన శాస్త్రవేత్త క్లాడ్ ఆగస్టులామీ, వేర్వేరుగా థాలియం అనే లోహపు అంశాన్ని కనుగొన్నారు. అదే సంవత్సరం భారతీయ రసాయన శాస్త్రవేత్త ప్రఫుల్లచంద్రరాయ్ జన్మించారు. ఆతర్వాత 35 సంవత్సరాలకు ఆయన మెర్క్యూరియం నైట్రేట్ కనిపెట్టారు.

రసాయన శాస్త్రవేత్తగా విశ్వ విఖ్యాతిగాంచిన శ్రీ రాయ్, బాల్యంలో సాహిత్యం, జీవిత చరిత్రలు, చరిత్ర, భౌగోళిక శాస్త్రాలను ఎంతో ఆసక్తితో అధ్యయనం చేస్తుండేవారు. తండ్రి గ్రంథాలయం నుండి యీ గ్రంథాలను తీసుకొని శ్రద్ధాసక్తులతో క్షుణ్ణంగా చదివేవారు. జాన్సన్ డిక్షనరీని దానిలోని లోకోక్తులను కంఠస్థం చేయడం, పన్నెండు సంవత్సరాల ప్రాయంలో వేకువ ఝామున మేల్కొని తన అభిమాన రచయితల గ్రంథాలను పఠించడం ఆయన అలవాట్లు. న్యూటన్, గెలీలియోల జీవిత చరిత్రలు ఆయనను ఎంతగనో ఆకర్షించాయి. విలియంజాన్సన్, లాడెన్ భాషా పాండిత్యం ఆయనను ముగ్ధుణ్ణిచేశాయి. బెంజిమన్ ఫ్రాంక్లిన్ పేదరికపు పెనుభూతంతో సంకుల సమరం జరిపి, ఆపైన కీర్తి చంద్రికలను సాధించిన ఉదంతం ఆయనను ప్రభావితుణ్ణి చేసింది. ఆ ప్రభావం ఆయన జీవితంపై ప్రసరించింది.

కలకత్తాలోని ప్రెసిడెన్సీ కళాశాలలో చదివే రోజులలో శాస్త్ర విజ్ఞానానికి సంబంధించిన ఉపన్యాసాలను వింటూ అలగ్జాండర్ పెడ్లర్ పరిశోధనా విషయాలకు మంత్రముగ్ధుడై రసాయన శాస్త్ర విషయాల వైపు తన దృష్టిని మరలించారు.

డిగ్రీ పరీక్షకు చదువుతున్న రోజులలో గిల్క్రిస్టు స్కాలర్‌షిప్పులకు సంబంధించిన అఖిల భారత పోటీలో పాల్గొనడానికి యింటివద్దనే అధ్యయనం చేసి పోటీలో నెగ్గారు. ఆ తర్వాత ఎడింబరో వెళ్ళి భౌతికశాస్త్రం, రసాయన శాస్త్రం, వృక్షశాస్త్రం, జీవశాస్త్రాల అధ్యయనం చేశారు. ఆచార్య అలగ్జాండర్ క్రమ్ బ్రౌన్ సహచర్యంవల్ల కెమిస్ట్రీలో మరింతగా ఆసక్తి పెరిగింది.

తీవ్రంగా కృషి చేసి డి. ఎస్ సి. సాధించారు. విశ్వవిద్యాలయ కెమికల్ సొసైటీ ఉపాధ్యక్షులుగా ఆయన ఎన్నికైనారు.

సైన్సులో డాక్టరేటు సంపాదించిన శ్రీ రాయ్ అధ్యాపక వృత్తిలో చేరడానికి ప్రయత్నించారు.

బెంగాల్ ప్రొవిన్షియల్ సర్వీసులో నెలకు రు. 250/- ల వేతనంపై అసిస్టెంట్ ప్రొఫెసరుగా డాక్టర్ రాయ్ చేరారు. 1896 లో మెర్క్యూరిక్ నైట్రేట్‌ను కనుగొనడంతో ఆయన ఘనత మరింతగా వాసికెక్కింది "మాస్టర్ ఆఫ్ నైట్రేట్"గా ప్రసిద్ధిగాంచారు.

ప్రభుత్వ సర్వీసు నుండి రిటైర్ అయిన తర్వాత విశ్వవిద్యాలయ సైన్స్ కళాశాలలో రసాయన శాస్త్ర పరిశోధనా విభాగం డైరెక్టరుగా నియమితులైనారు. ఈ సంస్థ అభివృద్ధికి ఆయన తన వేతనాన్నంతా వెచ్చించారు. భారతీయ రసాయన శాస్త్ర పాఠశాల, భారతీయ రసాయన శాస్త్ర సంఘాలను ఆయన నెలకొల్పారు. "హిందూ రసాయన శాస్త్ర చరిత్ర" గ్రంథాన్ని రచించి తన దేశ భక్తిని చాటుకున్నారు. వారి 15 సంవత్సరాల కృషి ఫలితమే యీ గ్రంథం. శాస్త్ర విజ్ఞానంలో భారత దేశ ప్రతిష్ఠను పునర్జీవింపజేశారు.

పరిశోధన, కేవలం పరిశోధన నిమిత్తం కాదనేది డా॥ రాయ్ ఉద్దేశం. దేశంలోని ముడి పదార్థాలకు యీ పరిశోధనా ఫలితాలను అన్వయింపజేసి, తద్వారా అమూల్యమైన వస్తువులను తయారు చేయాలని ఆ విధంగా మధ్య తరగతి కుటుంబాల ఉన్నతికి దోహదం కల్పించాలని ఆయన సంకల్పం. ఆయన తన వేతనంలో ఆదా చేసుకున్న రు 800/-లతో ఔషధాల పరిశ్రమను ప్రారంభించారు. పరిశోధనల కార్యక్రమాన్ని వదులుకోకుండా పూర్తి కాలం వినియోగించేవారు. సెలవు రోజులలో 10 నుండి 12 గంటలు పని చేసేవారు. ఆ సందర్భంలో ఎన్నో అడ్డంకులను ఎదుర్కొన్నారు. బెంగాల్ కెమికల్ ఫార్మసూటికల్ వర్క్స్ అనే సంస్థ, ఆయన స్మృతి చిహ్నంగా యిప్పటికీ నిర్వహించబడుతున్నది.

1901 లో ఇద్దరు నవనీత హృదయులు - గాంధీజీ, ప్రఫుల్ల చంద్ర రాయ్ కలుసుకోవడం జరిగింది. గోపాలకృష్ణ గోఖలే, గాంధీజీకి యీ శాస్త్రవేత్తను యీ విధంగా పరిచయం చేశారు. "ఇతను ఆచార్య రాయ్, తన రు 800/- నెలసరి జీతంలో కేవలం రు. 40/-లు తనకొరకు ఉంచుకొని మిగతా మొత్తాన్ని ప్రజా ప్రయోజనాలకు వినియోగిస్తున్నాడు. ఇతడు వివాహం చేసుకోలేదు చేసుకునే ఉద్దేశం లేదు"

కాలానుక్రమంగా వారిద్దరి పరిచయం పెరిగి చాలా సన్నిహితులైనారు. రసాయన శాస్త్ర పరిశోధనలలో కాలం గడిపే డా॥ రాయ్, రాజకీయాలపై దృష్టి నిలుపలేదు. అయినా వాటిని పూర్తిగా వదలుకోలేకపోయారు. అయితే 1923 లో కాకినాడలో జరిగిన కాంగ్రెసు మహాసభలకు కొన్ని నిముషాలపాటు ఆయన అధ్యక్షత వహించడం ఆశ్చర్యం కలిగిస్తుంది.

అధునాతన శాస్త్రవేత్త పారిశ్రామికవేత్త డా॥ రాయ్ పురాతనమైన చరఖాను అభిమానించడం అందరికీ అమితాశ్చర్యాన్ని కలిగిస్తుంది. ఖాదీని అభిమానించే వారిలో గాంధీజీ తర్వాత బహుశా ఆయనే ప్రసిద్ధి వహించారు. చర్ఖాను ఎంతగానో ఆయన అభిమానించారు. గాంధీజీ చర్ఖాను ఎంతో పవిత్రంగా భావించేవారు. తీసే ప్రతి నూలు పోగులో ఆయనకు శ్రీరాముడు కనిపించేవారు. బీదప్రజలకు కరువులేకుండా భుక్తిని కలిగించేది చర్ఖాయేనని డా॥ రాయ్ కనిపెట్టారు.

డా॥ రాయ్‌ను గోఖలే "శాస్త్రవిజ్ఞాన సన్యాసి," గా అభివర్ణించారు. తన అరవయ్యోపడిలో డా॥ రాయ్ దేశంలో 2,00,000 మైళ్ళు పర్యటించి సహాయక కార్యక్రమాలు, స్వదేశీ ఉద్యమ వ్యాప్తి, యితర జాతీయ, మానవసేవా కార్యక్రమాలను నిర్వహించారు.

ఎట్టి సందర్భంలోను దేశసేవను వెనుదీయలేదు. 1921 లో ఖుల్నాకరువు సందర్భంలో , 1922 1931 లలో బెంగాల్‌లో వరదలు వచ్చిన సందర్భంలోను డా॥ రాయ్ అమోఘమైన కృషి చేశారు. సంస్థలను ఏర్పరచి, నిర్వహించడం ఆయన ప్రత్యేకత సమాజంలో ఆయనకుగల గౌరవం అపూర్వమైనది. ఆయన పిలుపుపై ప్రజలు ఎంతో ఉదారంగా విరాళాలు యిచ్చేవారు. అవి సద్వినియోగం చేయబడ్డాయని వారికి తెలుసు

డా॥ రాయ్ సంఘసేవా తత్పరుడేగాక ప్రఖ్యాత విద్యావేత్త, పారిశ్రామికవేత్త కూడా అంతకుమించి గొప్ప దేశభక్తుడు వరద బాధితుల సహాయ కార్యక్రమాలు ముమ్మరంగా జరుగుతున్న సమయంలో వీలుకల్పించుకుని తన పరిశోధనాలయంలో పనిచూచేవారు అదేవిధంగా పరిశోధనాలయంలో వూపిరిసల్పని పనిచేస్తూనే మరోవైపు సేవా కార్యక్రమాల్లో పాల్గొనేవారు.

ఎడతెరపిలేని కార్యక్రమాలలో సహితం తీరిక చేసుకొని తనఅభిమాన విషయమైన గ్రంథపఠనం చేసేవారు.

తననుతాను పరమాత్మకు అంకితం చేసుకుని కార్యక్రమాలన్నిటిని చేపట్టేవాడినని డా॥ రాయ్ తన ఆత్మకథలో నుడివారు.

## గిడుగు రామమూర్తి

(జననం : 12 ఆగస్టు 1863)



నేటి యువకుడు, 50 ఏళ్ళకు పూర్వం వెలువడిన వార్తాపత్రికను గానీ, వార పత్రికనుగానీ తిరగేస్తే వాటిలోని భాష, శైలివిధానం కఠినంగానూ, చదవడానికి యిబ్బందికరంగానూ భావిస్తాడు నేటి తెలుగు పత్రికలను, పుస్తకాలను లక్షలాదిమంది ప్రజలు ఆసక్తితో చదవడానికి కారణం వాటి సరళమైన వాడుక భాష. ఇంతసన్నిహితమైన శైలిఉండడంవల్లనే నేటితరం పఠితలు. భావితరాల పఠితలు గిడుగు రామమూర్తి గారికి ఎంతగానో ఋణపడి ఉన్నారు వ్యవహారిక తెలుగును వాడకంలోకి తేవడానికి వారే బాధ్యులు

జీవితపు తొలి రోజులలో గిరిజనులకు చెందిన సవరలతో వ్యవహరించే అవకాశం ఆయనకు లభించింది. వారిభాష, సంప్రదాయాలు, ప్రవర్తన శ్రీ రామమూర్తిని ఎంతగానో ఆకర్షించాయి. ముఖలింగం దేవాలయంలోని శిలాశాసనాలు చరిత్ర, అధ్యయనానికి ఆయను పురికొల్పాయి ఆ విధంగా ఆయన తత్వశాస్త్రం, మానవుని పుట్టుపూర్వోత్తరాలకు చెందిన చరిత్ర, తత్సంబంధమైన యితర విషయాల అధ్యయనం వైపు మొగ్గుజూపారు.

లెక్చరర్‌గా పనిచేస్తూ సవరల భాషా పదకోశం తయారు చేశారు. సవరలకు చెందిన అసంఖ్యాకమైన కథలు, పాటలు సేకరించారు.

సవరల నిమిత్తం ఆయన పాఠశాలలను నెలకొల్పి సవరలకు ఉపాధ్యాయ శిక్షణ యిచ్చారు సవరల భాషకు లిపి యేర్పరచి, సవరవ్యాకరణం రూపొందించిన ఘనత ఆయనకు దక్కుతుంది.

1906 లో ఆంగ్లేయుడు, జె. ఎ. యేట్స్ సూచనను అనుసరించి గ్రాంధిక, వ్యవహారిక భాషలలో గల వ్యత్యాసాలను తొలిగించే నిమిత్తం శ్రీయుతులు రామమూర్తి, గురజాడ అప్పారావు, విశాఖపట్నంలోని ఎ వి. ఎన్. కళాశాల ప్రిన్సిపాల్ పి. టి శ్రీనివాస అయ్యంగార్ సమావేశ మయ్యారు.

వ్యవహారిక భాషకు ప్రాచుర్యం కలిగించి, దానికి అర్హమైన స్థానం, విలువ కలిగించడానికి శ్రీ రామమూర్తి అహర్నిశలు కృషిచేశారు. ఈ ఉద్యమంలో ఎన్నో సభలు, సమావేశాలు ఏర్పాటుచేసి, చర్చావేదికలు నిర్వహించి గ్రాంథికభాషా చాంధసులను, అభిమానులను విజయవంతంగా ఎదుర్కొన్నారు. ఎన్నో విమర్శలను ఎదుర్కొన్నారు.

గ్రాంథిక భాషలో ప్రావీణ్యతలేని కారణంగా వ్యవహారిక భాషఅనే సుళువైన మార్గాన్ని ఆయన అనుసరించాడని ఆయన విమర్శకులు ఆరోపించారు. గ్రాంథిక భాషాభిమానులు వ్యవహారిక భాషను "గ్రామ్య" భాషగా చిత్రీకరించారు.

అయితే శ్రీ రామమూర్తి పురాతన గ్రంథాలలోని ఆశ్వాసాలను, పద్యాలను సోదాహరణంగా ఉదహరించేవారు. నన్నయ కాలంనుండి అసంఖ్యాకులైన భాషా పాండిత్యంగలవారు వెలసినప్పటికీ శ్రీ రామమూర్తి మాదిరిగా ఆ భాష సంప్రదాయాలను లోతుగా తరచి అధ్యయనం చేసినవారు లేరు.

భాష ముందు ఆ తర్వాత వ్యాకరణంఅనే భావనను ఆయన సమర్థించారు. సజీవమైన భాష, పురోగమించే భాష, వ్యాక

రణపు సంకెళ్ళలో బిగిసిపోరాదు. చైతన్య పూరితమైన భాష చెందే మార్పులకు అనుగుణంగా వ్యాకరణ శాస్త్రం రూపొందాలి. ఈ వాదనను సమర్థించడానికి శ్రీ రామమూర్తి ఎందరో ఉద్దండ పండితులను ఎదుర్కోవాల్సి వచ్చింది. ఎన్ని కువిమర్శలు, వ్యతిరేకత ఎమరైనా చలించకుండా నిల్చారు. తన అవసానదశకు ముందుగానే పత్రికలు, యువజనులు, పురోగాములు శ్రీ రామమూర్తి విధానాలను సమర్థించడం ఆయనకు ఎంతగానో సంతృప్తి కలిగించింది. 1940లో ఆయన మృతిచెందారు. వ్యవహారిక భాష బాగా పాతుకపోయింది. పదాలను ఎంతగానో అభిమానించి, పదార్థాలను యుక్తిగా చిత్రీకరించేవారు. ధ్వనికి రూపకల్పనపథం. సవరలకు సేవచేస్తూ ఏజన్సీ ప్రాంతంలో మలేరియా వ్యాధికి గురిఅయ్యి క్వినైన్ తీసుకోవడంతో బధిరుడయ్యారు.

శ్రీ రామమూర్తి స్వాభిమానానికి ఎన్నో ఉదాహరణలు లభిస్తాయి. ఆయన సంఘ సంస్కర్త కూడ. అయితే భాషా సంస్కరణకే ఆయన తన శక్తి యుక్తులను ధారపోశారు. 1940 జనవరి 15 వ తేదీన తన భాషా సంస్కరణల తీరును ధ్రువపర్చాల్సిందిగా పత్రికలకు, ప్రభుత్వానికి, విశ్వవిద్యాలయాలకు ఆయన విజ్ఞప్తి చేశారు. అదే ఆయన అంతిమ సందేశం. ఆ తర్వాత కొద్దిరోజులకే జనవరి 22 వ తేదీన ఆయన మరణించారు ఆయన అంతిమ కోరిక నెరవేరినప్పుడు ఆయన ఆత్మకు శాంతి లభిస్తుంది.

## అరవింద ఘోష్



అరవింద మహర్షి భారతదేశంలోని పుణ్య పురుషులలో ఒకరుగా లెక్కించదగిన వ్యక్తి. భవిష్యత్తులో మహాపురుషుడుగా కాదగ్గ ఆయన బాల్యయవ్వన దశలు రెండూ భారతీయతకు, హైందవ సాంప్రదాయాలకూ దూరంగానే గడిచాయి. అరవిందుని తండ్రి డా. కృష్ణధన్ ఘోష్ ఆంగ్లభాషా ప్రభావితుడు యోగివలె నిరాడంబరుడు ఆయన యింటిలోని సేవకులు సైతం యింగ్లీషులోనే మాట్లాడుతుండేవారు.

అరవిందుని అయిదో ఏట ఆయనను డార్జిలింగు కాన్వెంట్ స్కూల్లో చేర్పించారు. ఏడోఏట మాంచెస్టర్‌కు పంపించి అక్కడి ఒక ఆంగ్లేయ మతాధిపతి దంపతులయింట్లో వారివద్ద చదువునేర్చుకొనే ఏర్పాట్లు చేశారు. తమ అజమాయిషీ క్రింద వున్నప్పుడు ఏ భారతీయుడికీ సన్నిహితంగా వెళ్ళకుండా కట్టుదిట్టాలు చేశారు గురువులు. కనీసం భారతీయ వాయువుల్ని సహితం ఆయన వైపు ప్రసరించకుండా జాగ్రత్త తీసుకున్నారు. ఆయన క్రైస్తవమతం పుచ్చుకోక పోవడం కేవలం దైవికం. అక్కడినించి ఆయన లండన్‌లోని సెంట్‌పాల్స్ స్కూల్లో చేరాడు అక్కడ విద్యాభ్యాసాన్ని పూర్తిచేశాక కేంబ్రిడ్జిలోని కింగ్స్ కాలేజిలో ప్రవేశించారు

కింగ్స్ కళాశాలలో అరవిందునికి "క్లాసిక్స్ స్కాలర్‌షిప్పు" లభించింది. మిల్టన్ తరువాత అంతటిగొప్ప ప్రజ్ఞావంతుడిగా ఆయనను పేర్కొన్నారు. ఫ్రెంచ్, జర్మన్, ఇటాలియన్, స్పానిష్ భాషలను అరవిందుడు అధ్యయనంచేశారు గ్రీకు, లాటిన్ కవితలకు ఉద్దేశించిన బహుమానాలన్నీ అరవిందుడే గెలుచుకునేవారు క్లాసిక్స్ తొలిభాగం ఆయన ప్రథమ శ్రేణిలో పాసయ్యారు. ట్యూటర్ యొక్క మార్గదర్శకత్వం లేకుండానే ఐ. సి. ఎస్. కు జరిగే బహిరంగ పోటీలో మంచిమార్కులతో గెలుపొందారు. అయితే గుర్రపు స్వారీ పరీక్షలో ఆయన ఓడిపోవడం వల్ల సెలక్టు కాలేకపోయారు. అంతకన్న మంచి భవిష్యత్తు ఆయనను ఆనాడే వరించింది కాబోలు !

అరవిందుడు కేంబ్రిడ్జిలో చదువుతున్నప్పుడు అక్కడి భారతీయ విద్యార్థుల సంఘమైన "మజ్లీస్‌కు" కార్యదర్శిగా వున్నారు. భారత దేశ స్వాతంత్ర్యాన్ని గూర్చి ప్రచారం చేసే ఒక ముఖ్య వ్యక్తిగా వినుతికెక్కారు "పద్మమూ-ఖడ్గమూ" అనే ఒక రహస్య సంస్థలోచేరి మాతృదేశంనుండి విదేశీ పరిపాలనను అంతమొందించడానికి తుదివరకు దీక్షతో పోరాడగలనని ప్రతిజ్ఞ కూడా చేశారు

ఇంగ్లాండులో అరవిందుడు విద్యాభ్యాసాన్ని ముగించుకుని 1893 లో స్వదేశానికి తిరిగివచ్చారు ఫిబ్రవరి నెలలో ఆయన బొంబాయి రేవు చేరుకుని మాతృదేశపు గడ్డపై కాలుపెట్టడంతోనే ఆయనలో తిరిగి వెనకటి అనుభవం ఆధ్యాత్మికమైన ఒకానొక అనుభూతి కలిగింది. ఆయనచుట్టూ ఒక విధమైన ప్రశాంతత అలుముకుంది.

స్వదేశానికి తిరిగి వచ్చిన అరవిందుడు ఉద్యోగాన్ని వెతుక్కోవలసి వచ్చింది. మహరాజా శాయజీరావు గైక్వాడ్ పరిపాలిస్తున్న బరోడా రాజ్యంలో ఉద్యోగంలో ప్రవేశించారు. అప్పటికి ఆయన వయస్సు 21 సంవత్సరాలు మాత్రమే. తన మాతృభాష అయిన బెంగాలీలో ఆయనకు చెదురు చెదురుగా మాత్రమే ప్రవేశం వుండేది. అయితే అనతికాలంలోనే ఆయన

దానిలో విశేషమైన ప్రజ్ఞను సంతరించుకున్నారు. హోమర్, వర్జిల్ వంటి మహాకవులు తిరిగిన కావ్యభూముల్లో సంచరించి, షేక్సిపియర్, మిల్టన్ వంటి కవివరేణ్యులునడయాడిన సాహిత్య క్షేత్రాలలో నడిచి నడిచి యిప్పుడు అరవిందుడు, కాళిదాసు, భవభూతి విహరించిన కవితామార్గాలలో అడుగుపెట్టారు. వేదాలను చదివారు. ఉపనిషత్తులను, గీతను పఠించారు అరవిందుడు మరాఠీ, గుజరాతీ భాషలను కూడా నేర్చారు.

మొదట అరవిందుడు రెండువందల రూపాయల నెలసరి జీతంతో రెవెన్యూశాఖలో ఉద్యోగంలో ప్రవేశించారు. ఆటుతర్వాత విద్యాశాఖలోకి మారి ఫ్రెంచి అధ్యాపకుడిగానూ, తరువాత ఇంగ్లీషు ప్రొఫెసర్‌గానూ, తదనంతరం బరోడాకళాశాల వైస్‌ప్రిన్స్‌పాల్ గానూ పని చేశారు. ఆయన ఉద్యోగంలో వున్నప్పుడే రాజకీయ కార్యకలాపాలు రహస్యంగా ప్రారంభమైనాయి. పూనాలోని హిందూప్రకాశ్‌కు ఆయన అందజేస్తున్న రచనలు ఎంతో ఆలజడిని సృష్టించాయి. ఆధునికుల త్రిమార్గ విధానమైన వేడుకోలు, విజ్ఞాపన, ధిక్కారం సూత్రాన్ని ఆయన గర్హించారు. ప్రజలు త్యాగ గుణాన్ని అలవరచుకోవాలనీ, స్వీయశక్తి మీద నమ్మకం కలిగి వుండాలనీ, శక్తివంతమైన ఉద్యమం మీద విశ్వాసం కలిగి వుండాలనీ నొక్కిచెప్పారు. బెంగాలులోని, మహారాష్ట్రలోని విప్లవవాదులతో సన్నిహితపరిచయం కలిగి వుండి, వారిని ప్రోత్సహించి, ఉత్తేజితులను చేస్తుండేవారు.

సాహిత్య, రాజకీయ కృషితోపాటు ఆధ్యాత్మిక జీవితాన్ని కూడా ఆయన కొనసాగించారు. బ్రహ్మానందస్వామి శిష్యులైన డియోధార్ అనే ఆయన అరవిందునకు ప్రాణాయామంలో ప్రవేశం కల్పించారు. అంతేగాక గ్వాలియర్‌కి చెందిన 'లెలె' మార్గదర్శకత్వాన్ని కూడా ఆయన పొందారు. అరవిందుని దేశాభిమానానికి ఆధ్యాత్మికజీవితమే బలమైన పునాదిగా అయింది. భారతదేశం అంటే ఒకొక భౌగోళిక భూఖండం కాదనీ, సాక్షాత్తూ దైవమాత అని ఆయన భావించేవారు. ఆయన జాతీయభావంలో మూడు ముఖ్యాంశాలు పెనవేసుకొని వున్నాయి. మొదటిది రాజకీయ స్వాతంత్ర్యం, రెండవది ఆర్థికాభివృద్ధి, మూడవది ఆధ్యాత్మిక ప్రగతి. ఈ ఆధ్యాత్మిక విస్తృతి కూడా అపారమూ, అనంతమూ అయివుండాలి అని విశ్వసించేవారాయన. భారతదేశం తనను తానే జాగృతం చేసుకోవడానికి మాత్రమేగాక మొత్తం మానవ జాతినంతటినీ జాగృతం చేయడానికి యీ ఆధ్యాత్మికశక్తి అవసరం అని ఆయన విశ్వాసం.

బెంగాలు విభజనతో దేశంలో రాజకీయ పరిస్థితి తీవ్ర రూపం దాల్చింది. 1905 అక్టోబరు 18 వ తేదీన సంతాపదినం జరిపారు. నిరసన సూచకంగా భరిసాల్‌లో జరిగిన ఊరేగింపుకు అరవిందుడు సారథ్యం వహించారు. అప్పుడు ఆయన బరోడా నుంచి బయలుదేరి వచ్చారు. అచ్చట ఆయన వైస్‌ప్రిన్సిపాల్‌గా రూ. 750 ల వేతనం పొందుతుండేవారు అరవిందునికి దివాన్ కావాలన్న కోర్కె వుండి వుంటే ఆ పదవిని కూడా పొందివుండే వారే.

1906 వ సంవత్సరంలో అరవిందుడు బెంగాలు జాతీయకళాశాలలో రూ. 150 ల వేతనంపై ఉద్యోగంలో ప్రవేశించారు. ఆ సంవత్సరం కలకత్తాలో జరిగిన కాంగ్రెసు మహాసభలో అతివాదులు బలంగా వున్నట్లు వెల్లడైంది. మహాసభకు అధ్యక్షత వహించిన దాదాభాయ్ నౌరోజీ తిలక్, అరవిందుడు ప్రతిపాదించిన నాలుగు అంశాలతో కూడిన కార్యక్రమాన్ని అంగీకరించవలసిందిగా మితవాదులను కోరారు.

"వందేమాతరం" "జుగంతర్" పత్రికలలో ఆయన వ్రాసిన వ్యాసాలు ప్రజలను ఉత్తేజితులను చేశాయి. "వందేమాతరం" పట్ల ఆయన తన దృష్టిని ఎక్కువగా కేంద్రీకరించవలసివచ్చింది. కనుక జాతీయ కళాశాలలో తమ ఉద్యోగానికి రాజీనామా చేశారు. 1907 వ సంవత్సరంలో సూరత్‌లో జరిగిన కాంగ్రెసు మహాసభలో అరవిందుడు, మితవాదులను విడిపోవడానికి అతివాదులను సమ్మతింపజేశారు. తీవ్రచర్యలు గైకొనడానికి యువకులను ప్రోత్సహించారు.

మనిక్‌టోలా బాంబుకేసు సందర్భంలో అరవిందుని అనుమానితునిగా ఎంచి అలీపూర్ జైలులో నిర్బంధించారు. అచ్చట ఆయన తమ ఆధ్యాత్మిక సాధనలను ప్రవర్తం చేశారు. సర్వాంతర్యామి అయిన శ్రీకృష్ణపరమాత్మని దివ్యమంగళ మూర్తిని దర్శించుకున్నారు. జైలు కటకటాలు, వృక్షాలు, న్యాయస్థానం న్యాయమూర్తి అన్ని వస్తువులు, అన్ని ప్రాణులు ఒకే ఒక అదృశ్యశక్తి యొక్క అనేక రూపాలుగా ఆయనకు గోచరించాయి. కోర్టు విచారణ పట్ల నిర్లిప్తత వహించారు శ్రీచిత్తరంజన్‌దాస్ అరవిందుని పక్షాన వాదించారు కోర్టులో అరవిందుని నిర్దోషిగా తీర్పు చెప్పి విడుదల చేశారు.

విడుదలై వచ్చిన కొన్ని వారాలకే 1909 మే 30 వ తేదీన ఆయన ఉత్తరప్రాంతంలో ప్రసంగిస్తూ జాతీయోద్యమం రాజకీయోద్యమం కాదనీ, సనాతనధర్మం జాతీయ వాదమనీ ఉద్ఘాటించారు. "కర్మయోగి" అనే ఇంగ్లీషువార పత్రికనూ, "ధర్మ" అనే బెంగాలీ వారపత్రికనూ ఆయన స్థాపించారు. "కర్మయోగి" 1909 జూలై 30 వ తేదీ సంచికలో వ్రాస్తూ దేవదూతగా ఒక మహావ్యక్తి ఉద్భవించి జాతికి విమోచనం కలిగిస్తాడని పేర్కొన్నారు. అరవిందుడు 1910 లో పాండిచేరికి వెళ్లి 1950 వ సంవత్సరంలో నిర్యాణం పొందేవరకూ అచ్చటనే నివసించారు.

వివిధ రంగాలలో అరవిందుడు సాధించిన విజయాలు అద్వితీయమైనవి. "ఆలోచన ద్వారా దేనినైనా సాధించవచ్చు. మృత్యువు, వ్యాధి, దారిద్ర్యం వీటిని అధిగమించవచ్చునని" అరవిందుడు ప్రవచించారు. దేశప్రజలందరూ సంధ్యాసమయంలో కొన్ని నిమిషాలపాటు "మనమందరమూ ఒక్కటే" అనే భావనను గురించి ఆలోచించినట్లయితే అద్భుతమైన ఆలోచనా శక్తి ఉద్భవిస్తుందని అరవిందుడు సూచించారు. ఉదాత్తమైన భావాలు కలిగి యథాశక్తి వాటిని ఆచరణలో పెట్టడానికి శక్తి వంచన లేకుండా మనం ప్రయత్నిద్దాం.

# ఆంధ్రకేసరి టంగుటూరి ప్రకాశం

(జననం: ఆగస్టు 23; 1872)



పస్తుపడి వుండడంవల్లగానీ, వార్ధక్యం మూలంగా సంక్రమించిన అశక్తతవల్లకానీ, ఆపదవల్లకానీ లేదా మృత్యుభయంవల్ల కానీ మృగరాజు గడ్డిపోచలు మేసి ప్రాణాలు నిలుపుకోడానికి సమ్మతించదు. బాగా మదించిన ఏనుగును వధించి విందారగించాలనే కోరుకుంటుంది. ఈ భర్తృహరి సుభాషితాన్ని గౌరవప్రదమైన వ్యక్తికి అన్వయింపజేసినప్పుడు అట్టి మనిషికి ప్రాతినిధ్యం వహిస్తారు మన ఆంధ్రకేసరి శ్రీ టంగుటూరి ప్రకాశం పంతులుగారు. ఘనతలో, ఠీవిలో, హుందాతనంలో ప్రకాశంగారు కేసరి వంటి వారు.

ఆయన అసమాన ధైర్యశాలి. గొప్ప త్యాగ శీలుడు. స్థిత ప్రజ్ఞుడు. గట్టి పట్టుదల కలవాడు ఐశ్వర్యానికికానీ, దారిద్ర్యానికికానీ అతీతుడైన వ్యక్తి ఆయన. కలిగివచ్చినప్పుడు గర్వించలేదు. కష్టకాలంలో కృంగిపోలేదు.

గుంటూరుజిల్లా కనపర్తి గ్రామం ప్రకాశంగారి జన్మస్థలం. లేమిడి, దారిద్ర్య బాధలకు ఆయన చిన్ననాడే అలవాటుపడ్డారు. క్షామ దేవత విలయతాండవం చేసినప్పుడు ఆయన ఎక్కువగా అణ్ణులఅలములతోనే కాలక్షేపం చేయవలసి వచ్చింది. తన పన్నెండవయేట ప్రకాశం తండ్రిని కోల్పోయారు. తన కుటుంబ పోషణార్థం అతని తల్లిగారు చిన్న భోజనశాల నడపవలసి వచ్చింది. అయితే ఆ రోజుల్లో ఈ వృత్తిపట్ల అంతగా గౌరవదృష్టి వుండేదికాదు. కాని బీదరాలైన ఆ మాతృమూర్తికి గత్యంతరం లేకపోయింది ప్రకాశం తన పొట్టపోసుకోవడానికి ఉదారులైన కుటుంబాలవారి దయాదాక్షిణ్యాలపైన ఆధారపడవలసి వచ్చింది. ప్రకాశం మాధ్యమిక పాఠశాల పరీక్ష ఫీజు చెల్లించడానికిగాను మూడు రూపాయల కొరకు అతని తల్లిగారు తన పట్టువస్త్రాన్ని కుదవబెట్టవలసి వచ్చింది.

ప్రకాశం చిన్నతనంలో చాలా తుంటరివాడుగా పేరుపడ్డాడు. అప్పుడప్పుడు అతణ్ణి కాళ్లు చేతులు కట్టి బడికి పంపవలసి వస్తుండేది. అల్లరి చేష్టలకుగాను ఆయనను నాయుడుపేట ప్రభుత్వ ఉన్నత పాఠశాలనుంచి రెండు పర్యాయాలు పంపించి వేశారు. క్రికెట్, కబడ్డీ మొదలైన ఆటలంటే ఆయనకు చాలా యిష్టం. కుస్తీలు పట్టడంలో, అథ్లెటిక్స్‌లో ఆయనకు మంచి నేర్పువుండేది. నాటకాలలో ఆయనకు రౌడీ పాత్రలు లభిస్తుండేవి.

ఒకసారి పూనా నాటక కంపెనీ ఒంగోలులో కొన్ని హిందీ నాటకాలు ప్రదర్శించింది. తనలోని నటనా కౌశల్యాన్ని ప్రదర్శితం చేయడానికి ఈ సందర్భం ఆయనకు అవకాశం కలిగించింది. "పీష్వా నారాయణరావు"లో ఆయన నాయకపాత్ర ధరించారు. తరువాతి కాలంలో ఆయన దశరథుడు, అర్జునుడు, చిత్రాంగి, ద్రౌపది, రత్నాంగి, దమయంతి, కౌసల్య మొదలైన ప్రముఖ పాత్రలు నటించి ప్రశంసలు పొందారు.

ఒంగోలు మిషన్ పాఠశాలలో ఇమ్మానేని హనుమంతరావు నాయుడుగారు ఉపాధ్యాయుడుగా వుండేవారు. ఆయనకు నాటకాలంటే ఎంతో యిష్టం. ఈ కారణంవల్లనే నాయుడుగారూ, ప్రకాశంగారూ సన్నిహితులయ్యారు. ప్రకాశంపట్ల ఆయనకు ప్రత్యేక అభిమానం, వాత్సల్యం ఏర్పడింది. తరువాత ఆయన ప్రకాశాన్ని తమ వెంట రాజమండ్రికి కూడా తీసుకొని వెళ్ళారు. అక్కడే ప్రకాశం అటుపిమ్మట విద్యాభ్యాసం చేశారు. ప్రకాశం ఉదారవంతులైన నాయుడుగారిపట్ల ఎల్లప్పుడూ కృతజ్ఞతాభావం ప్రకటిస్తుండేవారు.

'ఎఫ్.ఏ.' పూర్తి చేసిన తరువాత ప్రకాశం, హనుమంతరావు నాయుడుగారి సహాయ ప్రోత్సాహాలతో మద్రాసులో న్యాయశాస్త్రం అభ్యసించారు. తరువాత రాజమండ్రిలో ప్రాక్టీసుపెట్టి మంచి పేరు సంపాదించారు. తమ 29వ యేట మునిసిపల్ అధ్యక్షులుగా ఎన్నికయ్యారు.

రాజమండ్రిలో ఒక దశాబ్దంపాటు న్యాయవాదిగా ప్రాక్టీసు చేసిన అనంతరం శ్రీ ప్రకాశం, ఇద్దరు మిత్రులు చేసిన ఆర్థిక సహాయంతో బారిస్టరీ చదివే నిమిత్తం ఇంగ్లాండు వెళ్ళారు. అక్కడ వుండగా ఆయన లండన్ భారతీయ సంఘంలో సభ్యుడుగా వుండేవారు. ఆ సందర్భంలో ఆయనకు దాదాభాయ్ నౌరోజీ వంటి ప్రఖ్యాత నాయకులతో పరిచయం ఏర్పడింది. నౌరోజీ వ్రాసిన "పావర్టీ ఇన్ ఇండియా", రమేశ్‌చంద్ర దత్ లిఖించిన "ఎకనమిక్ సర్వే ఆఫ్ ఇండియా" అనే గ్రంథాలు శ్రీ ప్రకాశాన్ని బాగా ప్రభావితుణ్ణి చేశాయి. భారతదేశ స్థితిగతులపట్ల, భారతదేశ స్వాతంత్ర్య సమస్య పట్ల ఆయనకు ఆసక్తి కలిగింది. ఇప్పుడాయన పాఠశాలలనాటి తుంటరి పిల్లవాడుకాదు. న్యాయశాస్త్రంలో 75 శాతానికిపైగా మార్కులు పొందారు. 50 పౌనుల రొక్కం బహుమతితోసహా గౌరవపత్రం సాధించారు.

విదేశాలనుండి తిరిగి వచ్చిన తర్వాత ప్రకాశంపంతులుగారు మద్రాసులో స్థిరపడ్డారు. మైలాపూర్‌లోని మహామహులతో పోటీలో

తట్టుకోవడం అసాధ్యమైన విషయమని స్నేహితులు, శ్రేయోభిలాషులు అభిప్రాయపడ్డారు. అయితే ఆయన చలించలేదు. ధైర్య సాహసాలకు, దృఢసంకల్పానికి పెట్టిందిపేరు. ఆయన అక్కడే ఉండిలక్షలార్జించారు. బార్‌లో సహితం స్వతంత్రంగా స్వాభిమానంగా వ్యవహరించారు "లాటైమ్స్" పత్రికకు సంపాదకత్వం వహిసూనే ఇటు బార్‌ను అటు బెంచిని విస్మరించలేదు.

1921 లో గాంధీజీ పిలుపు వచ్చింది. సహాయ నిరాకరణోద్యమంలో మద్రాసులో న్యాయవాద వృత్తిని త్యజించిన లాయర్లలో శ్రీ ప్రకాశం ప్రప్రథములు. ఆనాడు ఆయన నెలకు దాదాపు రు. 10,000/- లు ఆర్జించేవారు.

గాంధీ ఉద్యమంలో ప్రముఖ కార్యకర్తగా వ్యవహరిస్తూ ఆయన కాంగ్రెసు వాణిగా పిలువబడిన "స్వరాజ్య" ఆంగ్లేయ దినపత్రికను ప్రారంభించారు. దేశం మొత్తంలో అటువంటి దినపత్రిక వెలువడడం అదేప్రథమం. పత్రికారంగంలో శ్రీ ప్రకాశం తన సర్వస్వాన్నీ ధారపోశారు.

1928 లో సైమన్ కమీషన్ మద్రాసు వచ్చింది. జాతి యావత్తు యీ కమీషన్ను బహిష్కరించింది. శాంతియుతంగా ఉన్న ప్రజా సమూహాలపై సైనికులు కాల్పులు ప్రారంభించారు. ఒక అజ్ఞాత వీరుడు నేలకొరిగాడు. ప్రజలు చెల్లాచెదరైనారు. శ్రీ ప్రకాశం వెంటనే ఆ ప్రదేశానికి వచ్చారు. తన అంగీగుండీలు విప్పి ఛాతీ చూపుతూ కాల్చుమని రొమ్మిచ్చినిలిచారు 'ఆంధ్ర కేసరికి జై' అనే నినాదాలు మిన్నుముట్టాయి. గాంధీ సైనికుని అహింసాశక్తి ముందు బ్రిటిష్ పాలకుల తుపాకులు నీళ్ళుగారిపోయాయి.

అది ఉప్పు సత్యాగ్రహమైనా, వ్యక్తి సత్యాగ్రహమైనా శ్రీ ప్రకాశం ప్రప్రథమ కార్యకర్తగా పాల్గొన్నారు. తమిళ నాయకులు నగరంలో ఉప్పు సత్యాగ్రహం చేయడం కష్టమని భావించి యితర ప్రాంతాలలో ప్రదర్శన నిమిత్తం వెళ్ళగా శ్రీ ప్రకాశం మద్రాసులో ఉండి నిర్వహించారు.

1937 లో శ్రీ ప్రకాశం నిర్విరామ కృషి ఫలితంగానే ఎన్నికలలో కాంగ్రెసు విజయంసాధించి ప్రప్రథమంగా మంత్రి వర్గాన్ని ఏర్పరచగలిగింది. రాజగోపాలచారి మంత్రి వర్గంలో శ్రీ ప్రకాశం రెవిన్యూశాఖ చేపట్టారు. ఆయన రూపొందించిన చరిత్రాత్మకమైన జమీందారీ నివేదిక మహాభారతం 18 పర్వాలలో ఉన్నవిధంగా అది 18 వాల్యూములలోఉంది ఆ నివేదిక జమీందారీ రద్దు చట్టానికి నాంది పలికింది.

1946 లో గాంధీజీ, కాంగ్రెసు హైకమాండుల ఆదేశాలకు వ్యతిరేకంగా శ్రీ ప్రకాశం మద్రాసు ముఖ్యమంత్రి అయ్యారు. రాజాజీ ముఖ్యమంత్రి కావాలని గాంధీజీ ఆదేశం. అయితే గాంధీజీ ఎంతపెద్దవాడైనా, ప్రజాస్వామ్యంలో ప్రజల అభీష్టం వ్యక్తం కావడంలో ఔచిత్యం కలుగజేసుకోరాదని శ్రీ ప్రకాశం వాదించారు. ప్రకాశం విజయం సాధించారు. మహాత్ముని సవాల్ చేస్తూ విజయంసాధించడం అద్భుతమైన విషయంగా పేర్కొనవచ్చు.

ఆయన ముఖ్యమంత్రిత్వంలోనే ఉత్పత్తిదారు, వినియోగదారుల సహకార సంఘాలు నెలకొల్పబడ్డాయి. తత్ఫలితంగానే మధ్యవర్తుల్ని తొలగించడానికి అది వీలు కల్పించింది. గ్రామీణ ప్రాంతాల పునర్వ్యవస్థీకరణకు ఫిర్కా అభివృద్ధి పథకాన్ని ప్రారంభించారు. సమాజాభివృద్ధి కార్యక్రమం అమలుకు అది నాంది వాచకం పలికింది. అయితే సంవత్సరంలోపుగానే ప్రకాశం మంత్రివర్గం పతనమైంది. అధికారంలో ఉన్నా, లేకున్నా ప్రకాశం ప్రజల మనిషి. ప్రజా ఆదరాభిమానాలు అపారంగా లభించాయి.

1953లో ఆంధ్రరాష్ట్రం ఏర్పడగానే శ్రీ ప్రకాశం ముఖ్యమంత్రి అయ్యారు. కొత్తరాష్ట్రాన్ని ఒడుదుడుకుల నుండి గట్టెక్కించడానికి సారథ్యం వహించి సఫలులైనారు.

1956లో ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం ఏర్పడింది. వృద్ధాప్యం కారణంగా ఆయన పరిపాలనా బాధ్యతలను స్వీకరించలేకపోయారు. ఆ మహానాయకుని ఆశీస్సులతో శ్రీ నీలం సంజీవరెడ్డి, ముఖ్యమంత్రి అయ్యారు. కొన్ని నెలల తర్వాత మహాయోగిగా ప్రకాశం పంతులుగారు హైదరాబాదులో స్వర్గస్థులైనారు. జైలులో ఉన్న రోజులలో పంతులుగారు రామాయణ, మహాభారత, భగవద్గీత, ఉపనిషత్తులను క్షుణ్ణంగా అధ్యయనం చేశారు. వాటి ద్వారా ఆధ్యాత్మికోన్నతిని పొందారు. పతంజలి యోగదర్శన ఆధారంగా ఆయన "యోగసూత్ర సిద్ధాంత" గ్రంథాన్ని రచించారు.

ఆంధ్రకేసరి గర్జనలు అంతరించాయి. ఆయన అడుగు జాడలు సమసిపోయాయి. అంతటి సాహసవంతుడు మళ్ళీ యీ భూమిపై ఎప్పుడు ఉద్భవిస్తాడో ! ఎప్పుడు ఆంధ్రావనిపై వెలుగు ప్రసరిస్తుందో ! అంతటి త్యాగశీలి, దేశాభిమాని ఎప్పుడు అవతరిస్తాడో కదా !

## సయ్యద్ హసన్ ఇమాం

(జననం : 1871, అగస్టు 31)

బీహారులో సుప్రసిద్ధ సయ్యద్ కుటుంబానికి చెందిన హసన్ ఇమామ్‌కు చిన్నతనంలో అర్రా, ప్రభుత్వ పాఠశాలలో చదివే రోజుల్లోనే ఆ తర్వాత కాలంలో ప్రఖ్యాతులైన సచ్చిదానంద సిన్హాతో పరిచయం ఏర్పడింది. వీరిరువురి స్నేహ సంబంధాలు హిందూ ముస్లిం సమైక్యతకు ఆదర్శంగా విలసిల్లాయి.

న్యాయశాస్త్రం అభ్యసించేందుకు సయ్యద్ ఇమామ్ ఇంగ్లండు వెళ్ళారు. అక్కడ 'ఇండియన్ సొసైటీకి,' 'అంజుమాన్ ఇస్లాం సంస్థకు' కార్యదర్శిగా పనిచేశారు. వర్ధమాన రాజకీయ వేత్తగా ఆయన 'సెంట్రల్ ఫిన్స్‌బెరీ' నియోజక వర్గంనుంచి, హౌస్ ఆఫ్ కామన్స్‌కు దాదాభాయి నౌరోజీ ఎన్నిక విషయంలో ప్రచారంచేశారు.

కొంతకాలం కలకత్తాలో గడిపి కలకత్తా 'బెంచ్' నుండి పాట్నా 'బార్' కు తిరిగి వచ్చిన కొద్దికాలానికే జడ్జిపీఠం ఆయన్ను ఆహ్వానించింది. కాని రాజకీయాలు, ప్రజాజీవితం అందుకు అడ్డుగా నిలిచాయి. మున్సిపాలిటీలు, జిల్లా బోర్డుల పరిపాలనా విషయాల్లో అనుభవం గడించిన సయ్యద్ ఇమామ్ ఒకేసారి జాతీయ స్థాయికెగబ్రాకి కలకత్తాలో స్పెషల్ కాంగ్రెస్ అధ్యక్షుడుగా ఎన్నుకొనబడ్డారు.



"భారతీయులందరు మొదట భారత దేశానికే చెందాలి. ఆ తర్వాతనే, వారు కావాలనుకుంటే ఆయా రాష్ట్రాలకు, తెగలకు చెందినవారౌతారు. మనం హిందువులం కాము మనం మహమ్మదీయులం కాము; మనమంతా భారతీయులం. తర్వాతనే బెంగాలీలము, బీహారీలము కావచ్చు" ; అని ఆయన ఉద్బోధించారు. మత విషయకంగా ఓటర్ల సంఘాల ఏర్పాటు విధానానికి ఆయన వ్యతిరేకి. అలీఘడ్ ముస్లిం యూనివర్శిటీకి, బెనారస్ హిందూ యూనివర్శిటీకి ఒకే వొరవడిలో సమాన మొత్తాలను ఆయన విరాళంగా యిచ్చారు. ఇతర విద్యా సంస్థలకు కూడా ఉదారంగా విరాళాలందజేశారు. హిందూ, మహమ్మదీయ విద్యార్థులకు తన వదాన్యతా గుణాన్ని చవి చూపించారు. మన సమాజంలో స్త్రీ, పురుషులకు సాంఘిక అసమానత్వం నుండి విముక్తి లభించకపోతే రాజకీయ విముక్తికోసం మనవాదన సన్నగిల్లిపోతుంది అని ఆయన భావించారు.

బీహార్ ప్రజల తరపున కృషి చేసేందుకు స్వతంత్ర పత్రిక నొకదానిని నడపవలసిన అవసరం వుందని ఆయన భావించారు. తనపాత స్నేహితుడూ, ప్రసిద్ధ పాత్రికేయుడూ అయిన శ్రీ సచ్చిదానందసిన్హా సహకారంతో 'సెర్చిలైట్' అనే పత్రికను ప్రారంభించారు.

బొంబాయిలో 1918 లో జరిగిన కాంగ్రెస్ సంస్థ ప్రత్యేక సమావేశానికి అధ్యక్షుడుగా ఇమామ్ నిర్వహించవలసి వచ్చిన పని అతిసున్నితమూ, క్లిష్టతరమైనది. 'మాంటేగ్ జేమ్సుఫర్డు సంస్కరణల' విషయం ఆ సమావేశంలో చర్చకువచ్చింది. ఒకవర్గం ఆ సంస్కరణలను త్రోసిపుచ్చాలనీ, మరొక వర్గం యథాతథంగా ఆమోదించాలనీ, ఇంకొకవర్గం కొద్దిమార్పులతో వానిని ఆమోదించాలని సూచించాయి ఆ సందర్భంలో సభాధ్యక్షుడైన ఇమామ్ యిలా అన్నారు.

"యుద్ధంలో మాదిరే 'పోరాటం' కాదు ప్రధానమైనది. విజయసాధనే లక్ష్యంగా వుండాలి. ఆసరా దొరికినచోట గౌరవ కల్పించుకొని దాన్ని వినియోగించుకొనక పోవడం సాధించిన విజయాన్ని జారవిడచినట్లే అవుతుంది" మహాత్మాగాంధీ ప్రారంభించిన సత్యాగ్రహ వుద్యమాన్ని సయ్యద్ ఇమామ్ బలపరిచారు

సయ్యద్ హసన్ ఇమామ్ వంటి గొప్ప వ్యక్తుల—అంటే భారత దేశాన్ని జాతిమత రూపాల్లో అనేక శకలాలుగా వుండే భూఖండంగా గాక, బిడ్డలందరికీ వాత్సల్యామృతాన్ని ప్రసాదించే అఖండ మాతృమూర్తిగా ఊహించిన గొప్పవ్యక్తుల—జీవితకాల ఔన్నత్యాన్ని తిరిగి మనం అందుకోవాలి.

## ఆదిభట్ల నారాయణదాసు

(జననం : ఆగస్టు 31 1864)

భక్తిభావపూరితమైన యితి వృత్తాన్ని గ్రహించి, దాన్ని పద్య, గద్య, కవితా, సంగీతాల సహాయంతో రమ్యంగా వినిపించే విధానం 'హరికథ'. హరికథచెప్పే విధానంలో శ్రీమదజ్జాడ ఆదిభట్ల నారాయణదాసు అప్రతిమాన ప్రతిభాశాలి, ఆయన హరికథా పితామహుడు. సామాన్య హరిదాసుల విషయంలో, హరికథ అంటే ఏదో ఒక కవి రచనను కంఠస్థంచేసి తోచిన పద్ధతిలో ఆసక్తి జనకంగా దాన్ని వినిపించడం. కాని నారాయణదాసు గారి హరికథా శ్రవణ భాగ్యానికి నోచుకున్న వారికి మాత్రం అది ఒక దివ్యానుభూతి ఆయనరచయిత,పండితుడు,కవి,బహుభాషాకోవిదుడు సంగీత విద్వాంసుడు, వీర, శృంగార, రౌద్ర, భీభత్స, కరుణ, శాంత, హాస్య,అద్భుత, భయానకములనే నవరసాలను సందర్భానుసారం మేళవించి, ప్రేక్షక జనహృదయ తంత్రులుమీటి వారి సుశ్రూతకుగించిన మహానుభావుడాయన సందర్భాన్నిబట్టి అవసరమైతే అప్పటికప్పుడే ఆయన పద్యాలూ పాటలూ ఆశుధారగా పలికేవారు. నీతికథలు, పిట్టకథలు మున్నగువానిని మధ్య మధ్య చొప్పించి, శ్రోతల హృదయ రంజకంగా హరికథ చెప్పడంలో ఆయనకు ఆయనేసాటి. ఒకసారి ప్రశంశలతోనూ, మరోసారి సున్నితమైన హెచ్చరికలతోనూ శ్రోతల నుక్కిరి బిక్కిరి చేసేవారు. 'శంభో' అని ఉచ్చస్వరంలో ఆయన ఆలపిస్తే ఒకమైలు దూరం వినిపించేది. శ్రోతల హృదయాలు ఆధ్యాత్మిక చింతనానుభూతిలో ఊయలలూగేవి. ఆయన గంభీరాకృతి, దృఢకాయము, వ్యక్తిత్వము, మిసమిసలాడే రూపసంపద అందరికళ్ళనూ అకర్షించేవి. విద్యావంతులకేగాక విద్యాహీనులకుకూడా విజ్ఞాన వినోదాలు కూర్చే సాధనంగా వుండేటట్లు ఆయన హరికథను తీర్చిదిద్దారు.

విజయనగరంలో మెట్రిక్యులేషన్ పరీక్ష చదువుతుండే రోజుల్లో నారాయణదాసుగారికి మద్రాసు వాస్తవ్యులు శ్రీ కప్పుస్వామి నాయుడు హరికథ వినే అవకాశం కలిగింది. అది ఆయన మనఃఫలకంపై చెరగని ముద్రవేసింది. ఈ కళను అభ్యసించేందుకు ఆయన కృతనిశ్చయుడయ్యాడు.

ఫలంగా కాలేజి విద్యకు స్వస్తిచెప్పి స్వయంకృషితో అయన ఇంగ్లీషు మాత్రమేగాక ఉర్దూ, పార్శీకము, అరబిక్, సంస్కృత భాషల నభ్యసించారు.

నారాయణదాసు అన్నగారైన పేరన్న మంచి సంగీత విద్వాంసుడు అన్నదమ్ములిద్దరూ మైసూరు బయలుదేరారు. శ్రావ్యంగా ప్రతిధ్వనించే ఆయన కంఠం అక్కడ అందరి మెప్పుపొందింది. మహారాజు సన్మానాన్నికూడా ఆయన అందుకోగలిగారు. నారాయణదాసు కీర్తిని గురించిన ఈ వార్త విజయనగరం ప్రాకింది దానితో విజయనగరం మహారాజా సంగీత కళాశాలలో ప్రిన్సిపాలుగా ఆయనకు ఉద్యోగం లభించింది.

రాజాస్థానాలు, జమీందారీలతోసహా ఆయన అనేక ప్రాంతాలలో హరికథ ప్రదర్శనలు నిర్వహించి, విజయవంతగా దేశమంతటా ప్రదర్శనలిస్తూ పర్యటించారు. కలకత్తాలో సంస్కృతం లోనూ, హిందీలోనూ హరికథలు నిర్వహించి ఆయన విశ్వకవి రవీంద్రనాథఠాగూరు మన్ననలందారు.

ఆయన హరికథానిర్వహణ ప్రఖ్యాతి ముందు యితర రంగాలలో ఆయనకున్న ప్రతిభ రాణించలేక పోయింది. కవిగా ఆయన అనేక పుస్తకాలు వ్రాశారు. ఉమర్‌ఖయ్యాం గీతాలు తెనుగులోకి,సంస్కృతంలోకి అనువదించారు. నవరసతరంగిణి అనే ఆయన రచన కాళిదాసు, షేక్స్పియర్‌ల వంటి మహాకవుల రచనలతో ఆయనకున్న పరిచయానికి చిహ్నంగా నిలుస్తుంది

స్వచ్ఛమైన తెలుగు పదాలను ప్రయోగించడంలో ఆయనకు గల ప్రతిభ అద్భుతమైనది. ఆయన ఈసప్ కథలనూ, భగవద్గీతనూ, విష్ణుసహస్రనామాన్ని తెనిగించారు. అనేక రచనలు కూడా చేశారు.

శ్రీ నారాయణదాసు సంస్కృతంలోకూడా అనేక గ్రంథాలు రచించారు. ఆయన గ్రంథం "తారకమును" ప్రశంసిస్తూ జర్మనీకి చెందిన సంస్కృత భాషాచార్యుడు "గిర్డ్నెర్" సంస్కృతంలో ఈ విధంగా శ్లోకం వ్రాశారు.

జానాతే యన్నచంద్రార్కౌ జానాతే యన్న యోగినః
జానీతే యన్నభర్గోపి తజ్జానాతి కవి స్వయమ్
వచ సుధామయం కావ్యం పీత్వాహం తృప్తమానసః
కృతజ్ఞోభి ప్రశంసామి భవంతు కవి శేఖరమ్.

తిరుపతి వెంకటకవులు శ్రీనారాయణదాసును కీర్తిస్తూ ఈ విధంగా పద్యం వ్రాశారు.

అలనారాయణుఁడవు కృష్ణుఁడయి గేయమ్మందు సంతోషమున్
గొలిపెంగాని కవిత్వమందు గొలుపన్ గొంతేనియున్ నోచుకో
డలలోపమ్మును దీర్చుకోదలచి కాదా యిట్టి రూపమ్ముతో
నిల నారాయణదాస నామమున నిల్చేపారెనా జెల్లదే.

## జలసూత్రం రుక్మిణీనాథశాస్త్రి

సుప్రసిద్ధరచయిత శ్రీ జలసూత్రం రుక్మిణీనాథశాస్త్రి,53సం. విజయవాడలో జూలై 20 న మరణించారు.

శ్రీ శాస్త్రి బందరులో జన్మించారు. చిట్టిగూడూరు సంస్కృత కళాశాలలో "ఉభయ భాషా ప్రవీణ" వరకు చదివారు. ఆయన తొమ్మిది సంవత్సరాలు "ఆంధ్ర పత్రిక" లో పని చేశారు. 1946 లో ఆకాశవాణి ఉద్యోగిగా ప్రవేశించారు.

పారడీకవిత వ్రాయడంలో శ్రీ రుక్మిణీనాథశాస్త్రి ప్రసిద్ధులు. విశ్వనాథ, కృష్ణశాస్త్రి, రాయప్రోలు, శ్రీ శ్రీ మొదలైన ఆధునిక తెలుగు కవుల రచనా పద్ధతులు పారడీచేసి చక్కని హాస్యంతో వ్రాసేవారు. ఆయన పెక్కు వ్యాసాలను, కథలను, పద్యాలను, రూపకాలను, నాటికలను, నాటకాలను, పదచిత్రాలను వ్రాశారు. డాక్టర్ జి. వి. కృష్ణారావు చెప్పినట్లు "ఆయన ఏది వ్రాసినా, ఏది మాట్లాడినా కొంత వైచిత్రి, కొత్తదనం, చమత్కారం కనిపిస్తూ వుండేవి. ఆయన మరణంతో ఆంధ్ర సాహిత్యలోకం ఒక సహృదయుని, మంచి రచయితను, వాగ్మిని కోల్పోయింది."



# జిల్లాలనుండి

## జిల్లా పరిషత్తులకు గవర్నరు సందేశం

తన గౌరవార్థం జూలై 11న మహబూబ్‌నగర్ జిల్లా పరిషత్తువారు ఏర్పాటు చేసిన సన్మాన సభలో పరిషత్ సభ్యుల నుద్దేశించి ప్రసంగిస్తూ, ఆంధ్రప్రదేశ్ గవర్నర్ శ్రీ ఖండూభాయ్ దేశాయ్ పరిషత్తు సభ్యులు సామాన్య ప్రజానీకంతో కలిసి మెలిసి తిరిగి, ప్రజాస్వామ్యం గురించి వారికి తెలియజెప్పాలనీ, భారత దేశంలో ప్రజాస్వామ్యం విఫలీకృతమైనదంటే అందుకు పూర్తిగా ఈ సభ్యులే బాధ్యులౌతారని వక్కాణించారు. పరిషత్ ఛైర్మన్ శ్రీ కె. కె. రెడ్డి సన్మాన పత్రం సమర్పించారు. అదే రోజు గవర్నరు షాద్ నగర్ పంచాయతీ సమితిని సందర్శించారు అక్కడ ఒక కుటుంబ నియంత్రణ శిబిరం ప్రారంభించబడింది.

## చిత్తూరులో నూతన ట్రంక్ ఎక్స్చేంజి ప్రారంభం

టి-43 అనే పేరుతో నూతన పద్ధతిలో పనిచేసే ఒక ట్రంక్ టెలిఫోన్ 'ఎక్స్చేంజీ' చిత్తూరులో జూన్ 24 నుండి పని చేయడం ప్రారంభించింది.

## నందిగామలో నూతన ఆర్ట్సు, సైన్సు కాలేజీకి ప్రారంభోత్సవం

జూలై 12న కృష్ణాజిల్లా నందిగామలో నూతన ఆర్ట్సు అండ్ సైన్సు కాలేజీకి ప్రారంభోత్సవంచేస్తూ, అప్పటి విద్యామంత్రి శ్రీ టి. వి. రాఘవులు, ఉదారంగా విరాళాలిచ్చి కళాశాలను ఏర్పాటు చేసుకున్నందుకు నందిగామ ప్రాంతీయులను అభినందించారు. శ్రీ కాకాని వెంకటరత్నం, సభకు అధ్యక్షత వహించారు. జిల్లా పరిషత్ అధ్యక్షులు శ్రీ పి. కోటేశ్వరరావు కాలేజీ లేబరేటరీలను ప్రారంభోత్సవం చేశారు. ఈ కాలేజీ ఏర్పాటు చేసుకొనేందుకె నందిగామ వాస్తవ్యులూ, చుట్టుపట్ల ప్రాంతీయులు 5 లక్షల రూపాయలు విరాళంగా యిచ్చారు.

## పెదనందిపాడులో[3] ఆర్ట్సు కాలేజీ ప్రారంభం

జూలై 14న పెదనందిపాడులో గుంటూరు జిల్లా కలెక్టరు శ్రీ యం. వెంకటరత్నం ఆర్ట్సు కాలేజీకి ప్రారంభోత్సవంచేశారు. దాదాపు పదిదాకా ఫీడర్ స్కూళ్లు కలిగిన పెదనందిపాడువంటి గ్రామంలో కాలేజీ ఒకటి ఏర్పాటు చేసుకొనేందుకు విరాళాలిచ్చిన గ్రామస్థులను కలెక్టరు అభినందించారు. గుంటూరులో, ఆంధ్రా యూనివర్సిటీకి చెందిన పోస్టు గ్రాడ్యుయేట్ సెంటర్ ప్రిన్సిపాల్ శ్రీ కె. సచ్చిదానందమూర్తి అధ్యక్షత వహించారు. జిల్లా పరిషత్ అధ్యక్షులు శ్రీ మేడూరి నాగేశ్వరరావు ప్రసంగిస్తూ, రాజకీయంగాను, చారిత్రకంగానూ పెదనందిపాడు ప్రఖ్యాతిగాంచిందనీ, స్వాతంత్ర్య సమరంలో కూడా ఉత్సాహంగా పాల్గొనినదని పేర్కొన్నారు. కళాశాల కార్యదర్శి టి. క్రిష్ణమ్మ మాట్లాడుతూ కాలేజీ నిమిత్తమై జిల్లా పరిషత్తువారు 10 ఎకరాల భూమి యిప్పించారనీ, వారు 2½ లక్షల రూపాయలు విరాళాల రూపంగా వసూలు చేశారని అన్నారు.



ఖమ్మం జిల్లాలోని నేలకొండ పల్లిలో కేంద్ర నీటిపారుదల మంత్రి డాక్టర్ కె. ఎల్. రావు జూన్ 30 న పాలేరు రైతుల సమావేశంలో ప్రసంగిస్తున్న దృశ్యం

## అనంతపురంలో శ్రీ సత్యసాయి కాలేజీకి ప్రారంభోత్సవం

అనంతపురంలో, జూలై 22 న అప్పటి విద్యామంత్రి శ్రీ టి. వి. రాఘవులు శ్రీ సత్యసాయి మహిళల కళాశాలకు (ఆర్ట్సు అండ్ సైన్స్) ప్రారంభోత్సవం జరిపారు. ఈ కార్యక్రమానికి అధ్యక్షత వహించి శ్రీ సత్యసాయిబాబా తన సందేశమందించారు.

## ఆహారోత్పత్తిపై సదస్సు

ఆహారోత్పత్తి—అధిక జనాభా పెరుగుదల—గ్రామ సేవకుని పాత్ర అనే అంశాలపై గోపన్నపాలెం గ్రామ సేవకుల శిక్షణ కేంద్రంలో రెండు రోజులపాటు ఏర్పాటు చేయబడిన సదస్సుకు, ప్రాజెక్టు ఆఫీసరు శ్రీ బి. ఎ. వెంకటరామన్ ప్రారంభోత్సవం చేశారు. భీమడోలు పంచాయితీ సమితి విస్తరణాధికారి బృందం, శిక్షణకేంద్రం సిబ్బంది, శిక్షణ పొందే గ్రామసేవకులూ ఈ సదస్సులో పాల్గొన్నారు.

## పశ్చిమగోదావరి జిల్లాలో దుర్భిక్ష నివారణకై సహాయ కార్యక్రమాలు

పశ్చిమగోదావరి జిల్లాలో దుర్భిక్షనివారణకై సహాయ కార్యక్రమాలు నిర్వహించేందుకు ప్రభుత్వం రు 21,02,400 ల మొత్తాన్ని మంజూరు చేసింది. ఈ సహాయ కార్యక్రమంలో, 177 మంచినీటి బావులను లోతుచేయించడం, 111 చిన్నతరహా సేద్యపు నీటి పనులు, 28 రస్తాపనులు చేరివున్నాయి. 8.66 లక్షల రూపాయల ఖర్చుతో 6 బావుల పనులను చేపట్టేందుకు జిల్లా పరిషత్తువారు పూనుకున్నారు.



కృష్ణాజిల్లా తెల్లప్రోలులో ప్రజలు విరాళంగా యిచ్చిన రు 50 వేలతో నిర్మించిన ప్రాంతీయ పశుగణాభివృద్ధి కేంద్రానికి ముఖ్యమంత్రి ప్రారంభోత్సవం చేశారు

ఇవిగాక ఏలూరు, చింతలపూడి, తాడేపల్లిగూడెం తాలూకాలలో రైతులకు రు 1.37 లక్షల మొత్తం మేరకు ప్రత్యేక భూమిశిస్తు రెమిషన్ మంజూరు చేయడం జరిగింది. దుర్భిక్షబాధిత ప్రాంతంలో రైతులకు తక్కావి ఋణాలిచ్చేందుకు ఒక లక్ష రూపాయలు ప్రభుత్వం మంజూరు చేసింది.

## మెదక్ జిల్లా పరిషత్తు నూతన కార్యాలయ భవనానికి ముఖ్యమంత్రి ప్రారంభోత్సవం



మెదక్ జిల్లా పరిషత్ నూతన భవన ప్రారంభోత్సవం

జూలై 7 న ముఖ్యమంత్రి, మెదక్ జిల్లా పరిషత్తు నూతన కార్యాలయ భవనానికి ప్రారంభోత్సవం చేశారు.

## నవాబ్ పేటలో ప్రాథమిక ఆరోగ్య కేంద్రం

మహబూబ్‌నగర్ జిల్లా, నవాబ్ పేటలో ప్రాథమిక ఆరోగ్య కేంద్రాన్ని, అప్పటి రాష్ట్ర ప్రణాళికల మంత్రి శ్రీ కె. వి. నారాయణరెడ్డి ప్రారంభించారు.

## కర్నిలో పంచాయత్ ఘర్‌కు ప్రారంభోత్సవం

రాష్ట్ర కమ్యూనికేషన్ల మంత్రి శ్రీ జె. వి. నరసింగరావు మహబూబ్‌నగర్ జిల్లా, మక్తల్ పంచాయితీ సమితికి చెందిన 'కర్ని' గ్రామంలో 'పంచాయత్ ఘర్'కు ప్రారంభోత్సవంచేశారు.

# మహాభారతము

తిరుపతి వేంకట ... 

## 19

అప్పుడు ద్రౌపది సభాసదుల నుద్దేశించి "నేను ఈ సభలోనికి ప్రవేశించగనే తొలుత పెద్దలందరకు నమస్కారము చేయవలసియుంటిని. భయ భ్రాంతిచేత మీకు నమస్కరించని నన్ను క్షమించుడు." అని చెప్పుచుండగనే దుశ్శాసనుడు ఆమెను బిగ్గరగా ఈడ్చెను. ఆమె వశముదప్పి యేడ్చుచు క్రిందపడిపోయెను. "నేను నా స్వయంవర సమయమునందుదప్ప ఆ తరువాత నేటిదాక సభాముఖములు చూడలేదు. అసూర్యం పశ్యయగు నే నిందరిలో నిక్కడ సామాన్య స్త్రీ వలె దీనముగా నిలువవలసి వచ్చెను. నేను అంతఃపురములోనున్నప్పుడు నన్ను వాయువుగూడ స్పృశించుటను సహించని పాండుకుమారులు నేడు దుశ్శాసనుడు నిండు సభలో నింతగా భంగపరచుచున్నను పలుకకుండ నున్నారు. ఇది యేమి చిత్రము. చాల విపరీతకాలము కురువంశమునకు మూడినది. నేడు రాజధర్మమేమయ్యెను ? వీరు పరమసాధ్వియగునన్ను సభలోనికిలాగి ప్రాచీన సనాతన ధర్మమునకే నాశము కలిగించుచున్నారు. పెద్ద కుటుంబములో పుట్టి, అంతటి శూరులను చెట్టబట్టి, కృష్ణభగవానుని చెల్లెలనై యుండికూడ ఇట్టి అవమానమునకు లోబడితినే." అని చెప్పెను.

ఇంకను ఆమెయిట్లు పలికెను :- "కౌరవులారా ! నేను ఉత్తమ క్షత్రియవంశమున పుట్టి మీ యింటికి కోడలనై వచ్చిన దానను. అట్టినేను దాసి నెట్లగుదును ? నేను 'దాసినా? అదాసినా ?' ఈ సంశయమునైన మీ రిప్పుడు తీర్చుడు. ఈ దుష్ట దుశ్శాసనుడు నాకు కలిగించుచున్న యీ క్లేశమును చాలకాలము సహించలేకున్నాను. కురుశ్రేష్ఠులారా ! నిక్కముగా చెప్పుడు. నేను జయింపబడితినా ? లేదా ? మీ నోటినుండి స్పష్టముగావిని తదనుసారముగా మెలగెదను."

అప్పుడు భీష్మపితామహు డామెతో నిట్లనెను:- "కల్యాణీ ! ధర్మగతి చాల సూక్ష్మముగ నున్నదని నేను తొలుతనే చెప్పితిని గదా ! మహాప్రాజ్ఞులుగూడ దానిని బాగుగా నెరుగజాలరు. బలవంతుడు దేనిని ధర్మముగా నిర్ణయించునో, సమయానుసారముగా లోకులుగూడ దానినే ధర్మముగా భావింతురు. బలహీనుడు చూపించు ధర్మము బలవంతుడు చూపిన ధర్మముముందు అణగిపోవును. అందువలన ఇప్పుడు కర్ణుడు, దుర్యోధనుడు నిర్ణయించు ధర్మమే అన్నిటికన్న మిన్నగానున్నది. ధర్మ స్వరూపము అతి సూక్ష్మమగుటచేతను, ఈ ధర్మ నిర్ణయకార్యము అతి భారమగుటచేతను, నీ ప్రశ్నమునకు నేను సదుత్తరమును ఈయజాలకున్నాను."

"చాల త్వరలోనే ఈ కులమునకు తప్పక నాశము కలుగ నున్నది. దీనికి కారణము, కౌరవులందరును లోభమోహములకు వశీభూతులై యున్నారు. కల్యాణీ ! నీ పతులు అతి కఠినమైన సంకటములో పడినప్పటికినీ ధర్మమార్గమునుండి కొంచెముగూడ తొలగకయున్నారు. వీరు మా కులమునకు అలంకారభూతులు. నీవు ఇంతగొప్ప సంకటములో పడియుండికూడ ధర్మమువైపే దృష్టి నిలపితివి గనుక నీ ప్రవర్తన చాల ప్రశంసనీయముగ నున్నది. ద్రోణాచార్యులు మొదలగు ఈ పెద్దలందరుగూడ ఆత్మలేని శూన్యశరీరముతో తలవంచి చచ్చినవారివలె గూర్చున్నారు. నీవు చేసిన ప్రశ్నమునకు సదుత్తరమీయగలవాడు ఈ సభలో ఒక ధర్మరాజు తప్ప మరియెవరును లేరని నా నిశ్చయము. కనుక నీ జయాపజయములనుగూర్చి నీవు అతనినే అడుగుము. అతడు స్పష్టపరచగలడు."

అప్పుడా సభలో ద్రౌపది పశ్నమునకెవ్వరును బదులు పలుకజాలకుండిరి. దుర్యోధనుడామెతో "ద్రౌపదీ ! ఈ రాజులందరును నీపతులు యీయవస్థనుజూచి పలుకజాలకున్నారు. ఇంతయేల భీమాదులు నలుగురు నీ పతులు 'ధర్మరాజు చేసిన కార్యము అధర్మము' అని చెప్పినచో నిన్నిప్పుడే విడిచివేసెదను. ధర్మజుడే స్వయముగా 'నీవు జయింపబడలేదు. దాసత్వము నీకు లేదు' అనియనిన చాలును. నీవు ఇప్పుడే విడువబడుదువు." అనియనెను.

అప్పుడు సభలోని వారందరును అతని మాటను ప్రశంసించిరి. యుధిష్ఠిరుడేమి చెప్పునో చూతమని యందరును ఆయన ముఖమువైపు చూచిరి. అప్పుడు భీముడు తన బాహువును పైకెత్తి యిట్లనెను:- "ధర్మాత్ముడగు నీ యుధిష్ఠిరుడు మాకు పితృతుల్యుడు, ఈ పాండుకులమునకు ప్రభువు. కాకుండినచో మేమీ కౌరవులుచేయు నీ యధర్మకృత్యమును ఎప్పటికిని సహించజాలకుంటిమి. ఈ ధర్మపుత్రుడు మా పుణ్యములకు, తపస్సునకు, ప్రాణములకును ప్రభువు. ఆయన యాజ్ఞకు బద్ధుడనై యున్నాను.

నేను జయింపబడకుండినచో నేడు నా పాదాహతిచేత ఈ దుష్టులం
దరు పొడియైయుండురు. నా భుజబలమునకు ఇంద్రుడుగూడ
ఆగలేడు. ధర్మరాజు నాకు ఆజ్ఞయిచ్చినచో, సింహము లేళ్లను
చంపినట్లు, ఈ ధృతరాష్ట్ర పుత్రులనందరను నా చేతులతోనే
నలిపియుందును" అప్పుడు భీష్మ ద్రోణాదులు భీముని శాంత
పరచిరి.

అప్పుడు కర్ణుడిట్లనెను:- "ద్రౌపదీ ! దాసుడు, పుత్రుడు,
సర్వదా పరాధీనురాలుగానే నుండదగిన స్త్రీ—ఈ ముగ్గురును ధన
మునకు అధికారులు కారు. కనుక సంపద తొలగిపోయి దాసు
డుగా నున్నవాని భార్య, మరియు, అట్టి దాసుని ధనము—మొద
లైన సర్వవస్తువులపైన అధికారము అతనిని దాసునిగా చేసికొనిన
ప్రభువునకే చెందగలదు. కనుక రాజకుమారీ ! ఇప్పుడు నీవు
దుర్యోధన మహారాజు యొక్క పరివారములోచేరి అందరకును
ఊడిగములు చేయవలసినదే. ఈ ఒక్క కర్తవ్యమే నీకు
ఇప్పుడు మిగిలియున్నది నేటినుండి ధృతరాష్ట్రుని పుత్రులందరు
నీకు ప్రభువులు కాని కుంతీపుత్రులు కారు సుందరీ ! ఇప్పుడు
నీవు మరియొక పతిని త్వరగా నిర్ణయించుకొనుము దానివలన
జూదములో మరియొకసారి నీవు ఓడిపోవలసిన అవసరముండదు.
నీవంటి ఉత్తమస్త్రీ విషయములో పతులు తమ యిచ్చానుసారముగ
ప్రవర్తించుట అతినీచమైన విషయము. దాసిగా నుండినచో స్త్రీకి
స్వేచ్ఛా ప్రవృత్తియుండును. అందువలన నీకు దాస్యభావమే
ఇప్పుడు అవసరమైయున్నది ద్రౌపదీ ! నీ పతులందరు
జూదములో నోడి దాసులైరి. నీవును దాసివైతివి ఓడిపోయిన
పాండవులిప్పుడు నీకు భర్తలుకారు. నిన్ను జూదములో నొడ్డిన
ధర్మరాజునకు ఈ ప్రపంచములో పరాక్రమము, పురుషార్థములు
అక్కరలేవా ?

కర్ణుడు చెప్పిన మాటలను విని భీముడు అతి పీడితుడై
నిట్టూర్చి కోపాగ్నిచేత కన్నుల నిప్పులు గ్రక్కుచు నిట్లనెను :—
"ధర్మరాజా ! కర్ణుడు నిక్కముగ దాస ధర్మమును చెప్పెను.
కనుక అతనిపైన నాకు కోపము లేదు. నీవు ఈమెను ఓడకుండి
నచో శత్రువులు మనతో నిట్లు మాట్లాడగలుగుచుండిరా !"

భీమసేనుడు పలికిన మాటలనువిని దుర్యోధనుడు అప్పుడు
అచేతనునివలె మౌనముతో కూర్చొనియున్న యుధిష్ఠిరునితో,:—
"రాజా ! నీతమ్ములు నీ యాజ్ఞకు లోబడియున్నారు. కనుక
ద్రౌపది ప్రశ్నమునకు నీవే బదులుచెప్పుము. ద్రౌపది ఓడబడి
నట్లుగా నీవు అంగీకరించవా ?" అని చెప్పి ఐశ్వర్యమదముచే
మోహితుడైన దుర్యోధనుడు కఠోరమైన తన ఎడమ తొడను
ద్రౌపదికి చూపుచు, కర్ణుని ప్రోత్సహించుచు భీముని తిరస్కరిం
చుచు, తన తొడపైని వచ్చి కూర్చొనుమన్నట్లుగా సైగచేసెను.

అది చూచి భీమసేనుని కన్నులు ఎఱ్ఱబడెను. సభాసదు
లందరు వినునట్లుగా నతడు, "దుర్యోధనా ! నీ యీ యెడమ
తొడను యుద్ధములో నేను నా గదచేత విరుగగొట్టనిచో నాకు పుణ్యా
లోకములు కలుగకుండుగాక" అని చెప్పెను. అప్పుడు క్రుద్ధుడైన
భీముని రోమ కూపములనుండి అగ్నికణములు బయల్వెడలు
చుండెను. ఆ సంఘటననుచూచి విదురుడు, "మీరందరు భీమ
సేనుని ప్రతిజ్ఞ వింటిరిగదా ! దురదృష్టవశముచేత భరతవంశ
ములో ఈ యన్యాయము పుట్టెను ధృతరాష్ట్ర పుత్రులారా !
మీరు వంశమర్యాదనుదాటి జూదమాడితిరి. నిండు సభలో మీ
యింటి కోడలిని తెచ్చి యవమానపరచుచున్నారు, ఇందువలన మీ
యోగక్షేమములు నష్టమగుచున్నవి. 'కౌరవులు ఎల్లప్పుడు
పాపపు ఆలోచనలే చేయుచుందురు' అని ప్రపంచమునకు నేడు
విదితమయ్యెను. ధర్మముయొక్క మహిమను త్వరగా తెలిసి
కొనుడు. ధర్మనాశదోషము సభవారికందరికి అంటును. ధర్మరాజు
తానోడుటకుముందు ద్రౌపదిని పందెము పెట్టుటకు అధికారము
కలిగియుండెను. తాను ఓడిన తరువాత నీమెను పందెము పెట్టు అధి
కారము పోగొట్టుకొని యుండెను. కనుక అనధికారి పెట్టిన పందె
మునకు విలువయుండునా ! అతనికి ఆ వస్తువుయొక్క జయాప
జయములలో గల స్వత్వము, స్వప్నములోని వస్తువుయొక్క
జయాపజయముల అధికారముతో సమానమేగదా ! మీరు శకుని
మాటలను విని ధర్మభ్రష్టులైతిరి."

అప్పుడు దుర్యోధనుడు, "ద్రౌపదీ ! భీమార్జున నకుల
సహదేవులలో ఏ యొక్కరైనను 'ధర్మరాజు తానోడిన తరువాత
నిన్ను పందెముబెట్టి ఓడుటకు అధికారి కాజాలడు' అని చెప్పినచో
చాలు. నిన్ను దాస్యమునుండి విడిచెదను." అని చెప్పెను. అప్పు
డర్జునుడు, "ధర్మరాజు మమ్ము ఓడుటకు తొలుత అధికారియై
యుండెను. కాని ఆయన తానే యోడిపోయినప్పుడు ఎవరికి
అధికారికాగలడు ! అను విషయమును కౌరవులందరు విచారించ
వలసియున్నది" అని చెప్పెను.

అప్పుడు ధృతరాష్ట్రుని అగ్నిహోత్రశాలలో ఒక నక్క
వచ్చి బిగ్గరగా అరచెను. దానికి బదులుగా, గద్దలు, మొదలైన
పక్షులు ప్రతిధ్వనించెను. ఆ భయంకర శబ్దమును తత్వజ్ఞానము
గల విదురుడు, గాంధారి, భీష్మద్రోణాదులును విని, 'అమంగళము
ప్రతిహతమగుగాక' యని స్వస్తి వాచనము బల్కిరి. అప్పుడు
ధృతరాష్ట్రుడు దుర్యోధనునితో, "దుర్బుద్ధీ ! నీవు జీవించియు
చచ్చిన వాడవైతివి. మహా పతివ్రతయైన మన కులస్త్రీని సభ
లోనికిలాగి అవమానపరచితివి." అని చెప్పెను. పిదప ద్రౌపదిని
ఊరడించుచు,

ధృత :-బిడ్డా ! ద్రౌపదీ ! నీవు నా కోడండ్రలో అందరికన్న
శ్రేష్ఠురాలవు. మహా ధర్మాత్మురాలవు. పతివ్రతవు.
నీ యిష్టమైన వరమును కోరుకొనుము ఇచ్చెదను.

ద్రౌపది :-మహారాజా : పరిపూర్ణ ధర్మజ్ఞుడైన యుధిష్ఠి
రుని నీవు దాస్యమునుండి విడువుము. దానిచేత, తొలుత
'రాజపుత్రుడు' అని రాజులందరిచేత ఆదరింపబడిన నా
కుమారుడు ప్రతివింధ్యుడు నేడు 'దాస పుత్రుడు' అని
అవమానపరచబడకుండుగాక :

ధృత :_కల్యాణీ ! అట్లేకానిమ్ము. నీకు మరియొక వరమిచ్చెదను. కోరుకొనుము. నీవు ఒక్కవరమును మాత్రమే పొందుటకు అర్హురాలవుకావు అని నా అంతరాత్మ చెప్పుచున్నది.

ద్రౌపది :_అట్లైన రాజా ! నా యితర పతులందరిని విముక్తులను చేసి వారి ఆయుధములు వారికిచ్చి స్వతంత్రులను చేయుము.

ధృత : ద్రౌపదీ ! నీవు కోరినప్రకారమే అగుగాక : నీ సంతోషమే మా కులమునకు శ్రేయస్సు. మూడవ వరము కోరుకొనుము. రెండవవరముచేతనే నీవంటి ధర్మాత్మురాలిని గౌరవించజాలను.

ద్రౌపది :_మహారాజా ! ఆశ ధర్మమును నశింపజేయును. అందుచేత నామనస్సులో మరియొక వరము కోరుమత్సాహము లేదు ఇంతియేకాక మూడవవరము కోరుటకు నాకు లేదు. ఎందుకనగా వైశ్య జాతివారికి ఒక వరము, క్షత్రియజాతి స్త్రీకి రెండువరములు, క్షత్రియునకు మూడు వరములు, బ్రాహ్మణునకు నూరువరములును కోరుటకు అధికారముగలదు. రాజా ! నా పతులు దాస్యమును పొంది గొప్ప సంకటములో చిక్కుకొనినారు. ఇప్పుడు వారికి ఆ విపత్తి తొలగిపోయెను. ఈ తర్వాత వారు పుణ్య కర్మల ననుష్ఠించి అనేక శుభములను పొందగలుగుదురు. ఇంతమాత్రమే నా కోరిక.

అప్పుడు కర్ణుడిట్లనెను :_" నేను సౌందర్యవతులైన అనేక మానవ స్త్రీలనుగూర్చి వినియున్నాను. కాని, ఎవరుగూడ ఇంతటి అద్భుత కార్యమును చేసియుండుట వినలేదు. పాండవులు, కౌరవులు పరస్పరము అత్యంత ద్వేషముతో క్రుద్ధులై యుందురు. అట్టి సమయమునందు ఈ ద్రౌపది పాండవులకు శాంతిని చేకూర్చును. నిరాధారమగు జలములో పడి మునుగుచున్న పాండవులను ఈమె పడవయై దరిజేర్చును."

అప్పుడు భీమసేనుడిట్లనెను :_" అయ్యో పాండవులను ఉద్ధరించుటకు నేడు ఒక స్త్రీ గతియయ్యెగదా ! పూర్వము మహర్షియగు దేవలుడు ఏమిచెప్పె ననగా, పురుషులకు మూడు విధములగు తేజస్సు ఉండును. అవి. 'సంతాన తేజము, కర్మతేజము, జ్ఞాన తేజము' అనునవి. వీనినుండియే సమస్త ప్రజాసృష్టి జరుగును. ఈ శరీరము ప్రాణ రహితమై అపవిత్ర మైనప్పుడు సమస్తబంధువులు విడిచెదరు. అప్పుడు పరలోకగతునకు ఈ మూడు తేజస్సులే ఉపయోగించును. అర్జునా ! ఇప్పుడు మన ధర్మపత్ని ద్రౌపదియొక్క శరీరమును దుశ్శాసనుడు బలత్కారముగా తాకి అపవిత్ర పరచెను. దీనిచేత మన సంతానజ్యోతి నష్టమైపోయెను. పరపురుషునిచే స్పృశించబడిన స్త్రీనుండి కలిగిన సంతానము అపవిత్రమై నిరుపయోగమగును.

ఆ మాటకు అర్జునుడిట్లనెను :_"ద్రౌపది పరమ పతివ్రత. ఆమెనుగూర్చి మీరిట్లు మాట్లాడ కూడదు. దుశ్శాసనుడు నీచ కార్యముచేసినది నిక్కమే. కాని, నీచులు ఉత్తములయెడ చేసిన చెడుపనులకుగాని, పలికిన చెడుమాటలకుగాని శ్రేష్ఠులు ఉత్తరము చెప్పరు. వాటిని ప్రతిఘటించుటకు సమర్థులైనప్పటికిని, ఇతరులు చేసిన వైరమును దృష్టియందుంచుకొనరు. వారు తమకు చేసిన యుపకారమును మాత్రమే తలచుచుందురు."

అప్పుడు ధర్మరాజుతో భీమసేనుడిట్లనెను :_"మహారాజా ! నీయాజ్ఞయైనచో ఇక్కడి శత్రువుల నందరను ఇక్కడనే ధ్వంసము చేసెదను. ఇచటినుండి బయటకుపోయి వీరి మూలమునుగూడ నష్టము చేసెదను. ఇప్పుడు మనము వివాదముచేయ నవసరములేదు. నేడే వీరందరను యమలోకమునకు పంపెదను. నీవే యీ సమస్త పృథివిని ఏలుము." అనిచెప్పి భీమసేనుడు ఉగ్రమైన సింహము లేళ్ళను చూచుచున్నట్లుగా శత్రువులను మాటిమాటికి చూచెను. అర్జును డతనిని శాంతపరచుచుండెను. భీముడు క్రోధాగ్నితో ఉడుకుచుండెను. యమునివలె అతిభయంకరుడుగా కనపడెను అతనివైపు చూచుటకే అందరును భయపడుచుండిరి. అప్పుడు యుధిష్ఠిరుడు భీమునిచేయి పట్టుకొని "ఇట్లు చేయకుము. శాంతుడవై కూర్చొనుము." అనిచెప్పి అతనిని ఆపి పెదతండ్రియగు ధృతరాష్ట్రుని వద్దకు చేతులు జోడించుకొని వినయముతో పోయి యిట్లనెను :__

" రాజా ! ఇప్పుడు మేమేమిచేయవలెనో శాసించుము. నీయాజ్ఞ మేరకు మేము ఎల్లప్పుడును నడచుకొనుచుందుము " ఆమాట విని ధృతరాష్ట్రుడిట్లనెను :__"నాయనా అజాత శత్రూ ! నీకు శుభము కలుగుగాక. నీవు ఓడిన సంపదనంతయుతిరిగి నీకిచ్చితిని. దీనితోపాటు నీవు ఏ విఘ్నములు లేకుండ నీ రాజధానికి పోయి తమ్ములతో సుఖముగా ఇంద్రప్రస్థ రాజ్య మేలుము."

పిదప ధృతరాష్ట్రుడు ధర్మరాజునకు ఈ విధముగా నుపదేశించెను :__"నాయనా ! నీవు ధర్మముయొక్క సూక్ష్మగతిని ఎరుగుదువు, వినయవంతుడవు. పెద్దలను సేవించినవాడవు. ఎక్కడ బుద్ధియుండునో అక్కడ శాంతియుండును. కనుక బుద్ధిమంతుడవగు నీవు శాంతుడవుకమ్ము. జరిగిన అధర్మమును మరచిపొమ్ము. రాతిపైనగాని, ఇనుముపైనగాని గొడ్డలిదెబ్బ వ్యర్థమైపోవును. కనుక లోకులు గొడ్డలితో కట్టెపైననే దెబ్బ కొట్టెదరు. ఎవడు వైరమును మరచిపోయి శత్రువుల సద్గుణములనే చూచుచుండునో వాడే ఉత్తమపురుషుడు. అట్టివాడు ఇతరులకు నిస్స్వార్థబుద్ధితో ఉపకారము చేయుచుండును.

" యుధిష్ఠిరా ! నీచుడు, సాధారణ సంభాషణలోగూడ కటువచనములు పలుకుచుండును. మధ్యముడు, తొలుత మధురముగా మాట్లాడి తరువాత కఠినముగా పలుకజొచ్చును. ఉత్తమపురుషు డైనచో, ఇతరులు కఠినముగా మాటాడినను ఎప్పుడుగూడ పరుష వచనములు పలుకడు. మహాత్ములు సానుభూతితో యితరుల సుఖదుఃఖములను ఆత్మాభిమానముగా చూచుచు ఇతరుల మంచినే తలంచుచు, చెడుగులను దృష్టియందుంచుకొనరు. సత్పురుషులు ఆర్యుల మర్యాదను భంగపరచరు. వారి దర్శనమాత్రముచేత

అందరు ప్రసన్నులగుదురు. యుధిష్ఠిరా! నీవు కౌరవ పాండవుల సమాగములలో శ్రేష్ఠపురుషుడుగానే మెలగుచుంటివి. దుర్యోధనుని దుష్ట వ్యవహారమును నీవెప్పుడుగూడ మనస్సులో నుంచుకొనకుము. నీవు ఉత్తముడవు. నన్ను, నీతల్లి గాంధారినిచూచి శాంతుడవుకమ్ము. నేను విచారించియే యీ జూదమునకు అంగీకరించితిని. ఇందులో మిత్రులతోకలిసి నా పుత్రుల బలాబలములను తెలిసికొన దలచితిని. ధర్మరాజా! నీవు రాజుగానుండి, సర్వశాస్త్ర నిపుణుడు. బుద్ధిమంతుడు నైన విదురుడు మంత్రిగానున్న యీ కురువంశము ఎప్పుడుగూడ దుఃఖములపాలు కాదగదు. నీలో ధర్మము, అర్జునునిలో ధైర్యము, భీమునిలో పరాక్రమము, నకుల సహదేవులలో గురుసేవా భావము, శ్రద్ధ ఉన్నది. కనుక మాకు సర్వదా శ్రేయస్సే కలుగును. మీరు క్షేమముగా నింద్రప్రస్థ నగరమునకుపోయి, రాజ్యము నేలుకొనుచుండుడు. దుర్యోధనాదులను సోదరభావముతో చూడుడు. సర్వదా ధర్మమార్గములోనే మీ మనస్సు లగ్నమై యుండునుగాక. పోయిరండు."

ధృతరాష్ట్రుని హితవచనములను విని ధర్మరాజు తమ్ములతోను భార్యతోను పెద్దలకు నమస్కరించి వారియాజ్ఞగొని రథముల పైన ఇంద్రప్రస్థమునకు బయలుదేరి పోయెను.

ఆ విధముగా ధృతరాష్ట్రుని యనుజ్ఞబడసి ధర్మరాజు పోయినసంగతి దుశ్శాసనుడు దుర్యోధనునకు తెలిపి దుఃఖించెను. అప్పుడు దుర్యోధనుడు కర్ణ శకునులతో ఆలోచించెను. ఆ దుష్ట చతుష్టయము ధృతరాష్ట్రుని వద్దకుపోయి యిట్లనిరి :— "రాజా! పూర్వము బృహస్పతి చెప్పిన నీతిని నీవు వినలేదా! ఏ యుపాయముల చేతనైనను శత్రువులను నశింపజేయవలెను. సర్పములను కంఠమునకు తగిలించుకొనుట అపాయముకాదా! తండ్రీ! శస్త్రధారులైన పాండవులను యుద్ధములో జయించుట ఇంద్రాదులకైనను సాధ్యమగునా! వారిని నీవు విడిచి వారి రాజ్యమును తిరిగి వారికి ఇచ్చుటచేత మా కంఠమునకు ఉరిత్రాడు తగిలించినవాడవయితివి. కనుక వారితో మరల మేము జూదమాడి వనవాసము పందెముగా పెట్టెదము. అప్పుడుగాని వారు రాజ్యముతోపాటు మాకు వశులుగారు.

"జూదములో ఓడినవారు పన్నెండు సంవత్సరములు వనములో మునులవలె నివసించి పదుమూడవ యేడు ఎవరికిని తెలియకుండ అజ్ఞాతవాసములో నుండునట్లును, ఒకవేళ అజ్ఞాతవాసములో ఎవరైన వారిని కనుగొనినచో తిరిగి పన్నెండేండ్లు వనవాసము చేయునట్లును పందెము పెట్టెదము. ఈ పందెముపైన తిరిగి జూదమాడుటకు నీవు అంగీకరించవలెను."

ఆ మాట విని ధృతరాష్ట్రుడు పుత్రప్రేమచేత, "నాయనా! పాండవులను వెంటనే పిలిపించి జూదమును తిరిగి ఆడుము" అని చెప్పెను. అప్పుడు ద్రోణాచార్యాదులగు పెద్దలందరును వలదని చెప్పినను ధృతరాష్ట్రుడు పుత్ర ప్రేమలోపడి పాండవులు ఇంద్రప్రస్థమువైపు ఎంతదూరము పోయినప్పటికిని వారిని అందుకొని తిరిగి జూదమాడుటకుతోడ్కొని రావలసినదని ఆజ్ఞ యిచ్చెను.

అప్పుడు గాంధారి పుత్రనాశమును శంకించుచు భర్తతో నిట్లనెను :— "ఆర్యపుత్రా! దుర్యోధనుడు పుట్టినప్పుడే విదురుడు 'ఈ బాలకుడు కులనాశకుడగును గనుక ఇతనిని చంపుడు.' అని చెప్పియుండెను గదా! ఈ దుష్టపుత్రుల మాటలను అంగీకరించకుడు. ఈ కులనాశమునకు మీరు స్వయముగా కారణభూతులగుటతగదు. కట్టబడిన వంతెనను పడగొట్టకుడు. ఆరిపోయిన అగ్నిని తిరిగి జ్వలింపజేయకుడు. దుర్బుద్ధిగలవారికి శాస్త్రము గూడ ఉపదేశింపజాలదు. మన పిల్లలకు ఎంత బోధించినను వివేకము రాదు. మన పుత్రులు మర్యాద తప్పి ప్రాణములను పోగొట్టుకొను పరిస్థితి వారికి మూడకుండ నుండులాగు మీరు వారిని మీ యాజ్ఞలో నుంచుకొనవలెను. కులమునకు అగ్నివంటి దుర్యోధనుని విడిచిపెట్టుడు. మీ కర్తవ్యమును పుత్రప్రేమచే మీరు నిర్వహించనందువలన నేడు ఈ ముప్పు మనకులమునకు మూడినది. అన్యాయార్జితమైన సంపద చిరకాలము ఉండదు. ధర్మబుద్ధితో మెలగి కార్యము చక్కబరపుడు."

ఆ మాట విని ధృతరాష్ట్రు డిట్లనెను :— "దేవీ! ఈ కులమునకు నాశమేర్పడినను సరియే. నేను దుర్యోధనుని ఆపజాలను. మన పుత్రుల కోరికయే నెరవేరు గాక. పాండవులు తిరిగి వచ్చి వీరితో జూదమాడుదురు గాక."

తరువాత ధృతరాష్ట్రుని యాజ్ఞచేత ప్రాతికామి పోయి, యింద్రప్రస్థ మార్గములో చాలదూరము వరకు ప్రయాణము చేసిన ధర్మరాజును చేరి అతనితో 'రాజా! తిరిగి హస్తిపురిలో ద్యూతసభ తీరియున్నది. నీవు మరలవచ్చి జూదమాడవలసినదని మీ తండ్రిగారి యాజ్ఞయైనది.' అని చెప్పెను.

ఆ మాట విని యుధిష్ఠిరుడు, "దైవనియోగము ననుసరించి ప్రాణులకు శుభాశుభములు కలుగుచుండును. దాని నెవడును తప్పించుకొనజాలడు. జూదమాడుటకు వృద్ధరాజు పిలిచెను. అది నాశకరమని తెలిసినను అతని యాజ్ఞను దాటజాలను. బంగారు లేడియుండుట అసంభవమని భగవానుడైన రాముడు తెలిసికూడ ఆ మృగము వెంటపడి అనేక బాధలను అనుభవించలేదా! పతనము ఆసన్నమైనవారి యొక్క బుద్ధి తరచుగా విపరీత మార్గములోనే నడచుచుండును." అని చెప్పుచు తమ్ములతో తిరిగి జూదమాడుటకు హస్తిపురికి పయనమయ్యెను.

హస్తిపురముచేరి ద్యూతసభాభవనమును ప్రవేశించి యుధిష్ఠిరుడు ప్రారబ్ధకర్మచేత తిరిగి శకునితో జూదమునకు మొదలిడెను. ప్రజానాశము కలుగవలసియున్నది. గనుక అతనికి దైవయోగముచేత అట్టి బుద్ధి కలిగెను అప్పుడు శకుని పూర్వోక్తరీతిగా పందెముయొక్క రీతిని ధర్మరాజునకు తెలిపెను. అది విని సభాసదులందరును వనవాసపు పందెమును నిందించిరి. అట్లైనను ధర్మరాజు సిగ్గుచేతను, తండ్రి యాజ్ఞచేతను బద్ధుడై 'కురువంశమునకు చేటు కాలము వచ్చినది.' అని తలచుచు జూదమాడదొడగెను. శకుని 'అరణ్యవాసము, అజ్ఞాతవాసము, పందెముపెట్టి ధర్మజుని యంగీకారముపై పాచికలు చేతగొనివేసెను. 'ధర్మరాజా! మాదే గెలుపు. నీవు ఓడితివి' అని చెప్పెను.

తరువాత పాండవులు లేడి చర్మమును ధరించి వనవాసము కొరకు దీక్షగొనిరి. వారిని జూచి దుశ్శాసనుడు, "నేటినుండి దుర్యోధనుని సామ్రాజ్యము భూమండలమంతయు కొనసాగగలదు. మేము శత్రువులకన్నను గుణాధికులమైతిమి. సుఖములను రాజ్యమును గోల్పోయి పాండవులు శాశ్వతముగా దుఃఖనరకములో పడిపోయిరి. ధనమదముచేత మమ్ము పరిహాసించుచుండిన వారికి మంచి శాస్తి జరిగినది. నేడు అంతయు పోగొట్టుకొని పొట్టునువ్వులవలె నిస్సత్తులైరి. మహాబుద్ధిశాలియైన ద్రుపదుడు ఇట్టి పాండవులకు కన్యనిచ్చి చాల అకృత్యమునే చేసెను. ద్రౌపది పతులు నపుంసకులుగ నున్నారు. ద్రౌపదీ! ఇట్టి కురూపులతో అరణ్యవాసమును నీవెట్లు చేసెదవు? కనుక నీకు తగిన పతిని మరియొకని నెవనినైన కోరుకొని సుఖించుము. ఇంతమంది కౌరవులలో నొకరిని వరింపుము. ఎవడుగూడ నీకి నీచగతిని గలిగించడు. పాండవులు నిస్సారులై పొట్టునువ్వులవలెను, చర్మమృగములవలెను, వడ్లతాలువలెను నున్నారు." అని అనేక విధముల నిందావాక్యములను పాండవుల నుద్దేశించి అనెను.

ఆ మాటలు విని భీమసేనుడు రోషముతో దుశ్శాసనునితో, "నీచుడా! నీ బాహుబలము ఎంతటిదో యెరుగక, కేవలము శకుని పాచికల బలముచేత రాజువనిపించుకొనుచు వదరుచున్నావు. ఇప్పుడు నీవాగ్బాణములచేత మా మర్మములను ఛేదించినట్లుగాదు. రేపు యుద్ధములో మా శస్త్రములచేత నీశరీరమర్మచ్ఛేదము చేసినప్పుడుగాని నీవీ మాటలను జ్ఞప్తికి తెచ్చికొనెదవు. నిన్నేకాక నీవెనుక తాళము వేయువారినిగూడ రేపు యమలోకమునకు పంపెదను. యుద్ధములో నీ రొమ్మును చీల్చి వేడినెత్తురు త్రాగెదను. అట్లు చేయనినాడు నేను పుణ్యలోకముకు దూరమగుదునుగాక. అందరు చూచుచుండగా యుద్ధములో ధృతరాష్ట్ర పుత్రులనందరిని చంపెదను. నేను దుర్యోధనుని, అర్జునుడు కర్ణుని, సహదేవుడు శకునినిచంపెదము. సుయోధనుని తల నేలపై వేసి త్రొక్కెదను." అని చెప్పెను.

అర్జునుడు, "వట్టిమాటలతో ప్రయోజనములేదు, నేటికి పదునాల్గవ సంవత్సరమున కౌరవులకు చెడ్డ ఆలోచనలు చెప్పుచున్న కర్ణుని యుద్ధములో చంపెదను. యుద్ధము చేయు రాజులందరిను హతమార్చెదను. ఇట్లు నేను చేయకున్నచో, హిమాలయము కదలుగాక, సూర్యుడు ప్రభాహీనుడు, చంద్రుడు శైత్యహీనుడు నగుదురుగాక. పదమూడేండ్ల తరువాత దుర్యోధనుడు గౌరవపూర్వకముగా మా రాజ్యమును మాకు ఇవ్వనిచో ఇట్లగుట తథ్యము." అని చెప్పి ప్రతిజ్ఞచేసెను.

"శకునిని చంపెదనని సహదేవుడు ప్రతిజ్ఞచేసెను. 'ధార్తరాష్ట్రులనందరిని చంపెదనని నకులుడు ప్రతిజ్ఞచేసెను.

ఇట్లు పాండవులు ప్రతిజ్ఞచేసి ధృతరాష్ట్రుని సమీపించిరి. ధర్మరాజు ధృతరాష్ట్రుని, పెద్దలను, అరణ్యవాసమునకు అనుజ్ఞ కోరెను. ఎవరును బదులు చెప్పక సిగ్గుచే తలవంచుకొని మనస్సులో పాండవుల క్షేమమును కోరుచుండిరి. అప్పుడు విదురుడు, 'సుకుమారియగు కుంతీదేవి అడవికిపోయి నివసించజాలదు కనుక ఆమె మా యింటనే యుండుగాక,' యని యనెను. పాండవులు విదురునియందలి భక్తిభావముచేత ఆ మాటకు అంగీకరించిరి.

అప్పుడు విదురుడు వారితో నిట్లనెను :— మీరు పరమ ధర్మాత్ములు. ద్రౌపది మహాపతివ్రత. మీ యాచార్యుడగు ధౌమ్యుడు త్రికాలజ్ఞుడు. శూరులగు మిమ్ము ఎవరును జెనకజాలరు. పూర్వము హిమాలయ పర్వతమునందు మేరుసావర్ణి, వారణావతమునందు వ్యాసుడు, భృగుతుంగ పర్వతమునందు పరశురాముడు, దృషద్వతీనదీ తీరమునందు సాక్షాత్తు భగవంతుడగు శంకరుడును మీకు ధర్మమును, జ్ఞానమును ఉపదేశించిరి. కల్మాష నదీతీరవాసియగు భృగుమహర్షిగూడ మీకు ఉపదేశించియుండెను. నారదుడు సర్వదా మీకు అండగానుండి మీ యోగక్షేమములను విచారించుచునే యుండును. మీకు పురోహితుడగు ధౌమ్యుడు మీతోనే యున్నాడు మీ క్షేమమునకు కొరత యుండదు."

"ధర్మరాజా! పురూరవునికన్న నీవు బుద్ధిమంతుడవు. ఋషులు ఉపదేశించిన పరలోక విషయిక విజ్ఞానమును విడువకుము. నీవు బలముచేత సమస్త రాజులను, ధర్మముచేత ఋషులను జయించగలవు. ఇంద్రుని వలన విజయోత్సాహమును, యముని నుండి క్రోధమునణచుకొనియుండు నుపాయమును గ్రహించుము. ఔదార్యములోను, దానములోను కుబేరుని ఆదర్శముగా పెట్టుకొనుము. ఇతరుల హితముకొరకు తననుతాను త్యాగము చేసికొనుట, శీతలత్వము (సౌమ్యభావము), జీవన (జల) దానము మొదలగు గుణములను జలమునుండి నేర్చుకొనుము. భూమినుండి ఓర్పు, సూర్యునినుండి తేజము, వాయువునుండి బలము, సమస్త భూతములనుండి సంపత్తిని పడయుము. నీకు రోగములేకుండ శుభములే సర్వదా కలుగుచుండుగాక. నీవు అరణ్యమునుండి క్షేమముగా తిరిగి వచ్చిన తరువాత మరల నిన్ను చూచెదను. ధర్మనందనా! నీకు ఆపత్తి వచ్చి ధర్మార్థములకు సంకట పరిస్థితి యేర్పడినప్పుడు గాని, మరి యే యితర కార్యములందుగాని సర్వదా నీవు ఉచితమైన కర్తవ్యమును పాలించుచుండుము. నీకు మంగళమగుగాక, పోయిరమ్ము." విదురుని నీతివచనములచేత శాంతుడైనట్లు సంతుష్టుడై ధర్మరాజు మరల భీష్మద్రోణులకు నమస్కరించి పయనమయ్యెను.

(సశేషము)

పంచవర్ష ప్రణాళికలు-కార్మికులు:

# కార్మిక విద్యా పథకం

ఎస్. కె. వి. గుప్త

భారతదేశం వ్యావసాయిక కేంద్రమని, రైతుల పుట్టిల్లని ప్రసిద్ధి చెందింది. భారతీయుల జీవన విధానం వ్యవసాయంపై ఆధారపడివున్నది. పరిశ్రమలు చాలా తక్కువగా వున్నందున నిత్యావసర వస్తువులుకూడా చేతితోనే చేస్తున్నారు. యంత్రాలు లేనందువలన పారిశ్రామికాభివృద్ధిపై అభిలాష తక్కువ వున్నది. దేశ పరిపాలన విదేశీయుల చేతులో ఉండినందువలన అన్ని రంగాలలోను అభివృద్ధికి అవకాశాలు లేకుండేవి. దినదినము ఆర్థికంగా సామాజికంగా ఒక్కులకులోనై బాధపడుతుండేవారు. భారతీయ హృదయాలలో స్వాతంత్ర్య జ్యోతి ప్రజ్వలింప సాగింది.

భారతదేశం 1947 సం. లో రాజకీయంగా స్వాతంత్ర్యము సంపాదించింది. దీనితో భారతదేశం తృప్తి పడలేదు. పాశ్చాత్య దేశాలలో యంత్రాల సహాయంతో పారిశ్రామిక రంగంలో అభివృద్ధి పొంది ఆర్థికంగానూ, సామాజికంగానూ వృద్ధి చెంది స్వయం పోషణ జరుపుటలో ముందంజ వేస్తుండిన వాటిని దృష్టిలో పెట్టుకొని, మానవ శక్తి సహజ సంపదనుఒక క్రమ పద్ధతిలో ఉపయోగించుటకు, కృషి సల్పడానికి స్థిరమైన కార్యక్రమము నొకదానిని చేపట్టడం జరిగింది. ఒక నియమిత కాలములో సాధించవలసిన సంపత్తిని పొందడానికి "పంచవర్ష ప్రణాళికలు" అను పేర దేశ పురోభివృద్ధికి కార్యక్రమాలు రూపొందింప బడ్డాయి. రాజకీయ స్వాతంత్ర్యంతో కేవలం ప్రజల స్థాయిని మెరుగు పరచడానికి సాధ్యంకాదు. దానికి ప్రజాస్వామ్య వ్యవస్థ ఏర్పరచి, సంక్షేమ రాజ్య స్థాపనతో అత్యవసరమైన ఆర్థిక సాంఘిక సదుపాయాలు కల్పించి సమాజ వికాసానికి కృషి సల్పడానికి పారిశ్రామికీకరణ చేపట్టడమైనది. పారిశ్రామిక రంగంలో అభివృద్ధి కావడానికి సుశిక్షితులైన కార్మికులు అత్యావశ్యకము. భారతదేశంలో మానవ శక్తి ఎక్కువగా వున్నది నిరక్షరాస్యులైన ప్రజలు అనాయాసంగా పరిశ్రమల కుపయోగపడుతున్నారు. పారిశ్రామికీకరణలో కార్మికుల పాత్ర విశిష్టమైనది. కార్మికులను ఒక సక్రమ పంథాలో నడిపించకపోయినట్లయితే వారికి సరియైన మార్గం చూపనట్లయితే దేశం ఆర్థికంగా అభివృద్ధి చెందటానికి ఆటంకం కలుగుతుందని నాయకులు భావించి భారత ప్రభుత్వం ప్రణాళికలలో "కార్మిక విద్యా పథకము" ముఖ్యాంశంగా ఏర్పరచింది. ఈ పథకాన్ని ఆచరణలో పెట్టడానికి భారత ప్రభుత్వం ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో కొంత డబ్బును కేటాయించింది.



జూలాజికల్ పార్కులో, కార్మిక విద్యా పథకం అధికారులతో శ్రీ గుల్జారీలాల్ నందా.

1957 సం. లో భారత కార్మిక ఉపాధి మంత్రిత్వశాఖ అధ్వర్యాన ఫోర్డు సంస్థ సహాయంతో కార్మిక విద్యారంగంలో అనుభవంగల 4 గురు విదేశీ నిపుణులతోసహా మొత్తం 8 మంది నిపుణులతో సంఘం ఒకటి ఏర్పరచబడింది. ఈ నిపుణుల బృందము దేశములోని ముఖ్యమైన పారిశ్రామిక కేంద్రాలను సందర్శించి కార్మికసంఘాల యజమానుల, ప్రభుత్వశాఖల, విద్యాసంస్థల ప్రతినిధులను కలుసుకొని కార్మిక విద్యా పథకాన్ని ఆచరణలో పెట్టడానికి సంప్రతించారు, తదుపరి ఈ పథకంపట్ల అభిరుచిగలవారిని ఆహ్వానించి ఢిల్లీలో ఒక పెద్ద సదస్సును ఏర్పరిచారు. ఈ సదస్సుల్లో సేకరించిన అభిప్రాయాలను పరిశీలించి ఒక ప్రత్యేక నివేదిక రూపంలో ప్రభుత్వానికి సమర్పించడం జరిగినది. జూలై 1957 లో న్యూఢిల్లీలో జరిగిన 15 వ భారత కార్మిక సమావేశంలో కొద్ది మార్పులతో ఈ నివేదిక అమోదించడం జరిగింది నాటి కేంద్ర కార్మిక శాఖామాత్యులైన శ్రీ గుల్జారీలాల్ నందాగారి సహాయంతో భారత దేశంలో కార్మిక విద్యా పథకాన్ని ఒకదాన్ని కార్మిక శ్రేయస్సు-కార్మిక సంక్షేమం లక్ష్యాలతో రూపొందించడం జరిగింది. నందాగారి సేవలు కార్మిక వర్గము ఎన్నడూ విస్మరింపజాలదు. నందాగారు కార్మిక విద్యా పథకాన్ని ఆచరణలో పెట్టినందులకు నిజంగా అభినందనీయులు.

కార్మిక విద్యా కేంద్ర మండలి:- 8 మంది నిపుణుల బృందం సూచించిన ప్రకారం భారత ప్రభుత్వం కార్మిక ఉపాధి

మంత్రిత్వశాఖ ఆధ్వర్యాన కార్మిక సంఘముల యజమానుల, ప్రభుత్వాధికారుల, విద్యా సంస్థల ప్రతినిధులతో కూడి స్వపరిపాలనాధికారముగల ఒక సంస్థ స్థాపించబడి దానికి కార్మిక విద్యా కేంద్ర మండలి అని నామకరణం చేయబడినది.

**విధులు:**— కార్మిక విద్యా పథకాన్ని ఆచరణలో పెట్టుటకు సాధారణ విధానమును రూపొందించుట— ప్రభుత్వముచే కేటాయింపబడిన నిధులను సరిగా వినియోగించుట, కార్మిక విద్యను ప్రోత్సాహ పరచుట—విద్యా కార్యక్రమములను జరుపుటకు ఆలోచన చేయుట, తగిన వస్తు సామగ్రిని ఏర్పరచుట.

విద్యాధికారుల శిక్షణ కార్యక్రమములను జరుపుట.

కార్మిక ఉపాధ్యాయులకు తగినంత స్థాయి నిర్ణయించుట— ఇందులోని ముఖ్యాంశాలు.

కార్మిక విద్యా పథకంయొక్క ముఖ్యమైన ఆశయాలు నాలుగు.

1 మంచి శిక్షణ పొందిన కార్మిక సంఘ కార్యకర్తలు వికాసము పొందిన సభ్యులద్వారా పటిష్ఠమైన కార్మిక సంఘములను పెంపొందింప జేయుట.

2 కర్మాగారములలో పనిచేయుచున్న కార్మికవర్గము నుండియే కార్మిక సంఘ నాయకులను సిద్ధపరచుట. కార్మిక సంఘ నిర్మాణ వ్యవహారములయందు ప్రజా స్వామ్య పద్ధతిని ప్రవేశపెట్టి దానిని వృద్ధిగావించుట.

3. సంఘీకృత కార్మికులకు ప్రజాస్వామ్య సంఘమందు సరియైన స్థానమును కల్పించుట - సాంఘిక ఆర్థిక కార్యకలాపములను తగు బాధ్యతలను సరియైన విధంలో నిర్వహించుటకై సమర్థత చేకూర్చుట—

4. ప్రస్తుత కార్మికులు తమ సంఘములను తమ సమస్యలను, సరియైన బాధ్యతలను గ్రహించి చట్టరీత్యా హక్కులను సాధించు విధానములను అనుసరించి తమ పరిసర ఆర్థిక సమస్యలను బాగుగా గ్రహించి దానిచే పొందిన జ్ఞానమువల్ల ప్రయోజనకరమైన భారత పౌరులుగా రూపొందించ బడుట.

కార్మిక విద్యాకేంద్రమండలి యాజమాన్యాన కార్మిక విద్యా విధానాన్ని మూడు స్థాయిలలో జరుపుటకు కార్యక్రమం రూపొందించ బడింది.

మొదటి స్థాయి : కార్మిక విద్యా కేంద్రమండలి ద్వారా మొదటి స్థాయిలో "విద్యాధికారులు" అనబడే నిర్వహణాధికారులను కేంద్రమండలిలో నియమించడానికి, అఖిలభారత సేవల రూపంలో తగిన సంఖ్యలో అభ్యర్థులను ఎన్నుకొని, వారికి శిక్షణ యివ్వడానికి కార్యక్రమం రూపొందింప బడినది. 1958 సం. లో ప్రప్రథమంగా బొంబాయినగరంలో రెండవసారి 1959 లో కలకత్తాలో విద్యాధికారుల శిక్షణ విజయవంతంగా జరుపబడినది. శిక్షణపొందిన విద్యాధికారులు వివిధ ప్రాంతములలో స్థానిక కేంద్రాలలో నియమింపబడిరి.

రెండవస్థాయి :—కార్మిక విద్యా స్థానికమండలి పేరిట ప్రాంతీయ విద్యాకేంద్రం 1959 లో ఇండోరు పారిశ్రామిక ప్రదేశంలో స్థాపించడం జరిగింది. కేంద్రమండలి విధానముతో ప్రాంతీయ మండలి నిర్మింప బడినది. శిక్షణ పొందిన విద్యాధికారులు కార్మిక విద్యా స్థానిక కేంద్రంలో ప్రాంతీయ మండలి సహకారంతోను కర్మాగారాలలో పనిచేయిస్తున్న కార్మిక సంఘ ఉచ్ఛాధికారులను, ముఖ్యమైన కర్మాగార ఆవరణలోనే తోటి కార్మికులకు తాము నేర్చుకొన్న విషయాలను నేర్పుటకు ఒక గది తీసికొని పనిగంటల తరువాత ప్రతిదినము 1½ గంట కాలము చొప్పున ప్రతి మూడు మాసములకు 25 మంది కార్మికులకు శిక్షణ గరపుట మూడవస్థాయి శిక్షణ అనబడును. హైదరాబాదు ప్రాంతీయ కేంద్రం యాజమాన్యాన 9 సం. లో దాదాపు 52,000 కార్మికులకు 122 ప్రాథమిక కేంద్రాల ద్వారా శిక్షణ కార్యక్రమం అమలుపరచడం జరిగింది. హైదరాబాదులోని నెహ్రూ జూలాజికల్ పార్కులోగూడా కార్మిక విద్యా ప్రాథమిక కేంద్రానికి 26-1-1966 తేదీన అటవీశాఖా ఉప-ముఖ్య రక్షణాధికారి, శ్రీ మజహరొద్దీన్ అహ్మద్ అధ్యక్షతన ప్రారంభోత్సవం జరిగింది. అటవీ శాఖాధికారుల సహకారంతో రెండు సంవత్సరాల కాలంలో 7 బృందాలుగా 210 కార్మికులకు శిక్షణ యివ్వడమైనది. అప్పటి ఆంధ్రప్రదేశ్ కార్మిక శాఖా మాత్యులైన శ్రీ కొండాలక్ష్మణ్ బాపూజీ గారు మూడవ బృందంలో శిక్షణ పొందిన కార్మికులకు ప్రమాణ పత్రాలు మే 1967 లో బహూకరించి కార్మిక విద్యా పథకమును ప్రశంసించారు. కార్మిక శ్రేయోభిలాషులైన మాజీ కేంద్ర కార్మిక గృహ మంత్రి శ్రీ గుల్జారిలాల్ నందాగారు 4-2-68 తేదీన 5 వ బృందరి శిక్షణ పూర్తి చేసుకున్న కార్మికులకు ప్రమాణ పత్రాలు బహూకరించారు. తదుపరి తమ ప్రసంగంలో కార్మికులను సంబోధిస్తూ తమతమ సంఘాల నిర్వహణ, కార్యకలాపాలను సత్యరూపంలోను, చట్టప్రకారం సమస్యా పరిష్కార విధానాలను అవలంబించి నప్పుడే దేశ ఆర్థిక సమృద్ధికి కార్మికులు ప్రశాంత వాతావరణములో అధికోత్పత్తి చేసిన వారగుదురని వక్కాణించారు.

వచనకవితా వికాసం :

## గ్రంథ సమీక్ష

వచన కవిత్వం అనే ఒక క్రొత్త ప్రక్రియను తెలుగు సాహిత్య రంగస్థలం మీద ప్రయోగాత్మకంగా ప్రదర్శించడం ప్రారంభించి మూడు దశాబ్దాలు దాటిపోయింది. పోర్షన్లు మరిచి పోయిన వారూ, ఒక రాగం తీయబోయి మరో రాగం ఆలాపించినవారూ, హార్మనీకి శ్రుతికలవకుండా బొంగురు గొంతులతో కర్ణకఠోరంగా పాడినవారూ, పద్యంలోని సాహిత్యం పూర్తిగా వదిలి చివరలో తీసే ఆలాపనతో ప్రేక్షకులను విసిగించినవారూ—యిలాంటి రకరకాల నటులు రావడం, ప్రేక్షకులు హేళనగా చప్పట్లు గొట్టడం మొదలైన దశలు ఏనాడో గడిచి పోయాయి. వీరితోపాటు బళ్లారి రాఘవ, హరిప్రసాదరావు, స్థానం, మాధవపెద్ది వంటి మంచి నటులు కూడా వచ్చి ప్రేక్షకుల్ని పురూత లూగించారు. కాలం గడిచినకొద్దీ యీ వచన కవిత అనే ప్రయోగాత్మక నాటకం ప్రజాదరణ పొందింది. ఇంక దీనికి "ప్రయోగాత్మక" అనే విశేషణం కూడా అక్కరలేని పరిస్థితి ఏర్పడింది. నాటకం వేస్తున్నారని తెలియగానే జనం తండోప తండాలుగా వస్తున్నారు. ఇంటింటికీ తిరిగి టిక్కెట్లు అమ్ముకోవలసిన పరిస్థితి తొలగిపోయింది.

వచన కవితా ప్రక్రియ ఒక ఉద్యమ స్థాయిలో గత మూడు దశాబ్దాల కాలంలో ఆంధ్రదేశంలో బాగా వ్యాపించింది. ఏ వుద్యమానికైనా ఒక నిర్దిష్టమైన లక్ష్యం వుంటుంది. సాంప్రదాయిక కవితా రీతులకు పట్టుబడకుండా తప్పించుకు తిరుగుతున్న ఆధునిక జీవిత వ్యవస్థను కావ్యస్థం చేయడమే వచన కవితా వుద్యమానికి లక్ష్యం. దీనికోసం కావ్యభాషా శృంఖలాలను త్రెంచివేసి సజీవమైన వ్యవహార భాషలోని శబ్దశక్తి సామర్థ్యాలను చక్కగా ఉపయోగించుకోవడం, లక్ష్యసిద్ధికి యీ కవులు చేపట్టిన సాధనం. అంటే పూజ్యులు గురజాడ చూపిన అభ్యుదయ భావమార్గం, గిడుగు చూపిన అభ్యుదయ భాషా మార్గాలను అనుసరించడం యీ వచన కవితా ప్రక్రియ యొక్క ప్రధాన లక్షణాలు.

శ్రీశ్రీ, ఆరుద్ర, కుందుర్తి, తిలక్‌ల తర్వాత వచ్చిన వచన కవిత్వపు యువ కవుల్లో అభ్యుదయ భావన బలంగా వున్నవారు శ్రీ వరవరరావు. ఆయన ప్రథమ కవితా సంకలనం

### చలినెగళ్లు—

ప్రచురణ, స్వేచ్ఛాసాహితి, హనుమకొండ, వెల : రెండు రూపాయలు. (ప్రతులకు పార్వతీ ప్రింటింగ్‌ప్రెస్, జడచర్ల, మహబూబ్‌నగర్ జిల్లా)

"సామాజిక ప్రయోజనంగల సాహిత్యమే శాశ్వతంగా నిలువ గలదు" అనే దృఢ విశ్వాసంతో స్వేచ్ఛా సాహితి వారు అందించిన "తొలి కానుక" యీ కావ్య సంకలనం. ఇటీవలి కాలంలో వచ్చిన అన్ని వాదాలలోనూ చివర వరకు గట్టిగా నిలబడగలిగింది సామాజిక ప్రయోజన వాదం ఒక్కటే. ఈ రీతికి చెందిన వాడు శ్రీ వరవరరావు. ఆధునిక కవిత్వంలో సాధారణంగా వాడే సంకేతాల వల్ల కలిగే అయోమయత్వాన్ని తొలగించుకోడానికో అన్నట్లు కవి తనువాడిన సంకేతాలకు అర్థ వివరణ యిచ్చాడు. తను వాడిన సంకేతాలకు కవి స్వయంగా అర్థ వివరణ యివ్వడం ఒక విధంగా ఎబ్బెట్టుగా కనిపించినా, మొదట్లో యీ పద్ధతి అనుసరించడమే మంచిదేమో అనిపిస్తుంది. కవి తన ఊహ ఏమిటో బైటపెడితే, సహృదయులైన విమర్శకులు, పాఠకులు దానిని ఆధారంగా ఆ కవితను పరిశీలించడానికి వీలుకలుగుతుంది. ఒకరి భావం ఏమిటో మరొకరికి తెలియకుండా తికమక పడినదానికంటే యిది చాలా మంచిది. అవ్యవస్థితమైన నేటి సామాజిక వ్యవస్థకు సంకేతం "చలివేకువ". ఒక భయంకరమైన రాత్రి గడిచిపోయి, యింకా భళ్లున తెల్లవారని వేకువ స్థితితో వర్తమానాన్ని కవి అన్వయించుకున్నాడు. నేటి స్తబ్దతకు చలిని సంకేతంగా చేసుకున్నాడు. నెగళ్లు వేశాడు. అయితే "చలినెగళ్లు" తాటాకు మంట వంటివి. తాత్కాలికమైనవి. కాని "స్తబ్దమైన జగత్తు యావత్తూ మేలుకుని, యీ చలిజ్వరం నుంచి కోలుకొని, యీ వెలుగు లోకాల నేలుకొంటుందనే" గాఢ విశ్వాసాన్ని కవి తన కావ్యంలో స్పష్టంగా సూచించాడు. కావ్యంలో ఎక్కడ చూసినా "తెల్లవారుతుంది, యింక భయంలేదు"అనే అభ్యుదయ, ఆశాభావనాత్మకం అయిన వ్యంగ్యం భాసిస్తుంటుంది. ఉదాహరణకు :

> "ఉత్సాహం ఉద్ధృతమై ఉప్పెన నెదిరించ గలదు
> ఆవేశం అలల వలె ఆవేదన నణచగలదు
> ఆనందం సముద్రమై ఆరాటము తీర్చగలదు
> అణువులోన అవతరించి అవనిని కాల్చేది అగ్నివి
> చినుకుల సేకరమూర్తి చప్పున చల్లార్ప గలదు—
> ఆకాశం అమృతాన్ని వాన వోలె కురిసింది
> శోకానల జీవులార సేవింతము రారండి."

ఇలాంటి ఆశాపూరిత వాతావరణం గ్రంథమంతటా కనిపిస్తుంది.

ఇటీవలనే వెలువడిన మరొక మంచికావ్యం :

### వైతరణి :

రచన : శ్రీ సి. వి. కృష్ణారావు,
ప్రచురణ : ఫ్రీవర్స్‌ఫ్రంట్, హైదరాబాదు,
వెల : రూపాయి

ప్రతులకు : చింతల నర్సింహులు అండ్ సన్స్, హన్మకొండ.

శ్రీ కృష్ణారావుగారు పేరు పొందిన అభ్యుదయ కవి. అందుకే ఆయన పూహ యీ కావ్యంలో హరిజనుల దుర్భర జీవన పరిస్థితులను వర్ణించడానికి పూనుకుంది. "నన్ను వాళ్ళ గుడిశెల్లోకి రానిచ్చారు ........సగం చెప్పి సగం చెప్పక పూర్తిగా బాధ చెప్పడానికి మాటరాక ఇక్కడ రాసికోడానికి యిళ్ళలో కాగితం లేక చేతుల్లో కలాలు లేక ఏకలవ్యులలా నాకు వారి బొటిమన వ్రేళ్ళిచ్చారు" అని కవిగారు రాసుకున్నారు. ఉద్యోగ ధర్మాన హరిజన వాడలకు తరచు వెళ్ళి వారి కష్టసుఖాలను వినే అవకాశం కవిగారికి కలిగింది. అందువల్లనే వారి కష్టాలనుచూసి హృదయం కరిగి యీ కావ్యరచనకు ఉపక్రమించడం జరిగింది. కవిగారి హృదయమైతే కరిగిందికాని, ఆ పరిస్థితులను వర్ణించి పాఠకుల హృదయాలను కవి ఎంతవరకు స్పృశించ గలిగారన్నదే అసలు ప్రశ్న. కావ్యం మొత్తం చదివిం తర్వాత, హరిజనులు, సంఘంలో యింకా యితర వెనుకబడిన వర్గాల వారి పరిస్థితిని యింతకంటే కరుణరసాత్మకంగా వర్ణించి చూపడానికి వీలులేదా అనే ప్రశ్న మనకు కలుగుతుంది. ఈ కావ్యంలో కరుణరస నిర్వహణలో కవి అనుకున్నంతగా కృతకృత్యుడు కాలేదేమో అనే సందేహం మనల్ని బాధిస్తుంది. అయితే యీ కావ్యంలో మెచ్చుకోదగిన విశేషమేమంటే కావ్యమంతా ఏకసూత్రత కలిగి వుండడం—ఇటీవల వెలువడుతున్న అనేక వచన కవితాసంపుటుల్లో యీ ప్రధానమైన కావ్య లక్షణం మృగ్యం. కావ్యం మొదటి నుండి చివరివరకు, మురికివాడలలో దుర్భర పరిస్థితుల్లో నివసిస్తూ, సంఘంచేత దాదాపు వెలి వేయబడిన దరిద్రనారాయణుల నిత్యజీవిత రంగంలోని మంచిచెడులను కళ్ళకు కట్టినట్లు వర్ణించాలని చేసిన యీ ప్రయత్నం అభినందనీయం. "వెలుతురు స్థంభం" అనే ఖండికలో "మహామహులు ప్రయాణంచేసే శకటాలకు అనామకులైన సారథులు" అనీ, "అన్యాయపు ఆజ్ఞలు శిరసావహించని అనుమానాస్పదులైన సైనికు"లనీ తన కథా నాయకులను కవి వర్ణించాడు. "చీకటిలో వెలుతురు స్థంభంనాటించి, సామాన్య మానవుడు అసామాన్యుడని చాటించి, అందరికీ వెలుగులు పంచి క్రొత్త త్రోవలు త్రొక్కుతార"నే ఆశాభావాన్ని ప్రతిపాదించాడు కవి. ఈ కావ్యానికి శ్రీ కుందుర్తి సుదీర్ఘమైన పీఠికరాస్తూ" ఒక దృష్టితో చూస్తే గురజాడ, రాయప్రోలులతో ప్రారంభమైన నవ్య కవిత్వమంతా అభ్యుదయోద్యమంలో భాగమే........ఫలితమేదైనా కొత్తకోసం జరిగిన ప్రయత్నం కాబట్టి, దీనిని కూడా (ప్రేమ కవిత్వం) ఉదారంగా ఆలోచిస్తే అభ్యుదయ తత్వపు విశాలార్థం క్రిందికి తీసుకోవచ్చు" అన్నారు. ఎంత ఉదారంగా ఆలోచించినా యీ వాదన సమంజసమేనా అనే సందేహం కలుగక మానదు.

## చీకటినుంచి

(వచన కవిత) రచన నూతలపాటి గంగాధరం. ప్రచురణ కళా సాహితి, 83 లేక్ వ్యూ రోడ్ మద్రాసు—33, వెల మూడు రూపాయలు. ఇటీవల వెలువడిన మంచి కవితా సంపుటులలో యింకొకటి. ప్రఖ్యాత సినీనటుడు, పార్లమెంటు సభ్యుడు శ్రీ జగ్గయ్యగారికి యీ గ్రంథం అంకితం చేయబడింది. ఈ కావ్యంలో 40 ఖండికలు వున్నాయి. "నీవు కలవు" అనే ఖండికలో "మనిషి సమ్మెకగాంచి, మంచితనమును గాంచి, నీవు కలవని ఎంతు, నే వసుధ నివసింతు" అంటాడు కవి. ఈ నాటి సమాజంలో కూడా అక్కడక్కడ కనిపించే మంచిని చూసి అదే భగవంతుడని అనుకునే అల్ప సంతోషివలె.

"లైఫ్ యిన్షూర్ చెయ్యమని ఎల్.ఐ.సి. ఏజెంటు
వైఫ్ వెంట తిరుగుతున్నాడు, మంచి మూడ్ కోసం!"

అంటూ యీనాటి పరిస్థితిని చమత్కారంగా చెప్పి హృదయాన్ని రంజింప జేయగలడు గంగాధరంగారు, వెంటనే,

"బాంబునుండి తన సృష్టిని రక్షించుకోవడానికి

నాలుగు తలలవాడు నానా అవస్థలు పడుతున్నాడు "అని హృదయానికి గ్రుచ్చుకునేటట్లు చెప్పగలడు.

"ఊపిరి పీల్చలేక ఉక్కిరి బిక్కిరవుతున్న
అనాథ జీవుల్నీ అమాయక ప్రజల్నీ
విజ్ఞాన పూర్ణిమా జ్యోత్స్నలను విశ్వమంతా నింపి
చెత్తబారిన బ్రతుకులను క్రొత్త దారుల్లో
నడిపించడానికి"

"తపిస్తున్నా, విశ్వమానవ శాంతి మంత్రం జపిస్తున్నా" నని చెప్పుకున్న అభ్యుదయ భావనా శీలి యీ కవి,

"మృత్యు గహ్వరం" అనే ఖండికలో:

"జఠరాగ్ని శిఖల జిహ్వాల ప్రళయజ్వలిత జ్వాలలతో
శోణిత పలలాచ్ఛాదిత విస్ఫురద్ధవళ దంష్ట్రాగ్రములతో
నిజ దుర్భరక్షుధార్తి నిరంతర ప్రకటిత,
మృత్యు ముఖ గహ్వరం—ఇది" అన్నారు.

ఇటువంటి క్లిష్ట సమాసరచనను వచన కవితా ప్రక్రియ తనలో ఎంతవరకు యిముడ్చుకో గలుగుతుందో చెప్పడం చాల కష్టం

## చైతన్యభారతి

(కవితల కదంబం) కూర్పు: పురాణం రామచంద్ర; చైతన్య భారతి ప్రచురణ, వెల రూపాయిన్నర. ప్రతులకు ప్రగతి బుక్ డిస్ట్రిబ్యూటర్స్ 3-4-219, లింగంపల్లి, హైదరాబాదు. ఇది 23 మంది యువ కవుల గేయాల సంపుటి. ఒక్కొక్క కవిది ఒక్కొక్క గేయం వేశారు. వీరిలో శ్రీయుతులు వరవరరావు, శీలా వీర్రాజు, వేగుంట మోహన ప్రసాద్,

అద్దేపల్లి రామమోహనరావు, మురారి, పేర్వారం జగన్నాథం వంటి ప్రసిద్ధులైన యువకవులు వున్నారు. ఈ సంపుటి డా. దివాకర్ల వెంకటావధానిగారికి కృతి యివ్వబడింది. డా. అవధానిగారు సహృదయులు కాబట్టి వచన కవితా ప్రక్రియకు సంబంధించిన కృతి అయినా అరమరిక లేకుండా స్వీకరించారు. అన్ని ఖండికల్లోకి వీర్రాజుగారి "హృదయం దొరికింది" అనే కథాత్మక కవిత పెద్దది. అద్దేపల్లి రామమోహనరావుగారి "ప్రపంచ యుద్ధంలో అంతిమ విజయం," డి. రాజేశ్వరిగారి "వెలుగుబాట," సుగమ్ బాబుగారి "నోడౌట్" మొదలైన గేయాలు పేర్కొనదగినవి.

## నారాయణమ్మ

(పద్యకావ్యం) రచన: ముడివర్తి కొండమాచార్యులు: వెల రెండున్నర రూపాయలు, ప్రతులకు: రచయిత పేర జిల్లా పరిషత్ మల్టి పర్పస్ పాఠశాల, గూడూరు.

నారాయణమ్మ కథ 150 సంవత్సరాల నాటిది. నెల్లూరు జిల్లాలో ఆమె దేవతగా, పేరంటాలుగా ప్రసిద్ధికెక్కింది ప్రజలు ఆమెను యీ విధంగా పూజించడానికి కారణం పెండ్లి అయి సంవత్సరమైనా గడువకముందే, చేసుకున్న భర్తతో సంసార సుఖం సరిగా రుచి చూడకపోయినప్పటికీ, ఆయన మరణించగానే ఆమె సహగమనం చేయడమూ, ఆ విధంగా హిందూధర్మమని చెప్పబడిన దానిని తూచా తప్పకుండా అనుసరించడమూ. నారాయణమ్మ భర్త పాపిరెడ్డి ధార్వాడ సీమకు వెళ్లి కోడెలు కొని గోలకొండ రాజ్యంలో అమ్ముకుంటూ కోడెల వ్యాపారం చేస్తుండేవాడు. ఒక ఏడు గోలకొండ నవాబు ఒక మంచి కోడెను చూసి తనకిమ్మని కోరాడు. అది గ్రామదేవత ప్రీత్యర్థం ఆబోతుగా వదులుటకు ఉద్దేశించబడింది. కనుక పాపిరెడ్డి అమ్మ జూపలేదు. నవాబు కోపగించుకుని వెళ్లిపోయాడు. నవాబుకు కోపంవచ్చినా ఆయన పాపిరెడ్డిని ఏమీ చేయలేదు. కాని భయంవల్ల దారిలో పాపిరెడ్డి జ్వరగ్రస్తుడై చావు బ్రతుకులతో స్వగ్రామం వచ్చాడు. ఆబోతును వదిలే వరకు కొన ప్రాణంతో వుండి, ఆ పుణ్యకార్యం కనులార చూసి ప్రాణాలు విడిచాడు. బంధువులందరు వద్దంటున్నా భార్య నారాయణమ్మ సహగమనం చేస్తుంది. ఇదీ కథ స్థూలంగా. సహగమనం పాతివ్రత్య ధర్మానికి ప్రథమ లక్షణమని అంగీకరిస్తే నే తప్ప యీ కథలోని సొగసు మనకు బోధపడదు. పైగా కథనిండా యీ రోజుల్లో మూఢవిశ్వాసాలుగా పరిగణింపబడుతున్న కొలుపులు, జాతరలు అమ్మవార్లు కలలో కనిపించటం, నవాబు కోపము పాపిరెడ్డి జ్వరానికి కారణం కావడం, నారాయణమ్మ కలలో తన పెండ్లి సంబరం కనిపించడం మొదలగు అనేక విషయాలు వున్నవి. అయితే, ప్రజలు చెప్పుకునే దానిని బట్టి యివన్నీ జరిగిన విషయాలు కనుక వాటిని గురించి తర్కించే అవకాశంలేదు.

రచన కమ్మని, తీయని తెనుగుదనంతో ఘుమ ఘుమ లాడుతుంటుంది. తెనుగు నుడికారపు సొంపు, పటుత్వము, జాతీయత అడుగడుగునా వుట్టిపడుతుంటాయి. మనం యీనాడు దాదాపు మరిచిపోయిన ఎన్నో రమణీయములైన తెనుగు మాటలు, జాతీయములు యీ కావ్యం నిండా వున్నాయి. పల్లెటూరి వాతావరణం, పూర్వకాలపు రెడ్డి కుటుంబాల వైభవం మనోహరంగా వర్ణించబడింది. ఆధునిక యుగంలో వచ్చిన పద్య కావ్యాల్లో యింత ఘాటైన తెనుగుదనం ప్రదర్శించిన కావ్యాలు లేవంటే అతిశయోక్తి గాదు. పద్యంగానీ, కథగానీ, ఎక్కడా కుంటుబడకుండా అచ్చపు తెనుగు శైలిలో కావ్యమంతా నడిపిన కవిగారిని అభినందించకుండా వుండలేము. రెడ్డి రాజులు పాలించిన కాలంలో యీ కవిగారు వుంటే ఆయనకు ఆ ప్రభువులు కనకాభిషేకం_కాదు_రత్నాభిషేకం చేసి వుండేవారు.

గోలకొండ నవాబు దృష్టినాకర్షించిన కోడెవర్ణన చూడండి:

"ఏకుజేసలయెత్తు నెగుదోక యెగుబొడ్డు
గోదకొమ్ములుగల్గి కొరలునదియు
మిటిగన్ను మోమున సుడి యంటుమెడనిఱ్ఱు
మూపురంబున మురువుసూపునదియు
నాఱుపంటకువచ్చి యతిమాంసలంబయి
పట్టిన నిల్వకపారునదియు
గుచ్చు, నడుమువాలు గులుకుమువ్వలచేరు
సిగమోరలను నుల్ల సిల్లునదియు
దెసలు మాఱుచెలగ దివిరి ఘణిల్లని
అంకెవైచి కాలుద్రవ్వునదియు
నందివంటిదైన నట్టను దెకించి
పలికె హాలికవరుల మలకఱేడు"

నెల్లూరురెడ్డి కుటుంబ చరిత్రచేపట్టిన కవిగారు శైలిలో కూడా తిక్కన సోమయాజి పేరు నిలబెట్టారు "ఆంధ్రభూభువనాబ్జ మధ్యంబునందు కర్ణికగనున్న బెజవాడ గాంచియచట" వంటి పంక్తులు వచ్చినచోట "ఆంధ్రభూభువన మధ్యము పుండరీకంబు" వంటి శ్రీనాథ మహాకవి శైలిగుర్తుకువచ్చి, కవిగారు పూర్వకవితా సర్వవైభవమును తమ కరతలామలకంచేసుకున్నారనిపిస్తుంది. కవిత్వపు శైలిలో తెనుగుదనమాశించే ప్రతి ఒక్కరు తప్పక చదువవలసిన గ్రంథం.

శ్రీ సత్యనారాయణా (పద్య రత్నములు) గ్రంథకర్త: వడ్డపల్లి సత్యం బి. ఎ. వెల 25 పై. ప్రతులకు లక్ష్మీనాయుడు సాహితీ నిలయం, పొగిరి, వయా రాజాం శ్రీకాకుళం జిల్లా ఇందులో శ్రీ సత్యనారాయణా అనే మకుటంతో 50 పద్యాలు, గురుస్తుతి అనే పేరుతో 14 పద్యాలు వున్నవి

శ్రీశైల మల్లికార్జున సుప్రభాత సుసాంధ్యము: (సంస్కృతం) రచన శ్రీ ముదిగొండ వీరభద్ర మూర్తి, 13_6_675, కారవాన్‌సాహూ, హైదరాబాదు_6.

## స్వీకారం :

సంధ్య (నవల) వెల : రూ 6
తరంమారింది (నవల) వెల : రూ 5
జననీ జన్మభూమి (నవల) వెల : రూ 5.50
శ్రీనిలయం : (నవల) వెల : రూ 6

—పై నాలుగు నవలల రచయిత్రి శ్రీమతి మాదిరెడ్డి సులోచన.

5. జననాంతర సౌహృదాని (నవల)
రచన : శ్రీమతి విజయలక్ష్మి వెల : రూ 6

6. పంచపల్లవం (నవల)
రచన : శ్రీ కందుకూరి లింగరాజు వెల : రూ 9

7. కదిలించిన కలం (నేతాజీ వ్యాసాలూ, ఉత్తరాలూ)
అనువాదం : శ్రీ కాజ వెంకటేశ్వరరావు వెల : రూ 3_50
బాలల బాపు (కవిత)

8. రచయిత : (హిందీ) శ్రీ సోహన్‌లాల్ ద్వివేదీ
తెలుగు : శ్రీ వల్లభనేని కాశీ విశ్వనాథం వెల : రూ 2

9. ప్రముఖ పారిశ్రామిక వేత్తలు (ఒకటి)
శ్రీ వెలగపూడి రామకృష్ణగారి జీవితచరిత్ర వెల: రూ 1

10. కృష్ణశతకము రచన : శ్రీ విశ్వనాథం వెల : 25 పై

11. చిట్టి శతకము : రచన శ్రీ వల్లభనేని కాశీ విశ్వనాథం వెల : 25 పై

పై పదకొండు పుస్తకాల ప్రచురణకర్తలు :
ప్రజా ప్రచురణలు, పవరుపేట ఏలూరు.

× × ×

ఆంధ్రప్రదేశ్ జీవరక్ష సంఘము (గుంటూరు 3) ప్రచురించిన సప్తమవార్షిక సంచిక

జ్యోతిషసాముద్రికము (మూడు భాగాలు)
రచన : శ్రీశార్వరి వెల : ఒక్కొక్కటి రూ 2
ప్రచురణ : క్రెసెంట్ బుక్స్, 12– బి. సుబ్బారెడ్డి స్ట్రీట్, మద్రాసు_33

ప్రణయ వీణ (కవిత) :
రచన : శ్రీ కె. ఎస్. రామ వెల : రూ 2
ప్రచురణ : రచయిత, ఆంగ్లోపన్యాసకుడు, డి. ఎస్. ఆర్. కాలేజి భీమవరం, పశ్చిమ గోదావరిజిల్లా.

--చైతన్య



APPEAL

Once again various parts of the country have been ravaged by floods causing grievous loss of life and substantial damage to property. Thousands of men, women and children have been rendered homeless and are in need of immediate assistance and longer term rehabilitation.

May I appeal to you once more to donate as generously as you can to the Prime Minister's National Relief Fund, so that adequate and timely succour can reach those of our countrymen who are in dire need and distress.

(Indira Gandhi)

New Delhi
July 18, 1968.

## ప్రధాని విజ్ఞప్తి

మళ్ళీ దేశంలో చాలా ప్రాంతాల్లో వరదల ఉద్ధృతం వల్ల అపార నష్టం సంభవించింది. వేలాది ప్రజలు నిరాశ్రయులైనారు. వారిని తక్షణం ఆదుకోవాలి.

ప్రధాన మంత్రి జాతీయ సహాయ నిధికి ఉదారంగా విరాళాలు పంపి సకాలంలో వరద బాధితులకు సహాయ పడడంలో తోడ్పడాలని దేశ ప్రజలకు నా విజ్ఞప్తి.

—ఇందిరా గాంధీ

# అటవీప్రణాళిక అవసరాన్ని గూర్చి గవర్నరు ఉద్ఘాటన





"కుటుంబ నియంత్రణ విషయంలో ఒక పద్ధతి ప్రకారం కుటుంబాన్ని నియమించుకుంటున్నట్లే అడవుల విషయంలో కూడా ప్రణాళికా బద్ధమైన కృషి జరగాలి" అని ఆంధ్రప్రదేశ్ గవర్నరు శ్రీ ఖండూభాయి దేశాయి, జులై 14 వ తేదీన హైదరాబాదులో వన మహోత్సవానికి ప్రారంభోత్సవం చేస్తూ ఉద్ఘాటించారు. అడవులు ఉన్నచోట యిక యేమాత్రం భూమిని సేద్యానికి ఉపయోగించరాదు. ప్రతి రాజకీయవేత్త ఒక గ్రామాన్ని ఎన్నుకొని మొక్కలను నాటి సంరక్షణ భారాన్ని నిర్వహించాలని ఆయన అన్నారు. గవర్నరు పార్కులో కదంబం మొక్కను నాటారు. సమావేశానికి అధ్యక్షత వహించిన అటవీ శాఖ మంత్రి శ్రీ ఎన్. వెంచురామానాయుడు ప్రసంగిస్తూ, నాటిన మొక్కలను సంరక్షించడానికి ప్రత్యేక శ్రద్ధ వహించాలని అన్నారు. కొత్త కాలనీలను చెట్లను నాటడానికి అనువుగా నిర్మించాలని సూచించారు.



# పత్రికాప్రపంచం

## మతసామరస్య మహాసభ గురించి ....

"గురువారం (జూన్ 18) నాడు మన రాజధానీ నగరంలో జనసంబంధ శాఖ మంత్రి శ్రీ కొండా లక్ష్మణ్ బాపూజీ ఏర్పాటు చేసిన పురప్రముఖుల సమావేశం అనేక రీతుల ఉపయుక్తమైనది. ఆహూతులైన వారిలో నిష్పాక్షిక దృక్పథముగల వారి ప్రత్యక్షానుభవ జనితమైన అభిప్రాయమది. "ఆట్టి మైనారిటీ" మేధావులకు, జిజ్ఞాసువులకు పాక్షికదృష్టిలో సమావేశ ఫలితాలను అవలోకించవలసిన ప్రమేయం లేదు. సదాశయంతో సమాయత్త పరచిన ప్రేరణలను రంగు కళ్ళద్దాలతో 'తిలకించవలసిన' అగత్యం అంతకన్నా లేదు.

మంత్రి శ్రీ లక్ష్మణ్ గారు అత్యవసరమైన సదస్సును సమీకృతం చేశారు. కార్యక్రమ నిర్వహణలో ఆయన నిర్భయ ధోరణి అభివ్యక్తమైనది.

అదేవిధంగా సదస్సునకు అధ్యక్షత వహించిన మన ముఖ్యమంత్రి శ్రీ బ్రహ్మానందరెడ్డిగారు తన సంకల్ప దీక్షను సువ్యక్తం చేశారు. మాటలలో కటువుదనాన్ని విసర్జించినా, అధిక్షేపప్రక్రియను ధారాళంగా వినియోగించి దిటవు తనాన్ని స్పష్టంగా, సలక్షణంగా తెలియచెప్పారు.

శ్రీ కొండా లక్ష్మణ్ గారి కార్యదీక్ష, ముఖ్యమంత్రి గారి దిట్టతనం నిండారా 'అభినందించ దగినది"

—ఆంధ్రభూమి, జూన్ 1



## నెహ్రూ సూక్తులు

ప్రజలు తమ జాతీయ కార్యక్రమాలలోనూ, ప్రభుత్వం ఏర్పాటు చేయడానికి జరిగే ఎన్నికలలోనూ ప్రదర్శించే విజ్ఞత, ఆసక్తి, వారు నిర్వహించే పాత్ర ప్రజాస్వామ్యానికి ప్రాతిపదికగా పరిగణించవచ్చును.

*　　*　　*　　*

ప్రజాస్వామిక వ్యవస్థ స్థిరపడిన దేశంలో వివిధ కార్యక్రమాలకు బలమైన ప్రాతిపదికలు ఏర్పడతాయి. ఆయా పథకాలు, కార్యక్రమాల నిర్వహణకు ఇతరత్రాకంటె ఎక్కువకాలం పట్టవచ్చు. అది వేరువిషయం, ఆయా కార్యక్రమాల నిర్వహణలో వ్యక్తులకు - వ్యక్తిత్వానికి - సరియైన ప్రాధాన్యం - పరిగణన లభిస్తాయి,

*　　*　　*　　*

జాతీయత అంటే హైందవ జాతీయత, ముస్లిమ్ జాతీయత, సిఖ్ఖు జాతీయత అనికాదు అర్థం. విడివిడిగా హిందువునుగురించి, సిఖ్ఖునుగురించి, మహమ్మదీయునిగురించి మాట్లాడితే - ఆలోచిస్తే అది భారతదేశాన్ని గురించి మాట్లాడినట్లు కాదు. ఆలోచించినట్లు కాదు. భారతదేశం ఎలా రూపొందాలి ? ఏకఖండంగా ఏక జాతిగా రూపొందాలా లేక పది, ఇరవై, ఇరవై అయిదు ఖండాలుగా, జాతులుగా ఏ చిన్న అవాంతరం వచ్చినా విచ్ఛిన్నమైపోయే పరిస్థితులతో విభాజితమై ఉండాలా ? ఎలా ఉండాలని మీ అభిలాష ?, అని ప్రశ్నించుకొని ప్రతి ఒక్కరూ జాగ్రత్తగా పరిశీలన జరపాలి.

*　　*　　*　　*

పౌర స్వేచ్ఛ మనదృష్టిలో కేవలం ఒక సిద్ధాంతం-ఒక అభిలాష మాత్రమే కాదు. క్రమబద్ధంగా మనజాతి అభివృద్ధి చెందడానికి ఇది అత్యవసరమని మన నిశ్చితాభిప్రాయం. భేదాభిప్రాయాలు ఉండే సందర్భంలో సమస్యను పరిష్కరించడానికి అనువైన, నాగరికమైన ఆధునిక దృక్పథం ఇది. సమస్యా పరిష్కారానికి మనం అనుసరింపదగిన అహింసాత్మకమైన పద్ధతి ఇది.

# నగరంలో...

## నగరంలో ఉపప్రధాని

ఉప ప్రధాని శ్రీ మొరార్జీ దేశాయ్ జూన్ 24 న రాజేంద్ర నగర్‌లోని వ్యవసాయ విశ్వవిద్యాలయ ఆవరణలో జూనియర్ స్టాఫ్ తాలూకు హాస్టలు, క్వార్టర్సుకు ప్రారంభోత్సవం చేశారు.



డిప్యూటీ ప్రధానమంత్రి శ్రీ మొరార్జీ దేశాయ్‌కి మన శాసన సభ్యుల్ని పరిచయంచేస్తున్నదృశ్యం

జూబ్లీహాలులో ఆంధ్రప్రదేశ్ కాంగ్రెస్ లెజిస్లేచర్ పార్టీ సభ్యులను ఉద్దేశించి ప్రసంగించారు. అదే రోజున విద్యుచ్ఛక్తి మండలి ప్రధాన కార్యాలయ భవన, 'విద్యుత్ సౌధ' కు ప్రారంభోత్సవం చేశారు.

## బాలభవన్ కార్యక్రమాలు

రాష్ట్ర గవర్నరు శ్రీ ఖండూభాయ్ దేశాయ్ జులై 23 న హైదరాబాదులో జవహర్ బాలభవన్ ద్వితీయ వార్షికోత్సవాలకు



రవీంద్రభారతిలో జవహర్ బాలభవన్ వార్షికోత్సవాలను ఆంధ్రప్రదేశ్ గవర్నరు శ్రీ ఖండూభాయ్ దేశాయ్ ప్రారంభించారు

అధ్యక్షత వహిస్తూ, ప్రతి గ్రామంలో బాలభవనాలను నెలకొల్పాల్సిన అవసరాన్ని గురించి నొక్కి చెప్పారు. సంఘానికి మూల స్తంభాలైన బాల బాలికల అభివృద్ధిపై మానవ జాతి అభివృద్ధి ఆధారపడివున్నదని ఆయన ఉద్ఘాటించారు. జాతి సమైక్యత, యువతరంపై ఆధారపడి ఉన్నదని ఆయన అన్నారు. రాష్ట్ర సాంఘిక సంక్షేమ శాఖా మంత్రి శ్రీ అరిగె రామస్వామి ప్రసంగిస్తూ, బాల బాలికలలో క్రమ శిక్షణను పెంపొందించడానికి బాల భవన్‌లు తోడ్పడుతున్నాయని అన్నారు.

## స్థానిక పరిపాలన, కుటుంబ నియంత్రణలపై రెండవ ప్రాంతీయ గోష్ఠి

ముఖ్యమంత్రి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి, జులై 18 న స్థానిక పరిపాలన, కుటుంబ నియంత్రణల రెండవ ప్రాంతీయ సెమినారుకు ప్రారంభోత్సవం చేస్తూ రాష్ట్రంలోని కేంద్ర ప్రభుత్వ ఆస్తులపై మునిసిపాలిటీలు పన్నులు విధించడానికి వీలుండాలని నొక్కి చెప్పారు. దానివల్ల వాటి వనరులు అభివృద్ధి చెందే అవకాశం ఉంటుందని ఆయన అన్నారు. నాలుగవ ప్రణాళికలో పట్టణ అభివృద్ధి, పారిశుద్ధ్యం, మంచినీటి సరఫరా, మురుగు వాడల నిర్మూలన పథకాల నిమిత్తం తగినన్ని నిధులు కేటాయించాలని ఆయన అన్నారు. కుటుంబ నియంత్రణ పథకాల అమలు గురించి ప్రస్తావిస్తూ శస్త్ర చికిత్సలకు నిర్ణయించిన లక్ష్యాలను రాష్ట్రం అధిగమించిందనీ, 1967–68 సంవత్సరంలో 1.67 లక్షల శస్త్ర చికిత్సలు నిర్వహించారనీ ఆయన అన్నారు.



స్థానిక పరిపాలన, కుటుంబనియంత్రణ విషయాల ద్వితీయ ప్రాంతీయ చర్చాగోష్ఠిని జూబిలీ హాలులో ముఖ్యమంత్రి ప్రారంభించారు

కేంద్ర ఆరోగ్యశాఖ ఉప మంత్రి శ్రీ బి. ఎస్. మూర్తి సమావేశంలో ప్రసంగిస్తూ, స్థానిక పరిపాలనా సంస్థలలో పారిశుద్ధ్యం, పరిసరాల పరిరక్షణ చాలా తీవ్రమైన సమస్యలని ఆయన అన్నారు. పట్టణ జనాభాలో ఐదవ భాగానికి మాత్రమే మురుగు పథకాల సౌకర్యం కల్పించబడుతున్నదని ఆయన అన్నారు. రాష్ట్ర ఆరోగ్యశాఖా మంత్రి ప్రసంగిస్తూ నగరాలు అంటు వ్యాధులకు నిలయాలయినాయని అన్నారు. నిధుల కొరత కారణంగాముని

సిపాలిటీలు కలిసిన అవసరాలను కూడ తీర్చలేక పోతున్నాయన్నారు. మునిసిపల్ పరిపాలన శాఖామంత్రి శ్రీ వెంకటరామానాయుడు మాట్లాడుతూ కేంద్రం ఇచ్చే సబ్సిడీని 37.5 శాతం నుంచి 60 శాతానికి పెంచడం చాలా అవసరమని నొక్కి చెప్పారు.

## 'ఖాసా-ఒక పరిశీలన' గ్రంధావిష్కరణ

ఉస్మానియా విశ్వవిద్యాలయ న్యాయకళాశాల అధ్యాపకుడు శ్రీ పి. శేషాద్రి వ్రాసిన "ఖాసా సుబ్బారావు: ఒక విమర్శనాత్మకపరిశీలన" అనే ఆంగ్ల గ్రంథం మొదటి సంపుటిని ఆరోగ్య వైద్య శాఖల మంత్రి శ్రీ పి. వి. నరసింహారావు ఆవిష్కరించారు.



రాష్ట్ర మంత్రి శ్రీ పి. వి. నరసింహారావు "ఖాసా-ఒక పరిశీలన" అనే విమర్శగ్రంథాన్ని ఆవిష్కరించారు

ఆవిష్కరణ సభ జూలై 7 వ తేదీన శ్రీ కృష్ణ దేవరాయ ఆంధ్ర భాషా నిలయంలో జరిగింది ఈ సంపుటాన్ని స్వర్గీయ శ్రీ ఖాసా సుబ్బారావుకు అంకితం చేశారు.

శ్రీ ఖాసావంటి సుప్రసిద్ధ పత్రికా రచయిత రచనలను డి ఆయన సుభాషితాలనూ, అభిప్రాయాలనూ సేకరించి వాటిని నేటి సమస్యలకు అన్వయింప జేస్తూ విమర్శనా ధోరణితో వాటికి వ్యాఖ్యానం చెప్పడం కొత్త పద్ధతి అని మంత్రి అన్నారు ఇటువంటి గ్రంథాలు అనేకం వెలువడాలని ఆయన పేర్కొన్నారు. చరిత్ర రచనకు ఆయా కాలాలలోని ప్రసిద్ధుల అభిప్రాయాలు పునాది వంటివనీ ఇటువంటి పరిశోధనా కార్యకలాపాలు విద్యార్థులకే కాకుండా జనసామాన్యానికి కూడా ప్రయోజనకరమైనవనీ ఆయన వివరించారు సుప్రసిద్ధ పత్రికా రచయిత శ్రీ ఖాసా సుబ్బారావును గురించిన పరిశీలనా గ్రంథం వెలువరించినందుకు శ్రీ శేషాద్రిని మంత్రి అభినందించారు.

కార్యక్రమానికి అధ్యక్షత వహించిన శ్రీ సి. వి. హెచ్. రావు ప్రసంగిస్తూ, శ్రీ ఖాసా సుబ్బారావు అనేక విషయాలను గురించి రచనలు చేశారని చెప్పారు. శ్రీ ఖాసా అభిప్రాయాలు మౌలికమైనవని, శాశ్వత విలువలు కలిగినవని ఆయన పేర్కొన్నారు.

ఉస్మానియా విశ్వవిద్యాలయంలో జర్నలిజం శాఖ ప్రధానాచార్యులు శ్రీ ఎస్. వి. గోవిందరాజన్ ప్రసంగిస్తూ విశ్వ విద్యాలయం జర్నలిజం విభాగంలో ఖాసాపేరున ఒక బహుమతి ఏర్పాటు చేయబడిందని వెల్లడించారు. "పంచాయత్" సంపాదకుడు శ్రీ కె. ఎస్. సుబ్రహ్మణ్యం, శ్రీ ఎన్. సి. నరసింహాచార్య, శ్రీ ఎం. ఎల్. నరసింహారావు గారలు ప్రసంగించారు.

స్వర్గీయ శ్రీ ఖాసా జ్ఞాపకార్థం కృతి సమర్పణ చేస్తూ శ్రీ శేషాద్రి, పత్రికా రంగానికి శ్రీ సుబ్బారావు చేసిన అనుపమానమైన సేవలకు కృతజ్ఞతా సూచకంగా, గౌరవ పురస్సరంగా తామీ గ్రంథాన్ని ఆయనకు అంకితమిస్తున్నట్లు పేర్కొన్నారు.

"హిందూ" పత్రిక ప్రధాన విలేఖరి స్వర్గీయ శ్రీ ఖాసా అల్లుడు అయిన శ్రీ పి. వామనరావు అంకితం స్వీకరించారు

## తెలంగాణా యన్. జీ. వోలకు ముఖ్యమంత్రి హామీ

ఉద్యోగ నియామకాలు, ప్రమోషన్లు, భత్యాలు విషయంలో తెలంగాణా యన్. జీ. వోల కోర్కెలను, ప్రభుత్వం సమరస భావంతో పరిశీలించగలదనీ, ప్రభుత్వ ఉత్తరువులు కట్టుదిట్టంగా అమలు పరచేటట్టు చూడగలదని ముఖ్యమంత్రి తెలంగాణా నాన్ గజెటెడ్ ఉద్యోగులకు హామీ యిచ్చారు.

జూలై 14 న, గాంధీభవన్‌లో రెండురోజులపాటు జరిగిన తెలంగాణా యన్.జీ.వోల సంఘం సమావేశానికి ప్రారంభోత్సవం



గాంధీభవన్‌లో జరిగిన తెలంగాణా నాన్‌గెజెటెడ్ ప్రభుత్వోద్యోగుల మహాసభను ముఖ్యమంత్రి ప్రారంభించారు

ఉద్యోగులకు ముఖ్యమంత్రి, తెలంగాణా ఉద్యోగులు తాముకూడా ఆంధ్రప్రాంతానికి చెందిన ఉద్యోగులతో సమానంగా నిలిచేటట్లు భావాన్ని కలిగివుండాలని అన్నారు.

సామాన్య ప్రజానీకానికి తాము సేవచేయడానికే వున్నామన్న భావం కలిగే విధంగా ఉద్యోగులు ప్రవర్తించాలని ముఖ్యమంత్రి సలహా యిచ్చారు. అంతేగాక సమాజ నిర్మాణంలో తాముకూడా భాగస్వాములే అన్నభావం ఉద్యోగులలో వుండాలని కూడా ఆయన తెలియజేశారు.



సెక్రటేరియట్ 4 వ తరగతి ఉద్యోగుల వసతి గృహాల కాలనీకి ముఖ్యమంత్రి శంకు స్థాపన చేశారు

అంతకు ముందు ఫలక్‌నుమా దగ్గర మైలారు దేవపల్లిలో, తెలంగాణా ఎన్. జి. ఓ.ల కాలనీ, సచివాలయ నాల్గవ తరగతి ఉద్యోగుల కాలనీలకు శంకుస్థాపనలు కావించారు.



తెలంగాణా యన్. జి. ఓ. ల గృహవసతి కాలనీకి ముఖ్యమంత్రి శంకుస్థాపన చేశారు

ఈ ఉత్సవానికి అధ్యక్షత వహించిన రెవెన్యూ మంత్రి శ్రీ పి. వి. రాజు మాట్లాడుతూ యితర విషయాలున్నా తెలంగాణా అభివృద్ధికి ఏర్పడిన ప్రాధాన్యత ఉద్యమాలు అన్నారు. కాని ఆంధ్రజిల్లాల్లో వ్యవసాయోత్పత్తుల సమృద్ధిద్వారా వచ్చిన అదనపు మొత్తాలను తెలంగాణాలో పారిశ్రామిక అభివృద్ధికి తరలించాలని ఆయన తెలియజేశారు. తెలంగాణా వెనుకబడిన ప్రాంతమనే అభిప్రాయం ఏవిధంగానూ వారిలో కలగడానికి తావివ్వరాదని. ఆంధ్ర ప్రాంతం కూడా తమకు చెందినదే నన్న విశ్వాసం వారిలో కలగాలని పేర్కొన్నారు.

ఈ సమావేశం సందర్భంగా ప్రచురించిన సావనీర్‌ను కమ్యూనికేషన్ల మంత్రి శ్రీ జె. వి. నరసింగరావు ఆవిష్కరించారు.

## సమాజం ధోరణులు

అమెరికా సాంస్కృతిక కేంద్రం, జనసంబంధశాఖల సంయుక్త ఆధ్వర్యంలో జూబిలీ హాలులో ఏర్పాటు చేసిన "అమెరికా: జాతీయ ఎన్నికలు" ప్రదర్శనను జూన్ 22 న ముఖ్యమంత్రి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి ప్రారంభోత్సవం చేస్తూ సమాజంలో కేవలం ఐశ్వర్యం, బాహ్యాడంబరాల పెంపుదలవల్ల సమస్యలు పరిష్కారం కావనే అభిప్రాయాన్ని వ్యక్తం చేశారు. ప్రపంచంలో యిటీవల సంభవించిన ధోరణులను ప్రస్తావిస్తూ మానవవ్యక్తిత్వ ఉన్నతికి జరిగిన కృషి గూర్చిని పరిశీలించాల్సిన అవసరం కలదని ఆయన అన్నారు. భౌతిక సంపదభివృద్ధి మంచిదే అయినా ప్రతి వ్యక్తి తన వ్యక్తిత్వాన్ని పెంపొందించుకోవాలి. ఇది జరిగినప్పుడు ఉద్రిక్తత తగ్గుతుదని ఆయన అన్నారు.

మద్రాసులోని అమెరికా సమాచార కేంద్రంలో ప్రజావ్యవహారాల అధికారిగా వ్యవహరిస్తున్న శ్రీ అడి డీర్‌ఫీల్డు, యీ ఉత్సవానికి అధ్యక్షత వహించారు. ఆయన ప్రసంగిస్తూ, అమెరికాలో సాంఘిక ఆర్థిక రంగాలలో జరిగిన తీవ్ర పరిణామాలే 1968 వ సం॥ ఎన్నికల విధానాలలో మార్పుకు కారణమని అన్నారు

అమెరికా సాంస్కృతిక కేంద్రం డైరెక్టరు శ్రీ డెవిడ్ ఎల్. గ్రే, ప్రసంగిస్తూ అమెరికాలో నిర్వహించబడే ఎన్నికలకు సంబంధించిన అన్ని అంశాలను యీ ప్రదర్శనలో చూపడం జరిగిందని అన్నారు.

## హైదరాబాదుపై డాక్యుమెంటరీ చిత్రం

పదకొండు వేల రూపాయల వ్యయంతో హైదరాబాద్ సిటీ కార్పొరేషన్ వారు నిర్మించే "హైదరాబాద్: నాడూ-నేడూ" అనే డాక్యుమెంటరీ చిత్రానికి జూలై 6న ముఖ్యమంత్రి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి కెమెరా స్విచ్ ఆన్ చేసి ప్రారంభోత్సవం చేశారు.



"హైదరాబాదు : నాడు-నేడు" అనే డాక్యుమెంటరీ చిత్రానికి ముఖ్యమంత్రి ప్రారంభోత్సవం చేశారు

ఈ సందర్భంలో ప్రసంగిస్తూ ముఖ్యమంత్రి — ప్రజల మనసులో పౌరసత్వభావం నాటుకొనేటట్లుచేసి, పౌరసంక్షేమ కార్యక్రమాల విషయంలో వారి సహకారం లభింపచేసుకోవడం కార్పొరేటర్ల విధి అన్నారు. కార్పొరేటర్ల కోర్కెల మేరకు ప్రభుత్వం గ్రాంట్లు మంజూరుచేయలేక పోయిందంటే అది ఆర్థిక యిబ్బందుల వల్లనేగాని కార్పొరేటర్ల కోర్కెలపట్ల చిన్నచూపు చూడటం మాత్రం కాదని ముఖ్యమంత్రి చెప్పారు.

మేయరు శ్రీ కొండారెడ్డి మాట్లాడుతూ, జంటనగరాలలో వుండే 70 శాతం నిరక్షరాస్యులకు, కార్పొరేషన్ కార్యక్రమాల గురించి, కార్పొరేషన్ కలిగిస్తున్న పౌరవసతులను గురించి తెలియజేసేందుకు ఈ డాక్యుమెంటరీ చిత్రం నిర్మించబడుతున్నదని అన్నారు.

## కంటి ఆస్పత్రి సహాయార్థం శ్రీమతి యమ్. యస్. సుబ్బులక్ష్మి కచేరి

సరోజినీదేవి స్మారకసంఘం సహాయార్థం జూలై 8న రవీంద్ర భారతిలో, ప్రసిద్ధ గాయకి శ్రీమతి యమ్. యస్. సుబ్బలక్ష్మి సంగీత కచేరి ఏర్పాటు చేయించడం జరిగింది. ఈ సందర్భంలో వసూలైన రూ. 50,000ల మొత్తం సరోజినీదేవి కంటి ఆస్పత్రిలో బాలల విభాగం ఏర్పాటుచేసే నిమిత్తం వినియోగించబడుతుంది.

ఈ సందర్భంలో ప్రసంగిస్తూ ముఖ్యమంత్రి, శ్రీమతి సుబ్బలక్ష్మి గానకళా విశిష్టతను కొనియాడారు. ఆమె జరిపిన గాన కచేరీ, ఒక గానకోకిల మరో గానకోకిలకు (శ్రీమతి సరోజినీ నాయుడుకు) జరిపిన గొప్ప సన్మానంగా పరిగణించవచ్చునని అన్నారు.

కళాసంపదను సంఘ శ్రేయస్సుకై వినియోగించి పాటుబడే అరుదైన కళాకారులలో శ్రీమతి సుబ్బలక్ష్మి ఒకరని ముఖ్యమంత్రి పేర్కొన్నారు. హైదరాబాద్ ప్రజలు ఉదారంగా విరాళాలిచ్చి సరోజినీనాయుడు కంటి ఆసుపత్రిలో బాలల విభాగ స్థాపనకు, దానితోపాటు ప్రసిద్ధ కవయిత్రి, దేశభక్తురాలైన శ్రీమతి సరోజిని నాయుడు స్మృతి చిహ్నాన్ని నిలిపేందుకు తోడ్పడగలరని ముఖ్యమంత్రి ఆకాంక్షించారు.



శ్రీమతి యం. యస్. సుబ్బలక్ష్మికి ముఖ్యమంత్రి కృతజ్ఞతా చిహ్నంగా ఒక పేటిక బహూకరించారు

ఇంతవరకు కమిటీ రు. 1,40,000లను ప్రోగుచేసింది, ఇందులో రు 5000 మొత్తాన్ని శ్రీమతి సుబ్బలక్ష్మి స్వంత విరాళం క్రింద ఇచ్చారు. రు. 25,000లను హైదరాబాద్ మహిళా శిశువైద్య సంఘం విరాళంగా యిచ్చింది.



జూలై 2 వ తేదీన పాలిబండలో జరిగిన గాంధీ శతజయంత్యుత్సవ సన్నాహక సమావేశానికి జనసంబంధ మంత్రి శ్రీ కొండాలక్ష్మణ్ బాపూజీ అధ్యక్షత వహించారు

# క్రీడారంగం



ఆటల పోటీలు జరిగే తరుణం మళ్లీ ప్రారంభమైంది. రహీం స్మారక ట్రాఫీ కొరకు "ఏ" డివిజను లీగ్ ఫుట్‌బాల్ ఛాంపియన్‌షిప్ పోటీలు జరుగుతున్నాయి. గత సంవత్సరం ఈ ట్రాఫీ గెలుచుకున్న దక్షిణ-మధ్య రైల్వే జట్టువారు ఈ సంవత్సరం కూడా తమ ఆధిక్యాన్ని నిలబెట్టుకునేటట్లుగా ఆడుతున్నారు. అయితే ప్రారంభంలో వారు సిటీ కళాశాల పూర్వ విద్యార్థుల జట్టుతో ఓడిపోయారు. ఒకప్పుడు సిటీకళాశాల పూర్వవిద్యార్థుల జట్టు నగరంలోని అగ్రశ్రేణి జట్లలో ఒకటిగా పరిగణించబడుతుండేది. బయటి ప్రదేశాలలో కూడా యిది మంచి పేరు సంపాదించింది. శామ్‌రాజ్, కిషన్‌రాజ్, కాంత్‌రాజ్—ఈ సోదర త్రయం సి.క.పూ.వి. జట్టు ఘనతకు ప్రధానంగా తోడ్పడ్డారు. కాని ఇటీవలి సంవత్సరాలలో ఈ జట్టు తన పురా ప్రాభవాన్ని కోల్పోయింది. అయితే యిది మళ్లీ విజృంభించడానికి ప్రయత్నిస్తుండడం ముదావహం.

ఆంధ్రప్రదేశ్ పోలీసు జట్టుకూ, స్టేట్ బ్యాంకు ఆఫ్ హైదరాబాదు జట్టుకూ మధ్య జరిగిన పోటీ మధ్యలో ప్రేక్షకులు ఆట మైదానంలోనికి వెళ్లి ఆట సాగనివ్వకుండా చేయడం క్రీడాభిమానులకు ఖేదం కలిగించింది. బ్యాంకు ఆటగాడు నటించినట్లుగా అతని ప్రతి పక్షానికి చెందిన ఆటగాడు నిజంగానే అతనిని కొట్టాడన్న విషయాన్ని గురించి ప్రేక్షకులు ఆలోచించనైనాలేదు. రెఫరీలు మానవాతీయులుకారు. వారివల్ల కూడా పొరపాట్లు జరగవచ్చు. పొరపాటు జరిగినప్పుడు ఆటగాళ్లు పెద్ద రభస చేయడం మంచిది కాదు. రెఫరీ తీర్పును శిరసావహించి నిజమైన క్రీడాకారునిగా ప్రవర్తించాలి. ఇది ప్రేక్షకులకు కూడా వర్తిస్తుంది.

"ఏ" "బి" డివిజను లీగ్ ఛాంపియన్‌షిప్ పోటీలు కూడా ప్రారంభమయ్యాయి. క్రిందటిసారి విజేతలైన స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా జట్టుకూ, ఏ.ఓ.సి సెంటర్ జట్టుకూ మధ్య థాపర్ స్టేడియంలో జరిగిన ఆట ఆసక్తికరంగా సాగింది. ఉభయ పక్షాలు చెరి 157 పరుగుల చొప్పున స్కోరు చేశాయి. ఏ.ఓ.సి. ఆటగాడు విజయ భూషణ్ ప్రస్తుత సీజన్‌లో మొదటి సెంచరీ సాధించాడు. నిజాం కళాశాలకు చెందిన జయంతీలాల్, మైసూరు జట్టు ఆటగాడు ఫైజుద్దీను కూడా తరువాత సెంచరీలు చేశారు. ఈ సీజన్‌లో, సికింద్రాబాదు యూనియన్ క్రికెట్ క్లబ్‌కు ప్రాతినిధ్యం వహిస్తున్న మహేశ్వర్‌సింగ్ మంచి ఆట ప్రదర్శిస్తున్నాడు. బాటింగ్‌లో, బౌలింగ్‌లో కూడా ఇతను సమాన ప్రతిభ కనబరుస్తున్నాడు. ఇతనికి మంచి భవిష్యత్తు వుంది

సహకారశాఖా మంత్రి శ్రీ విజయభాస్కర రెడ్డి ఆంధ్రప్రదేశ్ స్పోర్ట్స్ కౌన్సిలు అధ్యక్ష బాధ్యతలు స్వీకరించారు ఉపాధ్యక్షులుగా శ్రీ శివకుమార్‌లాల్, కోశాధికారిగా శ్రీ ఏ రామచంద్రారెడ్డి వ్యవహరిస్తారు. మాజీ పోలీసు ఇన్‌స్పెక్టర్ జనరల్ శ్రీశివకుమార్‌లాల్, శ్రీగులామ్ అహమద్ మినహా పునర్నిర్మించబడిన కౌన్సిలు సభ్యులందరూ కొత్తవారే. శ్రీ ఎన్. రామచంద్రారెడ్డి లోగడ కౌన్సిలు అధ్యక్షులుగా వుండేవారు. వీరి కార్యవర్గపు నాలుగు సంవత్సరాల కాలపరిమితి గత ఏప్రిల్‌లో ముగిసింది. ఎవ్వరూ కూడా ఒకటి కంటే ఎక్కువ సంఘాల కార్యవర్గంలో వుండకూడదని కౌన్సిలు నిశ్చయించింది. వివిధ సంస్థలలో కార్యవర్గంలో వున్నవారు ఏదైన ఒక సంస్థలో తప్ప మిగిలిన వాటిలో ఆగస్టు నెలాఖరులోగా రాజీనామా చేయాలని కూడా తీర్మానించింది. అర్హులైన క్రీడాకారులకు స్కాలర్ షిప్పులు ఇవ్వడానికి క్రీడామండలి నూతన కార్య వర్గం నిశ్చయించింది. ఇందుకు మండలిని అభినందించాలి.

ఇంగ్లాండు, ఆస్ట్రేలియా జట్లకు మధ్య జరుగుతున్న క్రికెట్ మ్యాచ్‌లు రాను రాను ఆసక్తి కలిగిస్తున్నాయి. కంట్రీ మ్యాచ్‌లలో విఫలమైన ఆస్ట్రేలియా మొదటి టెస్ట్‌లో గెలుపొందింది. కాని రెండవ టెస్ట్‌లోనూ, మూడవ టెస్ట్‌లోనూ, ఇంగ్లాండుది పైచేయిగా వుండింది. వర్షం వచ్చి ఆటకు అంతరాయం కలగడం వల్లనే ఆస్ట్రేలియా 'డ్రా' చేయగలిగింది.

మెక్సికోలో జరిగే ఒలంపిక్ క్రీడోత్సవాలలో భారత హాకీ జట్టులో పాల్గొనే ఆటగాళ్ల పేర్లు ప్రకటించారు. టోక్యోలో సాధించిన ప్రపంచ ఛాంపియన్ షిప్‌ను నిలబెట్టుకొనగలమనే విశ్వాసంతో మన ఆట గాళ్లు వున్నారు. భారతదేశానికి స్వర్ణ పతకాన్ని సాధించి పెట్టగలిగేది ఒక్క హాకీ మాత్రమే. ఇతర పోటీలలో మనకు అంతగా అవకాశాలు లేకపోయినప్పటికీ మన క్రీడాకారులు అనుభవం గడించగలగడానికి వీలుగా వాటిలో పాల్గొనడం అవసరం. అయితే బృందం పరిమితంగా వుండడం మంచిది.



# ప్రభుత్వ ఉత్తర్వులు

జి. ఓ. ఆర్. టి. నెం. 1107 తేదీ 15 జూలై, 1968

## సాధారణ పరిపాలన శాఖ

### అభివృద్ధిమండలి పునర్వ్యవస్థీకరణ

ఈ దిగువ విధంగా రాష్ట్ర అభివృద్ధి మండలిని పునర్వ్యవస్థీకరిస్తూ ప్రభుత్వం ఆదేశించింది—

1. ప్రభుత్వ ప్రధానకార్యదర్శి, అభివృద్ధి మండలి కమీషనర్, షెడ్యూల్ కులాల షెడ్యూలు జాతుల కమీషనర్ — అధ్యక్షుడు
2. నీటిపారుదల, పంచాయతీరాజ్, ఆయకట్టు అభివృద్ధికి సంబంధించిన రెవెన్యూ బోర్డు సభ్యులు — సభ్యులు
3. ఆహార, వ్యవసాయ శాఖ ప్రత్యేక కార్యదర్శి — సభ్యుడు
4. ఆర్థిక శాఖ కార్యదర్శి — సభ్యుడు
5. పరిశ్రమల శాఖ కార్యదర్శి — సభ్యుడు
6. పబ్లిక్ వర్క్సు శాఖ కార్యదర్శి — సభ్యుడు
7. వ్యవసాయ శాఖ డైరెక్టర్ — సభ్యుడు
8. సహకార సంఘాల రిజిష్ట్రారు — సభ్యుడు
9. పరిశ్రమల శాఖ డైరెక్టర్ — సభ్యుడు
10. భారీనీటి పారుదల, సాధారణ పనుల చీఫ్ ఇంజనీర్ — సభ్యుడు
11. ప్రణాళికా, పంచాయతీ రాజ్ శాఖ కార్యదర్శి — సభ్యుడు కార్యదర్శి

## విద్యా శాఖ

జి. ఓ. ఎం. ఎస్. నెం. 1355 తేదీ 28జూన్, 1968

### ఇంజనీరింగ్ కోర్సులు - వయః పరిమితి

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలోని ప్రభుత్వ ఇంజనీరింగ్ కళాశాలలలో అయిదు సంవత్సరాల సమీకృత ఇంజనీరింగ్ కోర్సు మొదటి సంవత్సరంలో ప్రవేశానికి సంబంధించిన నిబంధనల ననుసరించి ఈ కోర్సులో చేరదలచిన అభ్యర్థి వయస్సు ఆ సంవత్సరం అక్టోబరు 31వ తేదీ నాటికి 16_21 సంవత్సరాల మధ్య వుండాలి. అయితే నిమ్నజాతులు, నిమ్న తెగలకు చెందిన అభ్యర్థుల విషయంలో గరిష్ఠవయః పరిమితిని మరో 3 సంవత్సరాల వరకు పొడిగిస్తారు.

రాష్ట్రంలోని విశ్వవిద్యాలయ ఇంజనీరింగ్ కళాశాలలలో ప్రవేశానికి సంబంధించిన నిబంధనలలో, అభ్యర్థుల గరిష్ఠవయస్సునకు సంబంధించిన ఇట్టి పరిమితి ఏదీ లేనట్లు ప్రభుత్వం దృష్టికి వచ్చింది. కాబట్టి రాష్ట్రంలోని ప్రభుత్వ ఇంజనీరింగ్ కళాశాలలలో ప్రవేశానికి సంబంధించిన నిబంధనలలో నుంచి గరిష్ఠ వయః పరిమితికి సంబంధించిన నిబంధనను తొలగించడానికై ఉత్తర్వు చేయవలసిందిగా సాంకేతిక విద్యాశాఖ డైరెక్టరు ప్రభుత్వానికి సిఫార్సు చేశారు.

ప్రభుత్వం ఆంధ్రప్రదేశ్ ప్రాంతీయ సంఘంలో సంప్రదించి ఈ సిఫార్సును జాగ్రత్తగా పరిశీలించినమీదట, రాష్ట్రంలోని ప్రభుత్వ ఇంజనీరింగ్ కళాశాలలలో అయిదు సంవత్సరాల సమీకృత కోర్సులో అభ్యర్థులను చేర్చుకునే సందర్భంలో 1968_69వ విద్యా సంవత్సరం నుంచి గరిష్ఠ వయః పరిమితికి సంబంధించిన నిబంధనను పాటించనవసరంలేదని ఆదేశించింది. రాష్ట్రంలోని ప్రభుత్వ ఇంజనీరింగ్ కళాశాలలో ప్రవేశానికి సంబంధించిన నిబంధనలలో పై ఉత్తర్వులను అమలుపరుస్తూ _ తగు విధంగా మార్పులు చేయవలసిందిగా కూడా సాంకేతిక విద్యాశాఖ డైరెక్టరును కోరడమైనది.

## ఆహార, వ్యవసాయ(ఎఫ్.పి.1) శాఖ

జి. ఓ. ఎం. ఎస్. నెం. 1323 తేదీ: 29 జూన్, 68

### ఎరువుల పథకం

1967_68 వ సంవత్సరపు బడ్జెటు అంచనాలలో, సమితి ప్రాంతాలలోనూ సమితులు ఏర్పడని ప్రాంతాలలోనూ తీవ్రతరంగా ఎరువులు వేయడానికి సంబంధించిన పథకం క్రింద ఋణాలు మంజూరు చేసే నిమిత్తం కేటాయింపు చేయడం జరిగింది.

తీవ్రతరంగా ఎరువులు వేయడానికి సంబంధించిన పథకాన్ని 1968_69 వ సంవత్సరంలో కూడా రూ. 203.76 లక్షల ఖర్చుతో కొనసాగించడానికి వ్యవసాయశాఖ డైరెక్టరు ప్రతిపాదించారు. ఈ మొత్తంలో రూ. 121.58 లక్షలను ఖరీఫ్ ఋతువులోనూ, రూ. 82.18 లక్షలను రాబీ ఋతువులోనూ వెచ్చించడానికి ఆయన ప్రతిపాదించారు.

తీవ్రతరంగా ఎరువులు వేయడానికి సంబంధించిన పథకాన్ని 1968_69 వ సంవత్సరంలో అన్ని జిల్లాలలోనూ కొనసాగించడానికి ప్రభుత్వం మంజూరు చేసింది. ఈ పథకం క్రింద ఖరీఫ్ ఋతువులో వ్యవసాయదార్లకు స్వల్పకాలిక ఋణాలు పంపిణీ చేసే నిమిత్తం రూ. 30 లక్షలు వెచ్చించడానికి కూడా మంజూరీ యివ్వబడింది. వ్యవసాయశాఖ డైరెక్టరు ఈ మొత్తాన్ని ఆయా జిల్లాలకు, ప్రభుత్వానికి తెలియపరుస్తూ తక్షణమే కేటాయిస్తారు.

ఈ విధంగా కేటాయించబడిన మొత్తాలు జిల్లా అభివృద్ధి మండలి అధీనంలో వుంటాయి. ఈ మొత్తాలు, జిల్లాలోని ప్రతి సమితికి, సమితి ఏర్పడని ప్రాంతానికి, అవసరాన్నిబట్టి, జిల్లా పరిషత్తు మొదటి స్థాయీ సంఘం ఆమోదించే పరిమితి మేరకు కేటాయించబడతాయి. ఆహార, వ్యవసాయశాఖ 17-8-64వ తేదీన జారీచేసిన 2097 నెంబరు ఉత్తర్వులోనూ, 6-5-67వ తేదీన జారీ చేసిన 4070 ఎఫ్. పి. 1/66-8 నెంబరు మెమోరాండంలోనూ నిర్దిష్టపరచబడి, 30-5-1968వ తేదీన జారీచేసిన 311 ఎఫ్. పి. 1/68-8 నెంబరు మెమోరాండంలో సవరించబడిన నియమ నిబంధనల ననుసరించి ఈ మొత్తాలు లభింపజేయబడతాయి. 30-5-68వ తేదీన జారీ అయిన 311 ఎఫ్. పి. 1/68-8 నెంబరు మెమోరాండంలో నిర్దిష్టపరచిన ప్రకారం పంచాయతీ సమితులకు ఇతోధికంగా కూడా మొత్తాలు లభింపజేయవచ్చు. అయితే అట్టి సమితులకు, ఈ విధంగా ఇతోధిక మొత్తాలు యివ్వదలచిన తేదీ నుంచి లోగడ మూడు సంవత్సరాల కాలంలో యిచ్చిన మొత్తం ఋణాలలో యింకా చెల్లించవలసివున్న బకాయీలు ఆ తేదీ నాటికి పూర్తి ఋణంలో 25 శాతానికి మించి వుండకూడదు. జిల్లా పరిషత్తు మొదటి స్థాయీ సంఘం ఆమోదించిన వెంటనే కలెక్టర్లు వ్యవసాయ శాఖ అసిస్టెంట్ డైరెక్టర్ల సహాయంతో పంచాయతీ మొత్తాలను లభింప జేస్తారు. సమితులు ఏర్పడని ప్రాంతాలలో జిల్లా వ్యవసాయ శాఖాధికార్లు వ్యవసాయ దార్లకు ఋణాలు మంజూరు చేస్తారు. వీరు ఈ విధంగా పంపిణీ చేసిన ఋణాలను రెవెన్యూశాఖ, తక్కావీ మాన్యువల్‌లో నిర్దిష్టపరచబడిన పద్ధతి ప్రకారం వసూలు చేస్తుంది. ఋణ మొత్తాలను ఫలప్రదంగా వినియోగించడానికై జాగ్రత్త వహించాలి.

ఆహార, వ్యవసాయశాఖవారి 12-10-1965 తేదీగల జి.ఒ. నెం. 2522 లో నిర్దేశించిన విధంగా యీ పథకం క్రింద మంజూరు చేసే ఋణాలపై 8 1/2 శాతం వడ్డీ విధించబడుతుంది. అయితే అవసరమైనప్పుడు యీ వడ్డీరేటు సవరింపుకు లోబడి ఉంటుంది.

తీవ్రతర ఎరువుల వాడకం పథకం క్రింద దిగువ తెల్పిన పైర్ల నిమిత్తం మాత్రమే రైతులకు ఋణాలు మంజూరు చేయబడ్తాయి:

వరి, మొక్కజొన్న, జొన్న, కాయధాన్యాలు, కూరగాయలు, పండ్లు, ప్రత్తి, వేరుశనగ.

ఒక వ్యక్తికి రు 750 లకు మించకుండా ఋణాలు దిగువ విధంగాయివ్వబడ్తాయి:

| | | |
|---|---|---|
| (అ) | నీటితోసాగుఅయ్యే కాయధాన్యాలు......ఎకరాకు రు. | 100 |
| (ఆ) | నీటితోసాగుకాని కాయధాన్యాలు........ ,, | 50 |
| (ఇ) | వెరుశనగ (నీటితోసాగుఅయ్యేది)....... | 50 |
| (ఈ) | పశువుల మేతపైర్లు .............. | 100 |
| (ఉ) | నీటితో సాగుఅయ్యే ప్రత్తి .......... ,, | 100 |
| (ఊ) | పండ్లు, కూరగాయలు.............. ,, | 70 |

ఋణాల మంజూరీ నిమిత్తం, వ్యక్తిగత పూచీకత్తుతోపాటు అదనంగా ఇద్దరు వ్యక్తుల పూచీకత్తుతీసుకునే ప్రస్తుతం అమలులో ఉన్న విధానం అనుసరించబడాలి.

1968-69వ సంవత్సరంలో యీపథకం క్రింద వేరుశనగ పిట్టు, ఆముదం నూనెపిట్టు వంటి నూనెపిట్టులతోపాటు దిగువ తెల్పిన రసాయనపు ఎరువులుకూడ సరఫరా చేయబడ్తాయి.

(అ) అమోనియా సల్ఫేటు, యితర నత్రజనిఎరువులు.

(ఆ) సూపర్‌ఫాస్ఫేటు, ఎముకల పొడితోసహా ఫాస్ఫేటుకు చెందిన యితర ఎరువులు.

(ఇ) అమోనియం ఫాస్ఫేటు వంటి మిశ్రమఎరువులు.

(ఈ) మిశ్రమంగా ఉన్నఎరువులు.

దిగువ తెల్పిన ప్రాధాన్య క్రమాన్ని అనుసరించి ఋణగ్రహీతలకు ఋణపత్రాలు యివ్వబడ్తాయి.

(అ) డిపార్టుమెంటల్ గోదాములో ఉన్న ఎరువులనిల్వలు.

(ఆ) సహకార సంఘాలవద్ద లభించే ఎరువులు.

(ఇ) ప్రైవేటు సంస్థలనుండి ఋణగ్రహీతలుకోరిన యితర రకాలఎరువులు.

అవసరాన్నిబట్టి ఒక జిల్లాకు చెందిననిధులను మరోజిల్లాకు బదిలీచేసే అధికారం వ్యవసాయశాఖ డైరెక్టరుకు ఉంటుంది. జిల్లా పరిషత్తు ఒకటవ స్థాయీసంఘం, సమితివారీగా నిర్ణయించిన విధంగా వ్యవసాయశాఖ డిప్యూటీడైరెక్టరు (కలెక్టర్ల పర్సనల్ అసిస్టెంట్లు) సమితులకు నిధులను విడుదలచేస్తారు.

ఈ పథకంక్రింద పంపిణీచేసిన ఋణాలఖర్చును దిగువ తెల్పిన పద్దులలో పేర్కొంటారు.

సమితేతరప్రాంతం: "క్యూ. రాష్ట్రప్రభుత్వంచే ఋణాలు, అడ్వాన్సులు. ఎ. స్థానికనిధులు, ప్రైవేటుపార్టీలు మొదలైనవాటికి ఋణాలు
హెచ్. రైతులకు అడ్వాన్సులు.
డి. రసాయనఎరువుల కొనుగోలుకు ఋణాలు

సమితులు: "క్యూ. రాష్ట్రప్రభుత్వంచే ఋణాలు అడ్వాన్సులు ఎ. లోకల్‌ఫండ్స్, ప్రైవేటు పార్టీలు మొదలైన వాటికి ఋణాలు.
హెచ్. రైతులకు అడ్వాన్సులు
ఏ 7. తక్కావీ ఋణాల నిమిత్తం పంచాయతీ సమితులకు అడ్వాన్సులు.
1) తీవ్రతర ఎరువుల వినియోగం పథకాలు.

ప్రతి సమితి, సమితిలేని ప్రాంతాల్లో నామకః రు. 100-ల కేటాయింపు ఉన్నకారణంగా మిగతా మొత్తాన్ని యితర కేటాయింపుల నుండి తీసుకోవడం జరుగుతుంది.

PUBLISHED BY THE DIRECTOR, JANA SAMBANDHA SAKHA, ANDHRA PRADESH, HYDERABAD, AND PRINTED BY THE DIRECTOR OF PRINTING, GOVERNMENT OF ANDHRA PRADESH, AT THE GOVERNMENT CENTRAL PRESS, HYDERABAD.

